# మరోసారి
# గిడుగు రామమూర్తి

ప్రారంభం
కావూరి రమేష్‌బాబు

నిర్వహణ
వేమూరి రామారావు



హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల : 16-00

అట్టమీద బొమ్మ తెలుగు విశ్వవిద్యాలయం తెలుగు విజ్ఞాన
సర్వస్వ కేంద్రం సౌజన్యంతో

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు
మొదటి ముద్రణ : డిసెంబరు, 1986
వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్
3-6-687, 10వ వీధి,
హిమాయత్ నగర్, హైదరాబాద్-500029

ముద్రణ : హైదరాబాద్ ప్రింటర్స్, హబ్సిగూడ, హైదరాబాద్

# ఎవరీ రామమూర్తి?
# ఎందుకు 'మరోసారి'?



*సంస్కర్తలూ : ఆధునిక భావాలు*

ఇంచు మించుగా ఈ శతాబ్ది ప్రారంభం నుంచి ఆధునిక భావజాలం భారతీయ మేధావుల్ని ప్రభావితం చెయ్యటం ప్రారంభించింది. మారుతున్న ఆర్థిక రాజకీయ వ్యవస్థల కనుగుణంగా సాంస్కృతిక రంగాల్లో అభివృద్ధికోసం సంస్కర్తలు కొందరు ఉద్యమాలు నడిపారు. వ్యక్తులుగా కృషి చేశారు. ఆంధ్ర దేశంలో రఘుపతి వెంకట రత్నం నాయుడు గారు, కందుకూరి వీరేశలింగం గారు, గురజాడ అప్పారావు గారు... ఇంకా ఇంకా అనేకులు ఆయా రంగాలను ఆధునికం చేయటానికి ప్రయత్నించారు. దేశీయులను ఉద్బోధించారు. ప్రజాస్వామ్య భావాలను ప్రచారం చేశారు. భాషా రంగంలో ప్రధానంగా ఈ పని చేసిన వారు గిడుగు రామమూర్తిగారు.

*భాషలో సంప్రదాయీకరణం*

నాగరిక సమాజాల్లో మాట్లాడే భాష, రాసే భాష అని రెండు రకాల వ్యవస్థ లుంటాయి. రాసే భాషకు మాట్లాడే భాషే మూలం అయినా ప్రయోజన భేదాల్ని బట్టి మాట్లాడే భాషకన్నా భిన్నమైన సంప్రదాయాలు రాసే భాషలో ఏర్పడతాయి ప్రభుత్వ మహజర్లలోనూ, మామూలు ఉత్తరాల్లోనూ, ప్రామిసరీ నోట్లలోనూ, సాహిత్య రచన లోనూ ఇంకా అనేకానేక సందర్భాల్లో వాడే భాషలోనూ వేరు వేరు సంప్రదాయాలు మనం గమనించ వచ్చు.

ఇట్లాంటి సంప్రదాయాలు ఏర్పడే పద్ధతిని శైలీకరణం (**Stylization**) అంటున్నారు దీన్నే సంప్రదాయీకరణం అని కూడా అనవచ్చు. ఈ సంప్రదాయీ కరణం లిపి సౌకర్యం లేని భాషల్లో కూడా కనిపిస్తుంది. ఇద్దరు వ్యక్తులు మాట్లాడే సంభాషణ శైలికీ, మత సంబంధ కార్య కలాపాల్లో వాడే శైలికీ, కథా కథనం చేసేటప్పుడు వాడే శైలికీ, పాటల శైలికీ భేదాలు కనిపిస్తాయి. ఈ భేదాలు ధ్వనుల్లోనూ, పద స్వరూపంలోనూ, వాక్య రచనలోనూ ఉంటాయి. ఇది సహజమే.

*మాట్లాడే భాషకూ రాసే భాషకూ అంతరం*

ఈ భేదాలు సహజమే అయినప్పుడు రాసే భాషకూ మాట్లాడే భాషకూ భేదా

ఉండటం కూడా సహజమే. అయితే ఈ భేదాలు మరీ ఎక్కువయితే భాషా ప్రయోగ వ్యవస్థలో సంక్షోభం వస్తుంది. చాలా భారతీయ భాషల్లో అదే జరిగింది. తెలుగులోనూ అదే జరిగింది.

ప్రాచీన కాలంలో 'భాషా రచన' అంటే సాహిత్య రచనే. రాజకీయ వ్యవస్థలో భాషా లేఖనం ఉన్నా అది అతి పరిమితమైనది. అప్పటి రాజులకు ప్రజలతో సంబంధం చాలా తక్కువ. రాజ శాసనాలను కూడా చాటింపు వెయ్యటం ద్వారా ప్రజలకు అందించే వారు. శిలా శాసనాలు వేయించేవారు. శాసన భాష వాడుక భాషకు సన్నిహితంగా ఉండేది. ప్రాచీన కాలపు రచనా భాషగా విస్తృతంగా మనకు దొరుకుతున్నది సాహిత్య భాషే. తెలుగు లిఖిత రచనా సంప్రదాయంలో సాహిత్యభాష అంటే కావ్యభాష. ఈ కావ్య భాష నన్నయ కంటె ఒకటి రెండు శతాబ్దుల ముందే (సుమారు 9వ శతాబ్దం) సంప్రదాయీకృతమైంది. ఈ కావ్యభాషలో తరవాత్తరవాత కొన్ని మార్పులు వచ్చినా ఇవి సంప్రదాయీకృతమైన భాషా వ్యవస్థను సమూలంగా మార్చేవికావు. సంప్రదాయంలో భాగంగా కలిసిపోయేవి. ఈ కావ్యభాష కాల క్రమంలో సహజంగానే మామూలు భాష నుంచి క్రమ క్రమంగా దూరదూరంగా జరిగిపోయింది. దాదాపు వేరే భాష అన్నంత దూరంగా జరిగిపోయింది. ప్రత్యేక శిక్షణ ఉంటే తప్ప అర్థం కానంత దూరంగా జరిగింది. సమాజంలో చాలా కొద్దిమందికి మాత్రమే అందుబాటులో ఉన్న భాష అయింది. సామాన్య ప్రజల సాహిత్యం మౌఖిక రూపాల్లో వేరే పాయగా వారి వ్యవహార భాషకు మనుగడ సాగిస్తూనే ఉంది.

*భాషా ప్రయోగ విస్తృతి*

ఆర్థిక, రాజకీయ వ్యవస్థల్లో వచ్చిన మార్పుల వల్ల ప్రభుత్వానికి ప్రజలతో సంబంధం ఏర్పడి ప్రజల్లో విద్యావ్యాప్తి ఏర్పడింది. రచనా భాషా ప్రయోగ సందర్భాలు పెరిగాయి. అందుకనుగుణంగా అచ్చు పుస్తకాలు, అచ్చు పత్రికలు వచ్చిన తరువాత ఎక్కువ ప్రతులు తయారయి ఎక్కువ మందికి అందుబాటులోకి వచ్చాయి. విద్యావ్యాప్తి కోసం స్కూళ్ళసంఖ్య పెరిగింది. వాళ్ళకు కొత్తవిషయాలు అందించే వాచకాలు తయారయినాయి. ఈ రచనా వ్యాసంగమంతా ఏ భాషలో జరగాలి అనే ప్రశ్న మన మేధావులను ఎదుర్కొన్నది.

*సులభ గ్రాంధికావతరణం*

అప్పటి చదువరుల కందుబాటులో ఉన్న రచనా భాష కావ్య భాష. మొదట్లో ఆ భాషనే వాడుకున్నారు. అయితే ఆ భాషలో స్థిరీకృతమైన సంప్రదాయాలు నేర్చుకొనే వారికి పెద్ద అడ్డంకులుగా తయారయినాయి. బళ్ళలో వాచకాలు తయారు చేయాల్సిన అవసరం ఉన్న వీరేశలింగం గారు ఈ క్లిష్ట స్థితిని గమనించారు. ప్రాచీన కావ్యభాష

కున్న కొన్ని నియమాలను సడలించి సులభ గ్రాంథికం అని ఒకటి తయారుచేసి దానికో వ్యాకరణం రచించారు. ఆ ప్రయత్నంలో భాగంగానే వేదం వేంకటరాయశాస్త్రి గారు విసంధి వివేకం అన్న చిన్నపుస్తకం రచించి తెలుగులో సంధులు పాటించక్కర్లేదన టానికి సంస్కృత వ్యాకరణాల ప్రమాణాలు చూపించారు. వ్యావహారిక భాషా శైలిని గ్రాంథికీకరించటానికి పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారు సాక్షి వ్యాసాల ద్వారా ప్రయత్నించారు. ప్రాచీన కావ్యభాష ఆధునిక రచనా వ్యాసంగానికి సరిపడటంలేదన్న సంగతి నాటి విద్యావంతులు గుర్తించినట్టు వీళ్ళ సంస్కరణ ప్రయత్నాలే సాక్ష్యం ఇస్తున్నాయి.

*కొత్త రచనా భాష మాట్లాడే భాషనుంచే రావాలి*

శతాబ్దాలుగా స్థిరీకృతమై కేవల సాహిత్య రచనకు మాత్రమే పరిమితమైన భాష ఎన్ని సంస్కరణలు చేసినా ఆధునిక రచనా వ్యాసంగానికి పనికిరాదని గుర్తించిన వారిలో ముఖ్యులు గిడుగు రామమూర్తిగారు, (1863-1940). ఈయన తన కాలంలో పెరుగుతున్న కొత్త శాస్త్రాలు నేర్చుకున్నారు. ముఖ్యంగా నరశాస్త్రం, భాషాశాస్త్రం. మొదట సవరభాషను అధ్యయనం చేసి వాచకాలు ప్రకటించారు. (1911-1913). ఇంకో ఇరవయ్యేళ్ళ తరవాత **A Manual of savara language** (1931) అనే వర్ణనాత్మక వ్యాకరణం ప్రకటించారు. భాషా శాస్త్రం మీద విశాఖలో (1910-1912) ఉపన్యాసాలిచ్చారు. తన నాటి మేటి (విదేశ) భాషా వేత్తలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపారు. వాళ్ళలో ఒకడుగా పేరు తెచ్చుకున్నారు. భాషా విజ్ఞాని రామమూర్తిగారు సహజంగానే సులభ గ్రాంథికవాదాన్ని తిరస్కరించారు. ఈనాటి రచనా భాష, ఈనాటి వ్యవహార భాష నుంచి ఏర్పడాలని ప్రతిపాదించారు. ఎక్కువ మందికి ఉద్దేశించిన ప్రాచీన వచన రచనలో ఉన్న నిజమైన సంప్రదాయం ఇదేనని వాదించారు. వ్యావహారిక భాషా వాదాన్ని స్థాపించారు. . తన జీవితంలో ఎక్కువభాగం అందుకే వెచ్చించారు.

*రామమూర్తి గారి త్యాగం : మన కర్తవ్యం*

సవరభాషా మాన్యువల్ వంటి సృజనాత్మక వ్యాకరణాలు రచించాల్సిన అద్భుత మేధా సంపత్తిని రామమూర్తిగారు భాషా వాదోపవాదాలకు త్యాగం చేశారు. ఈనాడు భాషా వివాదం లేదు. భాషా శాస్త్రం చాలా మందికి అందుబాటులోకి వచ్చింది. శాస్త్ర సహాయంతో ఆధునిక భాషాధ్యయనం చేయాల్సిన పనులను రామమూర్తిగారు మనకు వదిలి పెట్టారు. రామమూర్తిగారి ఆదర్శాన్ని ఆచరణను గుర్తుచేసుకొని రామమూర్తిగారు మనకు వదిలిన పనులను నిర్వహించటమే మన కర్తవ్యం. అందుకే, ఆ స్ఫూర్తి కోసమే 'మరోసారిగిడుగు రామమూర్తి'

*ఈ పుస్తకం గురించి ఆలోచన : రమేష్‌బాబు*

తన సంతకం లేకుండా గురజాడ స్మారక సంచికను తన శ్రమతో వెలువ రించిన ఢిల్లీ డాక్టరు కాపూరి రమేషుబాబు దీని ప్రారంభకుడు. 1979 మే నెల 20 ప్రాంతంలో హైదరాబాదు వచ్చి, ఈ విషయమై నాతో చర్చించాడు. కాంపోజిషన్ కమిటీ రిపోర్టు శకలాలకూ, కొన్ని ఉత్తరాలకూ తీయించిన జీరాక్సు కాపీలను నా దగ్గర వదిలి మళ్ళీ ఢిల్లీ తిరిగి వెళ్ళిపోయేటప్పుడు నాతో వివరంగా మాట్లాడతానన్నాడు. కాని ఆ అవకాశం దక్కకుండానే మృత్యువు రమేష్ బాబును మే 31న కబళించింది. నాతో చెప్పదల్చుకున్నది చెప్పకుండానే ఈ లోకంనుంచి శాశ్వతంగా నిష్క్ర మించాల్సి వచ్చినందుకు ఎంతో బాధ పడ్డట్టు ఆ సమయంలో దగ్గరున్న వాళ్ళు చెప్పారు. అంటే రామమూర్తిగారిపై వ్యాస సంకలనం వెలువరించాల్సిన పనిని తన చివరి కోరికగా నాకప్పగించాడన్నమాట! ఈ సంకలన ప్రచురణ, ముద్రణ బాధ్యతలను హైదరాబాద్ బుక్‌ట్రస్టు సంతోషంతో స్వీకరించింది. నిర్వహణ బాధ్యతను నాకప్పగించింది.

*కార్యనిర్వహణలో సాయపడ్డవారు*

కార్య నిర్వహణలో రమేష్ బాబుతో పోటీ పడగలిగిన శక్తి నాకు లేదు. అయినా పని ప్రారంభించాను. పత్రికా ప్రకటన ఇచ్చాను. రచయితలను అభ్యర్థించాను. అడిగి నదే తడవుగా అందరూ సాయపడ్డారు. అయినా ఇతర వ్యాసంగాల్లో నిమగ్నుణ్ణి కావ టం వల్లా, కొంత అలసత్వం వల్లా ఈ సంకలనం తయారు చెయ్యటం ఆలస్యం అయింది. అడగంగానే రచనలిచ్చి అచ్చుకోసం తొందర పెట్టకుండా నా అలసత్వాన్ని క్షమించారు రచయితలు. గిడుగు రామమూర్తిగారి రెండుత్తరాలను అందించారు ఒక అజ్ఞాత వ్యక్తి. (ఆయన పేరు రాసుకున్న కాయితం ఎక్కడో పోయింది) భారతి, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రికల నుంచి తన ముత్యాలవంటి అక్షరాలతో కాపీ చేసి ఎప్పటి కప్పుడు నాకందించింది రమేష్‌బాబు పెద్ద చెల్లెలు జి. సీతాదేవి. కొన్ని వ్యాసాలు కాపీ తీయటంలో సాయపడటమే కాక పుస్తకం ఎప్పుడు వస్తుందని నన్ను విసిగించ లేక తానే విసుక్కునేది రమేషుబాబు భార్య డాక్టరు కరుణ. కొత్త పుస్తకాలు తీసుకు రాకపోతే మనం బుక్ ట్రస్టును ఎత్తేసుకోవాల్సిందేనని నాకు అల్టిమేటం ఇచ్చి, వస్తు సంచయనంలో, వ్యాస క్రమ విభాగంలోనూ సాయపడ్డాడు మా సుబ్బయ్య. యేట్సు ఉత్తరాల జీరాక్సు కాపీలందించాడు ఏటుకూరి ప్రసాద్. అసలు ఉత్తరాలను మళ్ళీ నకళ్ళు తీసుకోనిచ్చారు అక్కిరాజు రమాపతిరావు గారు. ఈ ఉత్తరాల్లో వాక్యాలను, మాటలను పోల్చుకోటంలో మా పరిశోధక విద్యార్థి బృందం–విజయ నారాయణ, ఉమా మహేశ్వరరావు, రమణయ్య, శ్రీమతి మరియం తాయబ్ ఆలీలు విశేషంగా తోడ్పడ్డారు. ఆ ఉత్తరాల్లో మూడు మొదటిసారి ఈ పుస్తకంలో ప్రకటిత మవుతున్నాయి. [వీలు వెంబడి మిగతా ఉత్తరాలు, మెమొరాండం, పూర్తిగా దొరికితే కాంపోజిషన్ కమిటీ

రిపోర్టు ప్రచురించాలని హైదరాబాదు బుక్ ట్రస్టు ఆలోచిస్తున్నది.] ఇంత మందీ తలా ఒక చెయ్యా వెయ్యటంవల్ల ఈ పుస్తకం బయటికి వస్తున్నది. రమేష్‌బాబు స్వయంగా నిర్వహిస్తే ఇంకా పెద్ద పుస్తకంగా బాగా వచ్చేమాట నిజమే. అయితే ఇది ఇంకా రావాల్సిన ఇట్లాంటి సంకలనాలకు పునఃప్రారంభం మాత్రమే.

చే. రా.

1986 డిసెంబరు 22

విషయ సూచిక

# రామమూర్తి పంతులుగారి జీవితచరిత్రలోని చిత్రవిచిత్ర ఘట్టాలు

గిడుగు సీతాపతి

మా తండ్రిగారి జీవిత చరిత్ర నాకంటె తక్కిన వారెవరైనా వ్రాయడం మంచిదేమో అని నా అభిప్రాయము. నేనే వ్రాయడం మంచిదని కొందరున్నూ, నేను కూడా వ్రాయడం అవసరమని కొందరున్నూ కోరినందున నేను కూడా వ్రాయడానికి పూనుకున్నాను. ఇందుకు నాకు గల అర్హత ఏమిటంటే: మా తండ్రి గారికిన్నీ నాకున్నూ గల సంబంధం కేవలము తండ్రీ కొడుకుల సంబంధమే కాదు. 28-జనవరి 1885లో నేను పుట్టినది మొదలు 22-జనవరి 1940లో వీరు స్వర్గస్థులయిన వరకున్నూ వీరికీ నాకూ గల గురుశిష్యుల సంబంధము తండ్రీ కొడుకుల సంబంధం కంటె ఎక్కువగా పరిణమించినది. వీరి నలుగురు కొడుకులలోను మొదటివాడ నయినందుకు నేనే వారి శిక్షణకు పూర్తిగా లోబడి ఎక్కువగా దెబ్బలు తిన్నవాడను; వీరి వాత్సల్యము సైతము ఎక్కువగా అనుభవించిన వాడనూ నేనే; వీరు పూనుకొన్న ఉద్యమములన్నిటిలోను వీరి వెంటనుండి వీరికి తోడుగా పనిచేసినవాడనూ నేనే; వీరి కడపటి దినములలో వీరి ఆర్థిక దుస్థితికి కూడా నేనే లేదా, నా దౌర్భాగ్యమే కారణము; తుదకు 22-జనవరి, 40 సోమవారం ఉదయం నేను వీరి ప్రక్కను కూర్చుండి ఉపచారం చేస్తూ ఉండగా వీరు తమ భౌతిక దేహము విడిచిపెట్టడం సంభవించినది.

మా తండ్రిగారి దైనక వృత్త పుస్తకములూ, వారికి బంధుమిత్రులు వ్రాసిన ఉత్తరములూ మొదలయిన పరికరములు పర్లాకిమిడిలో ఉండిపోయినవి. వీరి బాల్యమిత్రులు, సమకాలీనులు అయిన వారు కొందరు సజీవులయి ఉన్నారు. వీరి జీవిత విషయములు కొన్ని వారి నడిగి తెలుసుకోవలసి యున్నది. గనుక వీరి జీవిత చరిత్ర పూర్తిగా నేనిప్పుడు వ్రాయలేను. నా అనుభవములో ఉన్న విషయములున్నూ నేనింత వరకు తెలుసుకొన్న విషయములున్నూ సంగ్రహించి తెలియజేస్తున్నాను.

## మా తాత ముత్తాతల వృత్తాంతము

మా పూర్వులు ఏడు తరముల నుండి గోదావరి జిల్లా, అమలాపురం తాలూకా ఇందుపల్లిలో ఉండినవారు. అంతకు పూర్వము ఎక్కడ ఉండేవారో తెలియదు. మా

కింకా ఇందుపల్లిలో కొద్దిగా కొబ్బరి తోటలున్నవి. మా గిడుగు వారు గోదావరి కృష్ణా జిల్లాలలో చెదిరి ఉన్నారు గోదావరి కాలువలు పడక మునుపు పంటల భాగ్యము లేని కరవు కాలములో మా తాతగారు గిడుగు వీరరాజు గారు విశాఖపట్టణం జిల్లాకు వచ్చి విజయనగర సంస్థానంలో సముద్దారుగా పని చేసినారు. ముఖలింగమునకు నైఋతీ దిక్కున సుమారు రెండు మైళ్ళ దూరమందుగల పర్వతాలపేట అనే గ్రామము విజయ నగర సంస్థానం వారి ఉత్తర మండలపు సముద్దారు ఉండవలసిన ఠాణా గనుక, ఆ గ్రామమందు మా తాతగారు పండ్రెండు సంవత్సరములుండిరి. ఆ కాలంలో 1868వ సంవత్సరంలో మా తండ్రిగారు ఆ గ్రామమందు జన్మించినారు. 1906లో నేను బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణుడనయి ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించిన కొద్ది కాలం లోనే వీరు నన్ను ముఖలింగమునకు తీసికొనిపోయి, అక్కడ దేవాలయ మందలి చిత్రములు, శాసనములు చూపించి, పిమ్మట పర్వతాలపేటకు తీసికొనిపోయి, తమ తండ్రిగారుండిన గృహమున్నూ, తాను పుట్టిన గదిన్నీ చూపించి, తాము పుట్టిన స్థలమునకు సాష్టాంగ నమస్కారము చేసినారు.

మా తాతగారు పర్వతాలపేటలో ఉన్న కాలంలోనే ప్రస్తుతం జయపుర సంస్థానాధిపతులై ఉన్న శ్రీ విక్రమ దేవవర్మ మహారాజు గారి తండ్రిగారు నగరి కట కమనే గ్రామంలో ఉండేవారు. ఈ రెండు గ్రామములున్నూ వంశధారా నదికి చెరి యొక యొడ్డున ఉండేవి. వారి తండ్రిగారున్నూ, వీరి తండ్రిగారున్నూ మిత్రులు. అందుచేత వీరిరువురున్నూ కలసి మెలసి ఆడుకొంటూ ఉండేవారు. బాల్యమందంకు రించిన మైత్రి అంతకంత కెక్కువైనది. గ్రాంధిక వ్యావహారిక భాషా వాదంలో ఇద్దరూ ఏకీభవించక పోయినా వీరి పరస్పర మైత్రి అణుమాత్రమైనా చెడలేదు సరిగదా, మహారాజా వారికి మా తండ్రి గారి యెడల ఆదరమూ, వీరిని బట్టి నా యెడల వాత్సల్యమూ ఎక్కువైనవి. వారి అనుగ్రహమే మా కుటుంబమునకు బహుధా శరణ మైనది.

### మా తండ్రిగారి విద్యాభ్యాసం

పర్వతాలపేటలోనే మా తండ్రిగారికి అక్షరాభ్యాసమూ, ప్రారంభ విద్య సాగి నవి. ఆ కాలంలో అక్కడ బడి లేదు. కీర్తిశేషులు వారణాసి గున్నయ్య శాస్త్రిగారు వీరికి వ్రాయడం, చదవడం నేర్పినారు. తీరుబడి ఉన్నప్పుడు మా తాతగారే వీరిని తమ దగ్గర కూర్చుండ బెట్టుకొని భారతం, భాగవతం లోనివి కొన్ని పద్యాలు, బాల రామాయణం లోనివి కొన్ని శ్లోకాలు చదివిస్తూ ఉండే వారట. మాతండ్రి గారి ఉప నయనం వీరి ఎనిమిదవ యేట విజయనగరంలో జరిగింది. అప్పుడు వీరి చేతను మా తాతగారు యథావిధిగా "మాధు కర" భిక్ష దీక్షా దినములలో ఎత్తించినారట. ఒకనాడు మా తండ్రిగారు వేళకు సరిగా సంధ్యా వందనము చేయలేదని వీరిని మా

తాతగారు కఠినంగా దండించినారట.

**మా తాతగారి మరణము : మా నాయనమ్మ పాట్లు**

పాపం, మా తండ్రి గారు పండ్రెండేండ్ల బాలుడుగా ఉన్నప్పుడే మా తాతగారు చనిపోయినారు 17-1-1940 నాడు మా తండ్రిగారు వ్యాధిగ్రస్తులై యుండిన్నీ తమ తండ్రిగారి ఆబ్దికం జరుపవలసి వచ్చింది. అప్పుడు వీరు నన్ను పిలిచి, నన్ను కూడా స్నానం చేసి తమ చెంత నుండవలసినదని చెప్పగా నేనట్లే చేసినాను. "66వ సారి మా తండ్రిగారి తద్దినం పెడుతున్నాను. ఇదే కడపటి సారి కాబోలును!" అని వారు నాతో అన్నప్పుడు నేను దుఃఖమాపుకోలేక ఏదో నెపమున పైకొక సారి వచ్చి కండ్లు తుడుచుకొని మరల పోయి కూర్చున్నాను. ఇక నీ పని నాకు ప్రారంభం కాబోలు నన్న సూచన పొడగట్టినది.

మా తండ్రి గారికి ఇద్దరు చెల్లెండ్లు తప్ప అన్న దమ్ములు లేరు. ఈ ముగ్గురు బిడ్డలను పోషించడము మా నాయనమ్మకు చాలా కష్టంగా ఉండేది. ఇందుపల్లి తోటల నుండి రావలసిన ఆదాయమత్యల్పము; అదైనా సరిగా వచ్చేది కాదు మా తాతగారు పర్వతాలపేటలో పని చేస్తూ ఉండిన కాలంలో వారు సంస్థానం వారికి లాభం చూపిస్తూ రయితులకు, భూస్వాములకు ఉపయోగకరములైన పనులు చేయించుటచేత, ఆ ప్రాంతమందుగల సిద్ధాంతం దొరలు వారికి అక్కడకు చేరువగా ఉన్న మతలబు పేట ఇనాము భూమి ఒకటి సంస్థానంవారి అనుమతి పొంది దానం చేసినారు. కాని అది అప్పటికి సాగులోనికి రాలేదు. అంతేకాక ఆ దానం సంగతి మా నాయనమ్మకు తెలియనే తెలియదు. అందుచేత ఆమె విజయనగరంలో తన యొడలిపై నున్న ఆభరణములమ్ముతూ పొందికగా కాలక్షేపం చేసినది. ఇప్పుడు పచ్చయ్యప్ప కాలేజీలో కెమిస్ట్రీ ప్రొఫెసరుగా నున్న కాళ్ళకూరి సూర్యనారాయణగారి తండ్రిగారైన విశ్వనాథం గారు బంధువులున్నూ, మిత్రులున్నూ అయి పొరుగున ఉండటంచేత వారి వద్దను మా తండ్రిగారు ఇంగ్లీషు అభ్యసించినారు. మహారాజా వారి కళాశాలలో వీరు ప్రవేశించి చదువుకున్నదంతా నాలుగు క్లాసుల చదువు మాత్రమే—లోయర్ ఫోర్తు, అప్పర్ ఫోర్తు, ఫిఫ్తు, మెట్రిక్యులేషను. వీరి బడి చదువంతా యింతే. అప్పుడు కాలేజి ప్రిన్సిపాలుగారు చంద్రశేఖర శాస్త్రిగారు. వారికి వీరు ప్రియ శిష్యగణములో చేరినవారు. వీరి సహాధ్యాయులలో వీరికి పరమ మిత్రులుగా ఉండి, వీరితో కలసి మెలసి ఆడుకొంటూ ఉన్నవారు గురజాడ అప్పారావు పంతులుగారు. వీరి కంటే కొంచెము చిన్నవారున్నూ, క్రింది తరగతులలో ఉన్న వారున్ను అయినా వీరితో ఆడు కొంటూ ఉండేవారు శ్రీయుత కేసరి కామేశ్వరరావుగారు. వీరు సజీవులై ఉన్నారు. మరి యొకరు బుర్రా పార్వతీశం పంతులుగారు— శేషగిరిరావుగారి పినతండ్రిగారు. ఆ కాలపు చదువులు, ఉపాధ్యాయుల పాండిత్యము, విద్యార్థుల నడవడి మొదలైన

విషయములను గురించి మా తండ్రిగారు పెక్కుసార్లు నాతో ముచ్చటించినారు. ఈనాటి చదువులలో కొన్ని లోపములున్ను, ఆనాటి చదువులలో కొన్ని సుగుణములున్ను ఉన్నా మొత్తము మీద ఆనాటి విద్యా విధానము కంటె ఈనాటి విద్యా విధానము ఎక్కువ మేలయిన దనిన్ని, పరీక్షల కోసం చదివే శ్రద్ధ నాటి విద్యార్థుల కంటె నేటి విద్యార్థులకు సాధారణంగా తగ్గిపోయినా, నేటి విద్యార్థులకు సామాన్యంగా ఉండే విశాలదృష్టి, అవేక్షణము, ప్రపంచ జ్ఞానము నాటి విద్యార్థులకే కాదు ఉపాధ్యాయులకైనా లేదని వీరున్నూ, గురజాడ అప్పారావు గారున్నూ ముచ్చటించు కొంటూ ఉండేవారు.

## చదువు చాలింపు, ఉద్యోగ ప్రయత్నాలు

మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులైన తర్వాత గురజాడ అప్పారావు పంతులు గారు కాలేజీలో ఉన్నత విద్య సాగించ గలిగినారు, మరి మా తండ్రిగారు సాగించ లేక పోయినారు. "ఏదైనా ఒక ఉద్యోగం చూసుకోవలసినదే కాని మరి నేను నీకు చదువు చెప్పించలే"నని మా నాయనమ్మ చెప్పడం చేత మా తండ్రిగారు విశాఖ పట్టణం కలెక్టరు కచేరీలో ఆరు మాసములు గుమస్తా పనికోసం వాలంటరీ చేశారు. ఈలోగా వీరికి వివాహమైనది. మా తల్లి తండ్రిగారు కందికొండ రామదాసు పంతులు గారు, భీముని పట్టణంలో ఒక చిన్న వాటా దారుగా ఓడ వర్తకం సాగిస్తూ ఉండేవారు.

ఇట్లుండగా 1880లో మా తండ్రిగారికి రెండు ఉద్యోగములలో ఏది కావలెనని స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు గారడిగినారు— విజయనగరమునకు సమీపముగ ఉన్న కోనాడ గ్రామములో 25 రూపాయల ఉపాధ్యాయ పదవి కావలెనా? లేక పర్లాకిమిడి రాజు గారి పాఠశాలలో 30 రూపాయల పని కావలెనా! అని అడిగినప్పుడు స్వగ్రామమునకు దూరంగా మన్యప్రదేశంలో ఉన్నా పర్లాకిమిడిలో ఐదు రూపాయలెక్కువ దొరుకునన్న ఉద్దేశ్యంతో ఆ పనే కావలెనన్నారు. అది మొదలు 1936వ సంవత్సరము వరకు వీరు 56 సంవత్సరములు పర్లాకిమిడిలోనే నివాసమేర్పరచుకొని ఉండిరి.

## ఉద్యోగం చేస్తూనే ఉన్నత పరీక్షలు పాసయ్యారు

ఉన్నత విద్య వీరు కాలేజీలో అభ్యసించడానికి అవకాశం లేకపోయినా, ఉద్యోగం చేస్తూ చదువుకొని ఎఫ్. ఏ. పరీక్షలోనూ, బి. ఏ. ఇంగ్లీషు, సంస్కృత భాగముల పరీక్షలోనూ క్రమంగా వెంట వెంటనే నెగ్గినారు ఇంతలో వీరి బుద్ధిని రెండు విషయము లాకర్షించినవి పర్లాకిమిడి చుట్టును కొండలలో నివసించే సవరలు విద్యావాసన లేక పశుప్రాయులై ఉన్నారు గనుక, వాండ్ల కోసము వాండ్ల కొండలలోనే బడులు పెట్టించి, వాండ్లకు చదువు చెప్పించవలెనన్న కోరిక పుట్టి వీరు తమ ఆశయం నెరవేర్చుకొనుటకు ఉపక్రమ సాధనంగా 1892లో సవర భాష నేర్చుకొనుటకు

ప్రారంభించారు. తమ జన్మస్థానమునకు ఈశాన్య దిక్కున రెండు మైళ్ళు దూరం గానూ, పర్లాకిమిడి దక్షిణాన సుమారు 20 మైళ్ళు దూరంగానూ ఉన్న ముఖలింగం ఆలయమూ, ఆలయంలో గోడలపై నున్న శాసనములూ చూస్తూ ఉండడం చేత ఆ శాసనముల లిపి నేర్చుకొని శాసనములు చదివి పురాతన చరిత్ర విషయములు పరిశీలించ వలెనన్న కోరిక పుట్టినది. ఈ రెండు పనులున్నూ వీరు స్వయముగా స్వశక్తి, స్వబుద్ధి వినియోగించి చేయవలసినదేకాని ఆ కాలంలో ఆ మారు మూల ప్రదేశంలో వీరికి తోడుపడి మార్గము చూపించగల గ్రంథములూ లేవు, విద్యావంతులూ లేరు, మరి ఏ సాధనములూ లేవు. అందుచేత వీరు స్వశక్తి మీదనే ఆధారపడి, కొంచెం కొంచెంగా అయినా రెండు పనులున్నూ పట్టుదలతో సాగిస్తూ వచ్చారు.

**తలవని తలంపుగా తప్పిపోయిన ప్లీడరీ చదువు ప్రయత్నాలు**

ఇంతలో వీరి జీవిత చరిత్ర పూర్తిగా మార్చివేయగల సంధిగ్ధావస్థ వచ్చినది. 1884లో మా తల్లి కాపరానికి వచ్చినది. 1887లో వీరు ఎఫ్. ఏ. పరీక్షలో ఉత్తీర్ణులయి సబ్‌రిజిస్ట్రారు పనికి దరఖాస్తు పంపించారు. ఆ పని అయినట్టు ఉత్తరువు వచ్చింది, గాని, అది మా నాయనమ్మ కిష్టము కాకపోవుటచేత విడిచి పెట్టుకొన్నారు. మరికొద్ది కాలమునకు మా నాయనమ్మ చనిపోయినది. 1892లో వీరిని స్కూలునుండి రాజావారి తమ్మునికి (ఇప్పటి మహారాజావారి పినతండ్రికి) ట్యూటరుగా బదలాయించారు అప్పటికి వీరు బి. ఏ. ఇంగ్లీషు, సంస్కృతం భాగముల పరీక్షలో ఉత్తీర్ణులయినారు వీరి స్థానే ఆ కళాశాల ప్రధానోపాధ్యాయుల తమ్ముడు గారిని నియమించారు. ఆ సంవత్సరమే శ్యామసుందర రాజగురువు అనే ఓఢ్రులు బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణులయి వచ్చుట చేత వారిని ట్యూటర్‌గా నియమించి మా తండ్రిగారిని మరల స్కూలుకు పంపించారు. అప్పుడు వీరున్ను, వీరి స్థానే ఉన్నవారున్ను పనిచేయుటకు అవకాశం ఉన్నందున, వీరి స్థానే ఉన్నవారు బి. ఏ. పూర్తిగా అయినవారన్న కారణం చేత వారు అనుభవము సార్వీసు లేనివారైనా వారిని మీది ఉపాధ్యాయులుగాను, వీరు 12 ఏండ్ల సార్వీసూ, అనుభవమూ ఉన్నవారైనా పూర్తిగా బి. ఏ. కారన్న కారణంచేత వీరిని క్రింది ఉపాధ్యాయులుగాను నియమించవలెనని ప్రధానోపాధ్యాయులు గారు శిఫార్సు చేశారు. అది చూసి, మా తండ్రిగారు తమకు అన్యాయం జరుగుతూ ఉన్నందుకు ఖేదపడి, అంతవరకున్నూ పరమ మిత్రులుగా ఉన్న ప్రధానోపాధ్యాయులు తమ తమ్ముని కోసం చేసిన శిఫార్సుకు విరుద్ధముగా అధికారులతో నివేదించుకొనుటకు ఇష్టపడక "ప్లీడరీ చదువు కొనుటకు చెన్నపట్టణం వెళ్ళదలచినాను గనుక ఒక సంవత్సరము జీతం నష్టము పైని సెలవు ఇప్పించ వలసిన"దని కోరుతూ దరఖాస్తు పంపించుకొన్నారు. వీరు చెన్నపట్టణం ప్రయాణం చేయడానికి కావలసిన ఏర్పాట్లు అన్నీ చేసుకొన్నారు. అప్పట్లో మా తల్లి పుట్టింటికి వచ్చుట చేత ఆమెతో

నేనూ, నా తమ్ముళ్లూ (అప్పటికి ముగ్గురము సోదరులము) భీమునిపట్టణంలో ఉన్నాము. "నేను సంవత్సరం సెలవు పెట్టి ప్లీడరీ చదువుకోవడానికి చెన్నపట్టణం వెళ్తున్నాను. నీవు, పిల్లలు మీ పుట్టింటనే ఉండవలసినది. సామాన్లు అన్నీ పంపిస్తున్నాను" అని ఉత్తరం వచ్చింది. మరి పది దినములకు ఈ ప్రయత్నమంతా విడిచి పెట్టుకొన్నట్లు తెలియజేస్తూ మేము పర్లాకిమిడి రావలసినదని తంతివార్త వచ్చినది. ఏమిటీ వైపరీత్య మనుకొన్నారు మా వాండ్లు. స్కూలు ప్రధానోపాధ్యాయులు తమ శిఫార్సు రద్దు చేసు కొన్నారు. వారి తమ్ములు ప్లీడరీ చదువుకోడానికి చెన్నపట్టణం వెళ్ళినారు. మా తండ్రి గారికి అన్యాయం మరి జరుగలేదు. ప్లీడరై వుంటే మా తండ్రి గారు ఎక్కువగా ధన మార్జించి ఉందురేమో కాని వీరు సవర భాష విషయమై చేసిన పని మరి కాకపోవును. ముఖలింగం-పురాతన చరిత్ర విషయములు ఇటీవరి చారిత్రక పరిశోధకులు పరిశీలించ గలుగుదురు గాని ఈ పని అంతవేగముగా కాకపోవును.

## సంఘ సంస్కరణ సన్నాహాలు, తత్ఫలితంగా సంఘ బహిష్కారము

పైని చెప్పిన రెండు పనులున్ను మందముగానే సాగుతూ ఉండడానికి చాలా కారణాలున్నవి. ఆ కాలంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారి సంఘసంస్కరణ ప్రాభవం ఆంధ్రదేశమందు ఎక్కువగా వ్యాపించి యుండేది. అది మా తండ్రిగారిని సైతము లోబరచుకొన్నది, బాలవితంతువులకు పునర్వివాహము కావలెనన్న ఆశయము వీరికీ నచ్చినది. అప్పుడు పండితుల ఆక్షేపమును ఖండించుటకు స్మృతులు చదువుకొని ఉపన్యసిస్తూ ఉండేవారు. పర్లాకిమిడిలో రీడింగ్ రూమ్ అనే పేర నొక సమాజముండేది. దానికి వీరు చాలా కాలము కార్యదర్శిగా ఉండేవారు. ఒకసారి పర్లాకిమిడిలో ఒక బాల వితంతువుకు పునర్వివాహము చేయించుటకు వీరు తగిన ఏర్పాట్లన్నీ చేసి వీరేశలింగం పంతులు గారికి జాబు వ్రాశారు. అది తెలిసికొన్న వీరి మిత్రులలో పెద్దవారొకరు వీరి ఉద్యమము కొనసాగకుండా చేయుట చేతను, వీరి ననేక విధముల నిరుత్సాహ పరచుట చేతను, సంఘ సంస్కారోద్యమమునకు పూనుకొన్న యెడల తాము అంతకు ముందుగా ప్రారంభించిన పనులు (సవర భాషకున్ను, చరిత్ర పరిశోధనలకున్ను సంబంధించిన పనులు) నిలిచి పోవునన్న భీతి చేతను సంఘ సంస్కారమునకు సంబంధించిన పనులు వీరు మరి తలపెట్టలేదు: గాని, నాట నుండి చనిపోవు వరకున్ను సంఘ సంస్కార ప్రియులుగానే ఉండిరి. శ్రీయుత బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు బాల వితంతువైన తమ కూతురికి వివాహము చేసినప్పుడున్ను, అన్యమతమును స్వీక రించి పశ్చాత్తప్తులయి మరల హిందూ మతమందు ప్రవేశింప దలచిన యొక బ్రాహ్మణ యువకునికి తోడుగా శ్రీ వాసా సూర్యనారాయణ శాస్త్రిగారు ఉద్యమించినప్పు డున్ను, శారదా వివాహ చట్టమునకు అనుకూలముగా ఈ యిద్దరు శాస్త్రుల వారున్ను పనిచేసినప్పుడున్ను వారికి వీరు తోడుగా ఉండి తగిన ప్రోత్సాహము కలిగించినారు. హరి

జనులు నంటరాదను పూర్వాచారమును తొలగించి హరిజనుల పురోభివృద్ధికి పూను కొన్న ఉద్యమమునకు వీరును యథాశక్తి తోడుపడినవారే. ఈ ఉద్యమము వెలయక పూర్వము 40 సంవత్సరముల క్రిందటనే వీరు సవరలను, సవరభాష తెలిసిన పైడి (పానో) వాండ్లను ఇంట నుంచుకొని, తమకు దగ్గరగానే కూర్చుండ బెట్టుకొని, సవర భాష నేర్చుకొంటూ ఉండేవారు. హరిజనుల కోసము పెట్టిన బడులలోనికి బడిపని పరీక్షించుటకు తమతోడి ఉపాధ్యాయులు నిరాకరించినప్పుడు వీరు మాత్రము సంతో షముతో వెళ్ళుతూ ఉండేవారు. 1908లో వీరి శిష్యులలో ఒకరు కీ. శే. కన్నేపల్లి వేంకట నరసింహం పంతులుగారు బారిస్టరయి ఇంగ్లండు నుండి మన దేశమునకు వచ్చి, మా తండ్రిగారినీ తక్కిన మిత్రులనూ చూదామని పర్లాకిమిడి వచ్చినప్పుడు మా యింట బసచేసినారు వారి యెడల తమకు గల వాత్సల్యము చేతను, గౌరవము చేతను వీరు ఒక రాత్రి విందుచేసి పదిమంది మిత్రులను ఆహ్వానించారు. ముగ్గురు తప్ప తక్కినవారు రాలేదు; సరిగదా, ఆ మరునాట నుండిన్నీ మాకు ఊరిలో వెలిపెట్టి నారు ఇంట వంటపని చేసే వంటలక్క మరి మా యింటికి రాలేనన్నది. మంచినీళ్లు తెచ్చిపోసే బ్రాహ్మణుడు మరి మాకు కనబడలేదు. ఊరి పెద్దలు కొందరు—మాకు పరమ మిత్రులే— వన సంతర్పణ తలపెట్టి భోజనాలకు పూర్వము కాశీగంగ 'తీర్థము' పుచ్చుకొనుటకు సమ్మతించిన యెడల మమ్మ ఆహ్వానించి వెలి తీసి వేయుదుమన్నారు. "మరియొకనాడు కావలసిన యెడల నూరు సారులు తీర్థము పుచ్చుకొందును గాని ఈనాడు మాత్రము ఒక్కచుక్కయినా పుచ్చుకో"నని వీరు నిరాకరించారు. కొందరుమిత్రులు మా తండ్రిగారిని వెలిలో ఉంచడానికి మనసొప్పకను, కలుపుకోడానికి సాహసము లేకను సభలేర్పరచి సముద్రయానము చేసినవారు ప్రాయశ్చిత్తము చేసుకోవలెనా, అక్కర లేదా అనే విషయము చర్చకు తీసుకొని వచ్చారు. ఈ వెలి కొద్ది కాలములో దానంతట అదే అంతరించినది గాని మా తండ్రి గారు సనాతనులకు కొంచమైనా లొంగలేదు. వీరు మొదట నుండిన్నీ సబబు లేని అధి కారమునకు గాని, అట్టి అధికారము వహించే వ్యక్తులకు గాని లొంగక తమ పట్టుదల విడవక పనిచేస్తూ వచ్చారు ఉద్యోగ మూడిపోయినా సరే అనిష్టమైన పని చేయనన్న సంకల్పము మొదట నుండిన్నీ వీరికి బలంగా ఉండేది. ఇందుకు తార్కాణంగా 1892లో వీరు పర్లాకిమిడి కుమారరాజుకు ట్యూటరుగా ఉన్నప్పుడు ఒక ముచ్చట జరిగినది భోగీ సంక్రమణము తర్వాత కనుము నాడు పశువుల పండుగ చేసి పశువు లకే కాక మనుష్యులకు సైతము చురకలు వేసే ఆచారము పర్లాకిమిడిలో ఆ కాలమందు బలంగా ఉండేది. అందుచేత, వీరు కుమారరాజుకు పాఠము చెప్పుతూ ఉన్న సమయంలో రాజావారి సేవకులు నిప్పు కుంపటీ, చురకలు వేసే పరికరములూ పట్టు కొనివచ్చి "మీకున్ను కడుపు పైని రెండు చురకలు వేయవలసినదని రాజావారి ఆజ్ఞ" అని మా తండ్రిగారికి తెలియజేయగా వీరు కోపము పట్టలేక "ఇక్కడి రాజుల మర్యాద

చక్కగానే ఉన్నది; తక్కిన సంస్థానాలలో పండితులకూ, ఉద్యోగస్తులకూ పండుగ నాడు పంచెల చాపులో, పట్టుబట్టలో బహుమతిగా ఇస్తూ ఉంటే ఈ సంస్థానంలో వాత పెట్టడం సంప్రదాయంగా ఉన్నది, సెబాస్! చాలు మీ మర్యాద" అన్నారు. అప్పుడా కుమార రాజు సేవకులను మందలించి వెడలి పొమ్మన్నాడట.

**వీరు తలపెట్టిన సవరల విద్యాభివృద్ధి, గవర్నరుగారి తోడ్పాటుకు అడ్డుపుల్ల**

1894లో గవర్నరు గారు పర్లాకిమిడికి వచ్చినప్పుడు, రీడింగ్ రూమ్ సభ వారొక సన్మాన పత్రిక సమర్పిస్తూ సవరల విద్యాభివృద్ధి కోసం ప్రభుత్వం వారు సవర దేశంలో బడులు పెట్టించవలసినదనిన్ని, అందుకు సవర భాష నేర్చిన మా తండ్రిగారు తోడు పడగలరనిన్ని తెలియ జేసినారు. అందుకు గవర్నరుగారు సంతసించి మా తండ్రిగారితో సవరల విషయమై కొంతసేపు ప్రసంగించినారు. గాని, అప్పుడు జిల్లా కలెక్టరుగా ఉన్న మెక్కార్టీ దొరగారికి సవరలకు చదువు చెప్పించడము ఇష్టము కాక పోయినది. కట్టెలు కొట్టి జీవించే కొండవాండ్లకు చదువెందుకని వారి అభిప్రాయమట! అందుచేత గవర్నరుగారితో భోజనము చేస్తూ ఉన్న సమయమున మా తండ్రిగారి ప్రస్తావన వచ్చినప్పుడు ఆ కలెక్టరుగారు "రామమూర్తి పంతులు పిచ్చి వాడు. నెమ్మదిగా జీవిస్తూ ఉన్న సవరలకు లేనిపోని ఆశలు కలిగించి ప్రశాంతమైన సవర దేశంలో విప్లవం పుట్టించ దలచినాడు. అతడు సవర దేశమునకు పోరాదని శాసించ దలచినాను" అని చెప్పి గవర్నరు గారికి మా తండ్రిగారి యెడల దురభి ప్రాయము కలిగించారట. అందుచేత, సవరల విద్యాభివృద్ధి కోసం మా తండ్రిగారు చేసిన ప్రయత్నం అప్పట్లో నెరవేరలేదు.

**అమితంగా క్వినైను సేవించుట వల్ల వీరికి చెవుడు పట్టుకొన్నది**

సవర భాష, సవర పాటలు, సవర దేశం తిరిగి నేర్చుకొందామని వేసవి సెల వులలో ఒకసారి వీరు కొండలలో తిరిగి రాగానే వీరికి మలేరియా జ్వరము పట్టుకొని మూడు మాసములు పీడించింది. అప్పుడు పోస్టాఫీసులలో అమ్మే క్వినీను గుండ దినానికి 10 గ్రెయినులు చొప్పున 40 దినములు పుచ్చుకొనే సరికి వీరికి చెవుడు పట్టు కొన్నది. ఎన్ని మందులు తిన్నా అది అంతకంతకు ఎక్కువయినది గాని తగ్గలేదు.

వీరి చారిత్రక పరిశోధన కృషి మాత్రము కొంతవరకు ఫలించినది. స్వయం కృషి వల్లనే శాసనములలోని ప్రాచీన నాగర కర్ణాటాంధ్ర లిపి వర్ణములు చదువుట నేర్చుకొని ముఖలింగేశ్వరాలయములోని రాతి గోడలపై చెక్కియున్న శాసనములున్ను, రాగిరేకులపై చెక్కిన దాన శాసనములున్ను చదివి ప్రాచీన కళింగ రాజ్యమునకు—ఎని మిదవ శతాబ్దము నుండి పండ్రెండవ శతాబ్దము వరకున్ను ముఖలింగము రాజధాని అనిన్ని, నగర కటకము (అనగా శ్రీ విక్రమ దేవవర్మగారు బాల్యమందున్న గ్రామము)

సైనిక స్థానమనిన్ని, కళింగ పట్టణము రాజుల రేవు పట్టణ మనిన్ని తెలుసుకొన్నారు. తాము తెలుసు కొన్న విషయములన్నీ చేర్చి "ఆంటి క్విటీజ్ ఆఫ్ ముఖ లింగం" అనే పేరను ఇంగ్లీషులో ఒక వ్యాసము వ్రాసి మద్రాస్ లిటరేచర్ అండ్ సయిన్సు సొసైటీ మాస పత్రికలో 1895లో ప్రకటించారు. కళింగ గంగ వంశపు రాజుల దాన పట్టా శాసనములు సంప్రతించి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించారు. ముఖలింగము ప్రాచీన కళింగ గంగ రాజ్యమునకు రాజధాని నగరమన్న విషయం వీరి వ్రాతల నాధారంగా గ్రైకొన్నట్లు సూచిస్తూ విన్‌సెంట్ స్మిత్ గారు తమ హిందూ దేశ చరిత్రలో చేర్చుకొన్నారు.

## పరిశోధనలు కొంత కాలంపట్టు ఆగాయి

అంతట్లో సవర భాషా కృషికి, చరిత్ర పరిశోధనలకు సంబంధించిన పనులు మా తండ్రిగారు కొంత కాలము నిలిపి వేయవలసి వచ్చినది. అందుకు కారణ మేమంటే, 1895లో ఆదివరకు హైస్కూలు మాత్రముగానే ఉన్న కళాశాల సెకెండ్ గ్రేడ్ కాలేజీగా అభివృద్ధి పరచుటకు పర్లాకిమిడి రాజావారు సంకల్పించి అందుకు తగిన యేర్పాట్లుచేశారు. మా తండ్రిగారప్పటికి బి ఏ. పూర్తి చేయలేదు ఇంగ్లీషు, సంస్కృత భాగములందలి పరీక్షలలో మాత్రమే ఉత్తీర్ణులై ఉండడం చేత మెట్రిక్యులేషన్ తరగతి వరకు పాఠములు చెప్పడానికి మాత్రమే అర్హులై ఉండిరి ఫోర్తు ఫారమునకు ఇంగ్లీషు న్ను, హైస్కూలు తరగతులకు చరిత్ర పాఠములున్ను చెప్పతూ ఉండేవారు. చరిత్రాధ్యయనములో వీరికి అభిమానమూ, కృషీ ఎక్కువగా ఉండడం చేత కాలేజీలో చరిత్రాధ్యాపక పదవికి అర్హులు కాగోరి, బి.ఏ. పూర్తి అయితేనే కాని ఆ పదవి తమకు రాదు గనుక సవర బాషకున్ను, చరిత్ర పరిశోధనలకున్ను సంబంధించిన కృషి కట్టిపెట్టి బి.ఏ. చరిత్రభాగ పరీక్షకు చదివి 1896లో జరిగిన పరీక్ష యందు మొదటి తరగతిలో ఉత్తీర్ణులై, ఆ సంవత్సరం ఉత్తీర్ణులైన వారిలో రెండవ వారుగా నిల్చినారు. ఏ కాలేజీలోను ప్రవేశించి చదవకుండా ప్రైవేటు విద్యార్థిగా పరీక్షకు వెళ్ళి ఇంత ఎక్కువగా ఉత్తీర్ణులు కావడము చాలా మెచ్చుకోవలసిన విషయము గనుక, పర్లాకిమిడిలో కాలేజీ పెట్టగానే వీరిని రాజావారు చరిత్రోపన్యాసకులుగా నియమించినారు. ఆరంభములో కొత్తగా చెప్పవలసినవిషయము తాము పెద్ద పుస్తకములు చదివి నేర్చుకోవలసి ఉండడం చేత నాలుగైదు సంవత్సరముల వరకున్ను సవర భాషకూ, ప్రాచీన హిందూ దేశ చరిత్ర పరిశోధనలకూ సంబంధించిన కృషి సాగలేదు.

## తెలుగు-సవర నిఘంటు రచన

ఆ పిమ్మట సవర భాష కృషి సాగించి తెలుగు — సవర నిఘంటు వొకటి రచించారు. సవరపాటలు, సవరకథలు కొన్ని సవరభాషలోనే వ్రాసి పెట్టుకొన్నారు

సవరభాషకు వ్యాకరణం రచించడానికి పునాది వేసినారు. ఈ పనిలో వీరికి వీరి మిత్రులొకరు మామిడన్నము కుమారస్వామి పంతులు గారు తోడుగా ఉండేవారు. వీరికి మొదట నుండిన్ని సవరభాష నేర్పినవాడు 'తౌడు' అనే పేరు గల ఒక పైడి (పానో) వాడు వాడికి ఓఢ్రము, తెలుగు, సవర భాషలు వచ్చి ఉండడం చేత వాణ్ని గురువుగా పెట్టుకొన్నారు. కొంత కాలానికి ఆ పైడి వాడు చెప్పిన సవర భాష స్వచ్ఛమైన సవరభాష కాదనిన్ని, స్వచ్ఛమైన సవరభాష నేర్చుకోవలెనంటే స్వచ్ఛమైన సవరల నడిగి తెలుసు కోవలసినదే అనిన్ని మా తండ్రిగారికి బోధపడినది. అది సులభ సాధ్యమైన పనికాదు. అందుచేత, అప్పుడప్పుడు స్వచ్ఛమైన సవరలను రప్పించి వారికి అన్నం పెడుతూ, బట్టలిస్తూ, డబ్బిస్తూ ఇంటి వద్దనుంచుకొని కృషి చేశారు. ఏమిచేసి ఎంత శ్రమపడి సవరభాష నేర్చుకొని సవరల విద్యాభివృద్ధి కోసం వీరు ప్రయత్నించినా, వీరి ఉద్యమం కొనసాగడానికి రాజావారి తోడ్పాటు గాని, ప్రభుత్వం వారి తోడ్పాటు గాని లేకపోయినది. వీరు రచించిన గ్రంథము అచ్చుపడడానికి ఆధారం కన బడలేదు; సవరల కోసం బడులు పెట్టించడానికి సాహాయ్యం దొరకలేదు. అప్పటికీ ఊరుకోలేక వీరు తమ సొంత ధనం వెచ్చించి, పర్లాకిమిడికి చేరువనున్న సవర పల్లెలలో గ్రాంటు బడులు పెట్టి గ్రాంటు కోసం ప్రయత్నించారు. కొన్నాళ్లకు—అనగా 1905-6 లో వీరి కృషీ, ఉత్సాహమూ, పట్టుదలా మెచ్చుకొన్న ఉద్యోగస్థులు జిల్లాలో ఉండడం చేత వీరు పెట్టిన బడులు కొద్దిగా వృద్ధిలోనికి వచ్చినవి. సవరల విద్యాభివృద్ధికి ఎక్కడెక్కడ ప్రభుత్వము వారు బడులు పెట్టవలెను, విద్యావిధానమెట్లుండవలెను అనే విషయములు చర్చకు వచ్చినవి. ఆ చర్చలు గంజాం జిల్లా కలెక్టర్లు ఛత్రపురంలో జరిపిస్తూ కొందరుద్యోగస్థులతో పాటు మా తండ్రి గారిని సైతము ఆహ్వానిస్తూ ఉండే వారు.

**సవర భాషాభ్యాసానికి ఒక దొరగారు వీరి వద్ద శిష్యరికం చేశారు**

1908 లో వెల్ష్‌మన్ అనే ఒక ఫారెస్టు ఉద్యోగస్థుడు సవరదేశములో పని చేయవలసి వచ్చుటచేత అతనికి సవరభాష నేర్చుకోవలెనన్న కోరిక పుట్టినది. "కొద్దిగా పారితోషికం ఇస్తూ ఉంటాను; నాకు మా యింటి వద్దను సవరభాష నేర్పుతారా?" అని ఆ దొర మా తండ్రి గారిని అడిగినాడు. "మీరు నాకేమీ పారితోషికం ఇవ్వనక్కరలేదు. నేను మీ యింటికి వచ్చి సవరభాష నేర్పడానికి నాకు వీలుండదు. మీరు మా కాలేజీకి మధ్యాహ్నం మా విశ్రాంతి వేళవస్తే మీకొక గంట సవరభాషా పాఠములు చెప్ప గలను" అని వీరు తెలియజేశారు. ఆ దొర వీరు కోరినట్లు వీరివద్దకే వచ్చి సవర భాష నేర్చుకొన్నాడు. మొట్టమొదట ఆ దొర పెద్ద ఉద్యోగస్థుడననే గర్వంతో అధికార భావంతో మా తండ్రి గారిని చూచేవాడట. గాని, కొద్ది దినములలో వీరి పాండిత్య గరిమ తెలుసుకొని వీరిని గురుభావంతో చూస్తూ ఉండేవాడు. అప్పటికి నేను రాజ

మహేంద్రవరం ట్రెయినింగ్ కాలెజీలో (1907 లో) ట్రెయినింగయి పర్లాకిమిడి కాలేజీలోనే హైస్కూలు తరగతులకు చరిత్రాధ్యాపకుడుగా పని చేస్తూ ఉండేవాడను. అందుచేత, నేను కూడా ఆ దొరతో కలిసి సవరభాష నేర్చుకోవలసి ఉండెను. గాని, అప్పుడు స్కూళ్ల ఇన్స్పెక్టరుగా ఉన్న యేట్సుదొర గారు ఫొనెటిక్స్ లిపిని, డైరెక్ట్ మెథడ్ అనే పద్ధతిని అనుసరించి చిన్నపిల్లలకు ఇంగ్లీషు నేర్పడం మంచిదనే క్రొత్త విధానం తెచ్చిపెట్టి ఆ పనికి మా తండ్రి గారున్ను, నేనున్ను తగిన వారమని ఎంచి శిఫార్సు చేయడం చేతను మేమాపని ప్రారంభించాము క్రొత్త పద్ధతుల ననుసరించి పాఠములను చెప్పేవాడను నేను; నాకు సంహాలిస్తూ మార్గం చూపిస్తూ నా పని పరిశీలిస్తూ ఉండేవారు మా తండ్రిగారు.

ఇంతలో యేట్సుదొర గారి మూలాన్నే వ్యావహారిక భాషా వాదం ప్రారంభమయినది. 1910 జూలై మాసంలో నేను జయపురం స్కూలుకు హెడ్ మాస్టరుగా వెళ్ళినాను; గనుక అప్పట్లో సవర భాష నేర్చుకోవలెనన్న నా సంకల్పం నెరవేరలేదు.

మా తండ్రి గారి వద్ద సవరభాష నేర్చుకొన్న వెల్షమన్ దొర పలుకుబడి గలవాడు గనుక వీరి విషయం జిల్లా కలెక్టరు గారికి చెప్పి, వీరు రచించి పెట్టుకొన్న తెలుగు—సవర నిఘంటు, సవర కథలు, సవరపాటలు ప్రభుత్వం వారు అచ్చు వేయించేటట్లు గట్టిగా శిఫార్సు చేయవలసినదని ఉద్యోగి రీతిగాను, స్నేహధర్మం గాను చెప్పడం చేత అప్పటి జిల్లా కలెక్టరయిన మాక్ మైకేల్ దొరగారు ప్రభుత్వము వారికి వ్రాసి అనుమతి తెప్పించారు.

**ఉద్యోగ విరమణము: రావుసాహెబు బిరుద ప్రాప్తి**

ఇంతలో మా తండ్రి గారికి కాలేజీ పని నుండి 'రిటైర్' అయి విశ్రాంతి పొందు దామన్న కోరిక పుట్టినది. వయస్సుకు 48 సంవత్సరముల వారే అయినా 1880 నుండి 30 సంవత్సరములు పని చేసినారు గనుక, వీరు రిటైర్ కావడానికి కాలేజీ అధికారులు అనుమతిచ్చారు 1911లో వీరు రిటైర్ అయినారు. ఆ పని నాకు ప్రాప్తించడం చేత, జయపురం హైస్కూల్ హెడ్మాస్టరు పని విడిచి పెట్టి, నేను పర్లాకిమిడి చేరుకొన్నాను. అచ్చగుతూ ఉన్న సవర పుస్తకాల ప్రూఫులు దిద్దడం తప్ప మరి యే సాహాయ్యమూ నేను వీరికి చేయలేక పోయినాను. "ఈ పుస్తకాలు నీవు రచించినందుకు నీ కేమి పారితోషికము కావలె" నని ప్రభుత్వం వారు అడిగినప్పుడు "నా కేమీ అక్కర లే"దని వీరు తెలియజేశారు. ఎట్లయినా వీరిని గౌరవించడం తమ విధి యని ప్రభుత్వం వారు గ్రహించి, 1911 లో జార్జి చక్రవర్తి రాజ్యాభిషేక సంబంధమైన ఉత్సవం జరిగినప్పుడు వీరికి "సెర్టిఫికెట్ ఆఫ్ మెరి" ట్టున్ను, 1913 లో రావుసాహెబ్ అనే బిరుదున్ను ప్రభుత్వం వారు వీరికిచ్చారు.

ఆ బిరుదు వచ్చేసరికి వీరు విజయనగరంలో నివసించవలసి వచ్చినది. అది

యొక్క చిత్రమైన సన్నివేశము. విజయనగరం మహారాజావారి పిల్లలలో మొదటి వారు (అనగా రెండేండ్ల క్రిందట చెన్నపురిలో మృతి నొందినవారు) అజ్మీరులో చదువు కొంటూ ఉంటేవారు. వారి చెల్లెలున్ను, తమ్ముడున్ను (అనగా క్రికెట్ బంతి ఆటలో ప్రసిద్ధి పొందినవారు) విజయనగరంలో ఉండేవారు. వారికి ట్యూటరు కావలసి ఉండెను. ఆ పని నాకిప్పించడానికి కీ॥ శే॥ గురజాడ అప్పారావు పంతులు గారు సంకల్పించు కొని నన్నడిగినారు. పర్లాకిమిడి కాలేజీలో నేను చేస్తూ ఉన్నపని ఇంతకంటె ఎక్కువ శాశ్వతమైన పని అన్న ఉద్దేశంతో ఆ పని చేయడానికి నేను సమ్మతించక, మాతండ్రి గారు రిటైర్ అయినా 50 సంవత్సరములు ఈడు గలవారే కనుక, వీరి కాపని ఇప్పించిన యెడల మా కుటుంబమునకు సహాయంగా ఉంటుందన్నాను అందుచేత వీరు 1913లో విజయనగర వాస్తవ్యులయినారు. అప్పుడు వీరూ, గురజాడ అప్పారావు గారూ, బుర్రా శేషగిరిరావు గారూ, వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రులు గారూ వ్యావహారిక భాషా వాదమునకు కావలసిన కృషీ, చర్చలూ చేస్తూ ఉండేవారు. అయితే, ఈ ట్యూటర్ పని ఒక్క సంవత్సరం కంటె ఎక్కువ చేయలేదు.

1914లో వీరు పర్లాకిమిడికి తిరిగివచ్చి ఆంధ్రభాషా కృషి తీవ్రంగా చేయడానికి మొదలు పెట్టినారు ఈ వ్యావహారిక భాషావాద పరిణామము వేరే ఒక వ్యాసంగా రచించ వలసినది గనుక, దానితో సంబంధించిన వీరి జీవిత చరిత్ర మరి ఎక్కువగా ఇక్కడ వ్రాయదలచుకోలేదు.

**సవర భాషను గురించిన వీరి గ్రంథములకు ప్రభుత్వము వారి తోడ్పాటు**

'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' అనే గ్రంథాలలో సవరభాషను గురించి వ్రాస్తూ "దీనికి సంబంధించిన నిఘంటువు, కథలు, పాటలు రావుసాహెబు జి. వి రామ మూర్తి పంతులుగారు రచించినారు; ప్రభుత్వము వారు అచ్చువేసి ప్రకటించినారు; గాని, ఇవి తెలుగు లిపిలో తెలుగు తర్జుమాలో ఉన్నందున, ఇవి తెలుగు తెలిసిన వారికేకాని ఇతరులకు ఉపకరించవు; ఆంగ్ల భాషలో రచితములై ఉండిన యెడల భాషా తత్వవేత్తల కుపకరించి ఉండును" అని గ్రి అర్సన్ దొరగారు వ్రాశారు. అందుచేత మా తండ్రిగారికిన్ని, ప్రభుత్వోద్యోగస్థులకున్ను, కొండలలో సవర దేశమందు పని చేస్తూ ఉన్న మిషనరీల కున్ను, అస్సాం తేయాకు తోటలకు సవరలను సైతం కూలీలుగా తీసుకొని పోతూఉండిన సంఘం వారికిన్ని సవర భాషకు సంబంధించిన పుస్తకములు ఇంగ్లీషు భాషలో కావలెనన్న కోరిక పుట్టినది. అవి రచించగల శక్తి మా తండ్రిగారికి తప్ప మరి యెవరికిని లేకుండేది. సవర భాష నేర్చుకొన్న వెల్షమన్ దొరగారు 1917లో చనిపోయినారు. 1928లో మిస్ మన్రో అనే మిషనరీ దొరసానిగారు సవర కొండలలో పనిచేయవలసి వచ్చినందువ సవర భాష నేర్చు కొనుటకు మొదలుపెట్టినారు. ఆంధ్రభాషా కృషిలోను, వ్యావహారిక భాషా వాదముల

లోను నేను మా తండ్రిగారికి తోడుపడి పనిచేయవలసి వచ్చినందున నేను సవర భాష నేర్చుకొనుట కప్పటివరకున్ను అవకాశము లేకపోయినది. అప్పుడు మా తండ్రిగారు నన్నొకసారి పిలిచి "నీవు సవర భాష నేర్చుకోక తప్పు" దన్నారు. "సరే మంచి" దన్నాను. 30 సంవత్సరములు వారు శ్రమపడి నేర్చుకొన్న సవర భాష అంతా నాకు ఆరు మాసాలలో పట్టుపడేటట్లు నేర్పారు. అంతలో ప్రభుత్వంవారు ఇంగ్లీషు భాషలో సవర-ఇంగ్లీషు, ఇంగ్లీషు-సవర నిఘంటువులున్ను, సవర వ్యాకరణము, సవర కథలున్ను రచించవలసినదని కోరుతూ మా తండ్రిగారికి తెలియజేశారు. నేను సవర భాష నేర్చుకొని ఉండడంచేత ఈ పనిలో సైతము నేను మా తండ్రిగారికి తోడుపడ గలిగాను. 1931-36 లలో ఈ గ్రంథములు రచితములయినవి. ప్రభుత్వమువారు వీటిని ప్రకటించారు. ఈ పని జరుగుతూ ఉన్న కాలంలో 1934 వ సంవత్సరమందు వీరికి కైజర్-ఇ-హిందీ సువర్ణ పతకమును ప్రభుత్వమువారు బహుమతిగా ఇచ్చారు.

### ఆంధ్రోత్కళ సంక్షోభంలో జోక్యం

ఈ పని జరుగుతూ ఉన్న కాలంలోనే ఆంధ్రోత్కళ సమస్య, ఉత్కళ రాష్ట్ర నిర్మాణం, ఆంధ్రదేశ భాగములే అయినా పర్లాకిమిడి, బరంపురం మొదలయిన భాగములు ఉత్కళ రాష్ట్రంలో కలపడం మొదలయిన సంక్షోభం కలిగింది.

ఇందులో మా తండ్రిగారున్ను, వీరితోపాటు నేనున్ను జోక్యం కలుగజేసుకోక తప్పిందికాదు. 1931లో పర్లాకిమిడి రాజుల చరిత్ర, గంగవంశపు రాజులు ఓఢ్రులు కారన్న విషయం చర్చకు వచ్చినప్పుడున్ను, ఒడొనెల్ కమిటీవారి యెదుట ఆంధ్రుల తరపున ఆంధ్రుల కోర్కెలు నివేదించవలసి వచ్చినప్పుడున్ను ఈ విషయం బాగుగా తెలిసిన వారిలో పెద్దలు మా తండ్రిగారు కావటంవల్లను వీరిని ముందుగా పెట్టుకొని ఆంధ్రులు పనిచేయవలసి వచ్చినది. ఇదంతా పర్లాకిమిడి రాజుగారి కోపానికి కారణమైనది. అయితే, రాజావారు వీరినేమి చేయగలరు? వారి కాలేజీలో పని చేసినవారే అయినా వీరు 1911లో ఎస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సు వారి పెత్తనంలో ఉన్నప్పుడు గ్రాట్యుఇటీ పుచ్చుకొని రిటైరయినారు. అందుచేతను వీరిమీద తమకుగల కోపం, నేను వారి కొలువులో ఉన్నవాణ్ణి గనుక, నామీద చూపించారు. ఏదో ఒక సాకు చూచి నన్ను 4-2-1932లో ఉద్యోగం నుండి తొలగించారు. నాటనుండిన్ని మా కుటుంబము ఆర్థికంగా చాలా చిక్కులు పడవలసి వచ్చింది. అయినా మా తండ్రిగారు చలించలేదు, నన్ను చలించనివ్వలేదు.

1932-33 లో పర్లాకిమిడి తాలూకా బోర్డు కొత్తగా ఏర్పడింది. ఆదివరకు పర్లాకిమిడిలో ఉన్న మ్యూనిసిపల్ కౌన్సిలును తమకు వశ్యం చేసుకొని పర్లాకిమిడి రాజావారు పర్లాకిమిడి ఒరిస్సాలో చేర్చవలసినదనే తీర్మానం కావించుకొని ఉండడం వల్ల రాబోయే తాలూకా బోర్డుకూడా తమకు వశ్యమయితే దానిలో కూడా ఈ తీర్మానం

నెగ్గించుకొని పర్లాకిమిడి తాలూకా ప్రజలంతా ఒరిస్సాలో చేరదాని కిష్టపడుతున్నట్లు ప్రభుత్వం వారికి తెలియజేస్తారన్న భీతి చేతను తాలూకా లోని ఆంధ్రులందరూ తాలూకా బోర్డు మెంబర్ల ఎన్నికల విషయంలో ఉషారుగా ఉండిరి. ప్రతి ఫిర్కాలోను రాజుగారు నిలబెట్టిన అభ్యర్థికిన్ని, తెలుగువారు నిలబెట్టిన అభ్యర్థికిన్ని తీవ్రమైన పోటీ జరిగింది. రాజుగారితో తాలూకా రైతులు బహిరంగంగా పోటీలో నిలవడానికి ఇదే ప్రారంభం. రాజుగారి మనుష్యులు ఎన్నికల విషయంలో 'రైతుబిడ్డ' సినిమాలో చేసిన చర్యలు ఇంచుమించుగా అన్నీ చేసినవారే. అయినా, తెలుగువారి ప్రతినిధుల సంఖ్యే ఎక్కువయినది; నేనే అధ్యక్షుడ నయినాను ఈ విషయంలో మా తండ్రిగారు తెలుగువారి పక్షమున నిల్చి వృద్ధులయినా యువకులవలెనే పని చేసి మాకు జయము కలిగించారు. పర్లాకిమిడి తాలూకాలో నూటికి 60 మంది పైగా తెలుగు మాటలాడేవారు కలరు గనుక ఇది ఒరిస్సాలో చేర్చకూడదన్న తీర్మానము నెగ్గింది. ఒడొనెల్ కమిటీవారి నివేదికలో ఇద్దరు సభ్యులు పర్లాకిమిడి కూడా ఒరిస్సాలో చేర్చవలసినదని శిఫార్సు చేసినా, వారి అభిప్రాయమును ఖండిస్తూ అధ్యక్షులయిన ఒడొనెల్‌గారు పర్లాకిమిడి తెలుగువారిదే కనుక ఒరిస్సాలో చేర్చగూడదన్నారు. దాని ననుసరించి వైట్‌పేపర్లో కూడా అదే నిశ్చితమైనది. అయినా, ఈ విషయము జాయింట్ పార్లమెంటు కమిటీ వారు ఆమోదిస్తేనేకాని తేలనిది గనుక, వారి యెదటను ఎవరి పక్షము వారు మనవి చేసుకోడానికి లండన్ వెళ్ళవలసి వచ్చింది. తెలుగువారి పక్షమున బయలుదేరిన వారిలో పర్లాకిమిడి ఒరిస్సాలో కలపరాదని వాదించడానికి నన్ను మా తాలూకా ఆంధ్రులు పంపించారు. ఈ పనిలో సైతము మా తండ్రిగారు శ్రమపడి అనేక విధముల మాకు మార్గదర్శకులుగా ఉండేవారు. ఈ ఉద్యమంలో నేను జోక్యం కలుగ జేసుకోకుండా ఉండేటట్టు చేయడానికి కొన్ని మాయోపాయములూ, తంత్రములూ జరిగినవి. "ఆంధ్రుల యెడలను గాని, నిన్ను నమ్మి తమకు ప్రతినిధిగా నిన్ను లండన్ పంపినవారి యెడలనుగాని నీవు ద్రోహివి కానేరవన్న నమ్మకం నాకు లేకపోలేదు. అయినా చెప్తున్నాను : నీవు పరుల మాయ మాటలకు మోసపోవద్దు. జాగ్రత్త" అని నేను 1933లో లండన్ వెళ్ళినప్పుడు మా తండ్రిగారు నాకు చేసిన ఉపదేశ వాక్యాలు నేనెన్నటికీ మరవలేను. అసలు నాకు ద్రోహచింత పుట్టనేలేదు. అందులో మా తండ్రిగారి హెచ్చరిక నన్ను మరింత జాగరూకుని చేసినది; దొంగ మాటలకు లొంగిపోకుండా కాపాడినది. నాకు విహితమైన పని నేను నెరవేర్చుకొన్నాను. పర్లాకిమిడి ఒరిస్సాలో చేర్చకూడదనడానికి నేను చెప్పిన కారణాలు సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా కున్ను, వారికి తోడుగా ఉన్న కమిటీ వారికిన్ని నచ్చినవి. 1934 జనవరి నరికి పర్లాకిమిడి ఒరిస్సాలో కలపకుండా ఉంచుటకే జాయింటు పార్లమెంటరీ కమిటీ వారు నిశ్చయించు కొన్నారన్న వదంతి పుట్టినది. అప్పుడు పర్లాకిమిడి రాజావారు మరల లండన్ పోయి పర్లాకిమిడి తాలూకా అంతా కాకపోయినా, పట్టణ

మున్ను దానికి చేరువగా ఉన్న కొన్ని గ్రామములున్ను అయినా ఒరిస్సాలో చేర్చ వలసినదని కోరి విశేషంగా ధనం కర్చుపెట్టి పలుకుబడి ఎక్కువ చేసుకొని కృతార్థు లయినారు. పర్లాకిమిడిన్ని, తాలూకాలో మూడవ వంతు భాగమున్ను ఒరిస్సాలో కలిసినవి. 1936లో ఏనాడు ఒరిస్సా రాష్ట్రి ఏర్పడి పర్లాకిమిడి అందులో చేరినదో ఆనాడే మా తండ్రిగారు అక్కడనుండి వెడలి నా కడపటి తమ్మునివద్ద నుండడానికి నిశ్చయించుకొని రాజమహేంద్రవరం వచ్చారు. అక్కడ మా తమ్ముని కొడుకులను చేరదీసి ఇంగ్లీషు, సంస్కృతము, తెలుగు నేర్పడానికి పూనుకొన్నారు

## వీరి విద్యాబోధన పద్ధతులు

బడులలో చెప్పే చదువు కంటె ఎక్కువగా సులభమైన పద్ధతులలో చదువు చెప్పవలెనన్న కోరిక వీరికి చిన్నప్పటి నుండిన్నీ ఉండేది. 50 ఏండ్ల క్రిందటనే రెండు తరగతుల చదువు ఒక్క సంవత్సరంలో ఎందుకు చెప్పకూడదన్న పట్టుదలతో ఆరంభించి నన్ను బడిలో ప్రవేశపెట్టక ఇంటివద్దనే కూర్చుండ బెట్టుకొని చదువు చెప్తూ ఉండేవారు. ప్రైమరీ పరీక్ష గవర్నమెంటు పరీక్షగా ఉండేది అది నేను నా 7-వ ఏటను నెగ్గేటట్టు తర్ఫీతు చేశారు. ఆ కాలం బడులలో పాఠములు చెప్పే పద్ధతుల కంటె ఎక్కువ మంచి పద్ధతులనే అనుసరించి వీరు పాఠములు చెప్తూ ఉండేవారు. అయినా వీరి పద్ధతులు నేటి విద్యా బోధకుల దృష్టికి కూడనివిగానే ఉండేవి. ఇది ఇటీవల వీరు ఒప్పుకున్న విషయమే. పిల్లల బుద్ధికి, గ్రహణ శక్తికి మించిన మాటలూ, వాక్యాలూ, అర్థాలూ వల్లన వేయిస్తూ ఉండేవారు. అన్న ప్రాశనము నాడే ఆవకాయ తినిపించా రన్నట్లు వీరు నాకు ఇంగ్లీషు చెప్పడానికి ఆరంభించిన మూడు నెలలకే వ్యాకరణ సూత్రాలు చెప్పి అప్పజెప్పుకొనేవారు, అన్నిటికంటే పెద్ద లోపమేమంటే కోపము. ఒక్కసారి చెప్పింది రాకపోయినా, మరునాడు మరచిపోయినా చేతికి వచ్చినట్టు కొట్టే వారు. బడిలో పెద్ద తరగతుల పిల్లలను, చిన్నతరగతుల పిల్లలను, ఎఫ్. ఏ. క్లాసు విద్యార్థులను సైతము గట్టిగా కొట్టేవారు. వీరి నెవరున్ను మందలించే వారుకారు. కళాశాలలోని ప్రిన్సిపల్ గారు కూడా వీరికి ఒదిగి ఉండేవారు. అధికారం చెలాయించ డమే కాని అధికారానికి లోబడి ఉండడం వీరికెన్నడూ అలవాటు కాలేదు. ఈ కోపం వీరికి తగ్గిపోవడానికి కొంతవరకు నేనే కారణం. ఫోనెటిక్ లిపి ననుసరించి, డైరెక్టు మెథడ్ ప్రకారం 1908లో పిల్లలకు ఇంగ్లీషు నేర్పుతూ ఉన్నప్పుడు ఒకనాడు నేను పాఠం చెప్తున్నాను. అప్పుడు వీరు కూడా నా చెంత నుండి క్రొత్త విషయాలు, క్రొత్త మాటలు చెప్తున్నారు. ఒకటి రెండుసార్లు చెప్పినా పిల్లలకు పట్టు పడలేదు. వీరు అడిగిన ప్రశ్నలకు పిల్లలు తప్పు చెప్తున్నారు. వీరు కోపం పట్టలేక చికాకు-పడుతూ పిల్లల నందరినీ గట్టిగా కొడుతున్నారు. ఒకసారి వాణ్ణీ వీణ్ణీ కొట్టవలసినదని నాతో చెప్పారు. నేను కొట్టనన్నాను నా మీద కోపం వచ్చి వెళ్ళిపోయినారు మిమ్మట్టు కొంతసేపు

పోయిన తర్వాత శాంతంగా రెండుసార్లు మూడుసార్లు బోధపరచి చెప్పగా మా తండ్రి గారు బోధపరచి చెప్పదలచుకొన్న విషయములు పిల్లలకు చక్కగా బోధపడినవి. ఆ దినమే నాకూ, మా తండ్రిగారికీ ఇంటివద్దను పిల్లలను కొట్టడం గురించి పెద్ద వాదం జరిగింది. పిల్లలు అల్లరి చేసినా, నడవడి చెడ్డదయినా వారిని దండించ వచ్చునేమో కాని చెప్పిన విషయం వారికి బోధపడక పోతే మరి యొకసారి చెప్పవలసినదే కాని దండించడం తప్పు అనిన్ని, దానివల్ల లాభం లేదనిన్ని నేను వాదించాను. ఈ ఆశయాన్ని పెట్టు కొనే నేను ఉపాధ్యాయ వృత్తి నడుపు కొంటానన్నాను. ఈ వాదం జరిగిన తర్వాత ఈ విషయంలో వీరి దృష్టి మారినది. మరి మూడేండ్లకే వీరు రిటైరయినారు. అప్పటికి మా కడపటి తమ్ముడు (గిడుగు సూర్యనారాయణ ఎం.ఏ.ఎల్.టి.) 8 ఏండ్ల వాడు. వాణ్ణి, మరి ఇద్దరు పిల్లలను ఇంటి వద్దను చదువు చెప్పి రెండేండ్లలో వాండ్లు 4వ ఫారములో చదువుటకు అర్హులయినట్లు తర్బీతు చేశారు. వీండ్లను సాధారణంగా కొట్టే వారు కారు. వీండ్ల ఇంగ్లీషు నిర్దుష్టంగా ఉండేది. లాంగ్ ఫెలోజ్ హియవతా అర్థం చేసు కోగలిగారు. పిమ్మట గ్రాంథిక వ్యావహారిక భాషా వాదంలో పనిచేయవలసి వచ్చుట చేత పిల్లల చదువులపై వీరి దృష్టి తగ్గిపోయినది. రాజమహేంద్రవరం రాకముందే మా తమ్ముని పెద్ద కుమారుణ్ణి తర్బీతు చేయడానికి పూనుకొన్నారు. ఒక్క సంవత్సరంలో ఆ అబ్బాయి తెలుగు చదవడం, వ్రాయడం నేర్చుకొని చింతా దీక్షితులుగారు వ్రాసిన కథలు ధారాళంగా చదవగలిగాడు. మరి రెండు సంవత్సరములలో సుమారు రెండు వేల సంస్కృత శ్లోకాలు అర్థ జ్ఞానంతో నేర్చుకోగలిగి సంస్కృతమున కొద్దిగా సంభాషిస్తూ ఉండేవాడు. ఆ అబ్బాయి ఇప్పుడు 13 ఏండ్లవాడు; స్కూల్ ఫైనల్ పరీక్షకు వెళ్తున్నాడు. వాడి తరువాతి వాడు అట్టే ఆరోగ్యం గలవాడు కాదని వాణ్ణి విడిచి పెట్టి వాడి తర్వాత అబ్బాయిని తర్బీతు చేయడానికి పూనుకొన్నారు. వీడు తొమ్మిదేండ్ల వాడు; సంవత్సరమయినది సంస్కృతమారంభించి, వేయి శ్లోకములు అర్థజ్ఞానంతో చదివాడు. సాధారణ ధాతువులకు అన్ని లకారములలోను తిఙంత రూపములు చెప్పగలడు. ఈ అబ్బాయి మా తండ్రిగారితో చెన్నపట్టణం వచ్చాడు. ఈ అబ్బాయి కోసం మా తండ్రి గారు సంస్కృత కథల పుస్తకం, వెల్జ్ రచించిన ప్రపంచ చరిత్ర కొనుమన్నారు. రెండు దినాలకు మరణమాసన్న మగుననగా వీరు ఈ అబ్బాయిని దగ్గర కూర్చుండ బెట్టుకొని "మరి నేను నీకు చదువు చెప్పడం జరగదు; బుద్ధిగా చదువుకో" అని జాలిగా చెప్పారు.

పిల్లలకే కానీ, పెద్దలకే కానీ తమకు తెలిసిన చదువు ఇతరులకు చెప్పడమంటే వీరికి గల ఆసక్తి, ఓపిక సాధారణంగా మరి యొకరి యందుండవు. నేను కాలేజీలో పనిచేస్తున్న దినాలలో ఉదయం వీరు ఆలస్యంగా పక్కనుండి లేస్తూ ఉండడం చేతను, 10 గంటల నుండి సాయంకాలం వరకూ నేను కాలేజీలోనే ఉండడం చేతను రాత్రి భోజనాల సమయంలోనే ఇద్దరం కలుస్తూ ఉండేవారము. ఆ దినములు వీరు తెలుగు భాష

విషయంలో గానీ, మరియొక విషయంలోగానీ కొత్తగా నేర్చుకొన్నవన్నీ నాతో చెప్పేవారు. ఏదైనా ఒకవిషయం పరిశోధించి తెలుసుకోవలసి ఉంటే, కాలేజీలో నన్ను పుస్తకాలు పరిశోధించి తెలుసుకొని రమ్మనేవారు. మేము నిత్యం మాట్లాడుకొనే మాటలలో గృహకృత్యాల విషయం ఒకపాలు, చదువు విషయాలు తొంభైతొమ్మిది పాళ్ళు.

**పత్రికా రచయితలకు కడపటి సందేశం**

చెన్నపట్టణం చికిత్సకోసం వచ్చినప్పుడు వీరు పత్రికా రచయితలకు తమ కట్టకడపటి సందేశం తెలియజేయగోరి అందుకు "ఎక్కడయినా ఒక సభ ఏర్పాటు చేయిస్తావా? ఉపన్యసిస్తాను" అని నాతో ప్రసంగించారు. వీరి దేహస్థితి చూచిన వారెవరూ అందుకు సమ్మతించరు. అయితే, వీరి ఉత్సాహము, పట్టుదల ఎరిగినవాడను గనుక వారికి ఉపన్యాసమిచ్చే శ్రమకలిగించడం వల్ల కలిగే హానికంటే ఉపన్యాసం ఇవ్వకుండా చేయడంవల్ల కలిగే దుఃఖము వీరినెక్కువ బాధిస్తుందని గుర్తించి, చెన్నపురి ఆంధ్ర మహాసభ వారితోను, శ్రీ రామబ్రహ్మంగారి తోను మాటలాడాను. పెద్ద సభలో ఉపన్యసింపజేస్తే వీరికి ఎక్కువ ఆయాసంగా ఉంటుందని రామబ్రహ్మంగారు తమ ప్రజామిత్ర ఆఫీసువద్దను 15-1-40 నాడు సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో వీరు వ్యావహారిక భాష గ్రంథస్థం చేయించడానికి చేసిన కృషిని గురించి సంగ్రహంగా ముచ్చటించారు; తామింక ఈ లోకమునుండి వెడలిపోయే కాలమాసన్నమైనది గనుక తమ కట్టకడపటి సందేశము తెలుగు పత్రికల సంపాదకులు, రచయితలు వినవలసినదని కోరారు.

వీరి వాదంలోను, సందేశములోను ముఖ్యంగా గుర్తించవలసిన విషయములు సంగ్రహించి తెలియజేస్తున్నాను.

"జీవంతో ఉన్న ప్రతివస్తువూ మారుతూ ఉండడం సహజం. అన్ని జీవద్భాషలున్ను మారుతూ వచ్చినవి. మన తెలుగు భాష సైతము జీవద్భాష గనుక మారుతూ ఉంది. 'చేసితివేనిన్' 'చేస్తే' కావడం భాషలో కలిగిన పరిణామాన్ని చూపిస్తుంది గాని నాశనము చూపించదు. నన్నయనాటి తెలుగుభాషే నేటికిన్ని ఏ మార్పు లేకుండా ఉన్నదనడం అబద్ధం; ఉండాలనుకోవడం అవివేకం. నన్నయనాటి గోదావరే ఈనాడూ ప్రవహిస్తూందిగాని ఆనాటిజలం ఈనాటిది కాదు. అందుచేతనే 'నిత్యా ప్రవాహినీ దేశ్యా' అన్నారు.

"భాషలో ఎప్పటికేరూపములు వాడుకలోనుండి పోయినవో అవి విడిచి, ఏవి వాడుకలోనికి వచ్చినవో అవి ప్రయోగిస్తూ గ్రంథాలు రచించడము సత్సంప్రదాయం. అందుచేతనే వేదకాలంనాటి వైదిక రూపాలు భాషలో ఆర్షములనీ, వాటిని సంస్కృత భాషా గ్రంథాలలో ప్రయోగించరాదనీ నిషేధించారు.

"ఇంగ్లీషువారు తమ గ్రంథాలలో ఆధునిక ప్రయోగాలే తెలుపుతూ వాసత,

షేక్స్పియర్, మిల్టన్ మొదలయిన మహాకవులు రచించిన గ్రంథాలు చదువుకొంటారు గాని వాటిలో ఉన్న భాష తమ నాటి వ్యవహారంలో లేకపోతే వాడరు. ఆలాగే తెలుగు వారు కూడా తమనాటి వ్యావహారిక భాషలో గ్రంథ రచన సాగించవలెను.

"ఆంధ్ర సారస్వత చరిత్ర పరిశీలించి చూడగా పద్యరచనకొక సంప్రదాయ మున్ను, గద్యరచన కొక సంప్రదాయమున్ను ఉన్నట్లు కనబడుతుంది.

"పద్య రచనవిషయంలో ప్రతి కవిన్ని తన పూర్వులు రచించిన కావ్యాలలోని భాషనే ఆదర్శంగా పెట్టుకొని తన కాలమందు శిష్ట వ్యవహారమందున్న కొత్తమాటలే కాక కొత్తగా పరిణమించియున్న సుబంత, తిజంతాది రూపములున్ను జతపరచి ప్రయోగిస్తూ వచ్చాడు.

"ఈ కొత్త పాతల సమ్మేళనము కొద్దికొద్దిగా సాగుతూ రావడంవల్ల కావ్యాల లోని భాష వ్యావహారిక భాషకు దూరమగుతూఉన్నా దాని మార్గాననే నడుస్తూ ఉంది. అందుచేతనే, లాక్షణికులు, ఎప్పటికప్పుడు కవి ప్రయోగాల ననుసరించి లక్షణం సరిపెట్టుకొంటూ వచ్చారు. ఆంధ్రశబ్ద చింతామణి సూత్రాలనుబట్టి తప్పులనదగినవి అప్పకవి తననాటి వరకున్న గల కవిప్రయోగాలు చూపించి ఒప్పులుగా వప్పు కున్నాడు; అప్పకవి లక్షణం బట్టి తప్పులనదగిన ప్రయోగాలు కూచిమంచి తిమ్మకవి తనకాలం వరకున్న గల కవి ప్రయోగాలు చూపించి సాధువులన్నాడు. పిమ్మట అడిదం సూరకవి ఆధునిక ప్రయోగాలు అదివరలో తప్పులనదగినవి కవి ప్రయోగాలు చూపించి సమర్థించాడు. (ఈ సంప్రదాయం తెలియజేస్తూ మా తండ్రిగారు తమ బాలకవి శరణ్యము రచించారు.) చిన్నయసూరి ఆధునిక కవిప్రయోగా లెత్తుకోకుండా లక్ష్యాలు చూపించడం పనిపెట్టుకోకుండా తనకు తోచినట్లు వ్యాకరణ సూత్రాలు కల్పించి అదివరకు కావ్యరచనకు మాత్రమే కవులు ప్రయోగించిన కావ్య భాషా ప్రయోగాలు వచన రచనకు సైతము గ్రహించి వచన రచన విషయంలో కొత్త సంప్రదాయం తెచ్చిపెట్టినాడు.

"చిన్నయకు పూర్వం ఆంధ్ర సారస్వతంలో వచన రచన లేదనుకోడం పొరపాటు. వందలకొలది గ్రంథాలు వచనాలతో ఉన్నవి కనబడినవి. అవి అన్నీ వాడుక భాషలో ఉన్నవి. ఇవి అచ్చుపడక పోవడం చేతను, దేశంలోనికి అచ్చు యంత్రాలు వచ్చి గ్రంథాలు అచ్చుకావడం ఆరంభమయే టప్పటికి చిన్నయసూరి గారి నీతిచంద్రిక అచ్చుపడి వారి ఉద్యోగ ప్రాభవమువల్ల వారి బాలవ్యాకరణమున్ను, నీతిచంద్రికయున్ను బడులలో పాఠ్యగ్రంథాలు కావడంచేతను ఈ గ్రంథాలు చదువుకొన్న వారికీ, వారి శిష్యులకూ గద్య రచన విషయంలో ఈ కొత్త సంప్ర దాయమే కాని అంతకు పూర్వమున్న సంప్రదాయం తెలియకుండా పోయినది. చిన్నయ సూరి ప్రాభవము శల్యగతమై ఉన్నవారికి మా వాదము అతి కటువుగా తోచింది.

మా తండ్రిగారు తెలుసుకొన్న ఈ సంప్రదాయ విషయములు గ్రంథాలతో

సైతము చూపించగా చూపించగా వీరివాదం అంగీకరించడానికి మార్గమేర్పడినది. వ్యావహారిక భాషలో గ్రంథాలు (పద్యకావ్యాలు కాకపోతేపోనీ, గద్యరచనలు అయినా) రచించండని వారు చెప్పినప్పుడు వారు కొత్తగా ఏ సంప్రదాయమూ కల్పించి చెప్పడం లేదు; చిన్నయకు పూర్వమున్న సంప్రదాయమే మరల ఉద్ధరించండన్నారు. వారు తమ కడపటి సందేశంలో—

"నా శ్రమ వృథా కాలేదు. మొట్టమొదట నలుగురయిదుగురు మాత్రమే ఆమోదించినా నా వాదము వేలకొలది విద్యాధికులు, విద్యార్థులు, కవులు, రచయితలు ఆమోదించారు. ఏవో ఒకటిరెండు తప్ప తక్కిన పత్రికలన్నీ తమ సంపాదకీయ వ్యాసములూ, తక్కిన వ్యాసములూ వ్యావహారిక భాషలోనే ప్రకటిస్తున్నవి. ఇంత వరకు నేను కృతార్థుడను.

"యూనివెర్సిటీలున్ను, ప్రభుత్వ విద్యాశాఖ వారున్ను మాత్రం ఇంకా అనుగ్రహించలేదు. 25 సంవత్సరముల క్రిందట ఈ రెండు సంస్థల వారున్ను వాడుక భాషను గ్రహించవలెనని చూచినప్పుడు నా వాదం తెలుగువారు గ్రహించక పోవడం చేతను అలజడి ఎక్కువయినది. అందుచేత, ఆ సంస్థలవారు దానిని గ్రహించ లేదు, ఇప్పుడు తెలుగువారు నా వాదం గ్రహించినవారు గనక, ఆ సంస్థలవారు గ్రహించి ఆమోదించేటట్లున్ను, ఆచరణలో పెట్టేటట్లున్ను చేయవలసిన భారం మీది. ఈ పని మీకు అప్పగించి నేను విరమిస్తున్నాను—సెలవు" అన్నారు.

'కట్టకడపటి సందేశ' మని మా తండ్రిగారు అన్నట్లుగానే ఇది వాస్తవముగా వీరి కట్టకడపటి సందేశమే అయినది.

[ఆంధ్ర పత్రిక విక్రమ సంవత్సరాది సంచిక, 1940-1941]

# సవరలు*

## గిడుగు సీతాపతి

సవరలు గంజాం విశాఖపట్టణం జిల్లాల మాళవా ప్రదేశములలో ఎక్కువగా ఉన్నారు. ఒరిస్సా, బెంగాల్ మండలములందున్ను, సింగభూమి, సంబల్‌పూర్, రాయపూర్, బిలాసపూర్, పాట్నా, కలహండి, సారంగర్, రాయగర్ మొదలయిన మధ్య పరగణాలలోను కూడ అక్కడక్కడ, ఈ సవరలు కనబడుతున్నారు. పూర్వ కాలములో షాహాబాదులో ఈ సవరలు ఉండేవారనిన్నీ, అక్కడనుండి, రాజపుత్రులు తరిమి వేయుటచేత, దక్షిణప్రదేశములకు పారిపోయినారనిన్నీ, నేటికిన్ని సవరల తాలూకు కట్టడములు కొన్ని సిధిలములై షాహాబాదుజిల్లాలో కనబడుతున్నవనిన్ని రిస్లీ దొరగారు వ్రాసినారు.

ప్రాచీన కాలమందు ఈ సవర జాతివారిని గురించి వ్రాసిఉన్న విషయములు చూడండి:—ప్లినీ పేర్కొన్న సుఅరి (**Suari**) జాతివారున్ను, టాలమీ పేర్కొన్న సబరై (**Sabarai**) జాతివారున్ను, ఈ సవర జాతివారే కావలెనని ఊహించ వచ్చును. గంగావదీ ప్రాంతమందు వజ్రము లెక్కువగా దొరికే ప్రదేశములో ఈ సబరైలున్నారని టాలమీ వ్రాసినాడు. వజ్రములు దొరికే ఈ ప్రదేశము మధ్య పరగణాలలో సంబల్‌పూర్ వద్ద నుండేదని కనింగ్‌హాము వ్రాసిన్నాడు.

ఈ దేశమందలి వాఙ్మయములో కూడా సవరజాతిపేరు ప్రాచీనకాలమునుండిన్నీ కనబడుతున్నది. ఐతరేయ బ్రాహ్మణములో "ఏతే ఆంధ్రాః పుండ్రాః శబరాః పుళిందాః మూతిబాః ఇత్యుదంత్యాబహవోభవంతి వైశ్వామిత్రాదస్యూనామ్ భూయిష్ఠా" అని ఉన్నది. ఆంధ్రులు, పులిందులు మొదలైన వారితో సమముగా శబరులను పేర్కొన్నారు. భారతం శాంతి పర్వంలో "యవనాః కిరాతాగాంధారాః చీనాః శబర బర్బరాః శకాః తుషారాః కంకాశ్చపహ్లవా శ్చాంధ్రముద్రకాః। పౌండ్రాః పుళిందా, కమధాః

---

* ఈ వ్యాసము మా తండ్రిగారు, రావుసాహెబ్ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు వ్రాయ వలసినదే. అయితే అస్వస్థత చేత వారిపుడు వ్రాయుటకు వీలులేక, తాము సంగ్రహించి ఉంచిన సామగ్రి అంతా నా చేతికిచ్చి నన్ను వ్రాయుమని కోరినందున నేనే వ్రాసినాను.

చెప్పండి; అని పరిషత్తువారిని అడిగినాను. ప్రత్యుత్తరములేదు. ఇప్పుడు వచ్చిన పుస్తకములలో చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన "రఘుకుల చరిత్రము" ఒకటి. దీని ముఖపత్రమందు ఇంగ్లీషున (Novel) నావెల్ అని దీనికి పేరుపెట్టి ప్రకటించినారు; మోసము. కాళిదాస కృత రఘువంశమునకు శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు (తెలుగు పద్యాలుగా) చేసిన అనువాదమును అనువదించి వీరు వచనముగా రచించినారు. గ్రంథచౌర్యము ! రెండవకూర్పు నూరు పుటలలో రెండువేల తప్పులున్నవి. సగము అచ్చువేసినవారి మీద పెట్టినా తక్కినవి గ్రంథకర్త పాలివే చదువుకొనే పిల్లల కంటబడి, తప్పులు ఎవరివయినా, వాటిపని అవి చేయకమానవు. నరసింహము గారికి సంస్కృతమూ రాదు, ప్రాచీనాంధ్రమూ రాదు. వాడుకమాటలు మార్చి, మసిపూసి మారేడుకాయ చేసినట్లు, గ్రాంథికీకరణము చేస్తారు. పోయిన ఆగస్టు నెలలో రాజమహేంద్రవరమున వారము దినములుండి అయిదుపన్యాసములు చేసినాను ఒకటి ఈ నరసింహంగారి గ్రాంధికాంధ్రభాషా విశేషములను గురించినదే. వారి తప్పులు వారి యెదుటనే సభవారి కందరికీ తెలియజేసినాను. మారుమాటాడక ఆయన ఒప్పుకొన్నారు. అట్లే మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి భాషలోని తప్పులు చూపించినాను. అన్నట్టు ఈయన కొత్తగా ఒక నాటకము "భీష్మప్రతిజ్ఞ" అనేపేరు గలది రచించినారు. పత్రికలలో విమర్శకులు మెచ్చుకొన్నారు. నాకొక ప్రతి పంపిస్తూ దోషములుంటే చూపించమన్నారు. ఎంతో జాగ్రత్తతో ప్రూఫులు దిద్ది శుద్ధపత్రిక చేర్చి గ్రంథము ప్రకటించినారు. అయినా పాపము తప్పులు తప్పినవికావు సుమండీ. ఈయనకు తెలుగు రాదని చాటి చెప్పగలను. పందెము వేసి రుజువుచేయగలను.

వింత విషయము ఒకటి విన్నారా? ఆంధ్రపత్రిక తే. 26-2-24ది, సంచిక 19వ పుటలో మొదటి శ్రేణియందు "ప్రతాపరుద్రీయము" అనే శీర్షికగల జాబు ఒకటి ఉన్నది. చూడండి. బందరులో వేంకటరాయశాస్త్రిగారికి సత్కారము జరిగినప్పుడు పౌరులలో ఒకరు కొన్ని ప్రశ్నలు వేస్తే వాటికి ప్రత్యుత్తరమిస్తూ తమకు "సంస్కృతమున నున్నంత ప్రవేశము తెనుగున లేదనిగూడ చెప్పుకొనిరి" అని "విలేఖకుడు" ఎవరో వ్రాసినారు. వారి సంస్కృతప్రయోగములన్నీ అమోఘములు కావని నేనెరుగుదును.

మీ మిత్రులు మార్కండేయశర్మగారి మైత్రి నేను కోరుతున్నాను. నేను చెన్నపట్టణము వచ్చినప్పుడు నాకు వారి దర్శనము చేయింతురుగాని. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిని మీరెరుగుదురు. ఆయన లైబ్రరీకి తరచుగా వస్తూఉంటారు. చిరునామా తెలియక ఆయన పేర జాబు వ్రాయలేదు. వారి దర్శనము రాజమహేంద్రవరములో చేసినాను. అచ్చటి ముచ్చటలు ఆయన చెప్పగలరు. వారి చిరునామా తెలియజేస్తారా?

ప్రాయశ్చిత్తేందుశేఖరము వాడుకభాషలో తెలుగు టీకతో 1876వ సంగున బెంగుళూరిలో అచ్చుపడ్డది. అందులో చిట్టచివర కాశీనాథోపాధ్యాయుడు రచించినట్టున్నూ 304వ పుటలో నాగోజీభట్టు రచించినది, కాశీనాథుడు శోధించి పూర్తిచేసినట్టున్నూ

ఉన్నది. ఎవరు వీరు? ఎప్పటివారు? శబ్దేందుశేఖరము రచించిన భట్టుగారేనా? ఈ భట్టు గారు? ఇప్పటికి చాలిస్తాను.

చిత్తగించవలెను,
సే॥ గి॥ వేంకట రామమూర్తి

లేఖ చివర :

క్రీడాభిరామము దిద్దినారా? చెన్నపట్నము పండిత మండలి ఉద్యోగము హాస్యాస్పదముగా ఉన్నది. కాళ్ళకూరి గోపాలరావుగారి వంటి ధూర్తుడు ఎక్కడా ఉండడు. అతనికి అధికార్లవద్ద చనవున్నదిగాబోలు; ఏమి చేస్తున్నాడు?

మరొక పుటలో :

నిజమైన వచన రచనా సంప్రదాయముకి

1. ఉత్తరప్రత్యుత్తరములు:—పండితులు వ్రాసిన విద్యావిషయక లేఖలు, వ్యవహార విషయక లేఖలు, అర్జీలు విజ్ఞప్తులు మొ॥ ధర్మాధికార్లు చేసిన తీర్పులు—

2. శాసనములు:—హిందూరాజుల కాలములోనివి; మహమ్మదీయ ప్రభువుల కాలములోనివి; బ్రిటిష్ ప్రభువుల కాలములోనివి.

3. శాస్త్రములు:—తెలుగు వివరణము—ధర్మశాస్త్రములు-యాజ్ఞవల్క్యస్మృతి వ్యవహార కాండము, ప్రాయశ్చిత్తేందు శేఖరము, వరెంవాసుదేవ, పరబ్రహ్మశాస్త్రిగారి హిందూ ధర్మశాస్త్రము (టామస్ భూపాలీయము) ఇంకను ఎన్నివున్నవో? వేదాంతము (చాలా ఉన్నవి. అచ్చుపడ్డవి కొన్ని ఉన్నవి. వెంకటగిరి మహారాజావారు రచించిన ఇంచుమించుగా పది ఉన్నవి.)

శాస్త్రములు-కళలు: జ్యోతిషము, గోపాలరత్నాకరము అచ్చు పడ్డది. సిద్ధాంతము (అనేకమున్నవి), గణితము, భూగోళ, ఖగోళ వర్ణనము (అచ్చుపడ్డవి 1840), వైద్యము, అపరమితముగా ఉన్నవి-రసాయనశాస్త్రము విడదీయవలెను.

వీలయితే వృక్షశాస్త్రముకూడాను. పశు వైద్యము, ధనుశ్శాస్త్రము, శిల్పశాస్త్రము, వాస్తుశాస్త్రము, భరతశాస్త్రము, కామశాస్త్రము, నీతిశాస్త్రము, వ్యాకరణశాస్త్రము, కోశములు.

4. మతధర్మములు:—శైవము, వైష్ణవము మొ॥ సంస్కారములు, నిత్య నైమిత్తిక కర్మలు - వీటి వివరణము.

5. మాహాత్మ్యములు:—దేవతల మాహాత్మ్యములు, భక్తుల మాహాత్మ్యములు, క్షేత్ర మాహాత్మ్యములు, వ్రత మాహాత్మ్యములు.

6. పురాణములు:—ఇతిహాసములు, వ్రతకథలు.

7. కథలు:—శృంగార కథలు (చిలుక చెప్పినవి మొ॥) చిత్రకథలు మొ॥ నీతి కథలు, పంచతంత్రి, రాజనీతి రత్నాకరము.

8. చరిత్రలు:—తంజావూరి రాజుల చరిత్రము రాయవాచకము, ప్రతాపచరి

త్రము, లోకల్ రికార్డులు.

9. దేశయాత్ర:—ఏనుగుల వీరస్వామిగారి కాశీయాత్ర చరిత్ర (1820లో ముద్రితము) మొ॥

10. విమర్శములు.—ఉపోద్ఘాతములు, భాషావిషయకములు, సాహిత్యవిషయకములు, వినోద విషయకములు, అలంకార విషయకములు, హయగ్రీవశాస్త్రిగారి భాగవత పీఠిక, అప్పయ్య పండితునిది స్వామినేని ముద్దు నరసింహనాయనివారి హిత సూచని, వేంకటగిరి రాజావారి నాస్తిక ద్వాంత [ .. . . . . . . ]

11. వ్యాఖ్యానములు:—సంస్కృత కావ్యములకు, తెలుగు కావ్యములకు., రాఘవపాండవీయము, రాఘవ యాదవ పాండవీయము, మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద. హరిశ్చంద్ర నళీయము, లంకావిజయము రామకృష్ణోపాఖ్యానము, ముముక్షుజనకల్పకము కళాపూర్ణోదయము మొదలగునవి.

[illegible]

2

[illegible]

లేఖ—రెండు :

పర్లాకిమిడి
6-4-24

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారి సన్నిధికి సే॥ వె॥ రామమూర్తి అనేక నమస్కారములు చేసి చేయగల విన్నపములు—ఉభయకుశలోపరి.

చి॥ సీతాపతి మీ దర్శనము చేసినప్పుడు సెలవిచ్చిన మాటలన్నీ నాతో చెప్పినాడు. వానియెడలను, నా యెడలను మీకుగల దయకు చాలా సంతోషించినాము. నా చిన్నకుమారుడు మీ యాజ్ఞానుసారంగా లయబ్రరీలో పనిచేయుటకు అంగీకరించినాడు గనుక చేయవలసిన పని వాడికి సవిస్తరముగా బోధపరచి వాడుక. భాషలోనున్న వచన

సారస్వత ప్రతిరూపములు నానావిధ గ్రంథములను డిన్ని ఎత్తి వ్రాయి చవలెనని కోరుతాను వాడి మిత్రులుగాని మీ మిత్రులుగాని ఎవరైనా ఈ పనిలో సాయ చేయగల వారు ఉ చే వారిని కూడా పిలిపి చవలెను చిన్నయసూరికి పూర్వ ప్రబ ధ రచవకు తప్పు తక్కువ వ్రాతలన్నిటికి వ్యావహారిక భాషే ఉపయుక్తమయేదని రుజువు చేయుటకు మనము ఉదేశి చినాము గనుక అ దుకు చాలిన త గ్ర థము నానా విధమయినదీ మనము స పాది చవలెను మాదిరి తునుకలు ఎటువంటివై యుండవలెనో క్రి దటి ఉత్తరంలో విశదపరచుకొన్నాను

ఇకను నేను ప్రకటి చదలచుకొన్న రెండవ గ్ర థము కృతకా ధ్రభాషను గురించినది వ్యావహారిక భాష నిరాకరి చి దానికి బదులుగా ప్రాచీనా ధ్ర కావ్యముల లోని భావ ప్రబ ధేతర గ్ర థముల దు వాడుటకు మొదలుపెటినవారు చిన్నయసూరి గారు గదా వారున్ను వారి తర్వాతి వారున్ను నేటివరకు రచి చిన గ్ర థములలో అదృష్ట పూర్వమైన కృతకభాష కలదని రుజువుచేయుటకు ఈ 70 స లలో ప్రఖ్యాతి పొ దిన వారు రచి చిన గ్ర థములు అనేకముగా చదివినాను ప్పుడికి చుమి చుగా (పదుగురి) భాష విమర్శి చి చూచినాను కృతక భాషలేని గ్ర థము ఇప్పటికి నాకు కనబడలేదు గ్ర థకర్తల జాబితా మీకు పంపిస్తాను దానిలో చేరని వారి పేర్లున్న వారి గ్ర థముల పేర్లున్ను మీరు తెలియజేస్తే సంతోషిస్తాను ఎ డితు గ్ర థము లోని భాషాదోషములు ఏ ఉదేశ తో చూపిస్తున్నానో మీకు తెలుసును మీరు దేశభాషను (ద్వే)ప్య గా చేసి తమకైనా సుపరిచత గాని ప్రాచీనా ధ్రభాషను దానికి బదులుగా ఆదేశి చడంవల్ల దేశ భాషకు ప్రజల కుపచరి చవలసిన సారస్వతముకూ అపరిమితమయిన హాని కలిగినదని నేను నమ్ముతున్నాను వాడుకభాషకుగల పూర్వ గౌరవము తిరిగి ప్రతిష్ఠి చడమే నా ఉదేశము గనుక నిజమయిన స ప్రదాయమునకు ఈ గ్ర థము అనుబంధము వ టిదే

బసవపురాణ ప్రూఫులు 32 పుటలు మ శ్రీ నాగేశ్వరరావుగారు చి సతాపతి చేతికిచ్చి నా వదకు ప పించినారు అవి చూచి నా నివేదనతో కూడా మీవదకు ప పిస్తు న్నానని వారి పేరను వ్రాసినాను నాకు తోచిన సంగతులు ప్రూఫు కాగితాల మీదనే వ్రాసినాను అవి అన్నీ శ్రీ నాగేశ్వరరావు ప తులుగారు చూడవలెనన్న ఉదేశ తో వ్రాసినవి కావు మీరుచూచి వాటిలో మీరు అ గీకరి చతగినవి సరాతో వ్రాసి తక్కినవి రగుమేసి వారివదకు ప పించవలెను నేడే బుక్ పోసులో ప పినాను

భారతాది గ్రంథములు అంధ్ర ప డిత మన్యుల చేతులలో పడి ఏలాగున మారు రూపము పొందినవో అందరికంటే విస్పష్టంగా మనకు తెలుసును మీరు పాల్కురికి సోమనాథుని గ్రంథము పరిష్కరించుటకు పూనుకొన్నారు ప్రాచీనులు వ్రాతప్రతులలోని పాఠములు అన్ని గ్రంథములలోనివి మీకు బాగా తెలుసునవన్ని ప్రాచీనాంధ్రభాషా లక్షణము మీరు అన్నా [illegible] ప్రఖ్యాతి

గన్నారు గనుక మీ పేర్మికి తగినట్లుగా గ్రంథ పరిష్కరణముండవలెనని నా కోరిక. పాల్కురికి సోమనాథుని దేశకాలములకు అనుగుణంగా మనకు పొడగట్టిన చొప్పున అతని భాషావిశే(షములు) గ్రంథములో సాధ్యమయినంత స్పష్టంగా కనబరచుటకు (మనము) ప్రయత్నం చేయవలెను. అరసున్నలు, శకటరేఫలు(----) మొదలయిన వాటితో ప్రత్యర్పిత స్వరూపంగా గ్రంథముండవలెను. (అచ్చులో) పంక్తుల సంఖ్య వెయలేదు గనుక పుట సంఖ్యను బట్టి ఈ క్రింది విశేషములు తెలియజేస్తున్నాను.

పుటః (8) పనుగొని అనుటకు బదులుగా 'పనుగొన' అనే గ్రంథ(ముద) ఉంచవ౦ ఉండెను. పనుగొనన్ అనగా దృఢపడేటట్లు, అలవాటయేటట్లు అని అర్థము. గూ. శ. భారత ప్రయోగము.

మల్లినాథుడు' చతుర్థ వర్ణము అసాధువుకాదు. ప్రాకృత వ్యాకరణమందు దీనికి అనుశాసనమున్నది. దిద్దనక్కరలేదు. అయినా మీ ఇష్టం.

ఎఱిఁగించి' 9వ షరాలో చెప్పిన 'యెఱుఁగించి' అనే పాఠమే గ్రంథమం దుండ వలెను. ఇట్టి ప్రాచీనాంధ్ర శబ్దములలో ఉత్వము (accent) (ఆక్సెంటు) బట్టి సిద్ధించె. ఉత్వమునకు ప్రమాణమున్నది. చూ. పగుల్చు — చక్కని వ్రాతలలో 'ఎఱిం గించి' ఉరుదు. నేను చూచిన వ్రాతప్రతులలో మగుడి, నిగుడి, నగుపించి, మగుడించి, నిగుడించి మొ॥నవే కాని మగిడి, నిగిడి, నగిపించి, మొ॥ కనబడనేలేదు. చిన్నయసూరి సజీవుడై యుండగా ముద్రించిన నీతిచంద్రిక కూర్పులలో మొదటి రెండు (కూర్పుల)లోనే కాక అతడు కాలంచేసిన తర్వాత పడ్డ 5వ కూర్పులో కూడా నాకంటితో నేను చూచినాను. 'కనుపించి' (- ు) పించి, 'నిగుడి', 'మగుడించి' మొ॥ రూపములు. నేటి (రచనల) లో ఇవి కనబడవు. పాల్కురికి సోమనాథుని కాలమున గల భాషా లక్షణములో ఈ రూపము ఒక (లక్షణ)ము. ఇది షరాలో అణగద్రొక్కవలసినదికాదు. ((గ్రంథ)మందే ప్రకటీకరించవలసినదని నా అభిప్రాయము.

"-'విన్నవించుఁడు' 10వ షరాలో "కొన్ని ప్రతులలో అర్ధానుస్వారము...కాన వచ్చును. గాని పెక్కు ప్రతులలో లేకపోవుటచేతను బూర్ణానుస్వారరూప మెక్కడను [illegible] రాకుండుటచేతను దాని నిక్కడఁజేర్చలేదు అని ఉన్నది. [(ఇక్క)డ కళగదా [illegible] చక్కని వ్రాతప్రతులలో విన్నవించుఁడు', నావుఁడు, అవ [illegible] శబ్దములందు బిందువు కనబడకపోదని నా అనుభవమును బట్టి చెప్పు తున్నాను. వ్రాతలలోనేకాక అచ్చుపడ్డ గ్రంథములలోకూడా మొదటి కూర్పులలో ఇట్టి శబ్దములు సబిందుకంగానే ఉన్నవి. శా॥ శకవర్షము 1756 పరీధావి పునర్వసు ॥౧౦॥ సోమవారం ప్రకటితమైన ఆంధ్ర భారతంలో అక్కడక్కడ నాకు కనబడినవి. అది v. 197 నావుఁడున్, v. 238 అవవుఁడు. ఈ ప్రతిలోనే విరాటపర్వమందు మొదటి ఆశ్వాసంలో (పద్యసంఖ్య వేయలేదు. చూ. పు. 18) ఒక్క పుటలోనే ఎన్ని ఉన్నావో చూడండి. 1వ పంక్తి - కురుచ [illegible]

రేమి .. ఇది నావుఁడు. 11వ పంక్తి- కం॥ వచ్చితి ననవుఁడు. 19వ పంక్తి-దీయపెం పెసగగన్ అనవుఁడు. 27వ పంక్తి-ఇందుర మ్మనవుఁడు . 34వ పంక్తి- వచ్చితినన వుఁడు సుధేష్ణయిట్లనియె. 35వ పంక్తి- కం॥ అవునఁడు దరహసతము (ఆనంద ముద్ర ణములో I-315 'అనుటయుదరహసితము'అని ఉన్నది.) మన కాలమందు సర స్వతీ పత్రికలో ప్రకటితమయిన కేయూరబాహు చరిత్రమందు ఇట్టి శబ్దములలో (వ్రాత ప్రతియందు అరసున్నలు చూచినాను, దానికేమి) కొన్నిట అరసున్నలు అచ్చులో నిలిచి ఉన్నవి. లక్ష్మణరావుగారు పరిష్కరించిన శివతత్త్వ సారమందు 479వ పద్యంలో ( ..)ఁడు సబిందుకంగా ఉంచి, 106వ పద్యంలో (. ..)డు బిందువులేకుండా గ్రంథ ములో ముద్రింపించి (యున్నారు.)

షరాలో వ్రాతప్రతిలోని పాఠము సబిందుకముగా చూపించినారు. వైకృత చంద్రికలో 'ఆవుందోరనః' అని శాసించి ఉం(డగా) పూర్ణానుసార రూపము కాన రాదని మీరన్నారు. గా(నిక)లగుండు ఇట్టిదే. విస్మృత శేషం 'నలగుఁడు 'కలగుఁడు' ఇటువంటి విశేష్యములకు 'ఉన్' చేర్చితేనే ఆవంత్యాద్యర్థములగును. ఔపవిభక్తముల వలె (కేవలము ఔపవిభక్తములని చెప్పలేను. ఏమో!) 'కలఁగుటయును' అనే అవంత్యాద్యర్థక రూపము మరియొకటి ఉన్నది. (ఇది ప్రాక్తన భాషలో ద్వితీయా విభక్తి గాబోలు. కలంగుండు + ఐకలంగుట్టయ్యి. మండు — మంట; మండుండు— మండుట్టై + ఉన్ — మండుండున్ — మఁడుట్టయున్ - మూఁకుడు — మూఁకుండ్లు— మూఁకుంటి — మూకుండి ఇప్పుడు మూఁకుడు. 'మూళ్లు' 'ఇళ్లు' వలె 'మూఁకుళ్లు'. 'కలగుండు'లోని పూర్ణ బిందువు సిద్ధముకాదు. భీష్మపర్వం III-64లో సీ॥ పాః గురుసైన్యములు గలంగుండ్లు వెట్ట, అని ఉన్నది. గాని భీష్మ II-207 కం॥ నిజసింహనాదమున........గుండియలు గలంగ కలంగుండు పడంగా॥ అని (కొంత లిపి భేదముతో మూడు వ్రాతప్రతులలో చూచినాను. కలఁగుఁడువడగా నైషధంVII-81సీ॥ కలఁగుఁడు వెట్టిరి కలశవారి-ఇందులో కీలకమైనా నగమైనా ఛందోబద్ధమే గనుక అచ్చులో కలగుండు అని వేంకటరాయశాస్త్రిగారు చూపించినారు. గాని నావద్దనున్న వ్రాతప్రతిలో 'కలంగుండు' అని ఉన్నది గాని 'కలంగుండ్లు' అని లేదు. చంద్రికా పరిణయం అచ్చు ప్రతిలో III-15 'కుధరనాశిక కలఁగుఁడు వడియె IV-120లో 'కలఁగుండు....అని ఉన్నది టీకలో రెండుమూడు మాట్లు ఈ రూపమే సబిందుకముగా వాడినారు. చిన్నయసూరికూడా నీతిచంద్రికలో 'కలఁగుండు' అని సబిందుకముగా వాడినట్లు మొదటి రెండు కూర్పులలోనే కాక 5వ కూర్పున కూడా కనబడుతూ ఉన్నది. నేటి కూర్పులో అరసున్న లేదు. ఇట్లు నా కంటబడిన రూపములు అన్నీ చెప్పవలసిన దస్తా కాగితాలయినా చాలవు. నాకీ శబ్దరూప విషయ(మున) కలిగిన నమ్మకమునకు కావలసినంత ఆధారము కలదు. (పరిశీలన) చేసి మీ ఇష్టము వచ్చినట్లు పరిష్కరించ వలసినదని చెప్పుచున్నా

[10] తంజావూరి ఆదిపర్వము ప్రతులు నెం. 27, 31, 32

రు గల వాటి (యందు) 'భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు వుట్టుఁడు' అనిన్ని నెం॥ 80 లలో 'భూ(---) ఉన్నట్లు నేను వ్రాసిపెట్టుకొన్నాను. ఇట్లే నావుఁడు, అనవుఁడు సర్వత్ర సబిందుకములు. నాకీ విషయమై సందేహమేమీ లేదు.[11]

పుట - 10 'ఏఁటికి' 6వ షరాలో 'ఏఁటికి' అని కొన్ని ప్రతులలో నున్నట్లు చూపించినారు. - 15వ పుటలో నాఁటు సబిందుకంగా గ్రంథమందు చేర్చుకొన్న (విధమున) ఇది కూడా సబిందుకంగా గ్రంథమందే చేర్చుకోవలసి ఉండెను. ఇది 'ఏను, శబ్దము నుండి నిష్పన్నమైనది. కన్నడంలో ఇప్పటికీ ఏను -ఉన్నది. తెలుగు వారు పోగొట్టుకున్నారు. యచ్ఛబ్దార్థకంగా ఏని, ఎందేని, ఎయ్యేని; చేదర్థకంగా ఏన్ - వచ్చెనేన్ మొదలయిన రూపములలో మాత్రము విస్మృత శేషము ఉన్నది. శ. ర. లో బోఁటి అనేమాట కింద ఇచ్చిన ప్రయోగం — మత్తకోకిలలో ప్రాసము బిందు పూర్వక టకారమైనా రెండవ చరణమందున్న 'ఏటిజీవనము' లో టి ముందు బిందువు మానివేసినారు. కళాపూర్ణోదయం IV —132 ఉ॥లో "నాఁటికి - ၊ గాటపు - ၊ దోటకు నీవిభుం ၊ డేటికి" అచ్చులో మొదటి పాదంలోను మూడవ పాదములోను బిందువున్నది గాని తక్కిన రెండుపాదములందున్న లేదు. వ్రాతప్రతులలో నాలిగింటను ఉన్నది. తిక్కన యెఱ్ఱన శ్రీనాథులు 'ఏఁటికి అని సబిందుకంగా వాడినట్టు వ్రాతప్రతులలో వందలకొలదిగా ప్రయోగములు చూచినాను. మీరిచ్చిన హరివంశము ప్రతిలో ఏఁటికి ఉన్నది. అది II-139 క. అనఘ యిది యేఁటి తపము అని వ్రాతప్రతులలో చూచినాను.

పుట-13 'అందుఁబ్రఖ్యాత సద్భక్తి' అందు, ఇందు, అట, ఇట, ఎట, అక్కడ, ఇక్కడ,-ఇవి ప్రాచీన భాషలో ప్రథమాతుల్యములు. వీటికి పరంగాఉన్న కచటతపలకు గసడదవాదేశం రావలెను.[12] యుద్ధమల్లుని శాసనం, ఓపిలిసిద్ధి శాసనం జ్ఞాపకంగా ఉన్నది. 'ఇందు ప్రత్యక్షము' భారతం ఆదిపర్వం IV-26 ఉ॥లో 'ఎందుఁబోయిరొకో' ఆనందముద్రణం. దిద్దలేదు. వావిళ్ళ వారి కూర్పులో పుట అడుగున షరా 'ఎందువోయిరొకో' అని వ్రాతప్రతులు. ఆనంద ముద్రణంలో ( ... ...) I- 202 'ఎందుసనిరో' చూ. షరా. అనుశా.... ...65 'అందుఁజను' పుట దిగువున 'అందుసను' వ్రాతప్రతులలో పాఠము.' అందే 68వ పద్యము 'అందుఁ బోవు' పుట దిగువున 'అందువోవు' అని వ్రాతప్రతులు. అయితే అందే (74)వ పద్యం 'అందుఁబోదురు' దిద్దలేదు! ! -ఇట్లే భారత గ్రంథమంతా గందరగోళంగా ఉన్నది. అట ఇట ఎట ద్రుతప్రకృతికములుగా మొదటి వాల్యూంలోవేసి శుద్ధ పత్రికలో దిద్దినారు. కాశీఖండం — వావిళ్ళవారి ప్రతి III-147 'ఎందుఁబోయె' వ్రాతప్రతిలో 'ఎందువోయె' నేను చూచినాను. ఇట్టే నైషధంలో వేంకటరాయశాస్త్రిగారు ఈ ఆదేశము వ్యత్యస్తము చేసినారు. మీరు చేసే పరిష్కరణం ఈలాగున ఉండకూడదని నా కోరిక. వాక్యాంతమందు చుక్కలు మానగూడదు.

పుట-14 'తారు' అనే శబ్దము గ్రంథమందుంచ వలసి ఉంటుంది. (చూ. నోటు 10వ షరా) (అమహ) దర్థకంగా తా (రు) అనేది సింగన సకలనీతిశాస్త్ర సమ్మతము 475వ పద్యంలో సిరులు (తారు) వచ్చివసించున్ ఈఒక్క ప్రయోగ మంనే నేనెరుగుదును. (అమహ) దర్థకంగా 'తారు' తిక్కన శాంతి V-226 (?) కనబడినవి. నైషధ VII-129 లో దీపంబులు తమకు (తా) రారుట అని రెండు వాతప్రతులలో చూచి (నాను). వేంకటరాయశాస్త్రిగారు 'తాము' అనే పాఠము ( ..) ఇది ఎక్కడిదో నేనెరుగను. ఇంకను అనేక అంశములు ప్రూఫు కాగితముల మీదనే తప్పులో ఒప్పులో నాకు తోచినట్లు (....) నా అభిప్రాయము సూచించినాను.[13] మీకు తోచినట్లు మీరు చేయవచ్చును. పూచీ మీమీదనున్నది. నా అభిప్రాయమేమయినా మీ తీర్పే చెల్లవలెను. మీరు రచించిన(ది విమ)ర్శనము దివ్యముగా ఉన్నది. చాలా సంతోషముతో చదివినాను. ముందిరి (కథవినుటకు) నిండా కుతూహలముతో ఉన్నాను. నోరి నరసింహశాస్త్రిగారు[14]సోమనాథవిజయము చక్కగా రచించి(నారని) (.......) మెచ్చుకొన్నారని చి॥ సీతాపతి వల్ల విన్నాను. గాదెల గం(డదురచించిన) ఆయన ఎక్కడున్నాడో తెలియలేదు. ఏవో చిక్కులలో పడ్డాడట. సస్పెన్షనులో ఉన్నాడట. ఛోగట్టా తెలిసిన పిమ్మట (మీ) జాబు ఆయనకు అందజేస్తాను.

మీరు సవిస్తరముగా జాబు వ్రాస్తే, మీ గోష్ఠివల్ల కలిగే ఆనందము కలుగుతుంది. నేను మీ దర్శనమునకు వచ్చి ఉంటే ఏమేమి ముచ్చటలు చెప్పుదురో అవి అన్ని ఉత్తరములో చెప్పి నన్ను సంతోషపెట్టరాదూ! ఇంగ్లీషులో అట్టి ఉత్తరములు ఇంపుగా రచించేవారు ప్రఖ్యాతి కవులున్నారు. లెటర్‌రైటింగ్ మధుర కవితవంటిది.

అన్నట్టు క్రీడాభిరామము దిద్దినారా లేదా? హరవిలాసము పూర్తిగా దిద్ద లేదా? సంపూర్ణ యవ్వనము కల మీకే బద్ధకమయితే నావంటి ముసలివాళ్ళమేమి చేయగలము?

చిత్తగించవలెను
సే ॥ గి ॥ వేం॥ రామమూర్తి

లేఖ చివర :

మీ వినోదవిమర్శనము చూచినాను. సోముని హరివంశ మందు నేను మూడేళ్ళ క్రిందట ఈ విషయము గుర్తించినాను. వీరేశలింగముగారి పాఠము బాగా ఉందని చెప్పిన విమర్శకుని గ్రాంధికాంధ్ర భాషా జ్ఞానమువంటిదే ఇప్పటి ఆంధ్రపండితుల పాండిత్యము. నాకొక అంశము, మీకు రెండు, మరొకరికి మూడు. ఇంతేకాని ప్రాచీన కావ్య భాష అంతా ఎవరికీ రాదు గదా! ఎందుకు భేషజాలు? ఏదో ఒకమాట ఏదో పుస్తకములో చూచి ఇప్పుడు నేను ప్రయోగిస్తే, నన్ను మెచ్చుకోకూడదు. వేషధారి అని నన్ను నిందించవలెను. లోకులను మోసపుచ్చడము గొప్పదోషము కాదా?

లేఖ-మూడు :

పర్లాకిమిడి
11-1-27 (1928)

బ్ర॥ శ్రీ వేదమూర్తులయిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి

సే. గిడుగు వేంకటరామమూర్తి అనేక నమస్కారములు చేసి చేయగల విన్నపములు. ఉభయకుశలోపరి. మీ కార్డుచేరిన వెంటనే జవాబు వ్రాయ 'వయితి' కాలేదు. గ్రామాంతరము పోవలసి వచ్చినది. మీ కార్డు ఎక్కడనో పడిపోయినది. మీ చిరునామా తెలియక బ్ర॥ శ్రీ సుబ్బరామయ్యగారి వద్దకు ఈ జాబుపంపినాను. క్షమించవలెను.

బసవ పురాణము ప్రతి పుస్తకము ఒకటి శ్రీ సుబ్బరామయ్యగారు. 14-11-27 తారీఖున నాకు పంపినారు. అది అందకమునుపు మీ పేర దానిని గురించి వ్రాసి ఉంటిని. గ్రంథమంతా తిప్పిచూచినాను. పీఠికలో భాషను గురించి మీరు చేసిన సిద్ధాంతములు కొన్ని నేను స్వీకరించలేను.[15] నా అభిప్రాయములు (అనగా ఆదేశ ములు, కలఁగుఁడు మొ॥) మీరు ఖండించినను నా అభిప్రాయములకు తగినంత ఆధారమున్నది. గసడదవాదేశము నిత్యము కాదనుటకు మీరు ప్రాచీనుల ప్రయోగము ఒక్కటైనా చూపలేదు. అయినా మీరన్న 'వీఁడు కృతఘ్నుండు' ప్రాచీన భాషా లక్షణమునకు విరుద్ధ మనవలెను గాని, దానిని ఆధారము చేసుకొని ఆ లక్షణము నేరుపర్చరాదు. నేను 'గసడదవాదేశము'ను గురించి వేరే ఒక వ్యాసము రచిస్తున్నాను. వందలు వందలు ప్రయోగములు ఉదాహరిస్తాను.

అరసున్నలు, శకటరేఫలు నిరుడు కొంతవట్టుకు పరీక్షించినాను. విసిగి ఆ విషయం అట్టే పెట్టినాను. ఇప్పుడు తిరిగీ ఆ విషయ మెత్తుకొన్నాను. ప్రాచీనుల భాష కున్నూ అర్వాచీనులు అనుకరించిన ప్రాచీనభాషకున్నూ చాలా వ్యత్యాసము ఈ విషయ ములో కనబడుతున్నది. 'చీకటి'లో పూర్వులు అరసున్న పలకలేదు. కాళహస్తి మాహా త్మ్యములోను రామాభ్యుదయములోను 'చీఁకటి' ప్రాసస్థానమందు సరిగా తక్కిన చర ణములతో పొంది ఉన్నది. మీరు వాడినట్టు ఒసఁగు, ఎసఁగు,[16] బ్రాఁతి మొదలైన వాటి లోని అరసున్నకు ప్రమాణము నాకు కానరాదు. మాటకు ఆశ్రమ II-121 చూడండి. 'ఒసగు'లో బిందువు లేదు. 'ఆరడి', 'ఆఱడి' వేరే శబ్దములు అట్లే 'అర' 'అఱ' గాబోలు. 'బాతి' 'భాతి' యొక్క వికృతి. 'బ్రాఁతి' 'భ్రాంతి' యొక్క 'వికృతి'గా నాకు తోస్తున్నది. సిద్ధాంతము కాదు సుమండీ.

సంఖ్యాపరిణామవాచకముల మీద గసడదవాదేశము- నిత్యమన్నారు; సరేకాని, 'ఒక' మీద, ఆదేశము వచ్చు ననుటకు మీకు ప్రమాణమున్నదా? నాకు వింతగాఉన్నది. ఈ విషయము, 'ఒక వందు' అని చాలాసార్లు 94వ పుటలోను, 'ఒక వాము' అని 210 లోను 'ఒక్క దుమ్ము' మొ॥ కనబడినవి. 'ఒక' 'ఎల్ల' మీద ఆదేశము రాదని నా అభి

ప్రాయము. 21వ పుటలో 'ఎన్మిదికోట్లు' 'ఒండు పదక'లో ఆదేశ సరావలెను. రాలేదు. ప్రార్థనార్థక క్రియ మీద ఆదేశము రాదు. మీరు తరుచుగా అట్టిచోట ఆదేశము వాడుట నాకు వింతగా ఉన్నది. 'కదువ' 'పదుమలు'లలో 'దు' వర్ణము తాటాకు పుస్తకము లలో ఉన్నదా ? శాసనములే ప్రమాణము గాబోలు.

'ఎరఁగు' (నమస్కరించు)లో 'ర' తప్పు. 'చీరు' (పిలుచు) లోను గురురేఫ ముండవలెను. శ. ర. లోని ప్రయోగాలు తప్పు.

'బోటి'లోను 'ఏటి'లోను బిందువు ఉండవలెను. 'తోచు' 'తోకొను'లో బిందువు కనపడలేదు.

అనేక విషయము లిట్టివి ఇంకా సరిచూడవలసినవి ఉన్నవి. మరి ఒకప్పుడు వాటిని గూర్చి వ్రాస్తాను సవిస్తరముగా. ఇట్టి వాటికేమి ? మీరు ధన్యులయినారు. నన్నయ ఆదిపర్వమైనా నేటికిన్నీ దోషభూయిష్టముగా నున్నదే. దానికన్న వేయిమడుగులు చక్కగా ఉన్నది మీ బసవపురాణము. గ్రంథ పరిష్కరణమంటే ఏమిటో తెలిసిన వాళ్ళకే కాని ఇతరులకు మీ పరిష్కరణములో మెచ్చుకోవలసిన విషయములు బోధపడవు. మొదటి కూర్పుకున్ను దీనికిన్ని గల 'తేడా' చూచినవాళ్ళు మెచ్చుకొంటారు.

శబ్దరత్నాకరము తప్పుల తడక. ఇంచుమించుగా రెండువేల సవరణలు నేను దానిలో చేసినాను.

మ॥ నాగేశ్వరరావుగారు పండితారాధ్య చరిత్ర పరిష్కరించవలసినదని నన్ను కోరినారు. రెండే తాటాకు పుస్తకాలున్నవి. వాటిలో ఒకటి అసంపూర్ణము. కాగితాలమీద వ్రాసినదొకటి ఉన్నది. వీటినిబట్టి గ్రంథము పరిష్కరించవలెను. అచ్చుపడ్డ గ్రంథము ఉన్నది. 'వరంగల్' పురమందు సౌమ్య సం॥లో ముద్రితమైనది. అపశబ్దాలతో నిండి ఉన్నది. పాల్కురికి సోమన్న కాలమందు 'తెలింగానా'లో ఎట్టి తెలుగు ఉన్నదో తెలుసుకోవలెనని నా అభిలాష. నన్నయ భాషకున్ను తిక్కన భాషకున్ను వ్యత్యాస మున్నది. కాలము, దేశము మొ॥ భేదముల చేత భాషల్లో భేదములు ఏర్పడుతవని నా అభిప్రాయము. శైవులు వాడే మాటలు కూడా నిశిష్టముగా ఉంటవి. ఏదో వ్రాతప్రతి ఆధారముగా చేసుకొని పాఠములు పరిష్కరించవలెను. మీ సాయముంటేనే కాని నా పని నెరవేరదు. ముసలివాడను. ఒంట్లో బలములేదు. తెలిసిన విషయములు జ్ఞప్తికిరాకుండా ఉన్నవి. పెద్ద మనిషికి మాట యిచ్చినాను. మాట తప్పటము మర్యాదా కాదు, చి॥ సీతా పతి తోడుగా ఉంటానన్నాడు. మాట దక్కుతుండో దక్కదో ! 17 ఎంతోభారము మీద పడ్డట్టుగా ఉన్నది. కన్నడ భాషలోని పండితారాధ్య చరిత్ర తెలుగు గ్రంథముతో పోలి ఉంటుందా ? మీకీ విషయమయి తెలిసినదంతా నాకు తెలియచేస్తే సంతోషిస్తాను.

ఈ ఫిబ్రేవరిలో 'బోర్డు' మీటింగుకు నన్ను పిలిస్తే పట్నం వస్తాను. అప్పుడు మీ దర్శనం చేస్తాను.

మీ క్షేమసమాచారము వ్రాసి పంపండి, మనకు కావలసినది 'శాంతి'. నాకు

అలవడ్డది కాదు. ఉత్తమాటలెందుకు? సంశయములు మెండైనవి. 'తత్త్వము' కోసము ఎండమావుల వెంటబడ్డాను. తోవా తెన్నూ కనబడదు. ప్రయాణమునకు సిద్ధపడుతున్నాను. బయలు వెడలిపోక తప్పదు. పోయే దెక్కడికో తెలియదు.

చిత్తగించవలెను.

సే॥ గి॥ వెం॥ రామమూర్తి.

లేఖ మీది భాగంలో ఈ వ్రాత ఉన్నది :

"ఇది నా ఉత్తరంతో కూడా వచ్చింది. సం॥ G.S. (గన్నవరపు సుబ్బరామయ్య)
13-1-28."

*పాదసూచికలు :*

1. "వాడుకభాషలో గ్రంథాలు వందలు వందలున్నవి, అచ్చువచ్చిన తర్వాతనే యీ అన్యాయం. పూజా పురస్కారములు లేకుండా బూజుపట్టిస్తున్నారు.

వ్యాఖ్యానాలకు వాడుక భాషతప్ప వేరే భాష లేనేలేదు. తాళ్ళపాక తిరువేంగళనాథుడు అమర వ్యాఖ్య వాడుకభాషలో వ్రాసినాడు. కృష్ణరాయల నాటివాడు సర్వలక్షణసారసంగ్రహకర్త చిత్రకవి పెద్దన్న కొడుకు అనంతకవి హరిశ్చంద్రోపాఖ్యాన వ్యాఖ్యానం వాడుక భాషలో వ్రాసినాడు. అచ్చులో పూండ్ల వారు అర్థాన్నం చేసినారు. రాఘవపాండవీయ వ్యాఖ్య, ఆముక్తమాల్యద వ్యాఖ్య, మూడు వసు చరిత్రల వ్యాఖ్యలు, పంచతంత్ర వ్యాఖ్య; బాహట వ్యాఖ్య, బృహజ్జాత వ్యాఖ్య, సోమనాథ భాష్య వివరణము, ఆంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్య (అచ్చులో అన్యాయం చేసినారు. బాలసరస్వతి పేరు పెరికివేసినారు. భాషా పాడుచేసినారు.) తెలుగు వ్యాఖ్యానాలన్నీ, అదేమిటి, ఇదేమిటి, సర్వం వాడుక భాషలోనే ఉన్నవి.

ప్రాచీన వచన గ్రంథాలు వందలు వందలు పరిశీలింపగా కావ్యభాషవి వేళ్ళ లెక్కకైనారాలేదు. అన్నీ వాడుకభాషలోనే ఉన్నవి, రామాయణాలు, భాగవతాలు, కథలు అన్నీని ఎరిగి అంటారో, యెరగక అంటారో, కొందరు భాషరానివారు వ్రాసినారని. పుష్పగిరి తిమ్మన్న వ్యాకరణం రానివాడా? సమీరకుమార విజయం చదవమనండి. అతడు భాగవతసారం అని తేటతేనెవంటి వాడుక భాషలో గ్రంథం రచించినాడు. ఏమంటారో? వ్యాఖ్యానాలు, లక్షణ గ్రంథాలు రచించిన వారు భాషరానివారా?

లక్షణ గ్రంథాలలో వచన భాగమంతా వాడుకభాషే అనంతుని ఛందస్సు, కవిలోక చింతామణి, రంగరాట్ఛందస్సు, సర్వలక్షణసారసంగ్రహము, లక్షణ దీపిక వగైరాలు-అందులో చిత్రం, లక్షణ దీపికలో పాటలు, పదాలు, షట్పదులు, ధవళాలు, అర్ధచంద్రికలు వగైరాలు మధురకవిత అన్నాడు. ఇవన్నీ వాడుకభాషవే. మృదు మధుర చిత్ర విస్తరములని దేశికవిత చతుర్విధము. శ్రీనాథుడు శృంగార నైషధములో వీటిని తడవినాడు. పెద్దనాదులు తడవినారు. శ్రీనాథుడు మాతంగికథ, కాటంరాజుకథ వగైరాలు వాడుకభాషలో రచించినాడు. కుసలాయకం చదవండి మొదట

గ్రంథకర్త యేమి చెప్పినాడో? బ్రౌనుదొరగారు పండితులచేత వ్రాయించిన వ్యాఖ్యాన ములన్నీ వాడుకభాషే. పది పన్నెండు వ్యాఖ్యలున్నవి. పట్టాభిరామశాస్త్రి యనే ప్రెసిడెన్సీ కాలేజి పండితుడు అప్పుడు ఆంధ్రధాతుపాఠము రచించినాడు. వాడుక భాషనుండి చాలా మాటలు చేర్చుకొన్నాడు. వాడుక భాషలోనే కూర్పు. పండితుడు వఠెం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రులు, జూలూరి అప్పయ్య పండితుడు, గురుమూర్తి శాస్త్రులు మొదలగు గొప్పపండితులు బ్రౌనుదొరగారికే విద్యా విషయమై వ్రాసిన ఉత్తరములున్నవి. అన్నీ వాడుక భాషే. బ్రౌను పల్నాటివీరచరిత్ర వాడుకభాషలో రచియించినాడు. ఆంధ్రభారతం విషయక్రమంగా వాడుకభాషలో వ్రాయించినాడు. అయిదారు వాల్యూములున్నవి. వందలు వందలు క్రయంచేసి మరీ వ్రాయించినాడు. పేర్లు పేర్కొనడ మెందుకు? చిన్నయసూరిగారి వరకూ వుండే వచన గ్రంథాలలో యేవో కొద్ది సంఖ్యవి తప్ప అన్నీ వాడుకభాషవే. యక్షగానాల భాష చాలా వరకు వాడుక భాషే. గొప్ప గొప్పకవులు వ్రాసినవి ఉన్నవి. యక్షగానాలు నిన్న మొన్న పుట్టినవిగావు. బహుకాలంనుంచీ వున్నవి. 'సంస్కృత కవులే వాటికి లక్షణాలు చెప్పినారు".

(తెలుగు పత్రిక సంపుటి.) 1-సంచిక 1. 1919 సం॥ సెప్టెంబరు నెలలో ముద్రితము. ఆగస్టు-సెప్టెంబరు 1954 సం॥ పరిశోధన పత్రిక పుట 30లో పునర్ముద్రితము పైని ముద్రింపబడిన వచన పంక్తులుఅప్పట్లో గురుదేవులు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారికి వ్రాసిన లేఖలో కొన్ని అంశములు. దీని మీద అప్పటి పత్రికలలో కొంతచర్చకూడ కొనసాగినది.

2. చూ.డా గిడుగు సీతాపతిగారి వ్యాసం-పరిశోధన. పుట. 30—31.

" . . ఆ పిమ్మట మా తండ్రిగారికిన్నీ శాస్త్రిగారి కిన్నీ పరిచయం, మైత్రి అంతకంతకు ఎక్కువయినవి. ఇద్దరున్నూ నిగ్గయిన పాండిత్యముకోసము శ్రద్ధ వహించి కృషిచేసెడివారు. ఇద్దరికిన్నీ తెలుగు భాషాపదముల వ్యుత్పత్తి తెలుసుకొనుటలో గల ఉత్సాహము. సమర్థత ఎక్కువగా ఉండేవి. తమ పరిశీలన వలన తాము తెలిసికొన్న విషయమును నిలబెట్టుకొనుటలో గల పట్టుదలకూడా ఇద్దరికీ సమానముగానే ఉండేది. ఏదైనా ఒక ప్రయోగం గురించి కాని, వ్యాకరణ విషయం గురించి కాని, వారు వాదించుకొంటూ ఉంటే ప్రక్కనున్న వారికి ముచ్చటగానే ఉండేది . . ఒకరి అభిప్రాయ మును ఒకరు ఖండించుకొన్నప్పుడు వాదం తీవ్రంగానే చెలరేగేది. . ఎదిరివాదం సబబుగా కనబడకపోతే పెద్ద కేకలువేసి హడలగొట్టేవారు మాతండ్రిగారు ... "నిశ్చయక మైన యతిప్రాస స్థలములలో కనపడినదాకా నేను సాధువుగా గ్రహించలేను" అని పెదవి విరిచేవారు శాస్త్రిగారు. పట్టుదల విషయములో ఇద్దరూ సమాన తీవ్రతగలవారే .. ఒకరి పాండిత్యము యెడల ఒకరికి ఎక్కువగా ఆదారాభిమానాలుండేవి. నిరసనలో గూడా శాస్త్రిగారి యెడల మా తండ్రిగారికి గల గౌరవము ఎక్కువగా కనబడేది...."

3. యల్లాపంతుల జగన్నాథంగారు పర్లాకిమిడి వాస్తవ్యులు. వీరి తండ్రిగారు,

గిడుగు రామమూర్తి పంతులుగారూ సహపాఠులట. గిడుగువారి సాహచర్యభాగ్యం వల్లను, ప్రోత్సాహమువల్లను ఉద్బోధితులై వ్యావహారికభాషలో చక్కని గేయ ప్రబంధాలను రచించినారు. వీరి 'ఆగర్భశత్రువులు' అనే పద్యకృతి 'సోహ్రాబ్ అండ్ రుస్తుమ్' అన్న ఆంగ్ల పద్య కావ్యానికి అనువాదం వీరి 'గాదెలగండడు' అన్న పేరగాథ హోమరు వ్రాసిన హాస్య ప్రబంధాన్ని మాతృకగా తీసికొని బొబ్బిలి పాట వరుసన చెప్పిన గేయ ప్రబంధము. విశ్వాసి, (గేయ ప్రబంధం) శ్రీ చైతన్య శిక్షామృతము, ప్రేమదర్శిని, గీతా సరళార్థదర్శిని, నామసిద్ధాంత దర్శని, తరణోపాయం మొ॥ వీరి యితర కృతులు. విశ్వాసి గిడుగు వారి కంకితం. వీరి తరణోపాయానికి గిడుగువారు ఉపోద్ఘాతం వ్రాశారు. (చూ. గురుస్మరణము-వ్యాసం- ప్రతిభ-సం॥4 గి. రా. స్మారక సంపుటి-పుట 217-221.)

4. "1916 సెప్టెంబరు నెలలో వారి స్వస్థానమగు పర్లాకిమిడికే నాకు మార్పు కలిగినది. అప్పుడువారి సహవాసం ఏడు సంవత్సరములు అవిచ్ఛిన్నంగా లభించినది ...శ్రీ పంతులుగారు అప్పుడు నా యందు అవ్యాజమైన ప్రేమ చూపించినారు-'వ్యావహారికభాషలో వ్రాసినప్పుడు కావ్యమెంత రసవత్తరంగా ఉంటుందో నీకు అనుభవం మీద కాని తెలియదు. 'ఏదీ నీకలాన్ని ఒక్కసారి అటువైపు త్రిప్పు' అని సెలవిచ్చినారు. నాకు గుండె ఝల్లుమన్నది. వారి ఆజ్ఞ నెరవేర్చవలెననే అభిలాష ఒకవైపూ, పండిత రచనలకు అలవాటుపడియున్న నా కలము వ్యావహారిక భాషారచనలనంగీకరించదేమో అనే భయం ఒక వైపూ నన్నుపట్టి కొన్నాళ్ళు బాధించినా కాస్త ధైర్యము తెచ్చుకొని హోమరుకవి రచితమైన చిన్న హాస్యప్రబంధమును మాతృకగా పెట్టుకొని 'గాదెల గండడు' అనే పేరుతో బొబ్బిలిపాట వరుసను ఒక చిన్న గేయప్రబంధమును వ్రాసి వారికిచ్చినాను అదిచదివి ఆనందబాష్పములు రాల్చినారు. ధన్యోస్మి అన్నారు. ఇదంతా చూచి నాకే ఆశ్చర్యం కలిగింది ... ఈ చిన్న ప్రబంధానికి అచ్చులో 12 పేజీలు ఉపోద్ఘాతము అతి సమర్థతతో వ్రాసినారు " (చూ. అందే: గురుస్మరణము-వ్యాసము. పు 219.)

5. 'నన్నయ్య' 'ఎడమ' అనేకాని 'ఎడుమ' అని ప్రయోగించలేదు. ఈ అంశము ముగ్గురునలుగురు తప్ప మరి ఎవ్వరూ ఎరుగరు. ఈ ఆశీరర్థక రూపము 17సంవత్సరముల క్రిందట తంజావూరిలోని భారతప్రతులు చూచినపుడు అనేక పద్యములలో ప్రయుక్తమయినది, అయిదారు వ్రాత ప్రతులలో కనపడినది. ఆ ఊరిలో మూడు మాసములుండి నందున సావధానముగా పరీక్షించి చూచినాను. చెన్నపట్నంలో నా మిత్రులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారితో ఈ విషయము గురించి మాట్లాడినప్పుడు వారికిన్ని ఆ రూపము కనపడినదని చెప్పినారు.

6. "శాసనములలో ఈ శబ్దము ఉన్నదేమో అని మద్రాసు ఎపిగ్రాఫిస్టు ప్రకటించినవి వెదకినాముగాని కనపడలేదు. హైదరాబాదు ప్రభుత్వమువారు ప్రకటించిన శాస

నాలు శ్రీ వేపా రామేశం పంతులువారి వద్ద ఉన్నవని ప్రభాకరశాస్త్రిగారు తెలిపి ఉన్నందున వారూ నేనూ పంతులు వారివద్దకు వెళ్ళి అవి అడిగి పుచ్చుకొన్నాము. వాటిలో ఉపర్పల్లి శాసనమందు ఈ ఆశీరర్థకరూపము కనబడినది. శాసనము క్రీ॥శ॥ 1236వ సం॥న రాతిమీద చెక్కబడినది. శాసన ప్రతిబింబము (ఫోటోలిథో)తో శాసన గ్రంథము రోమన్ అక్షరములతో ముద్రితమై నెం॥ 3రు సంచికలో 1919వ సం॥న ప్రకటితమైనది. శాసనము గద్యపద్యములుగా చంపూకావ్యము మాదిరిగి రచింపబడినది. ఆ పద్యములలో ఒకటి శాసనములో ఉన్నట్టే ఇక్కడ వ్రాస్తున్నాను. "హరిదశ్వం దజాచ్యుత శంకరమూర్తి ద్రయీమయుండు గమలాప్తుండు భాస్కరుండు దయం గాచుచుండెడం గరుణారసపూర హృదయుం గాటయుం బ్రీతిని." రోమన్ అక్షరాలతో ఈ శాసన గ్రంథము వ్రాసినవారు. gachuchumded[U*]m అని 'గాచుచుండెడం' అనే మాటకు మారుగా వ్రాసి, ఉకారము విడిగా brackets లో పెట్టి నక్షత్ర చిహ్న ఉంచినారు. ఇది శాసనములు పరీక్షించి పాఠములు పరిష్కరించేవారు అవలంబించిన పద్ధతి, 'అ' కారమునకు మారుగా 'ఉ' కారము పరిష్కర్త వ్రాసినదని తెలియ జేయడానికే అలాగున సూచిస్తారు. శాసన ప్రతిబింబములో 'గాచుచుండెడం' అని కట్టకడపట నున్న 'డు'కు తగులుతూనే ఉన్నది. కొమ్ముకు స్థలంలేదు. గనుక శాసనము రచించిన కవి 'డం' అనే వ్రాసినాడని నిశ్చయింపవచ్చును. ఐతే పరిష్కర్త 'ఉ' కారం ఎందుకు చేర్చినాడు? ఆ సంగతి తెలుసుకోవలెనని ఉద్దేశించి, 1923వ సం॥ ఆగస్టు 20వ తేదని హైదరాబాదులో ఉన్న అధికార్లకు దానిని గురించి జాబు వ్రాసినాను. శాసనాలు పరిష్కరించేవారు లండన్‌లో ఉన్న డాక్టర్ బార్‌నెట్ గారననిన్ని వారి వద్దకు నా జాబు పంపినామనిన్ని బార్నెట్‌గారు 1924వ సం॥ జనవరి తే. 31దిని నేను అడిగిన సంగతిని గురించి తమకు వ్రాసిన జవాబు నకలు నాకు పంపిస్తున్నామనిన్ని 1924వ సం॥ ఫిబ్రవరి తే. 20దిని నెం 160 రు గల జాబు వ్రాసినారు. బార్నెట్‌గారు తాము gachuchumded [u*]mఅని దిద్దడము పొరపాటనిన్ని 'తప్పొప్పుల పట్టిలో దానికి మారుగ gachuchumdedam, అని చదువవలెనని కాగితము ముక్కలమీద అచ్చువేసి శాసనమునకు అంటించవచ్చుననిన్ని అంగీకరించినారు.*

* Department of Oriental Printed Books and MSS.
British museum, London, 31st January 1924.

To
S.A Asger Bilgrami Esqr,
Office of Nizam Archaeological Department,
Hyderabad (Deccan).

Sir.

I beg to acknowledge the receipt of your letter of 22nd December 1923 (No. 197) enclosing a copy of a letter from Professor G.V. Ramamurti for which Iam obliged to you. I have care

fully examined the Professor's observations and believe them to be correct. Accordingly I enclose a corrigendum slip............
Corrigendum :- Page 15, line 20 of text, for (gachuchumded [u]m, read gachuchumdedam.

[చూ. ప్రతిభ గి. రా. స్మారక సంపుటి (4) పు. 55-56]

7. "ఆంధ్ర నిఘంటు నిర్మాణము విషయమున రామయ్యగారికి రామమూర్తిగారికి అభిప్రాయ భేదం వచ్చిందట. తాము చెప్పినట్లు చేస్తే తక్కువ ఖర్చుతో ఎక్కువ పని చేయించవచ్చునని రామమూర్తి గారన్నారట ఇవేవీ రామయ్యగారికి కిట్టలేదు. అప్పుడు చేశారు రామమూర్తిగారు ప్రతిజ్ఞ. మీ నిఘంటువులో నేను తప్పులు చూపుతాను. మీరు వప్పుకొన్న తప్పులకి తప్పు ఒక్కింటికి ఒక రూపాయి నాకు ఇప్పించ గలరా అని రామయ్య గారు ఈ షరతు వప్పుకొంటే ఎన్నివేలు లేక, లక్షలు ఖర్చు చేయవలసి ఉండేదో." (చూ. కర్మవీరుడు - చింతా దీక్షితులు గారి వ్యాసం. ప్రతిభ సంపుటి 4. గి.రా. స్మారక సంపుటి -225-226)

8. 'సుమారు 30 సంవత్సరములై వర్తమానాంధ్ర భాషా ప్రయోజనము గురించి పాటుపడుతున్నాను. వ్యావహారిక భాషా గౌరవమును నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూ ఉంటే దానిని పడగొట్టడానికి ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారు పనిచేస్తూ వచ్చారు. మొదట నేనూ, నా మిత్రుడు గురజాడ అప్పారావు, మాకు తోడుగా మరి ఇద్దరు ముగ్గురు మాత్రమే ఈ ఉద్యమము ప్రారంభించాము తక్కిన తెలుగువారందరూ మాకు ప్రతికూలంగా ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారితో కలసి మా ఉద్యమాన్ని ఎదిరించిన వారే....

అప్పుడు నిజమైన సంప్రదాయము అనే పేరను చిన్న వ్యాసమొకటి రచించాను. అది శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులుగారు అచ్చువేయించి ప్రకటించారు. అందులో విద్యార్థులు చదువుకొనే గ్రంథాలన్నీ మన పూర్వులు వ్యావహారిక భాషలోనే రచించినారని కొన్ని నిదర్శనాలు చూపించాను...

[చూ. గిడుగువారి 'తుదివిన్నపము' (151 - 1940 - ప్రజామిత్ర కార్యాలయంలో చేసిన ఉపన్యాస సారాంశము). ప్రతిభ సంపుటి 4 గి.రా. స్మారక సంపుటి పు-203 - 204., చూ. మరియు ఇందు ప్రకటింపబడిన గిడుగువారి లేఖలు]

9. పూజ్యులు డా॥ వేటూరి శంకరశాస్త్రి గారితో ముఖాముఖి - ఈ ప్రూపుల గూర్చిన కొన్ని అంశాలు.

"గురజాడ అప్పారావుగారివి చాలా ఉత్తరాలుండాలి మరి ఏమైనాయో అవన్నీను. ఆయన చెన్నపట్నం వచ్చినపుడల్లా ఈయనకి రాస్తుండేవాడు ఇద్దరూ కలుసుకొంటూ వుండేవాళ్లు. ఇంటికొస్తూ ఉండేవాడు. ఇద్దరూ కలిసి అప్పుడప్పుడు గైటీ టాకీసులో మూకీ సినిమాలకి వెళ్ళడం గుర్తే

రామమూర్తి పంతులుగారు పట్నం వచ్చినప్పుడు ఇంటికి వచ్చేవాడు. పుల్లైడు

చెముడు. సవర భాష మీద పనిచేసేటప్పుడు మలేరియా పట్టిందని క్వినైన్ డోసెక్కువై చెముడు పుట్టుకొచ్చింది. చెవులో గొట్టంపెట్టి పెద్దగా అరవాల్సివచ్చేది. ఆయనా పెద్ద గొంతుతో అరిచేవాడు. ఇద్దరూ ప్రయోగాల్ని గురించీ వాటి గురించీ తీవ్రంగానే వాదించుకునే వాళ్ళు. ఆయన వెళ్ళేటప్పుడు బస్ స్టాండ్ దాకా తీసుకెళ్ళి దిగబెట్టి వస్తూవుండే వాణ్ణి. చిన్నన్నయ్యంటే ఆయనకి చాలా మంచి అభిప్రాయం ఉండేది. ఈయన ఆయనకి వ్యావహారిక భాషా విషయంలో బాగా తోడుపడుతూ వుండేవాడు ఏట్సుకి కూడా ఈయనంటే చాలా గౌరవం. వాళ్ళకి తెలీనవి అప్పుడప్పుడు ఈయనకి రాసి తెలుసుకుంటూ వుండేవాళ్ళు.

పరిశోధన పత్రికలో సీతాపతి ఈయన్ని గురించి రాసింది చదివావుగా!... అదో ధోరణిలో రాశాడు. ఆ బసవ పురాణం ప్రూఫులు మన దగ్గర వుండాలి. తన కేమైనా తెలుసేమో కోదండ రామయ్యగారి నడిగావా ఎప్పుడైనా? ఏమైనాయో మరి నాగేశ్వర రావు గారు బసవపురాణం అచ్చుపని ఆరంభించిన తర్వాత ఒకసారి ప్రూఫులు ఇట్లా అచ్చవుతున్నాయని తెలుపుదామని కాబోలు ఆయనకి పంపినట్టున్నారు. సందేహాలుంటే రామమూర్తి గారు ఈయనకి విడిగా రాసుండవచ్చు. అట్టాకాకుండా ఆ ప్రూఫు కాగితాల మీదనే పెన్సిలుతో కాగితం చినిగేటట్టుగా కొన్ని కొన్ని చోట్ల దిద్ది పంపించాడు. చిన్నన్నయ్య ఏం చేశాడంటే మళ్ళీ ఆ ప్రూఫు కాగితాల మీదనే అంత గట్టిగానూ ఎర్ర పెన్సిలుతో అక్కడక్కడా సున్నలు చుట్టి 'తప్పు' - 'ఇది సరికాదు' అని అడ్డంగా రాసి తాననుకున్న పారాల్నే మార్జినులో ఉంచుతూ కట్ట కట్టా మొత్తం అలాగే నాగేశ్వర రావు గారికి పంపించాడు. దాపరిక మేముంది? అంతా చివరికి ఆయనకీ తెలియాలిగా మరి! ఆయనా ఇవన్నీ చూసుకునే వుంటాడు తర్వాత. బసవపురాణం ప్రూఫుల కథ అదీ!... పండితారాధ్య చరిత్ర అచ్చయిందర్వాత తిరుపతి జర్నల్‌లో చిన్నన్నయ్య రాసింది చదివేవుగా! .. ముక్త్యాలలో జరిగిన నవ్య సాహిత్య పరిషత్తు ఉపన్యాసమో!. .

గి.రా. స్మారక సంచికలో ఈయన వ్యాసం ఎందుకు లేదో నాకాట్టే తేలీదు. అప్పుడు వాళ్ళు అడగలేదేమో ఈయన్ని పరస్పరం ఒకరి పాండిత్యం మీద ఒకరికి ఎంతో ప్రత్యయం, ఆదరం వుండేది. ఆ తరమే వేరు"

10. చూ. బసవపురాణము (1926 వే ప్ర) పీఠిక పు. 108 - 111 (అర్ధానుస్వారములు) "కలగుండు" ప్రయోగ విషయము.

"కలఁగుఁడు అను పదమే 'కలగుండు'గా రూపాంతరము జెందినదనియు నావుడు మొదలగు వానిలో ననుస్వారము గలదనుటకిది జ్ఞాపకమనియు నొక వాదము గలదు. ఇవి సరికాదు. కలగుఁడు మొదలగు శబ్దముల తుది 'డు' ధాత్వర్థకము. ఇది ప్రాచీన కృతులలోనే పెచ్చుగాఁగానవచ్చును. నావుడు, అనవుడు మొదలగు శబ్దముల తుది 'డు' అనంతర్యార్థకము. ఒకటి కళ. వేఱొకటి ద్రుతాంతము. ఈ రెండింటను గూడ నరసున్న లేదు. .."

11. చూ. బసవపురాణము (1926 వే. ప్ర.) పీఠిక పు. 108 - 111 (అర్ధాను స్వారములు.) అనవుడు, నావుడు మొదలగు శబ్దములందనుస్వారము కానవచ్చును. కాని పెక్కు ప్రతులను స్వారము లేకుండఁగూడ నున్నవిగదా! ఆ శబ్దములలో సున్న యుంచి వ్రాసిన ప్రతులకంటె, ఉండకుండ వ్రాసిన ప్రతులే యెక్కువని నేను నిరూపించగలను. (ఈ పట్టున మార్జినల్ నోట్సులో మరికొన్ని ప్రయోగము లివి గుర్తించి వ్రాసి యున్నారు )

క. ఆఁకరముఁతోఁద నప్పెను
మూఁకలపై కుతికి కఠిన ముష్టినిహతులన్
మాఁకులను శిలలఁబీనుఁగు
ప్రోఁకలు గావించి రపుడు పౌడవడఁగ వడిన్.

రా.యు కాం.

మూపు - అరసున్న లేదు రంగనాథ రామాయణము. తాచు - అరసున్న లేదు. "తాచిన (దోనబిట్టొడిసి తత్పదయుగ్మము - పీచి - వైచె; హరి. పూర్వ భాగము 7-85, మరియు; పూచిన, ఏచిన, తాచువనదేవతల చరణా చలితములైన యందియల మ్రోఁత యనన్" నృసింహ పురాణము 2 ఆ॥ 70 ప.)

12. చూ. బసవ పురాణము. (1926 - వే. ప్ర.) పీఠిక - పు. 105-107 (ప్రథమాదుల మీఁద గసడదవా దేశము); (చూ. పు. 46 మొదటకాలం రెండవ పేరాలో పాదసూచిక సంఖ్య 12 విడువబడినది)

"ప్రాఁత వ్రాఁతలలోఁ దఱచుగా నీ యాదేశము కానవచ్చునుగాని యదిలేని వ్రాఁతలును కొన్ని గలవు. ప్రాస స్థలముల, జూచి వీనిని నిర్ణయింపనగును ప్రాచీన తర శాసనములరీతి ననుసరించి తొలుత నీయాదేశము నీ గ్రంథమున (బూన్కితోఁ బాటింపఁదలఁచితిని గాని, భారతాది ప్రయోగముల ద్వైవిధ్యమును, దాళపత్ర గ్రంథము లంతగా నీ నియమమును బహుకాలమున నుండియే పాటింపకుండుటను, గొన్నియెడల వర్ణక్లేశమును గల్గించుటను, అచ్చులో నపూర్వమయిన మార్పగుటచే నెంత జాగ్రత్తగాఁ జూచినను గన్ను వంచించి కొన్ని పట్టులు గానరాకుండుటను, బర్యాలోచించి యాపూన్కి విడిచి నేనును బహుళముగానే యీ యాదేశము నిందుఁబాటించితిని."

ఈ పట్టున మార్జినల్ నోట్సులో ఇట్లు కలదు. (ప్రథమ మీఁది గసడదవ గూర్చి - కవి చింతామణి చూ. వికటశ్రుతి లేని చోట్ల ఉండునన్నాడు.)

13. చూ. డా॥ వేటూరి-శంకరశాస్త్రి గారితో ముఖాముఖి-పాదసూచిక సం॥ 9.

14. "మహానుభావులైన వారిని నేను సందర్శించినాను. వారి దృష్టి నామీద పడ్డది. వారితో నేను మాట్లాడినాను. వారిని నేను స్పృశించినాను .. వారికి నేను ఉత్తరాలు వ్రాసినాను. వారు ప్రత్యుత్తరాలిచ్చినారు. నేను వ్రాసినవి వారు చదివినారు. బాగున్న వంటూ వాటిలో భాషా ప్రమాదాలు ఎత్తిచూపి అటువంటి ప్రయోగాలు పూర్వ కవులవి

చూపుతారా అని మర్యాదగా ప్రశ్నించినారు. నాయందు కూడా వారికి కొంత ఆదర ముండేది.. " (చూ 'రామమూర్తి పంతులు-నోరి నరసింహశాస్త్రి గారి వ్యాసం. ప్రతిభ సం॥ 4. గి.రా. స్మారక సంపుటి పు. 215.)

15. "పట్టుదల విషయములో ఇద్దరూ సమానతీవ్రత గలవారే చూ. పాద సూచిక సం॥ 2.

16. "బసవపురాణ పీఠిక యందు పై ప్రాసమును సోమనాథుఁడు ప్రయోగించె ననుటకు సాధనములలో నొకదానినిగాఁ బూర్వోదాహృత ద్విపద (జగతి పద్మపురాణ సంహితలందె - సఁగె శంభురాఘవ సంవాదమునను)ను జూపితిని. అప్పటికి నాకది సందేహమును గొల్పుచునే యుండెను. తర్వాత భారతమునుఁ బరిశీలించుటలో నీ క్రింది ప్రయోగములు దొరకినవి.

క॥ బిగువెడలక నిలిచిపడున్
నగమయి వేతసచయంబు న్రమంబై పె
ల్లగు మా వేగము గడపి యె
సఁగు పూర్వస్థితిన బ్రదుకు సమకూరంగన్.
భా. శాంతి. 3 ఆ॥ 89ప.

క॥ తగు నా కురువృద్ధునకు నొ
సఁగె నాటికి దివ్యదృష్టి సాత్యవతేయుం
డగణిత తమః ప్రభావం
బు గని యధిక విస్మయంబు బొందగ జనముల్
భా. ఆశ్రమ. 2 ఆ॥ 121 ప.

తిక్కన గూడనిట్లు 'ఎసగు'ను, దాని వంటిదేయగు 'ఒసగు'నుఁ సార్థబిందుక నిర్బిందుక ప్రాసమునఁ బ్రయోగించుట నాకు మఱింత వింతను గొల్పినది. ప్రాచీన తాళ పత్రములలోఁ బెక్కింట నీ పదములు సబిందుకములుగనే యుండుట గమనించి తిని. కాని నేను శాసన పద్యములు సేకరించుచు శాసన బింబములఁ జూచునపుడీ శబ్దము లరసున్న లేనివిగనే పెక్కుచోట్ల నగపడెను. అట్లు నిర్బిందుకముగా పై శబ్ద ములఁ జూపు శాసనములఁ గొన్నింటి నొసగుదును చూడుము." అని వారు (శ్రీ ప్రభాకర శాస్త్రి గారు) వ్రాసియుంచుకొన్న పద్య శాసనములఁ గొన్నింటిఁజూపిరి

చూ. ఎసగు - ఒసగు - వ్యాసం. తిరుమల రామచంద్ర యువ సంవత్సర (881 - 884) భారతి.

17. పండితారాధ్య చరిత్రము, చరిత్రమే యేమి, సోమనాథుని గ్రంథములెల్లను భాషాచ్ఛందో వ్యాకరణాది రీతులందు వింత తీరులు గలవి బసవపురాణ ప్రకటనమునకుఁ బూర్వమువర్తమానాంధ్ర పండితులెవ్వరుగాని వాని నంతగాఁ బరిశీలించి యెఱుఁగరు. శబ్దరత్నాకరకారులు సోమనాథుని గ్రంథములఁ-బరిశీలించిన లేదు. [illegible]

తత్ప్రయోగములనే వారు గయికొనిరి. బ్రౌణ్యమున సోమనాథ ద్విపద లన్యదీయ ములుగా నుదాహరింపఁబడినవి.

1910 నుండి 1914 దాఁక నే నదేపనిగా ప్రాచ్యలిఖితపుస్తక శాలలోని యము ద్రిత గ్రంథములనెల్లఁ జదువుట, పరిశీలించుట, విశేష విషయములనెత్తి వ్రాసి యుంచు కొనుట, మొదలగు కార్యముల జరపుచుంటిని. 1914 సంవత్సరమున నేను పండితా రాధ్య చరిత్రమున విశేష విషయముల గుర్తించి నోటు బుక్కులో వ్రాసికొనుచుఁ జదువుచు నుండగా భయంకరమయిన వ్యాధికిఁ బాల్పడితిని. 1916లో నా జబ్బు కుదిరినవి. జబ్బు కుదురఁగానే మరల పాల్కురికి సోమనాథుని గ్రంథముల పరిశీలనశేషము ముగించితిని. 1914 సం॥ నాఁడు వ్రాసిన యా నోటుబుక్కులు నేఁడు నా దగ్గఱ నున్నవి. మద్రాసులో శ్రీ. తం. తేవప్పెరుమాళ్ళయ్య గారు నాకు మిత్రులు. వారికి సోమనాథుని గ్రంథముల యోగ్యతా విశేషము లెఱిఁగించి ఆనంద ముద్రణాలయము వారిచేఁ బ్రకటింపఁ జేయఁగోరితిని. శైవ గ్రంథములను మా సెట్టిగారు ప్రకటింప నంగీకరింపరని వారనిరి. "అభిమాన కర్తె" అన్న సోమనాథుని ప్రయోగమును దెలుపఁగా తేవప్పెరుమాళ్ళయ్య గారు "ఇది సర్వాంధ్ర కవిప్రయోగ విరుద్ధముగా నున్నదే" యనిరి. కోపగాఁడు, కోపగత్తెయన్న శ్రీనాథుని ప్రయోగములే తదనుసారులు గదా యంటిని. అటుపైఁ గొన్నాళ్ళకు మిత్రులు శ్రీ కె. వి. లక్ష్మణరావుగారును నేనును ప్రోత్సహింపఁగా శ్రీ నాగేశ్వరరావు గారు బసవపురాణ ప్రకటనమున కంగీకరించిరి....

బసవపురాణము ప్రకటితమయిన పిదపఁ గొన్నాళ్ళకు శ్రీ నాగేశ్వరరావు గారు పండితారాధ్య చరిత్రముఁ గూడఁ బ్రకటింపఁ దలపోసి దీనిని గూడ మీరు పరిష్కరించి యిత్తురా యని నన్ను హెచ్చరించిరి. బసవపురాణ పరిష్కరణాది కార్యములఁబట్టి నేను బిట్టు సంక్షోభము పాలయితిని. క్షమింపుఁడు. నేఁడు నా మనః ప్రవృత్తి వాఙ్మయ విషయ పరిశీలనమునఁ జాల విముఖముగా నున్నది. బసవపురాణ పీఠికపై నాక్షేపము లెన్నో వెలసియున్నను వానికి నేను జెప్పఁదగిన సమాధానములున్ననుఁ గూడ నేఁజెప్ప నుత్సహింపఁ జాలకున్నాను. శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు దాని సరిగా సంస్కరించి ప్రకటింప సమర్థులు. మీరిష్టపడుదురేని వారిని గోరవచ్చునంటిని. వా రెంతో సంతోషించిరి. తొలి పుస్తకమును నేను పరిష్కరించితిని గాన దీని నాతోఁ జెప్పక యితరులచేఁ బరిష్కరింపించుట బాగు కాదన్న తలఁపుతోనేని శ్రీ నాగేశ్వరరావు గారు నాతో నట్లు ముచ్చటించి యుండవచ్చును. శ్రీ రామమూర్తి పంతులు గారు శ్రీ నాగేశ్వరరావు గారి కోరికపై పండితారాధ్య చరిత్ర పరిష్కరణమున కనుమతించిరి. శ్రీ రామమూర్తి పంతులు గారి తూలంకష ప్రజ్ఞా ప్రయోగ మీ పరిష్కరణమునఁ గాననగునని పండితారాధ్య చరిత్రము ప్రశస్తరముగాఁ బ్రకటితముగాఁ గలదని పరితోషించితిని.

పెక్కేండ్లు గడచినవి. అప్పుడు పండితారాధ్య చరిత్ర పరిష్కరణాది కార్యమును డాక్టరు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు జరపుచున్నారని వింటిని. అయినను నందుఁ దద్గురువర్యులగు శ్రీ రామమూర్తి పంతులుగారి యుపరిపరిశీలన ముండుననియే విశ్వసించితిని. గ్రంథ మీ నడుమ ప్రకటితమయినది.

బసవపురాణ పీఠికలో నేనెంతో కష్టపడి యిదమిత్థమని నిర్ణయించుకొని సూత్రప్రాయముగా వెల్లడించిన సిద్ధాంతముల నెన్నిటినో శ్రీ నారాయణరావుగారు ఉపోద్ఘాతమునఁ బూర్వపక్షముచేసిరి. నేను వ్రాసినదానిని సరిగా వారు పర్యాలోచించినట్లు తోపదయ్యెను. శ్రీ రామమూర్తి పంతులుగారి యుపరిపరిశీలనమున్నచో నాయా విషయములట్లట్లు విపరీతస్థితిని బొరసియుండకపోవు ననుకొంటిని. కాని పీఠికలో నారాయణరావుగారిట్లు వ్రాసిరి. "శ్రీ రామమూర్తి పంతులుగారు (పెక్కు ప్రతులు) దగ్గఱ పెట్టుకొని తమ కుమారులు శ్రీ వేంకటసీతాపతి గారి సహాయముతో వివిధ పాఠముల గుర్తిస్తూ ఉండిరి. 1932సం॥ ఎండకాలపు సెలవులలో నేను పర్లాకిమిడి పోయినప్పుడు శ్రీ రామమూర్తి పంతులుగారితో ఒక నెల్లాళ్ళుండడము తటస్థించినది. అప్పుడు మేము ముగ్గురమున్ను కలిసి వాద ప్రకరణములో కొంత సరిచూచినాము. నేనింటికి రావలసిన తొందర కలగడముచేతను, మా గురువు గారికి నామీద నమ్మకముండడము చేతను పండితారాధ్య చరిత్రమును పరిష్కరించి అచ్చుకు సిద్ధము చేసేభారము నామీఁదవేసి తామప్పటికి చేసిన కృషికి ఫలితముగా తేలిన సమస్త సామగ్రిని తమవద్ద నుండిన వ్రాఁతప్రతులను నాకిచ్చివేసిరి.............నేను సరిచేసిన మహిమ పర్వత ప్రకరణములను ఈ లోగా శ్రీ రామమూర్తి పంతులుగారు చూస్తే బాగుంటుందని వారికి పంపినాను." దీనిఁబట్టి వాదప్రకరణమునఁ గొంతభాగమున శ్రీ రామమూర్తిపంతులుగారి సమ్యక్పరిశీలనమునను దక్కిన భాగముల వారు సేకరించిన సాధన సామగ్రితో శ్రీ నారాయణరావుగారి పరిశీలనమునను బరిష్కృత మైనట్లు స్పష్టపడినది తక్కిన గ్రంథభాగముల కేమిగాని వాదప్రకరణమునఁ గొంతయేని ససిగా శ్రీ రామమూర్తి పంతులుగారి పరిష్కరణముఁ బడసినదిగాన చక్కగా నుండునన్న కుతూహలముతో దానిఁదెఱచితిని. దాని తీరును జూడఁగా నందు శ్రీ రామమూర్తిగారి ప్రతిభాప్రయోగమున్నదన్న పీఠికావాక్యము విశ్వాస్యముగాఁదోపదయ్యెను. శ్రీ రామమూర్తిగారి వైదుష్యము నెఱిఁగినవా రీవాదప్రకరణమును జదువుదురేని నా మాట నిజమనఁగలరు. ఇది నిజమని నిరూపింపఁదగ్గపట్టులఁగొన్నింటిని నిక్కడ చూపుచున్నాడను ........ ...

స్థూలదృష్టిని జూడఁగా నీ వాదప్రకరణమున నిన్నియసందర్భములుగాన వచ్చినవి. తక్కిన ప్రకరణములలో నసందర్భములు త్రవ్వితండములు. వాద ప్రకరణమును శ్రీ రామమూర్తి పంతులుగారు పరిష్కరించిరనుట నే విశ్వసింపఁ జాలను. వారి వైదుష్యమున కప్రథ కలుగకుండుఁ గాక! ("పండితారాధ్య

చరిత్రము." వే. ప్ర. వ్యాసము-శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ సంచిక)

[ప్రభాకర పరిశోధక మండలివారి మణిమంజరి 1982 ఫిబ్రవరి సంచికలో ఈ వ్యాసం "గిడుగువారి లేఖలు" అనే శీర్షికతో అచ్చయింది]

# గిడుగు రామమూర్తిగారి మరో రెండు లేఖలు

లేఖ : ఒకటి

రాజమహేంద్రవరం
20-3-39

మహాశయా !

మీరు దయతో వ్రాసిన ఉత్తరమున్ను ఆంధ్రకౌముదిలోని పదాలున్ను అందినవి. మీరు నాకోసము పడ్డశ్రమకు అనేక వందనములు.

మీరు Italian of the East ను గు॥ అడిగిన భోగట్టా కోసము వెదుకుతుండడమువల్ల వెంటనే జవాబు వ్రాయలేదు. క్షమించవలెను.

1. ఆంధ్రకౌముది అచ్చుపుటలో 24వ పుటలోని పద్యాలు మీరు వ్రాసిపంపినారు నాకు కలిగిన సందేహములు ఆ పద్యాలలోనివి కావు. 23వ పుటలోని పద్యాలలో అపపాఠములున్నట్టు తోచినది. ఆ పద్యాలు వేరే కాగితముమీద వ్రాసి [బిడా] యించినాను.

ఆశీరర్థక రూపములలో ఎడ-మ అని భారతాది ప్రాచీన గ్రంథముల వ్రాత ప్రతులలో ఉన్నది. చిన్నయసూరి ఎడు-(మ్మ) అని బాలవ్యాకరణములో అనుశాసించినాడు. దానిప్రకారము అచ్చులో పరిష్కర్తలు భారతములోని పాఠాలుకూడా దిద్దిపాడు చేసినారు. కేతన రచించిన ఆంధ్రభాషాభూషణములో —

దీవన కెడమయుఁ గాతయుఁ
గావుతయును దెనుఁగుఁ గవుల కబ్బంబులలో
శ్రీ వెలిఁగెడమ ధిపుఁడు మే
ల్గావించుఁగాత మేలుగావుత యనగన్.

వావిళ్ళవారు అచ్చువేసిన పుస్తకములో —

దీవెనలగునెడఁ గాతయుఁ
గావుతయున్ .... ...
శ్రీ వెలిఁగెడు నధిపుఁడు etc. అని మారినది.

శాసనములలోకూడా ఎడ-మ అని దకార అకారములుగల రూపము కనబడు తున్నది.

ఆంధ్ర కౌముది వ్రాత ప్రతిలో :

"యయ్యెద" అని మొదటి పంక్తిలోను, "లాయెడనా" అని మూడవ పంక్తిలోను ఉంటుందేమో అని తలచి శ్రీ అప్పారావు పం॥ గారితో ఆ విషయము చెప్పినాను.

మీరు మరి ఒకమారు వ్రాతప్రతి చూడవలెను. అచ్చు పుస్తకములో 23వ పుటలో ఉంటుంది. మీరు సరిచూడవలసిన వాక్యము; 24వ పుటలో లేదు.

2. చాలా కాలము క్రిందట ఏదో పత్రికలో చూచి ఉన్నాను. కొందరు యూరోపియను బాటసారులు తెలుగుదేశమందు సంచరిస్తూ స్త్రీలు చెరువుగట్టుమీదను, పొలాలలోను మాట్లాడడము విని వారి భాష శ్రావ్యముగా ఉన్నదనిన్ని, (ఇటాలియన్‌వలె) పాటలుగూడా మనోహరముగా ఉంటవనిన్ని మెచ్చుకొన్నారట. ఈ మెప్పు గ్రాంధికాంధ్రమునకు చెందదు. పాశ్చాత్యులుగదా ఈలాగున మెచ్చుకొన్నది. వారి చెవినిబడ్డ భాషను మెచ్చుకొన్నారుగాని పుస్తకాలలో వ్రాసినదానినిగాదు.

ఈమారు చెన్నపట్నం వెళ్లినప్పుడు అక్కడి లైబ్రరీలోని పుస్తకాలలో ఈ విషయమున్నదేమో చూస్తాను.

చిత్తగించవలెను
ఇట్లు
సే॥ గి॥ వెం. రామమూర్తి

లేఖ : రెండు

రాజమహేంద్రవరం
11-7-39

మహారాజశ్రీ కుందుర్తి ఈశ్వరదత్తుపంతులుగారి సన్నిధికి -

సే॥ గిడుగు వెంకట రామమూర్తి అనేక నమస్కారములుచేసి చేయంగల వి॥

మీరు దయతో వ్రాసిన జాబుకు వెంటనే జవాబు వ్రాయకపోవుటకు కారణము అస్వస్థత అని మనవిచేస్తున్నాను. విలంబము క్షమిస్తారని నమ్ముతాను.

శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతములో వేలకొలదిగా ఉన్నవి తప్పులు. ఒక సభలో శాస్త్రిగారి యెదుటనే కొన్ని చూపించినాను. అయితే ఆయన రెండేళ్ళ క్రిందట రచించిన ఒక వ్యాసము (చెళ్ళపిళ్ల చెరలాటము)తో "నాభారతములో పెక్కు స్థలముల తప్పులుపడియున్నవి, నేనిప్పుడు 'శ్రీకృష్ణ భారత భావార్థ దీపిక' అనునొక గ్రంథము వ్రాసి ముద్రాభ్రంశములు, ప్రమాదములు, అజ్ఞానజములు లోనగునవియేకాక భావార్థములంగూడ సువ్యక్తమునగునట్లు చేయుచున్నాను." అని ప్రకటించినారు. శ్రీ వెంకటశాస్త్రిగారు వారి శబ్దాలు కొన్ని "తప్పులు" అని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారిని నిందించినప్పుడు శ్రీకృష్ణ భారతములో అట్టివి ఉన్నవని వెంకటశాస్త్రిగారు సమాధానము చెప్పితే

'అవి తప్పులే', అలాంటి తప్పులే వెంకటశాస్త్రిగారు ప్రయోగించినవిన్నీ,' అని వాదించి నాను. గనుక ఆ భావార్థదీపిక కవిసార్వభౌములు ప్రకటించిన పిమ్మటనే నా వ్యాసము ప్రకటించవలెను. అది మీరే అచ్చువేయింతురుగాని.

మీరూ పిల్లలూ క్షేమంగా ఉన్నారని ఆశంస.

చిత్తగించవలెను.
సే॥ గి॥ వేం. రామమూర్తి.

[వివరణ : ఈ రెండుత్తరాలూ రామమూర్తిగారి జీవితంలో చివరి ఏడాదివి. సాధారణంగా.రామమూర్తిగారు ఉత్తరాల్లో ఎవరికి రాస్తున్న స్పష్టంగా పేర్కొంటారు. కాని ఈ మొదటి ఉత్తరంలో ఆ విషయం చెప్పలేదు. ఎవరికి రాసిందీ ఇప్పటికితెలియదు.

మొదటి ఉత్తరంలో ప్రాచీన భాషలో ఆశీరర్థక స్వరూపం ఎట్లా ఉండేది అనే విషయం చర్చించారు. 'అయ్యెడమని' అని ఉండేదనీ, చిన్నయసూరి 'అయ్యెడుమని' అనే విధంగా ఉండాలని శాసించటంవల్ల పండితులు పాత పుస్తకాలు అచ్చువేసేటప్పుడు దిద్ది భాషను చెడగొట్టారని రామమూర్తిగారు వాపోయారు.

Italian of the East అనే వ్యాఖ్య విన్నభాషను గురించి చేసిందేకాని చదివిన భాషనుగురించి చేసిందికాదనే విషయం నిరూపించే పద్ధతిలో రామమూర్తిగారి తార్కిక శక్తి కనిపిస్తుంది.

రెండో ఉత్తరం కుందూరి ఈశ్వరదత్తుగారనే ప్రఖ్యాత శాసన పరిశోధకులకు రాసింది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి భారతంలో గ్రాంధికాంధ్ర భాషలో ఇమడని తప్పుల్ని ఏరిపెట్టుకున్నట్టున్నారు రామమూర్తిగారు. రాసిన వెంటనే గబగబా అచ్చు కివ్వకుండా అవతలివారు తప్పులని ఒప్పుకుంటే వాటినివదిలేసి మిగతావాటినే చూపిద్దా మని రామమూర్తిగారి ఉద్దేశం. రామమూర్తికి వ్యక్తులుగా పండితులతో శత్రుత్వంలేదు' భాషాదృష్టి వైరుధ్యం మాత్రమే.

ఈ ఉత్తరాల్లో గుర్తించదగిన సంప్రదాయ విశేషాలు కొన్ని ఉన్నాయి. బ్రాహ్మల్లో నియోగులలో ఉత్తరాలు రాసుకునేటప్పుడు 'మహారాజశ్రీ' అనే విశేషణం పేరు ముందుకు తగిలిస్తారు.

వి॥ అనేది విన్నపాలు అనేదానికి, సే॥ అంటే సేవకుడు అనేదానికి, గు॥ అంటే గురించి అనేదానికి సంగ్రహరూపాలు. ॥ అనే రెండు గీతలు సంక్షేపానికి రాతలో ఉపయోగించే గుర్తు. ఉత్తరాల్లో అవతలివారికి ఆధిక్యమిస్తూ తమను తాము తక్కువ జేసుకొనే సంప్రదాయం ఒకటి ఉంది.

సే॥ అనే విధంగా రాసింది అందుకు గుర్తు. ఇంకా ఇతర శబ్దాల్లోకూడా ఈ ధోరణిని గుర్తుపట్టవచ్చు.

మొదటి ఉత్తరంలో ఒకచోట బ్రాకెట్లలో ఉంచిన భాగం అనుమానాస్పదంగా ఉంది. చదవటంలో పొరపడ్డానేమోనని బ్రాకెట్లలో ఉంచాను. సం.]

# తెలుగు కావ్య భాషమీద గిడుగురామమూర్తి ప్రభావం

శ్రీ శ్రీ

తెలుగు కవిత్వం సుమారు వెయ్యి సంవత్సరాలబాటు నాలుగు చక్రాల రథాల్లాంటి వ్యక్తులతో, సంస్కృతపదభూయిష్ఠమైన భాషతో సాగుతూ వచ్చింది. ఈ శతాబ్దారంభంలో గిడుగు రామమూర్తి వ్యావహారిక భాషావాదం లేవనెత్తడంతో తెలుగు కావ్యభాషాస్వరూపం మారిపోయింది.

అయితే ఈ మార్పు హఠాత్తుగానూ రాలేదు, గిడుగువారు ఆజ్ఞాపించడంవల్లనూ రాలేదు. పైగా ఆయనే "కవులు నిరంకుశులు. ఫలానా విధంగా రాయమనటానికి నేనెవణ్ణి" అనేటట్లు మాట్లాడేవారు. కాని వారి భాషా సిద్ధాంతాల ప్రభావం మొదట వచనం మీదనూ, తర్వాత కవనం మీదనూ చెరగని ముద్రవేసింది.

నా చిన్నతనంలో సెట్టిమాష్టారి "నూటాపదార్లు" అనే శార్దూల మాలిక (116 పాదాల) చదివాను. ఇదిప్పుడెక్కడైనా దొరుకుతుందో లేదో తెలియదు. నాకు జ్ఞాపకం ఉన్నంతవరకూ——

పస్తాయించి వినండి....

...................... కే

వాస్తే యిస్తరఫ్ ఇస్లియే మగరు మా

ఫక్ ఖేష్ చమక్కించు హిం

దూస్తానీ పదసంచయంబె కృతులన్

దూరుస్తురో లేక" నో

యెస్తేంక్స్; మిస్టరు, మైడియర్, మొదలుగా

ఇంగ్లీషు శబ్దాలనే

వేస్తారో తమ చిత్తమండి. ..... ..

. ..................... ....

ఖుస్తీ మీద సవాల్...

వంటిపాదాలతో స్వసంస్కృత వృత్తాలతో వాడుక భాషను ప్రవేశపెట్టే ప్రయత్నం

జరిగింది. ఇది వ్యర్థ ప్రయత్నమని వేరే చెప్పనక్కరలేదు. అసలా మారిక ప్రారంభమే

విస్తారంబగు ప్రజ్ఞ గల్గిన మహా
విద్వాంసులారా!

అని గ్రాంధికాన్ని ఆశ్రయించింది.

తన చివరిరోజుల్లో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ప్రతి ఆదివారం ఆంధ్ర పత్రికలో చక్కని వ్యావహారికాంధ్రంలో వచనం రాశారేగాని కవిత్వం మాత్రం గ్రాంధికంలోనే సాగించారు. అన్యదేశ్యాలను (ఇంగ్లీషు మాటలతో సహా) ధారాళంగానే వాడుకున్నారు.

ఉదా : మంజువాణీప్రెస్సు
మానేజరౌక సాక్షి

ఇత్యాదులు.

తెలుగు కావ్యభాషకు 1920లో గ్రాంధిక శృంఖలావిమోచనం జరిగింది. కొత్తపాతల మేలు కలయికతో గురజాడ ముత్యాలసరాలు గుచ్చిన సంవత్సరం అది. అప్పుడే వ్యాడలిజానికి నడుం విరిగింది. రాజరికపు సేవలోఉన్నప్పటికీ ఈ యదార్థం గురజాడకి తెలియనిది కాదు. తనది ప్రజల ఉద్యమమని స్పష్టంగా తానే చెప్పుకున్నాడు.

గురజాడ రాసిన కవిత్వమంతా వాడుక భాషకాదు. పైగా 'ముదుసలి మొగుడుకు ముడివేసిరి' లాంటి అటు గ్రాంధికమూ ఇటు వ్యావహారికమూకాని ప్రయోగాలు చిరాకు పుట్టిస్తాయి. అయినా గురజాడ మార్గదర్శి. దేశిచ్ఛందస్సులను వాహనంగా తీసుకుంటేనే వాడుకభాషకి కావ్యజగత్తులో ప్రవేశం ఉంటుందని తొలిసారిగా ప్రకటించినవాడు. (ఆ తర్వాత వచన గీతం వచ్చి, ఛందస్సుల అవసరాన్ని తొలగించి వేసింది.)

తమిళంలో సుబ్రహ్మణ్య భారతి గ్రాంధిక కుబుసాన్ని వదుల్చుకోలేక పోయాడు. అతని స్వాతంత్రేచ్ఛ, జాతీయ భావాలూ అతణ్ణి మహాకవిని చేశాయి. (ఇక్కడో విషయం చెప్పాలి. వాడుకభాషలో రాస్తేనే తప్ప గొప్ప కవిత్వం కాదని నేనెప్పుడూ అనలేను. మాటవరసకు టాగూరునే తీసుకుందాం. అతను వాడుకభాషలోనే కవిత్వం రాశాడంటారు. అది నాకు కవిత్వం అనిపించదు. ఇదే కవిత్వమని అనుకునే వాళ్ళనుకుందురుగాక)

వెయ్యి సంవత్సరాల తెలుగు కవిత్వాన్ని ఒక పెద్దఊపు ఊపినవాడు గురజాడే అయినా భావకవుల ధర్మమా అని గ్రాంధికమే కావ్యభాషగా ఊరేగుతూ వచ్చింది. భావకవులలో చాలామంది సాహితీ సమితి సభ్యులు. వారందరికీ గిడుగువారే ఆరాధ్య దైవం. అయినా వాళ్ళు వచనంలో వ్యావహారికం వాడి కవిత్వం దగ్గరకి వచ్చేసరికి గ్రాంధికాన్ని వదులుకోలేక పోయారు. ఇందుకు మినహాయింపుగా నిలుస్తాడు చింతా

దీక్షితులు. కొద్దిగానే రాసినా తన కవిత్వానికి వాడుక భాషనే స్వీకరించాడు. మరో మినహాయింపు నండూరి. అతని యెంకిపాటలు వ్యావహారికంలోనే కాదు పాటకపు జనుల నిత్యవ్యవహారంలోని భాషలో రాసినవి.

ముమ్ముందు శుద్ధ గ్రాంధిక వాదిగా మారిపోయిన విశ్వనాథ సత్యనారాయణ కూడా ఆ రోజుల్లో

లేత బుర్రలు కొక్కిరిస్తే
ఆతగాళ్ళతో యేమిగానీ

అంటూ వ్యావహారిక భాషలో ముత్యాలసరాలు రాశాడు. కిన్నెరసాని పాటలు సరేసరి. "శేఖరంగా ఉన్నా"యన్నాడు కొంపెల్ల జనార్దనరావు నాతో. గ్రాంధికంలో పిరమిడ్ల లాంటి పద్యాలు రాస్తున్నాడని వేలూరి శివరామశాస్త్రి చేత అనిపించుకున్న కొంపెల్ల చివరి రోజుల్లో "పడగెత్తిపాడుకొంటాను" లాంటి వ్యావహారిక రచనలు చేశాడు. అందుకు నా మహాప్రస్థానం గీతాలు కొంత కారణమనుకుంటాను. "నేను సైతం ప్రపంచాగ్నికి" అనే గీతం మొదటి సారిగా అతని 'ఉదయిని' లోనే అచ్చయింది.

మరి మహాప్రస్థానం గీతాలకు కారణం ఎవరంటే భాషకు సంబంధించినంత వరకు గిడుగు వారే అంటాను. మహాప్రస్థానం పూర్తిగా వాడుక భాషలో సాగిన రచన.

కాని, తెలుగులో కావ్యభాష గ్రాంధికం నుంచి వ్యావహారికానికి మారడం సులువుగా జరిగిన పనికాదు. 1910లోనే గురజాడ ముత్యాలసరాలు రాసినా, ఆ తర్వాత చింతాదీక్షితులు, బసవరాజు అప్పారావు, కవి కొండల వెంకటరావు, అడవి బాపిరాజు మొదలైన వారు ఎన్నెన్నో కావ్యఖండికలు వాడుక భాషలో రాసినా వ్యావహారికం వచన రచనలో సాధించినంత విజయం కావ్య రచనలో సాధించలేదు. యెంకి పాటల గాలి మమారం చెలరేగుతున్న రోజుల్లో యెంకిని "వెంకి"గా మార్చే ప్రయత్నం జరిగింది.

"యెనక జల్మములోన
యెవరమోనంటి"

అనే గేయాన్ని

"వెనుకటి జన్మమందునను
ప్రేయసి యెవ్వరమౌదు నంటెమో
యనగను"

అంటూ గ్రాంధికీకరణ ప్రయత్నం జరిగింది.

1920లో ప్రారంభమైన మూడవ దశాబ్దం భావ కవులదని చెప్పవచ్చును అప్పటికి రాయప్రోలు, అబ్బూరి కవుల చేతి నుంచి భావకవిత్వం (ఆ వ్యవహారం నా చేతి నుంచి పోలిసెట్టి లాగేశాడని రామప్పంతులన్నట్టు) కృష్ణశాస్త్రి మొదలైన వారి చేతిలోనికి పోయింది. భావకవి సమ్రాట్టునని బసవరాజు అప్పారాజు చెప్ప

కున్నప్పటికీ ఆ సామ్రాజ్యం సాహితీ సమితిదే అనే అభిప్రాయం ఆ రోజుల్లో ప్రాబల్యం వహించింది. కవిత్వం గ్రాంథిక భాషలోనే ఉండాలనేది భావ కవులలో అధిక సంఖ్యాకుల అవగాహన. సాహితీ సమితి నాయకత్వం అడవి బాపిరాజును ద్వితీయ శ్రేణి కవిగా పరిగణించింది. చింతాదీక్షితులును కవిగా కంటె కథకునిగా ఎక్కువ గౌరవించింది. భావకవులు మాత్రాచ్ఛందస్సులలో కూడా గ్రాంధికాన్నే ఉపయోగించారు.

ఉదా:- కాలమే పసిపాప
కను విచ్చినయుషస్సు

ఈ వ్యాసంగమంతా గిరాంమూర్తి కళ్ళ యెదుటే సాగింది.

కాని 1930 తర్వాత నుంచీ వ్యావహారికం కావ్యభాషగా స్థిరపడింది. భావకవిత్వం తెరమరుగై అభ్యుదయ కవిత్వం రంగప్రవేశం చేసింది. అదే సమయంలో విశ్వనాథవంటివారు వీరగ్రాంధిక వాదులుగా మారిపోవడంకూడా జరిగింది. యాక్షన్‌తో బాటేకదా రియాక్షన్! విశ్వనాథ వారెంత రియాక్షనరీ అయిపోయారంటే 'జయంతి' పత్రికకు సంపాదకీయం ('అధునా' అనే శీర్షికతో ) వాడుకభాషలో రాసిన చేతితోనే తమ నవలల్లోని వచనం కూడా గ్రాంధికభాషలో రాశారు.

అభ్యుదయ కవిత్వం వ్యావహారిక భాషకు అఖండ విజయం సాధించడంతో కవిత్వానికి వాడుకభాష పనికి రాదనే వాదంలో పసలేదని తేలిపోయింది.

ఈనాటి విప్లవకవులు ఇంకాముందుకు వెళ్ళి పాటక జనం భాషలో జానపదపు బాణీలో కవితలు రాస్తున్నారు. చెరబండరాజు, గద్దర్, వంగపండు మొదలగువారి కవితలు వింటే గిరాంమూర్తిగారు ఎంత ఆనందించేవారో!

[ఈ సంపుటికోసం ప్రత్యేకంగా రాసిన ఈ వ్యాసాన్ని శ్రీశ్రీగారు 1982 సెప్టెంబరు నెలలో పంపారు-సం.]

# శాసన పరిశోధకులుగా గిడుగు - గురజాడ

## ఆరుద్ర

గిడుగు వెంకటరామమూర్తిగారి పేరు చెప్పగానే ఆయనను వ్యావహారిక భాషా ప్రవర్తకులుగానే ఇవాళ చాలామంది భావిస్తారు. అలాగే గురజాడ అప్పారావుగారి పేరు చెప్పగానే ఆధునిక ఆంధ్రసాహిత్య జనకులుగా గౌరవిస్తూ ఉంటారు. అయితే గిడుగు, గురజాడ ఆదిలో శాసన పరిశోధకులుగా మన సంస్కృతికి ఎంతో సేవచేశారు. ఆ సేవ గురించి విపులంగా ఇప్పటిదాకా ఎవరూ వివరించినట్టు లేదు. ఇప్పటికైనా మించి పోయినది లేదు. తెలిసినంత మట్టుకు టూకీగా కాకుండా సవిస్తరంగానే మనవి చేస్తాను.

గిడుగూ, గురజాడా బాల్య స్నేహితులు, ప్రాణమిత్రులు. అన్నిటిలోనూ మమేకంగా ఉన్నవాళ్ళు. ఇద్దరూ ఒక ఈడువాళ్ళు. ఒకే సంవత్సరంలో పుట్టారు (1862). పదమూడేళ్ళ ప్రాయంలో కలుసుకొన్నారు (1875)1. ఇద్దరూ ఒక్కసారే మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు (1879)2. ఇద్దరూ బియ్యే ప్యాసయ్యారు, కానీ ఒక్కసారి కాదు. గిడుగువారు అంచెలంచెలుగా ప్యాసవవలసి వచ్చింది.

రామమూర్తిగారి తండ్రిగారు కుమారుని పదమూడో యేటనే చనిపోయారు. తల్లిగారు నగలమ్మి ఎలాగో మెట్రిక్యులేషన్ దాకా చదువు చెప్పించారు. ఈ పరీక్ష ప్యాసయిన మరుసటి సంవత్సరమే రామమూర్తిగారికి పెళ్ళికూడా జరిగింది. కుటుంబ పోషణకోసం ఆయన ఉద్యోగం చూసుకోవలసి వచ్చింది. పర్లాకిమిడి మిడిల్ స్కూల్లో ఉపాధ్యాయుడుగా చేరారు. ఈ మిడిల్ స్కూల్ క్రమేణా హైస్కూలుగా, కాలేజీగా పురోగమించింది. అక్కడ ఉద్యోగం చేస్తూనే రామమూర్తిగారు ఎప్ఫే, బియ్యేలు ప్యాసయ్యారు. బియ్యేలో చెన్న రాజధానికి ఫస్టుక్లాసులో ద్వితీయుడిగా ప్యాసయ్యారు. పర్లాకిమిడి పండుగ చేసుకొంది3.

ఎప్ఫేలోనూ బియ్యేలోనూ చరిత్రను ఐచ్ఛిక విషయంగా ఎంచుకొని అప్పారావుగారు మెట్రిక్యులేషన్ పాసవగానే కాలేజీలో చేరారు. ఎప్ఫేలో ఉత్తీర్ణులయ్యాక అప్పారావుగారు మహారాజావారి కాలేజీలో పదవ లెక్చరర్‌గా ఉద్యోగంలో కుదురుకున్నారు. జీతం పాతికరూపాయలు. 1886లో బియ్యే ప్యాసయ్యాక 1887లో అప్పారావుగారు నాలుగో లెక్చరర్ అయ్యారు. తమ అభిమాన విషయమైన చరిత్రను

అప్పారావుగారు విడిచిపెట్టలేదు. 1889 నుండి చరిత్ర పాఠాలు అదనంగా బోధిస్తూ వచ్చారు. అందుకు వారి జీతంలో అయిదు రూపాయలు ఇంక్రిమెంటు వచ్చింది. హిస్టరీ పాఠాలు చెప్తున్నంత వరకు ఈ పెంపుదల జీతంలో ఉంటుంది[4] గిడుగురామమూర్తిగారు గూడా పర్లాకిమిడిలో చరిత్రపాఠాలను కూడా చెప్తూ ఉండేవారు తర్వాత తర్వాత చరిత్రపాఠాలనే చెప్పేవారు.

మిత్రులిద్దరు కేవలం పాఠ్యపుస్తకాల్లో రాసింది చెప్తూ కూర్చోక చరిత్ర గురించి చాలా చదివారు. సమకాలిక ప్రచురణలు అన్నీ వదిలిపెట్టకుండా చదివి నోట్సు రాసుకునేవారు. 1882లోనే రాబర్టు సూయల్ దొర చెన్న రాజధానిలోని ప్రాచీనవస్తు విశేషాలపై రెండు సంపుటాలు రాశాడు. దీనిని సూయల్ దొరగారి లిస్టులంటారు[5]. ఇవికాక ఇండియన్ ఏంటిక్వరీ సంపుటాల్లో మెడ్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ సంచికలో మిత్రులు కలిసిగాని విడి విడిగాగాని చదివేవారు. కళింగ రాజ్యం చరిత్రగల సీమ. తామున్న ప్రదేశంలోని ప్రాచీనతను పరిశీలించసాగారు. పాత శాసనాలు పఠించసాగారు. వివిధ కాలాలలోని లిపులు చదవాలంటే అధ్యయనం చాలా అవసరం.

గురజాడవారికి ఆనందగజపతి ప్రాపకం ఉన్నట్లే గిడుగువారికి పర్లాకిమిడి జమిందారుల అండఉంది. కుఇంగ జమిందారుగారి తమ్ముడు పద్మనారాయణదేవ్ గారికి ట్యూటరుగానేకాక చాలా దోస్తీ ఉండేది. నారాయణదేవ్‌గారికి మంచి స్వంత గ్రంథాలయంకూడా ఉండేది. అందులోని పుస్తకాలన్నీ రామమూర్తిగారికి కరతలామలకాలే. బర్నెల్ దొరగారు రాసిన "సౌత్ ఇండియన్ పాలియోగ్రఫీ" అనే పుస్తకం హమేషా ఇంట్లో ఉండకపోతే శాసనాలు చదవడం సాధ్యపడదు. తనుకో ప్రతికావాలని రామమూర్తిగారు పద్మనాభ నారాయణదేవ్‌ని అడిగారు. ఆయన వెంటనే ఒక ప్రతిని తెప్పించి ఇచ్చారు. అందులో చెప్పిన లిపులన్నీ రామమూర్తిగారికి కొట్టిన పిండి అనడానికి ఎంతోకాలంపట్టలేదు. ప్రాచీన శాసనాలకోసం గాలించసాగారు.

రామమూర్తిగారి నివాసగ్రామమైన పర్లాకిమిడికి ఇరవై మైళ్ళ దూరంలో వంశధారానది ఎడమ ఒడ్డున ముఖలింగ క్షేత్రముంది. ఇది ప్రాచీన యాత్రాస్థలమే, అయినా ముఖలింగం ప్రసక్తి సూయల్‌దొరగారి లిస్టులలో ఎక్కడాలేదు. ఈ లోపాన్ని చక్కదిద్దడానికి రామమూర్తిగారు 1893 జనవరి 15, 16 తారీఖులలో అంటే భోగీ, పెద్ద పండుగా వెళ్ళాక కనుమూ ముక్కనుములనాడు ముఖలింగానికి వెళ్ళారు. పరిశోధనలు చేశారు. గురజాడ అంతకు ముందుగానే 1892 ఆగస్టునాటికే స్థానిక పురాతత్వ పరిశోధనలో చెప్పుకోదగ్గకృషి చేసి తెలుగుహార్పు పత్రికలో **'an earnest labourer in the field of local archaeology'** అనే కితాబును అందుకొన్నారు. ముఖలింగ క్షేత్ర పరిశోధనకుముందు గిడుగువారు చేసిన పరిశోధనల గురించి ఈ మాత్రం చిట్టి భోగట్టా కూడ దొరకలేదు. 1892లో అప్పారావుగారు పరిశోధిస్తున్నట్టేగాని, ఏం పరిశోధనలు చేశారోకూడా తెలియదు. 1893 జనవరి నుండి గిడుగువారి పరిశోధనల గురించి చాలా

వివరాలే తెలుస్తున్నాయి.

రామమూర్తి గారి ఉద్దేశంలో అధికారంలోఉన్న ఆంగ్లేయ పండితులకంటే చదువు కొన్న హిందువులవల్లనే పురాతత్త్వ పరిశోధనలు ఫలప్రదంగా జరుగుతాయి. హిందువు లైతే ఏ ఆలయం లోనికైనా యథేచ్ఛగా వెళ్ళగలరు. గర్భకోవిల లోనికికూడా వెళ్ళ వచ్చు. (గిడుగువారు గర్భగుడి అనే మాటను వాడలేదు. ముఖలింగం మీద రాసిన వ్యాసంలో గర్భకోవిల అన్న పదాన్నే చాలాసార్లు వాడారు). తామ్ర శాసనాలు ఆచూకీ తీయడానికి స్థానికులతో వ్యవహరించడానికి స్వదేశీయ పండితులకే అవకాశాలు ఎక్కు వగా ఉంటాయి. అందుకే గిడుగువారు తమ పరిశోధనలు అభినివేశంతో చేయగలిగారు.

ముఖలింగంలో మూడు ఆలయాలు ఉన్నాయి. ఒకటి : మధూకేశ్వరాలయం, రెండు : భీమేశ్వరాలయం, మూడు : సోమేశ్వరాలయం. ఈ మూడు గుడుల గురించీ రామమూర్తి గారు కూలంకషంగా తెలుసుకొన్నారు. ముఖలింగక్షేత్రమహాత్మ్యం ప్రతిని ఒకటి సంపాదించారు. ముఖలింగానికి రావడానికిముందు ఈ పుస్తకం చదివి ఉంటే బాగుండుననుకొన్నారు. ఆ క్షేత్రంలో చూడవలసినవన్నీ చూశారు. కలుసుకో వలసిన వాళ్ళను కలుసుకొన్నారు. శాసనాలు చదివారు; రాసుకొన్నారు. ఆయన అక్కడ శాసనాలు చదివేదాకా అవి మానవులు చెక్కించినవే అన్న స్పృహ ఎవరికీలేదు. ఆ శాసనాలన్నీ దేవతలు లిఖించినవే అని స్థానికులు గట్టిగా నమ్మేవారు. నలుగురికీ ఆ సంగతే చెప్తూవచ్చేవారు. రామమూర్తి పంతులుగారు అనర్గళంగా వాటిని చదివేస్తూ ఉంటే అందరూ ఆశ్చర్యచకితులయ్యారు.[6]

ముఖలింగేశ్వర ఆలయంలో పదకొండు శిలాశాసనాలున్నాయి. వాటన్నింటినీ రామమూర్తిగారు రాసుకొన్నారు. శక సంవత్సరాలు నోటుచేసుకొన్నారు. భీమేశ్వరా లయంలో కూడా పదకొండు శాసనాలు ఉన్నాయి వాటినిగూడా రామమూర్తిగారు రాసు కొన్నారు. ఈ రెండు ఆలయాలలో ఇంకా మరెన్నో శాసనాలు ఉన్నాయిగానీ, సున్నం పూతవల్ల అవి మరుగుపడ్డాయి. అందుచేత రామమూర్తిగారు మొత్తం ఇరువై రెండు శాసనాలే ముఖలింగంలో రాసుకోగలిగారు. సోమేశ్వరాలయం ఈ రెండు గుడులకంటే ప్రాచీనమైనది. వెలుతురు చాలక ఈ గుడిలోని శాసనాలు రామమూర్తిగారి దృష్టికి రాలేదు. అయినా మసక వెలుతురులో అక్కడ కూడా శాసనాలు లేకపోలేదని రామ మూర్తిగారు గుర్తించారు.

గుళ్ళలోనేకాక ఊళ్ళోకూడా శాసనాలుగల ప్రదేశం ముఖలింగం. ఒక బుగత గారి పొలంలో ఒక శాసనం కనబడింది. దాన్ని చదువుదామంటే చుట్టూ చేను దట్టంగా ఉంది. చేను కోసేదాకా అది చదవడానికి వీలులేదు. అలాగే ఒక మఠాధికారి ఇంట్లో గడపకింద ఒక రాయిఉంది. దానిమీద నాగరి అక్షరాలు స్పష్టంగా ఉన్నాయి. ఆరాయి అడ్డదిడ్డంగా పాతడంవల్ల ఆ శాసనాన్నికూడా రామమూర్తిగారు చదవలేకపోయారు.

అమరావతిలోలాగే ముఖలింగంలోకూడా ఇటుకలకు కొరతలేదు. ఎవరు ఇల్లు

కట్టుకొందామన్నా ఆవం పెట్టించి ఇటుకలు చేయించుకో అక్కర్లేదు. మూడు అడుగులు పొడుగు రెండు అడుగులు వెడల్పు ఉన్న ఇటుకలు ఎన్నో దొరుకుతాయి. ఒక బ్రాహ్మణుడు నుయ్యి తవ్వించుకొంటే దాని ఇటుకల పనికి శిధిలాల దొరికినవి సరిపోయేవి. రామమూర్తిగారు ముఖలింగం శిధిలాలన్నిటినీ బాగా పరిశీలించారు. ముఖలింగానికి రెండు మైళ్ళ దూరంలో నగరికటకం అనే గ్రామం ఉంది. దానిని కూడా చూసి అక్కడి పురాతత్త్వాన్ని అవగాహన చేసుకొన్నారు.

ముఖలింగానికి నాలుగు మైళ్ళ దూరంలో "తెలిగిపెంట" అనే గ్రామం ఉంది. అక్కడ ఒక శివలింగం ఉందనీ శాసనాలుకూడా ఉన్నాయని విని రామమూర్తిగారు అక్కడకు వెళ్ళారు. శాసనాన్ని చదివారు. అది చోడగంగు ఇచ్చిన దాన శాసనం. శ. సంవత్సరాలు 1067. ఇది అనంతవర్మచోడగంగదేవుని శాసనంకాదని ఎవరో సామంతుని శాసనం అని రామమూర్తిగారు నిశ్చయించుకొన్నారు.

శిలా శాసనాలు చదువుతూ రాసుకొంటూనే తామ్ర శాసనాలకోసం వాకబు చేశారు. పదేళ్ళ కిందట ఒక పొలంలో ఒక రాగిరేకుల గుత్తు దొరికిందట. దానిని పర్లాకిమిడికి డిప్యూటీ తాసిల్దారుగారి దగ్గరకు పంపించారట. అయినా ఈ శాసనం ప్రసక్తి సూవెల్ దొరగారి లిస్టులలో కనబడదు. ముఖలింగానికి చేరువలోనున్న అచ్యుతాపురంలోని ఒక బుగతగారింట్లో తామ్ర శాసనపట్టిక లున్నాయని తెలిసి వెళ్ళి వాటిని కాపీ చేసుకొన్నారు. మొత్తం మూడు గుత్తుల ప్రతులు సంపాదించారు. ఇందులో రెండో గుత్తానికి చాలా కథ ఉంది. చికాకోలులో గ్రీహందొరగారు కొన్ని గుత్తాలను కొని మద్రాసు తీసుకెళ్ళి మ్యూజియంలో భద్రపర్చారు. ఒక గుత్తాన్ని ఎడమ చేత్తో ఎక్కడో పెట్టేసి మరచిపోయినందువల్ల దానిని మద్రాసుకు పంపలేదు. అది ప్రిన్సిపల్ అసిస్టెంటు కలెక్టరు దొరగారి కచ్చేరీలో ఉండిపోయింది. రాగిరేకుల శాసనాలంటే రామమూర్తిగారు చెవి కోసుకొంటారని ఆ కచ్చేరీ హెడ్‌క్లార్కు ఈ సంగతి ఆయన చెవిని వేశారు. శాసనం కాపీచేసుకొందికి అవకాశాల్ని కల్పించారు.

రామమూర్తిగారికి వజ్రహస్తుని హౌస్సలి తామ్ర శాసనం గురించి తెలియ వచ్చింది. దానిని పర్లాకిమిడి జమీందార్‌గారి తమ్ముడు పద్మనాభ నారాయణదేవ్ గారిచేత కొనిపించి మద్రాసు మ్యూజియంకు బహూకరింపజేశారు. డాక్టర్ హుల్ష్ దొరగారు రామమూర్తిగారికి ఉత్తరం రాసి ఆయన దగ్గర ఉన్న తామ్ర శాసనాలను ఎరువియ్య మన్నారు. తమ దగ్గర ఉన్నవి ప్రతులే అంటూను మూల పట్టికలు ఎక్కడెక్కడ దొరుకుతాయో చెప్తూనూ రామమూర్తిగారు హుల్ష్ దొరగారికి రాశారు.

పురాతత్త్వ పరిశోధనలో ప్రాచీన నాణెముల ప్రాముఖ్యం చాలా ప్రామాణిక మైనది. రామమూర్తిగారు కొన్ని నాణాలను సంపాదించారు. గంజాం జిల్లాలో సూప రెన్నెంటు ఆఫ్ పోలీస్‌గా పని చేసిన ఫాసెట్ దొరగారు రామమూర్తిగారికి చాలా నాణాలు బహూకరించారు. ఇలియట్ దొరగారు ప్రచురించిన "కాయిన్స్ ఆఫ్ సదరన్

ఇండియా" అనే గ్రంథంలోని వాటితో తమ దగ్గర ఉన్న నాణాలను రామమూర్తిగారు తైపారు వేశారు. ముఖలింగానికి తొమ్మిది మైళ్ళ దూరంలో ఉన్న దంతవక్త్రనిపురం దగ్గర దొరికిన నాణాలను పోలినవి తమదగ్గరున్నాయని గుర్తించారు. వానాకాలంలో అదృష్టవంతులకు ముఖలింగంలో అప్పుడప్పుడు బంగారు నాణాలు దొరుకుతూ ఉంటాయట.

ముఖలింగ పర్యాటన ముగించుకొని వచ్చాక రామమూర్తిగారు క్షేత్ర మాహాత్మ్యన్ని, చరిత్రనూ సమన్వయపర్చసాగారు. హుల్ష్ దొరకు ఉత్తరప్రత్యుత్తరాలు సాగించారు. విజయనగరం వెళ్ళి గురజాడ అప్పారావుగారితో ఈ సంగతులు ముచ్చటించారు. అప్పారావుగారు ఒక సభను పెట్టించారు. అందులో ముఖలింగం గురించి రామమూర్తిగారు ఉపన్యసించారు. ముఖలింగంపై ఒక వ్యాసం రాయాలనుకున్నారు. అచ్చులో ముప్పయి అయిదు పుటలు పట్టే వ్యాసాన్ని అధోజ్ఞాపికలతో ప్రామాణిక సూచనలతో వంశ వృక్షాలతోరాశారు. "మెడ్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్సు"కు ప్రచురణార్ధం పంపారు. దానిని ఆ పత్రికవారు అచ్చువేశారు. వ్యాసం పేరు " An account of Antiquities of Mukhalingam and its neighbourhood" 7

ఈ వ్యాసంలో రామమూర్తిగారు పదివిషయాలను చర్చిస్తారు. ముందే చెప్పి వాటిని ఇలా పేర్కొన్నారు.

1. ముఖలింగేశ్వర ఆలయం
2. భీమేశ్వరాలయం
3. సోమేశ్వరాలయం
4. ప్రాచీనాలయ శిధిలాలు
5. పద్మనాభుని కొండ
6. ప్రాచీన నాణెములు
7. పాడుపడిన పాతకోటలు
8. కాళింగులు
9. తెలిగిపెంటలోని శిలాశాసనం
10. తామ్ర శాసనాలు

ఈ పది విషయాలపైన వివరణాత్మకంగా రాశారు. ముఖలింగ శాసనాలలో అవి కళింగ నగరంనుండి వేసినట్టు చెప్తారు. 'కాళింగవని నగరే శ్రీ మధూకేశ్వరాయశర్యాయ' అనీ 'కాళింగ దేవపరే శ్రీ మధూకేశ్వరాయ దేవాయ' అనీ సంస్కృతంలోనూ 'నగరమున మధూకేశ్వర దేవరకు' అనీ 'నగరాన పీఠ్ మధూకేశ్వర దేవరకు' అని - తెలుగులోనూ శాసనాల్లో కనబడుతుంది. ఈ 'కళింగ (దేశ) నగరం' ముఖలింగమే అయివుటుందని చెప్పి స్వప్రమాణికంగా రుజువుచేశారు. పర్లాకిమిడి జమీందారులు అనంతవర్మ చోడగంగ

దేవుని వంశంలోని వాళ్ళేనని కూడా క్షేత్రమహాత్మ్యం సూచనగా శాసన ప్రమాణా లతో రుజువుచేశారు.

ఈ 'ముఖలింగ ప్రాచీనత' వ్యాసంలో ఇంకొక చెప్పుకోదగ్గ విశేషం ఉంది శాసనాలు పరిశోధించినా చరిత్రను మధించినా అది ప్రజలకోసం చేయాలి. దేశమంటే మనుషులన్న సత్యం తొలినుంచీ గిడుగూ గురజాడలకు తెలుసు. అందుకే ఈ వ్యాసంలో కాళింగుల గురించి మూడున్నర పేజీల సుదీర్ఘచర్చ జరిపారు. సాంఘిక సామాజిక శాస్త్ర పరిశోధనలు కూడా శాసన పరిశోధనలతో పాటు గిడుగువారు ప్రారంభించారు. సవరల గురించీ ఇతర కొండ జాతులవారి గురించి రామమూర్తిగారు ఉత్తరోత్తరా రాసిన అనేక వ్యాసాలను థరస్టన్ తన 'కేస్ట్స్ అండ్ ట్రైబ్సు సంపుటాలలో అక్కడక్కడ చాలా విరివిగా వాడుకొన్నాడు.

ముఖలింగంపై రామమూర్తిగారు రాసిన వ్యాసం జర్నల్‌లో ప్రచురితం కాగానే అధికారులకు కనువిప్పు కలిగింది. గిడుగువారు భోగట్టా ఇచ్చిన ఇరవై రెండు శాసనాల నకళ్ళు తీయడానికి శ్రీ హెచ్. కృష్ణశాస్త్రి గారిని వెంటనే ముఖలింగం పంపించారు. 1896 సంవత్సరపు సాంవత్సరిక నివేదికలలో శాసన పరిశోధన శాఖవారు ఈ శాసనా లను రిపోర్టుచేశారు. (ఇందులో క్రీస్తుశకం 1100 కి పూర్వం ఉన్న పదకొండు శాస నాలను బూదరాజు రాధాకృష్ణగారు తమ 'ప్రాచీనాంధ్ర శాసనములు' గ్రంథంలో చేర్చారు.)

ఇంతలో హుల్ష్‌దొర దేవేంద్రశర్మ చికాకోలు తామ్ర శాసనాన్ని పరిష్కరించి ఎపిగ్రాఫియా ఇండికా మూడవ సంపుటిలో ప్రకటిస్తూ అది గ్రాహందొర గారికి ఇవ్వని గుత్తశమన్న సంగతి తమకు పర్లాకిమిడి వాస్తవ్యులు మిస్టర్ జి.వి. రామమూర్తిగారు తెలియపర్చారని ప్రకటించారు. ఇది 1894-95లో జరిగిన విషయం. హుల్ష్‌దొరగారు రామమూర్తి గారిని కొన్ని తామ్ర శాసనాలను పరిష్కరించి పంపమన్నారు.

1895-96 ఎపిగ్రాఫియా ఇండికా నాలుగవ సంపుటంలో వజ్రహస్తుని నదగాం తామ్రశాసనాన్ని రామమూర్తిగారు పరిష్కరించి ప్రకటించారు. చాలా సుదీర్ఘమైన వ్యాఖ్యానాలు చేశారు. వజ్రహస్తుడు వేల్పురా విషయంలోని పన్నెండు గ్రామాలను ఫోంగు సామయ్య అనే వ్యక్తికి దానమిచ్చాడు. ఆ సంగతినే ఈ శాసనం చెప్తుంది. ఇది నరసన్నపేట తాలూకాలోని నదగాం గ్రామంలో ఒక రైతుదగ్గర దొరికింది. దీనిని స్వాధీనం చేసుకొని గంజాం కలక్టర్ వియల్ దొరగారి ద్వారా హుల్ష్ దొరగారికి రామమూర్తిగారు పంపించారు. పరిష్కరణ భారాన్ని దొర రామమూర్తిగారి పైనే పెట్టారు.

ఈ శాసనంలోని రెండు తేదీల ప్రాముఖ్యాన్ని రామమూర్తిగారు గుర్తించారు. ఒకటి దానమిచ్చిన రోజు గోవింద ద్వాదశి. ఇది విశిష్టమైన దినం. గోవింద ద్వాదశి అరవై సంవత్సరాలకు ఒకసారి వచ్చే పర్వదినం. ఈ శాసనంలోని మరొక ముఖ్య

మైన తేదీ వజ్రహస్తుని పట్టాభిషేక ముహూర్తం. క్రీస్తుశకం 1038 మే నెల మూడవ తారిఖునాడు రాత్రి 8 గంటల 27 నిముషాలకు వజ్రహస్తుడు పట్టాభిషేకం చేసుకొన్నాడని శాసనంలోని 8వ శ్లోకాన్ని బట్టి రామమూర్తిగారు నిర్ణయించారు. తూర్పుగాంగుల వంశవృక్షాన్ని రూపొందించారు.

ఈ శాసన పరిష్కరణను అవకాశంగా తీసుకొని గాంగుల రాజధాని నగరం అందరూ భావించేటట్టు గంజాం జిల్లాలోని కళింగపట్నం అనే రేవు కాదని ముఖలింగమే కళింగ నగరమని మరికొన్ని శాసన ప్రమాణాలతో రామమూర్తిగారు నిరూపించారు. రామమూర్తిగారి ఈ నిర్ణయాన్ని తరవాత పండితులందరూ ఆమోదించారు. స్టెన్‌కోనో గారు ఎపిగ్రాఫియా ఇండికా తొమ్మిదో సంపుటి (పుట 95)లోనూ విన్సెంట్ స్మిత్ తన 'ఎర్లీ హిస్టరి ఆఫ్ ఇండియా (పుట 498) లోనూ హూల్ట్ ఎపిగ్రాఫియా ఇండికా పధ్నాలుగో సంపుటి (పుట 332) లోనూ రామమూర్తిగారి నిర్ణయాన్ని అంగీకరిస్తున్నట్టు రాశారు.[8] తన పరిశోధనా ఫలితాన్ని ఇంతమంది చరిత్రకారులు ఆమోదించడం కన్నా ఎక్కువ ఆమోదం ఏ పండితునికి ఉండదు. "ఆపరితోషా ద్విదుషాం నసాధు మన్యే."

1895-96 లలోనే రామమూర్తిగారు మరొక శాసనాన్ని చదివి ఎపిగ్రాఫియా ఇండికా నాల్గవ సంపుటిలో ప్రకటించారు.[9] దీన్ని ధీర్ఘాసి శాసనం అంటారు. గంజాం జిల్లా కళింగపట్నం దగ్గర దీర్ఘాసి అనే గ్రామం ఉంది. అక్కడ ఒక శాసనంలో మొదట పదహారు పంక్తులూ సంస్కృతంలో ఉన్నాయి. తరవాత ఏడు పంక్తులూ తెలుగులో ఉన్నాయి. శాసనకాలం క్రి.శ. 1075-6. తెలుగు భాగం సీస పద్యంలో ఉండడం విశేషం. సంస్కృత శాసనాలను ధారాళంగా చదవవచ్చుగానీ తెలుగు శాసనాలు చదవడం చాలా కష్టమని రామమూర్తిగారు ముఖలింగం వ్యాసంలోనే స్పష్టపరిచారు. ప్రాదెనుగు శాసనాలలోని మాటలన్నీ అర్థమయ్యేయని చెప్పజాలం అన్నారు. ఈ దీర్ఘాసి శాసనాన్ని జయంతి రామయ్యగారు తమ శాసన పద్యమంజరి ప్రథమభాగంలో పాఠ భేదాలతో అచ్చువేశారు. బూదరాజు రాధాకృష్ణగారు తమ ప్రాచీనాంధ్ర శాసనములలో గిడుగువారి పాఠాలనే ప్రధాన పాఠాలుగా స్వీకరించారు.

1895 నుంచీ గురజాడ అప్పారావుగారు కూడా ఉధృతంగా శాసనపరిశోధనలు ప్రారంభించారు. ఆనంద గజపతి మహారాజా చాలా రిసెర్చి చేసి చేయించి 'ట్రీ ట్రీ' అనే పుస్తకం ప్రచురించారు. తమ సంస్థానం పూర్వీకులకూ తూర్పు ఇండియా కుంఫిణీ వారికి జరిగిన ఒప్పందం గురించి ఈ గ్రంథం తెలియచేస్తూంది. తమ పూర్వీకులకు 'మహామండలేశ్వర', 'సుబేదార్' అనే బిరుదులు ఉన్నాయని ఆనంద గజపతికి వారి తండ్రిగారు చెప్పారు.[10] అందుకు దాఖలాలుగా శాసనాధారాలు సేకరించాం. 1895 ఏప్రిల్ నుండీ పరిశోధనలు చేస్తున్న అప్పారావుగారు జూలై 5 నాటికి ఒక దాఖలా తీసుకు రాగలిగారు. ఇంతలో సంజీవరావుగారు మరొక దాఖలా తీసుకువచ్చారు. అప్పారావుగారు 'సుబేదార్' బిరుదును ధ్రువీకరించే సాక్ష్యం తెచ్చారు. సంజీవరావుగారు

'మహామండలేశ్వర' బిరుదుకు తగిన ప్రమాణం చూపించారు.

1895 ఏప్రిల్‌లోనే శాస్త్రీయ పద్ధతులలో శాసన ప్రతిబింబాలను ఎలా తీయాలన్న సంగతిని అప్పారావుగారు ఇలా నోటు చేసుకొన్నారు.[11]

> బ్రష్‌తో రాతిపలకను చక్కగా తుడిచి నీళ్ళలోకడగవలెను. కాగితమును నీటిలో ముంచి, పైకి తీసి, శాసనపు పలకమీద జాగ్రత్తగా నిండుగా పరచి, బ్రష్‌తో నొత్తవలెను. శాసనములోని అక్షరములు కాయితం మీద పడేవరకు బ్రష్‌తో అదమవలెను.నీళ్ళలో కాగితాన్ని ముంచేటప్పుడు దానిని టబ్బులో బాగాఉంచాలి. నౌకరు మొదట నాసిక పేపరును ఉంచాడు. దానిపై పైంటింగ్ పేపరును పరచాడు. రాయి మోటుగావుండి అక్షరములు స్ఫుటముగా పడనప్పుడు, వొక సీసాలో దీపపు మసీ, యింకు పౌడరూ వేసి సిరావలె తయారయేటట్టు నీళ్ళు పోయాలి. పేడ్‌పై కొద్ది కొద్దిగా ఈ సిరాను చిమ్ముతూ మెల్లగా నొత్తవలెను. అక్షరములు స్పష్టపడేవరకూ అలాగున యింకును పోస్తూనే ఉండవలెను.

ఇంత స్పష్టంగా ఇన్ని వివరాలతో శాస్త్రీయ పద్ధతులను నోట్ చేసుకొన్న అప్పారావుగారు ఈ సంగతులను రామమూర్తిగారికి చెప్పే వుంటారు. 1895లో అప్పారావుగారు బెంగుళూరులో హుల్ష్‌దొరగారిని కలుసుకొన్నప్పుడు విన్న ఒక సంగతి రామమూర్తిగారికి చెప్పారో లేదో? పరిశోధనకు తెలుగు అసిస్టెంటును ఒకరిని నియమించాలని ఈ ఉద్యోగం గిడుగు రామమూర్తిగారికి ఇవ్వాలని హుల్ష్‌దొర మొదట భావించాడట. కాని ఆంధ్ర దేశంలో పరిశోధించవలసిన శాసనాలు మిక్కుటంగా లేవనుకొని శ్రీ హెచ్. కృష్ణశాస్త్రిగారిని తర్వాత నియమించారట[12]

వాడుక భాష అదృష్టం కొద్దీ శాసనపరిశోధకునిగా గవర్నమెంటు ఉద్యోగం రామమూర్తిగారికి తప్పి పోయింది. ఈ అవకాశం రానందుకు రామమూర్తిగారు విచారించి ఉండరు. దాన్ని వారెప్పుడూ ఆశించలేదు గిడుగువారికి శాసన పరిశోధకుడనే హోదాతో ఉద్యోగం రాక పోయినా గురజాడకు మాత్రం విజయనగరం సంస్థానం శాసన పరిశోధకుడు అనే ఉద్యోగం 1896 జూన్ అయిదో తారీఖున లభించింది. లెక్చరర్‌గా పాఠాలు చెప్పడం తప్పింది. చెన్నరాజధాని అంతా తిరిగి శాసన పరిశోధన చేసే అవకాశాలు వచ్చాయి.

అంతకు ముందే అప్పారావుగారు బెంగుళూరులో హుల్ష్ దొరగారి బసలో కృష్ణశాస్త్రిగారిని వెంకయ్యగారిని కలుసుకొని స్నేహం ఏర్పరుచుకొన్నారు. తమ పరిశోధనల గురించి హుల్ష్ దొరగారితో చెప్పారు. అప్పారావుగారు కృష్ణదేవరాయల కాలం నాటి రెండు శాసనాలను ప్రస్తావించి వాటిని పరిష్కరించి ప్రచురించ దలచారు. డాక్టర్ కీల్హారన్ దొర వాటిని ప్రచురించకపోతే అప్పారావుగారు ఆ పనిని చేయవచ్చునని హుల్ష్ ఒక ఉత్తరంలో రాశాడు.[13] అప్పారావుగారు కీల్హారన్ దొరతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినట్టుంది. 1896 జూన్ మూడవ తారీఖునాడు డైరీలో "డాక్టర్ కీల్హారన్

దొరకు ఉత్తరం రాశాను" అని ఎంట్రీ ఉంది.

రామమూర్తిగారు కూడా కీల్హారన్ దొరతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవారు. అల్లయ్య దొడ్డారెడ్డి కొంకుదురు శాసనాన్ని పరిష్కరిస్తున్నప్పుడు రామమూర్తిగారికి ఒక సందేహం వచ్చింది. శాసనం అర్ధోదయ పుణ్యకాలంలో ఇచ్చాడు. పూర్వం గోవిందద్వాదశి విశిష్టతను తమంత తామే విశద పర్చగలిగినా ఈ అర్ధోదయం ఏమిటో రామమూర్తిగారికి పూర్తిగా తెలియలేదు. దానిని వివరించమని కీల్హారన్ దొరగారికి ఉత్తరం రాశారు. ఆయన వివరించారు. అమావాశ్య, ఆదివారం, వ్యతీపాతం, శ్రావణం కలిసి మాఘపుష్య మాసాలలో వచ్చే యోగాన్ని అర్ధోదయ మంటారు. ఇది చాలా అరుదుగా వస్తుంది. అల్లయ్యదొడ్డారెడ్డి శాసనంలో చెప్పిన శకవత్సరాలు 1352కు సరైన క్రీ.శ. 1432 జనవరి 14వ తేదీనాడు అర్ధోదయం వచ్చింది. కీల్హారన్ దొరగారి పేరు చెప్పి ఈ సంగతులను రామమూర్తిగారు తమ వ్యాసంలో రాశారు. (ఎపిగ్రాఫియా ఇండికా అయిదో సంపుటం)

1897లో ఆనంద గజపతి మరణించారు. మేలో మహారాజాగారు పోతే జూన్‌లో అప్పారావుగారు రాణి ఆంతరంగిక కార్యదర్శిగా నియమితులయ్యారు. సంస్థానం చిల్లరదావాలతో పెద్ద దావాలతో అప్పారావుగారు తలమునకలయ్యారు. శాసన పరిశోధన మందగించినా పూర్తిగా దానిని అప్పారావుగారు విడిచి పెట్టలేదు. పెద్ద దావాకోసం చాలా పరిశోధనలు కూడా చేయవలసి వచ్చింది. రామమూర్తిగారు మాత్రం చురుకుగా శాసన పరిశోధనలు కొనసాగించారు. చిలుకూరి నారాయణరావుగారు గిడుగువారి శిష్యులయ్యారు. శాసన పరిశోధనలో చాలా ఆసక్తి, శక్తి చూపించారు. గురుశిష్యు లిద్దరూ చాలా శాసనాలు సంపాదించారు.

వ్యావహారిక భాషావాదం ఉద్యమ రూపం సంతరించుకొన్నాక రామ మూర్తిగారు శాసవ సేకరణా పరిష్కరణా విషయాల్లో ఎక్కువకాలం వినియోగ పర్చలేక పోయా రనుకోవాలి. ఆ బాధ్యతలన్నీ చిలుకూరి నారాయణరావుగారి మీద పెట్టినట్టున్నారు. తూర్పు గాంగుల ఆరు తామ్ర శాసనాలను సంపాదించి నారాయణరావుగారు ప్రభుత్వానికి పంపారు. వాటిని నమోదుచేసుకొని తిరిగి నారాయణరావుగారికా గుత్తశాలు పంపిం చేశారు. ఈ శాసనాలను "మ రా రా. శ్రీ గిడుగువెంకట రామమూర్తి పంతులుగారూ, మ రా.రా శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పరిష్కరించి ఎపిగ్రాఫియా ఇండికాలో ప్రకటించనున్నారు" అని 1919 ఆగస్టు హోం (విద్యా) శాఖ గెజిట్ (నెం 1008)లో ప్రకటించారు. అయితే రామమూర్తిగారు తీరిక లేక ఆ పనికి పూనుకోలేదు. తూర్పు గాంగుల ఆరు కొత్త శాసనాలను 1933లో రాళ్ళ బండ సుబ్బారావుగారు పరిష్కరించి గిడుగువారి గౌరవార్థం ప్రచురించిన వ్యాస సంగ్రహంలో ప్రకటించారు.

అప్పారావుగారి డైరీలవల్లా ఇతర నోట్సు వల్లా వారు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోనూ, బెంగుళూరు శాసన పరిశోధక కార్యాలయంలోనూ ఎత్తి వ్రాసు

కొన్ని వాటి వివరాలు తెలుస్తాయి. ఆయన స్వయంగా సంపాదించిన శాసనాల గురించి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు చెప్పిన మాటలే ఇప్పటికి ప్రమాణాలు. 'గురజాడ శతవార్షిక జయంతి సంచి'కలో శర్మగారు రాసిన ఒక ఇంగ్లీషు వ్యాసానికి ఘోరమైన ఆంధ్రానువాదం ఒకటి పడింది. అందులోని అనువాద దోషాలను పరిహరిస్తూ కొన్ని వాక్యాలు ఉదాహరిస్తాను.

"ఎస్టేటు శాసన పరిశోధకుడిగా, అప్పారావు విజయనగరం ఎస్టేటులోని శాసనాల ప్రతులను సేకరించడానికి ఎస్టేటు అంతటా పర్యటించారు. వైదిక పండితులకు అగ్రహారాలు భూములు దానమిచ్చిన పురాతన తామ్ర శాసనాలను సేకరించడం ఆయన కొక సరదా అయింది. ఆయన దాదాపు ఏడు తామ్ర శాసనాలను సంపాదించారు. అందులో ఒకటి విష్ణు కుండిన వంశానికి చెందిన ఇంద్రవర్మకు సంబంధించినది మరొకటి తూర్పు గాంగవంశీకుడైన ముమ్మడి వజ్రహస్తునికి (967 శకం) చెందినది. మిగిలి నవి తూర్పు చాళుక్య వంశీకులయిన రాజులు కొక్కిలి మహారాజు ఇమ్మడి మంగి యువరాజు, కొక్కిలి విక్రమాదిత్య భట్టారకుడు, మొదటి చాళుక్య భీముడు మున్నగు వారికి చెందినవి. వీటినన్నిటిని పురావస్తుశాఖ అసిస్టెంటు సూపరింటెండెంటుకు పంపించారు. ఇంకా మిగిలిన వేమైనా ఉన్నవేమో తెలియదు. వాటిపై 1908-1909లో వెలువడిన శాసన పరిశోధనల వార్షిక నివేదికలో శ్రీ హెచ్. కృష్ణశాస్త్రి గమనించారు. ఇవి ఓరియంటల్ జర్నల్స్‌లో గాని ఎపిగ్రాఫియా ఇండికా త్రైమాస పత్రికలలో కాని ప్రచురించబడలేదు .ఎస్టేటు వ్యవహారాల్లో నిమగ్నమై పోవడం వల్ల ఇది సంభ వించి వుండక పోవచ్చు."

సుప్రసిద్ధ చారిత్రిక పరిశోధకులైన సోమశేఖర శర్మగారు ఇంత స్పష్టంగా అప్పారావుగారు సంపాదించిన శాసనాలు నమోదు మాత్రమే అయినాయిగాని వాటిని ఆయన ఎక్కడా ప్రచురించలేదు అని చెప్తూ ఉంటే గిడుగు సీతాపతిగారు "గురజాడ అప్పారావుగారు రెండు చిన్న శాసనములు మాత్రమే చదివి ఎపిగ్రాఫియా ఇండికాలో వ్యాసము ప్రకటించినారు" అని రాయడం విడ్డూరంగా ఉంది. (సాహిత్యోపన్యాసములు నెం.౯, ఆంధ్రసాహిత్య అకాడమి ప్రచురణ పుట.11) ఈ విషయంపై కె.వి. రమణా రెడ్డిగారు తమ మహోదయంలో 188వ పుట కింద అధోజ్ఞాపికలో శర్మగారి శ్రద్ధను తక్కువ పర్చడం మరీ విడ్డూరంగా ఉంది. అప్పారావుగారు ఏ పరిశోధక పత్రిక లోనైనా శాసవ పరిష్కరణా వ్యాసాలు వ్రాస్తే అవి మల్లంపల్లి వారి దృష్టిలో పడి ఉండేవి.

అప్పారావుగారుగాని రామమూర్తిగారుగాని శాసవసేకరణా, పరిష్కరణా తగ్గించు కొన్నా వివిధ పత్రికల్లో సంపుటాలలో ఇతరులు ప్రచురించే శాసన పాఠాలను గానీ, చర్చలనుగాని చాలా శ్రద్ధగా గమనించే వారని చెప్పవచ్చు. అప్పారావుగారు సంపాదక లేఖలు కూడా వ్రాసేవారు. 1911 ఫిబ్రవరి ఒకటవ తేదీనాడూ ఆరవ తేదీనాడు హిందూ

దినపత్రికకు సుదీర్ఘమైన లేఖలు రాశారు. నన్నయ కాలం కంటె ప్రాచీనమైన శాసనాల గురించీ, ప్రభుత్వ శాసన పరిశోధకుల సామర్థ్యం గురించీ ఈ లేఖలు రాశారు.

వాడుకభాష గురించి యుద్ధం చేస్తున్న రోజుల్లో అప్పారావుగారూ రామమూర్తి గారూ పండితులు దిద్ది పారేసిన పదాల అసల రూపాల కోసం శాసనాలపై ఆధారపడే వారు. శాసనాలలోని ప్రయోగాలు శిలాక్షరాలు. వాటిని ఏ పండితులో దిద్ది పారెయ్య లేరు. హిందూ పత్రికకు రాసిన సంపాదక లేఖలో నెల్లూరు శాసనాలను అప్పారావుగారు ఉదాహరించారు. రామమూర్తిగారు ముద్రితమైన నన్నయ భారతానికి వ్రాత ప్రతులలో ఉన్నదానికి గల తేడాలను తైపారు వేశారు. నన్నయ్యగారు ఆశీరర్థక 'ఎడమాం'త రూపంలోనే వాడేవారు. ఈ ప్రయోగాలను రామమూర్తి గారు తంజావూరు ప్రతులలో చూశారు. వీటికి శాసన ప్రమాణకోసం గాలించారు'. హైదరాబాదు ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటువారు కొన్ని శాసనాలు ప్రకటించారు. ఆ సంపుటిలో కాకతిగణపతి దేవుని కాలంనాటి ఉప్పరపల్లి శాసనం ఒకటి ఉంది. దాన్లో 'గాచుచుండెడం' అనే ప్రయోగం ఒక పద్యంలో కనబడింది. ఇది శాసన ప్రతిబింబంలో స్పష్టంగా ఉన్నా పరిష్కర్త మాత్రం 'గాచు చుండె (డుం)' అని సవరించాడు. ఈ అనుచిత సవరణనే కాక మరికొన్ని తప్పుల్ని చూపిస్తూ రామమూర్తిగారు బిల్గ్రామీగారికి ఉత్తరం రాశారు. ఆయన ఆ శాసనాన్ని పరిష్కరించిన బార్నెట్ దొరగారికి రామమూర్తిగారి ఉత్తరాన్ని లండన్ పంపించారు. బార్నెట్‌దొర రామమూర్తిగారి సూచనలన్నీ ఒప్పుకొని ఆ శాసనానికి తప్పొప్పుల పట్టికను చేర్పించాడు.

అప్పారావుగారు రామమూర్తిగారు తాము స్వయంగా శాసన సేకరణలు విర మించినా యువ పరిశోధకులకు ప్రోత్సాహమూ, శిక్షణా ఇచ్చేవారు. "వీరి ప్రోత్సాహము తోనే నేనే కాక చిలుకూరి నారాయణరావు, మండా నరసింహారావు, భావరాజు కృష్ణారావు, రాళ్ళబండి సుబ్బారావు మొదలైనవారు ప్రాచీన లిపి చదువుట అలవర్చుకొని శాసన ములు ప్రకటిస్తూ వచ్చిరి" అని గిడుగు సీతాపతిగారు రాశారు.

"ఉత్సాహవంతులైన యువ పరిశోధకులకు అందుబాటులో వుండేటందుకు డూప్లికేటు కాపీలను శాసనపు నకళ్లను మద్రాసు మ్యూజియములో పదిలపర్చవలెనని నా సూచన" అంటూ అప్పారావు గారు హిందూ పత్రిక లేఖలో సూచించారు. గురజాడ వారి వద్ద బుర్రా శేషగిరిరావుగారూ, వంగోలు మునిసుబ్రహ్మణ్యం గారూ శిష్యులుగా సహాయకులుగా ఉంటే గిడుగువారి దగ్గర వారి కుమారుడు సీతాపతిగారూ, చిలుకూరు నారాయణరావు గారు శిష్యులుగా, సహాయకులుగా ఉండేవారు. ఈ యువకుల చేత ఎంతో పరిశోధనా వ్యాసంగం చేయించారు.

1911లో రామమూర్తిగారు రిటైరయినారు. వయస్సు 48 సంవత్సరాలైనా 30 ఏళ్ళ సర్వీసు పూర్తవడం చేత రిటైరింగు హక్కును వాడుకొన్నారు. 1911-1912లో ఉద్యోగ బాధ్యత లేనందువల్ల రామమూర్తిగారు రాత్రింబవళ్ళు పరీక్షకోసం చదివినట్లుగా

తెలుగు సాహిత్య గ్రంధాలు వ్యాకరణాలు దీక్షతో చదివి నోట్సురాసి పెట్టుకొన్నారు. శాసనాలలోని ప్రమాణాలను ప్రత్యేకంగా గుర్తు పెట్టుకొన్నారు. 1913లో రామమూర్తి గారు విజయనగరంలో ఒక ఉద్యోగం ఒప్పుకున్నారు. సంస్థానం రాచ బిడ్డలకు ట్యూటరు ఉద్యోగాన్ని అప్పారావుగారే రామమూర్తిగారికి వేయించారు. మిత్రులిద్దరూ రోజూ కలుసుకొని అనేక విషయాలు చర్చించు కొనడానికి ఇది చక్కని అవకాశం కల్పించింది. కోటలో ట్యూటరు పనిని రామమూర్తిగారు అట్టేకాలం చెయ్యలేక పోయారు. దానికి రాజీనామా చేసినా విజయ నగరాన్ని వదిలిపెట్టలేదు. ఏడాది పాటు అక్కడే మరి కొందరు పిల్లలకు ట్యూటరుగా ఉంటూ అప్పారావుగారితో పాటు సాహిత్య పరిశోధనా కాలం గడిపారు.

దేశ చరిత్ర విషయమై చేయవలసినన్ని పరిశోధనలు చేశాననుకొన్నారు అప్పారావుగారు. దేశ చరిత్ర రచనకు పూనుకొందామనుకొన్నారు. కళింగదేశ చరిత్రను రాయదలిచారు. దానిని "విజ్ఞాన చంద్రికా గ్రంధమండలి" వారు వేస్తామన్నారు. ప్రకటనకూడా చేశారు. అయితే అప్పారావుగారు వాడుక భాషలో రాస్తామని భాషావిభేదాలు వచ్చాక చెప్పారు అని కొమర్రాజు లక్ష్మణరావు వగైరాలకు నచ్చలేదు. చరిత్ర రచన ఆగిపోయింది. సాగిఉంటే విజయనగరంలోనేఉన్న రామమూర్తిగారి సహకారం అప్పారావుగారికి ఎలాగైనా లభించి ఉండేది. శాసన పరిశోధనలకు ప్రయోజనం చరిత్రరచనే కదా! రామమూర్తిగారు ఆంధ్రదేశంలోని శాసన పరిశోధకులలో కురువృద్ధులు; భీష్మాచార్యునివంటివారు. గురజాడ ద్రోణాచార్యులే.

అప్పారావుగారు "కళింగదేశ చరిత్ర" రాయలేదుగాని, రాస్తే ఏ దృక్పధంలో రాసేవారో తెలిపే నోట్సుమాత్రం మిగిల్చిపోయారు. రాజుల చరిత్రకన్నా ప్రజల చరిత్రకే ప్రాముఖ్యం ఇచ్చేవారని ఈ నోట్ ఒక్కదానివల్లనే చెప్పవచ్చు.

> "ప్రాచీన శిధిల భవనాలను, శిల్పాలను, అవశేషాలను చూసినప్పుడు మనం వ్యాకులపడతాము. వ్యాకులముతోపాటు మనకు ఆసక్తి కలుగుతుంది ఆ వస్తువులచుట్టూ, జాలీ, ఆసక్తి గొలిపే వాతావరణం అలుముకొని ఉంటుంది.
>
> రూపు చెడని కోటకన్నా, రూపు చెడిన కోట, విశేషించి దానికి చరిత్రతో అనుబంధం వున్నప్పుడు, మనకు ఎక్కువ ఆసక్తిని కలిగిస్తుంది. ఊహించుకొందుకు వీలున్నప్పుడు మన ఆసక్తి మరీ ఎక్కువౌతుంది. సహజంగా మనకు కొన్ని ఊహాలు పుడతాయి.
>
> కొన్ని వందల సంవత్సరాల క్రితం ఈ కోటలో కొందరు నివసిస్తూవుండేవారు. అనేకుల జీవితాలు వింత వింత అభిరుచులతో, అనుభవాలతో, ఆశలతో, నిరాశలతో ఇక్కడ గడిచి పోయాయి. వాళ్ళ కష్ట సుఖాలు, సుఖ దుఃఖాలు ఎటువంటివో. ఇక్కడివాళ్ళు ఒక్కొక్కప్పుడు అత్యంత ధైర్యోత్సాహాలతో ఇంకొక్కపుడు మహా భయాలతో కాలం గడిపి ఉంటారు. జీవితంలో అనేక

జయాపజయాలను చవిచూసి ఉంటారు. వీళ్ళ ఆశలతో నిరాశలతో ఆనందంతో విచారంతో ఈ వాతావరణం ఒకప్పుడు నిండిఉండేది. ముఖ్యంగా ఇక్కడ నివసించిన చివరితరం మనుషులు ఎక్కువ ఒడిదుడుకులను ఎదుర్కొనివుంటారు. అనేక కష్టాలుపడివుంటారు.

చారిత్రకంగా వీటి ఉనికి ఏమిటో ?"

ఇటువంటి భావాలున్న వ్యక్తి తప్పించి "దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుషులోయ్" అని చెప్పలేడు. రామమూర్తిగారు ముఖలింగ పరిశోధనలు చేస్తున్నప్పుడే అక్కడి కాళింగుల గురించి రాయడం ఇంతకుముందే చూశాం. ఈ దృక్పథం కల ఇద్దరు మిత్రుల పొత్తుల కృషిగా దేశ చరిత్ర వెలువడితే బాగుండేది. అందుకే అప్పారావుగారు 1913 ఫిబ్రవరి 12వ తారీఖున సంస్థానం నౌఖరీనుంచి ఫించనుపుచ్చుకొన్నారు. వాడుక భాషకోసం ఒక ఉద్యమం నడుపుతున్నా చరిత్ర రచన మొదలు పెట్టాలన్న తహతహ మరీ ఎక్కువైంది. రామమూర్తిగారు 1914లో పర్లాకిమిడి వెళ్ళిపోవలసివచ్చింది. అప్పారావుగారి ఆరోగ్యం క్షీణిస్తూ వచ్చింది.

వైద్య పరీక్షకోసం, చికిత్సకోసం అప్పారావుగారు విశాఖపట్నం వెళ్ళారు. ఈ ఈ సంగతి తెలిసి రామమూర్తిగారు ప్రాణమిత్రుణ్ణి చూడడానికి వెళ్ళారు. చూశారు. ఈ అనుభవాన్ని తర్వాత ఒక లేఖలో చెప్పారు.

> "ఎలావున్నదో చూసివద్దామని విశాఖపట్నం వెళ్ళాను. అదే ఆఖరిసారి చూడడం. నేనతన్ని చూడ్డానికి వెళ్ళినప్పుడు డాక్టరు నాకిలా సలహాయిచ్చాడు. 'మీరు యెదట కనిపించేసరికల్లా ఆయన ఉద్రేకం పట్టలేక పోతున్నారు. అదేపనిగా, జబ్బుమాటే మరచి, మీతో సాహిత్యగోష్ఠి చేస్తున్నారు. చారిత్రక విషయాలను గురించీ, సారస్వతాన్ని గురించి చర్చలు జరుపుతున్నారు. విపరీతమైన అలసట కలుగుతున్నా లెక్కచేయడంలేదు. ఇలా అయితే ఆయన ఆరోగ్యం పాడవుతుంది కదా! "డాక్టరు అతనికి ఉత్తరాలు రాయవద్దని నాకు చెప్పాడు. నాటినుంచి అతనికి ఉత్తరాలు రాయడం మానుకొన్నాను."

జబ్బుపడ్డ దగ్గర్నుంచీ అప్పారావుగారికి "కళింగదేశ చరిత్ర" గురించే బెంగ పట్టుకొంది. అన్నేళ్లుగా చేసిన శాసనపరిశోధనల ఫలితం జాతికి ఇవ్వలేక పోతున్నాననే వ్యథ వ్యాకులపర్చసాగింది. "మీరే అది రాస్తారు. లేకపోతే మీ అంత సమర్థులచేత అది పూర్తి చేయిస్తాను" అని సంస్థానం కలక్టరు పౌలరుదొర హామీ ఇచ్చాడు. దొర దృష్టిలో రామమూర్తిగారే వుండి వుంటారు. గిడుగువారు ఈ చరిత్ర రచనను సమకూర్చడానికి ప్రయత్నించారు గాని ఆయనకు అవకాశం చిక్కనట్లు కనిపించదు అని గిడుగు - గురజాడలకు సమీప కాలస్థులయిన కిళాంబి రంగాచార్యులుగారు చెప్పారు. (గురజాడ రచనలు సంపుటి 5 - పుట 245)

అప్పారావుగారు 1915లో చనిపోయారు. ఆ తరువాత పాతికేళ్ళు ఏకాంగి వీరుడి

లాగ రామమూర్తిగారు వాడుక భాషకోసం సనాతన పండితులతో సంకుల సమరం చేయ వలసివచ్చింది. మధ్యలో పర్లాకిమిడి జమిందారీని ఒరిస్సా రాష్ట్రంలో చేర్చకుండా చూడడానికి పర్లాకిమిడి రాజాకు వ్యతిరేకంగా ఉద్యమం నడపవలసి వచ్చింది. ఏమైతేనేం చాలా కారణాలవల్ల రామమూర్తిగారు తమ శాసన పరిశోధనల ఫలితంగా చరిత్ర రచన చేయలేదు కాని ఒక్క సంగతి చెప్పాలి. వాడుక భాషావాదానికి ప్రమాణాలుగా శాసన ప్రయోగాలను చూపి పండితుల నోరు మూయించారు. ఒక్క "వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము" అన్న వ్యాసంలోనే వివిధ శాసనాలలోంచి 21 ప్రయోగాలు చూపించారు. ఎపిగ్రాఫియా ఇండికా, ఎపిగ్రాఫియా ఇండోమోస్లామికా, నెల్లూరు జిల్లా శాసనాలు, లోకల్ రికార్డ్స్, హైదరాబాదు ఆర్కియాలజికల్ సంపుటాలు మొదలైన వాటిలోంచి ఉదాహరణలు ఇచ్చారు. (గిడుగు వ్యాసావళి - పుట 14)

అప్పారావుగారు రాద్దామనుకొన్నది రాయలేకపోయామన్న బెంగతో మరణిస్తే రామమూర్తిగారు వాడుక భాషావాదం కొంతయినా నెగ్గినందుకు 'నేను' కృతార్థుడనైనా నని సంతోషిస్తున్నాను" అని చెప్పి పూర్తి విజయం లభిస్తుందన్న నమ్మకంతో తుది విన్నపం చేశారు.

అప్పారావుగారూ రామమూర్తిగారూ ఫ్యూడలిజంలో పుట్టారు. రాజాశ్రయం సంపాదించారు. రాచరికపు అండదండలతోనే శాసన పరిశోధనలు ప్రారంభించారు. స్వామి భక్తిని మిన్నగావించే రోజుల్లో గురజాడ దేశభక్తిని బోధించారు. "భాగ్యవంతులైన పెద్దలు తమ ఆరోగ్యం కాపాడుకొనవలెనంటే ప్రజల ఆరోగ్యము కాపాడవలెను" అని గిడుగువారు ఎలుగెత్తి ఘోషించారు. ఆరోగ్యం అంటే శారీరక, మానసిక, సాంస్కృతిక ఆరోగ్యాలన్నమాట! అప్పారావుగారు తాము అనారోగ్యవంతులైనా జాతిని ఆరోగ్యవంతం చేశారు. రామమూర్తిగారు ఆ జాతికి నోరూ వాయీ ఉండేటట్టు చూశారు. తన సహజ భాషలో రాతకోతలు సాగించుకొనే హక్కును సాధించి ఇచ్చారు.

ఇంత చేశాక, అప్పారావు దేశ చరిత్రనూ, రామమూర్తిగారు భాషా చరిత్రనూ రాయలేకపోతేనేం! అడవిని కొట్టినవాడు తానే భవనం కట్టక్కర్లేదు. భవంతులలో ఉన్నవాళ్ళు అడవిని కొట్టినవాళ్ళను మరచి పోగూడదు.

**జ్ఞాపికలు వివరణలు :**

1. మహోదయం, గురజాడ జీవిత సాహిత్యాలు, కె. వి. రమణారెడ్డి. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, (1969)చూ. కాలక్రమణిక.
2. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం-మూడవ సంపుటం. పుట 352 లోనూ, సాహిత్య అకాడమీవారి సాహిత్యోపన్యాసములు, నాల్గవభాగం 5వ పుటలోనూ గిడుగు సీతాపతిగారు ఈ సంగతి చెప్పారు. అదే 6వ పుటలో 1880 అన్నారు. ఈ సందర్భంలో కె.వి. రమణారెడ్డిగారి అనుమానాలు చూడ దగ్గవి; మహోదయం పుట81

3. వ్యాస సంగ్రహము—(సం). తెలికచర్ల వెంకటరత్నం (1933). ఇంగ్లీషు విభాగంలో బుర్రా శేషగిరిరావుగారి వ్యాసం - పుట 1
4. గురజాడ రచనలు-3, మహాకవి డైరీలు-(సం) అవసరాల సూర్యారావు విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ (1954) పుట-4.
5. **Robert Sewell-List of Ant iquariam Remains in Madras Presidency (Madras 1882)**
6. **Madras Journal of Literature and Science** (1889-1894) గిడుగువారి వ్యాసంలో చెప్పారు.
7. పై పట్టికలోనే,
8. **The Temples of Mukhalingam-B Masthanaiah** (1977)పుట రెండులో ఈ సంగతులు చెప్పారు.
9. **Epigraphia Indica Vol. 4, Page** 314 - 318.
10. గురజాడ రచనలు - మహాకవి డైరీలు. ద్వితీయ ముద్రణ పుట 125
11. అందులోనే - పుట 42.
12. అందులోనే - పుట 41.
13 అందులోనే - పుట 117.

# రామమూర్తిగారు వ్యావహారిక భాషావాది ఎందుకయ్యారు ?

**చేకూరి రామారావు**

తెలుగు భాషలో ఒక విశేషమైన ధ్వని భేదమున్నది. ఉదాహరణకు పిట్టు-పిట్ట, పీకు-పీక, మెట్టు-మెట్ట, మేకు-మేక, పుట్టు-పుట్ట, గూడు-గూడ, పొట్టు-పొట్ట, గోడు-గోడ ఇట్లాంటి మాటల జంటలలో మొదటి అచ్చుని ఒకేరకంగా రాస్తున్నా కొందరి ఉచ్చారణలో భేదమున్నది. ఈ జంటలలో మొదటి మాటల్లో మొదటి అచ్చు సంవృతం, రెండో మాటల్లో మొదటి అచ్చు వివృతం. సంవృతాచ్చును ప్రధానధ్వనిగా గుర్తిస్తే పరాక్షరంలో ఉన్న అకారంవల్ల వివృతాచ్చు ఏర్పడుతున్నదని చెప్పవచ్చు. దీన్ని సాధించే సూత్రాన్ని స్వర వివృతీకరణ సూత్రం (Vowel lowering rule) అంటారు. తెలుగు భాషమీద పరిశోధన చేసిన ఆధునిక భాషా శాస్త్రవేత్తలందరూ ఈ సూత్రాన్ని గురించి రకరకాలుగా చెప్పారు. అయితే ఈ చర్చలన్నీ 1958 తరువాతవే. కాని 1912 డిసెంబరులో ప్రఖ్యాత బ్రిటిష ధ్వని శాస్త్రవేత్త డేనియల్ జోన్స్ (Daniel Jones) మద్రాసు యూనివర్సిటీలో ధ్వనిశాస్త్రం (Phonetics) మీద ఉపన్యాసాలు ఇయ్యటానికి వచ్చినపుడు గిడుగు రామమూర్తి గారు ఆయనకుమారుడు సీతాపతిగారితో కూడా వెళ్ళి ఈ స్వర వివృతీకరణనుగూర్చి చర్చించినట్లు సీతాపతిగారు 1964 కృష్ణా పత్రికలో వరుసగా ప్రచురించిన 'గతకాలపు స్మృతులు' అనేవ్యాసాల్లో తెలియజేశారు. తెలుగు భాషను గురించి ఆధునిక పద్ధతుల్లో ఆలోచించిన తొలి భాషా విజ్ఞాని గిడుగు రామమూర్తి

తెలుగు భాషను ఆంధ్రేతరులకు నేర్పటానికి ఇటీవలి కాలంలో ధ్వని లిపిని ఉపయోగించిన పుస్తకాలు కొన్ని వచ్చినై. 1963లో అచ్చయినా లీలిస్కర్ (Leigh-lisker) అనే అమెరికను రచించిన **An Introduction to spoken Telugu** అనే పుస్తకమే ఈ తరహా పుస్తకాలలో మొదటిదిగా పరిగణించబడుతున్నది. అయితే యిట్లాంటి పనికూడా సీతాపతిగారి సహాయంతో రామమూర్తిగారే తొలిసారిగా చేసినట్లు సీతాపతిగారి స్వీయ చరిత్రవలన మనం గ్రహించవచ్చు. డేనియల్ జోన్స్ కోరికపై 1914లో రామమూర్తిగారు ఈ పుస్తకాన్ని తయారుచేసి పంపారు. దానికవసరమైన

**Phonetic type writer**ని కూడా జోన్స్ వీరికి పంపించారు. దురదృష్టవశాత్తు ఈ పుస్తకం అచ్చుకాలేదు. ఆక్స్ఫర్డ్ యూనివర్సిటీలో ద్రావిడ భాషల్లో **Phonetics** గురించి బోధించిన **Firth** అనే ఆయన ఉపయోగించుకొన్నట్లు తెలుస్తుంది. తరువాత ఆ పుస్తకం ఏమైందో తెలియలేదు.

రామమూర్తిగారు సవరభాషమీద చేసిన కృషి అమోఘమైనది. 1930-1934 ప్రాంతాలలోనే సవరభాషమీద ఒక వ్యాకరణం రచించారు. దాదాపు అదేకాలంలో సవర-తెలుగు నిఘంటువును ప్రకటించారు. 1911 ప్రాంతములోనే తెలుగులో సవర వాచకాలు ప్రకటించారు. ఈ పుస్తకాలేవి ఇప్పుడు కనిపించడంలేదు. నిఘంటువు, వ్యాకరణం మాత్రం కొందరు వ్యక్తుల దగ్గఱ ఉన్నట్లు తెలుస్తున్నది. ఈయన రాసిన సవర వ్యాకరణం గొప్పతనం చెప్పటానిక్కి ఒక్క విషయం చెప్పితేచాలు ఇదే భాషమిద ఇటీవల పరిశోధనచేసి పరివర్తన వ్యాకరణాన్ని రచించిన **Stan Starosta** అనే భాషా పరిశోధకుడు తన పుస్తకాన్ని రామమూర్తిగారికి సగౌరవంగా అకింతం చేశాడు. ఈ పరిశోధకుడు ప్రస్తుతం హవాయీ యూనివర్సిటీలో భాషాశాస్త్రంలో ప్రొఫెసర్‌గా ఉన్నాడు.

రామమూర్తిగారు సవరల ఆచార వ్యవహారాలమీద కొన్ని వ్యాసాలు ప్రకటించారు. అవి ఎక్కడా పుస్తక రూపంలో రాలేదు. సవరల విద్యా సమస్యలమీద కూడా కొన్ని వ్యాసాలు రచించారు. వీటినిబట్టి రామమూర్తిగారి బహుముఖ వ్యాసంగాలను గూర్చి తెలుసుకోవచ్చు.

ఆధునిక భాషావాదాన్ని స్థాపిస్తూ ఆయన రాసిన వ్యాసాలు అనేకం. ఆయన జీవితంలో చివరిభాగం అంతా దీనికోసమే గడిపారు. అందులో **A Memorandum on Modern Telugu** అనే పుస్తకం 1914లో అచ్చయింది. దీనికాపీలుకూడా ఇపుడు ప్రచారంలో లేవు. ఈ పుస్తకాన్ని చూస్తే రామమూర్తిగారు తన కాలంనాటికి వచ్చిన భాషాశాస్త్రాన్ని ఎంతక్షుణ్ణంగా పరిశీలించారో తెలుసుకోవచ్చు.

1911-1913 సంవత్సరాలలో విశాఖపట్నంలో జరిగిన ఉపాధ్యాయ పరిషత్తు సభలలో రామమూర్తిగారు భాషల పుట్టుక, అభివృద్ధి గురించి ఉపన్యాసాలిచ్చి తెలుగు దేశంలో భాషాశాస్త్ర ప్రచారకులలో మొదటి వారయ్యారు.

పై సంఘటనలనుబట్టి గిడుగు రామమూర్తిగారు మహా మేధావి అని, గొప్ప పరిశోధకుడని తెలుగుదేశంలో తెలుగు భాషను గురించి ఆధునిక పద్ధతులలో ఆలోచించిన మొట్ట మొదటి భాషా శాస్త్రవేత్త అని మనం గ్రహించవచ్చు. రామమూర్తిగారి పరిశోధన చాలావిలువైనది. సవర భాషమీద చేసిన కృషి అమూల్యమైనది. అయితే రామమూర్తిగారి గొప్పతనానికి ఈపైన చెప్పినవేవీ కారణాలుగా నేను పరిగణించటంలేదు. తెలుగుదేశంలో పరిశోధకులకు కొరతలేదు. ఆయన కృషిచేసిన రంగాలలో ఆయన చెప్పిన వాటికన్నా కొత్త విషయాలను ఆయన తరువాతివారు చెప్పారు—బహుశా అంతకన్నా బాగా చెప్పి

ఉండవచ్చు. ఈ నిరంతర కృషికి మూలమైన ఆయన వ్యక్తిత్వంవల్ల గొప్పవాడు. ఆ మహావ్యక్తిత్వాన్ని దొరికినంత ఆధారంతో ప్రదర్శించడమే ఈ వ్యాసానికి లక్ష్యం.

యూనివర్సిటీలలో పనిచేస్తున్న వాళ్ళంకూడా పరిశోధనలు చేస్తున్నాము. Ph.D. చేస్తే కొన్నాళ్ళకి Readership రావచ్చు. పరిశోధక వ్యాసాలు రాస్తే యూనివర్సిటీ వారి ఖర్చుతో కాన్ఫరెన్సులకు పోవచ్చు. ఈ వ్యాసాల సంఖ్య పెరిగితే కొన్నాళ్ళ తరువాత ప్రొఫెసర్ కావచ్చు. కీర్తి ప్రతిష్ఠలు సంపాయించవచ్చు. డబ్బు సంపాదించ వచ్చు. పెద్ద పెద్ద కమిటీలలో మెంబర్లుకావచ్చు. కాని రామమూర్తిగారు ఇట్లాంటి వాటిని ఆశించి పరిశోధన చేయలేదు.

అప్పటి మద్రాసు ప్రభుత్వం సవరల అభివృద్ధికై చేసిన కృషిని గుర్తించి (1911-1913) ప్రతిఫలం ఏమి కోరుతావని అడిగితే "చదువురాక లోకజ్ఞానంలేక అడవిమృగములవలె కొండలమీద తిరుగుతున్న సవరలకోసం నా సొంత డబ్బుతో, కొద్దిపాటి గవర్నమెంటు గ్రాంటుతో నాకు అందుబాటులో ఉన్న గ్రామాలలో పాఠశాలలు నడుపుతున్నాను. వారి అభివృద్ధికి ప్రభుత్వము వారు కొండల మీదనే పాఠశాలలు నడిపి వారి విద్యా అభివృద్ధికి సహాయపడమ"ని కోరారు. దీనిని బట్టి రామమూర్తిగారి పరిశోధనకు మూలకారణం ఏమిటో తెలుసుకోవచ్చు. ఈ మహత్తర మానవతా దృష్టే ఆయన సర్వ పరిశోధనకు మూలసూత్రం.

1919లో ఆయన 'తెలుగు' అనే మాస పత్రికను ప్రారంభిస్తూ ఉపోద్ఘాతంలో ఈ విధంగా చెప్పారు. "We believe in the uplift of the masses. Is there not here this reform of language the surest means of spreading light among the poor and needy? Is not our beautiful living tongue a true Vehicle for message? Our little ones are starved for good literature. Our women hunger for pure imaginative books."

పేదవాళ్ళకి, పసిపిల్లలకు, స్త్రీలకు వాళ్ళకు అర్థమైన భాషలో విజ్ఞాన బోధ రామమూర్తిగారికి వ్యావహారిక భాషా వాదానికి లక్ష్యం. అదే ఆయన జీవితాశయం.

ఈ విషయాన్ని ఇంతకు పూర్వమే గుర్తించినవారు లేకపోలేదు. 1934లో J.A Yates తెలికచర్ల వెంకటరత్నం గారికి రాసిన ఉత్తరంలో రామమూర్తిగారిని గురించి ఇట్లా రాశారు "I think apart from the logic of his appeal. It was the call to liberty in it and humanity of it, since it meant freedom to the poor and outcast, that took me from the beginning."

అట్లాగే ఇంకొక ఉదాహరణ : జనవరి 15, 1940 నాడు ప్రజామిత్ర కార్యాలయంలో ఆయన ఈ విధంగా అన్నారు. "సంఘంలో నిరక్షరకుక్షులు ఎక్కువగా ఉన్నంత కాలం సంఘం వృద్ధిలోకి రాదు. సౌఖ్యమన్నది సంఘంలోని భాగ్యవంతులు, పెద్దలు, సామాన్య ప్రజలతోపాటు సమాంశులుగా అనుభవించవలసినదే గాని తామొక్కరే అనుభవించవలసినది కాదు. ప్రజలలో విద్యవ్యాపిస్తేగాని, సంఘం వృద్ధి

లోనికి రాదు."

రామమూర్తిగారు ఫ్యూడల్ సమాజం అంతరించి బూర్జువా సమాజం తలెత్తుతున్న సంధికాలంలో జీవించారు. రామమూర్తిగారు 1863లో జన్మించారు. ఆయన యవ్వనం 19వ శతాబ్దిలో గడిచింది. బూర్జువా సమాజపు స్వేచ్ఛాభావాలు, ప్రజాస్వామ్య భావాలు ఆ కాలపు చాలామంది మేధావులను ప్రభావితం చేసినై. అయితే రామమూర్తిగారి మానవతా దృష్టి బూర్జువా సమాజపు పరిధిని కూడా కొంతవరకు అతిక్రమించినట్లు ఈ క్రింది వాక్యాలనుబట్టి గ్రహించవచ్చు.

"ప్రజలలో విద్య వ్యాపింపజేయడమూ, ప్రజల ఆరోగ్యము కాపాడటమూ, ప్రజల సౌఖ్యము పోషించడమూ సంఘంలోని పెద్దలు చేయవలసిన ధర్మ కార్యమని ఆలోచించకూడదు. భాగ్యవంతమైన పెద్దలు తమ ఆరోగ్యం కాపాడుకొనవలెనంటే ప్రజల ఆరోగ్యం కాపాడవలెను."

దీని అర్థం రామమూర్తిగారు వర్గరహిత మానవతా వాదాన్ని ఊహించారని కాదు. ఆయన పెరిగిన వాతావరణానికి, బహుశా ఆంధ్ర దేశంలో అప్పటి పరిస్థితులకి ఆ విధమైన ఊహ చాలా దూరం. అయినా ప్రజల ఆరోగ్యం కాపాడటం అంటే ప్రజలను ఉద్ధరించటం కాదని, భాగ్యవంతులు తమ మనుగడకోసమైనా ఈ పనిచేయాలని రామమూర్తిగారు ఊహించగలిగారు. ఆ విషయం వల్ల తన కాలపు చాలా మంది మేధావుల కన్నా ఆయన ఒక అడుగు ముందే ఉన్నారని ఊహించవచ్చు.

రామమూర్తిగారు భాషా సంస్కరణ విషయంలోనే తన జీవితంలో చాలా భాగం వెచ్చించినా, సంఘ అభ్యుదయ విషయంలో ఆయనకు సంస్కరణ భావాలుండేవని చెప్పటానికి ఆధారాలున్నాయి. సంస్కరణను ఆయన ఒక ఉద్యమంగా నిర్వహించలేదు, జీవితంలో భాగంగా ఆచరించాడు. సవరలలో అస్పృశ్యులు అనబడే వారిని కూడా తనతోపాటు తన ఇంట్లో కూర్చోబెట్టుకుని భోజనం చేసేవాడు. బ్రాహ్మణ పంతుళ్ళు ఇన్‌స్పెక్షన్‌కోసం వెళ్ళటానికి నిరాకరించిన అస్పృశ్యుల స్కూళ్ళకి రామమూర్తిగారు వెళ్ళేవారు. రామమూర్తిగారు ఆరువేల నియోగి బ్రాహ్మణులు, 1874లో 15వ యేట వీరికి వడుగు అయ్యింది. చివరి వరకు పాటించారో లేదో చెప్పటానికి ఆధారాలు లేవు కాని అప్పటి నుండి ఆయన సంధ్యావందనం చేసేవారు. ఈ విషయాలనుబట్టి ఆలోచిస్తే వర్ణధర్మాల ఉక్కు చట్టం నుంచి బయటపడడానికి రామమూర్తిగారు కొంతైనా ప్రయత్నం చేశారని గుర్తించగలం.

వీరేశలింగంగారి ఉద్యమ ప్రభావం కూడా రామమూర్తిగారి మీద ఉంది. బాల వితంతువైన బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి కూతురికి పెళ్ళి చేయించటానికి తల్లిదండ్రులకు ధైర్యం లేకపోతే రామమూర్తిగారే స్వయంగా కన్యాదానం చేశారు. ఆ పెండ్లిలో వరుడు గౌతమీ కోకిలగా ప్రసిద్ధులయిన వేదుల సత్యనారాయణశాస్త్రి.

రామమూర్తిగారి వ్యక్తిత్వం విశిష్టమైనది. వీరేశలింగంగారివలె ఈయన

నిర్భయుడు. తను నమ్మిన ఆశయాల విషయంలో రాజీపడడు, గురజాడ అప్పారావు గారివలె లౌక్యుడుకాడు. ఆశయసాధనకోసం కష్టాల నెదుర్కోగల ధైర్యశాలి ఈయన. వీటికి సంబంధించిన ఘట్టాలను ఆయన జీవితం నుంచి చూపిస్తాను.

1913లో రామమూర్తిగారు అప్పటి విజయనగరం మహారాజావారి కుమారునికి, కుమార్తెకు ఇంగ్లీషు ట్యూటర్‌గా పాఠం చెప్పడానికి కుదురుకున్నారు. అప్పటికి ఆయన వయస్సు 50యేళ్లు. 1880 లోనే ఆయన సర్వీసులో చేరడంవల్ల 1911 నాటికి 30ఏళ్ళ సర్వీసు పూర్తయి పర్లాకిమిడి కాలేజినుంచి రిటైర్ అయ్యారు. రామమూర్తిగారు **Phonetic Script** ద్వారా **direct Method** లో వాళ్ళకు పాఠాలు చెప్పేవారు. ఎవరో గిట్టని వారి చెప్పుడు మాటలు నమ్మి పాత పద్ధతులలోనే పాఠం చెప్పాలని ఆజ్ఞాపించి, అది పాటించకపోతే నెలాఖరునుండి ఉద్యోగం మానెయ్యవచ్చునని రాణీగారు కబురుపంపారు. అందుకు రామమూర్తిగారు నెలాఖరుదాకా ఆగనక్కరలేదు, ఇప్పుడే మానివేస్తున్నాను అని చెప్పి, రాణీగారికి కబురు పంపి అప్పటి నుంచి కోటకు వెళ్ళడం మానేశారు. రామమూర్తి గారికి ఈ ఉద్యోగం ఇప్పించినది గురజాడ అప్పారావుగారు. ఈ విషయాన్ని తెలుసు కొన్న గురజాడ అప్పారావుగారు "రాజుల కొలువులో కుమ్మరి పురుగువలె వ్యవహ రించడమునకు నేనలవాటుపడ్డాను. మీ తండ్రి అలవాటుపడలేదు" అని తనతో అన్న ట్లుగా సీతాపతిగారు రాశారు. ఈ సంఘటనను బట్టి రామమూర్తిగారు తన ఆశయాల విషయంలో రాజీపడరు అని తెలుసుకోవచ్చు. అట్లాగే అదే సంవత్సరం ఈ సంఘటనకు కొంతకాలం ముందు విజయనగరం కోటలో జరిగిన ఒక సంగీతపు కచ్చేరీలో విజయ నగరపు రాజావారు తన వేశ్యతోసహా ఒక సోఫాలో కూర్చుని ఉండగా చూచి సహించ లేక గురజాడ అప్పారావుగారి సాయంతో బయటికి వచ్చేశారు. అందువల్లనే రామ మూర్తిగారి వ్యక్తిత్వాన్ని చాలవరకు వీరేశలింగంగారితో పోల్చవచ్చు. వీరేశలింగం గారిలాగే ఈయనకు కొంత **Puritanic attitude** ఉంది. అప్పారావుగారు లోకజ్ఞులు. ఆశయ సాధనలో కొన్ని చిన్న చిన్న వంకరటింకరలను లక్ష్యపెట్టరు. రామమూర్తి గారిది ఋజుమార్గం. ముక్కుకి సూటిగా పోయేరకం. కొన్ని విషయాలలో ఆయన అమాయకుడుగా కూడా కన్పిస్తాడు. ఒకసారి తనతోటి ఉపాధ్యాయుడు తన్ను చూట్టా నికి వస్తే "ఏమయ్యో! నీవు నీ భార్యను కొడుతున్నావటగదా?" అని అడిగారు. అందుకా ఉపాధ్యాయుడు సిగ్గుపడి "మీతో ఎవరన్నారండీ" అన్నాడు. "ఎవరోఏమిటి? మా ఆవిడే చెప్పింది" అని రామమూర్తిగారి సమాధానం. ఆ తరువాత రామమూర్తి గారి భార్య "మనలో మనం అనుకుంటే అవన్నీ ఆయనతో అంటారేమిటండీ? అని అడిగింది. అందుకు రామమూర్తిగారు, "ఇతరులకు చెప్పటానికి వీలులేని విషయాలు నాతో చెప్పవద్దు" అని శాసించారు. ఈ పై సంఘటనలనుబట్టి రామమూర్తిగారిది ఎంత సరళ మనస్తత్వమో, ఎంత ఋజు వ్యక్తిత్వమో మనకు తెలుస్తుంది.

రామమూర్తిగారి ఆంధ్రాభిమానాన్ని నిరూపించే సంఘటనలు కూడా ఆయన జీవి

తంలో ఉన్నై. పర్లాకిమిడి జమీందారులకు వ్యతిరేకంగా పర్లాకిమిడి తాలూకాను మద్రాసు రాష్ట్రంలో కలపవలసిందిగా 1932 ప్రాంతములో ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటుకు వచ్చిన ఒడోనెల్ కమీషన్‌ను కలుసుకొని నివేదిక సమర్పించారు. 1934 వరకు ఈ విషయంలో రామమూర్తిగారు పోరాటం సాగించారు. ఆయన కృషివల్ల పర్లాకిమిడి ప్రాంతములోని 400 గ్రామాలు ఇప్పటి ఆంధ్ర రాష్ట్రానికి దక్కినట్లుగా సీతాపతిగారు రాస్తున్నారు. అయినా తెలుగు దేశానికి రావలసిన పర్లాకిమిడితోసహా 150 గ్రామాలు ఒరిస్సా రాష్ట్రం లోనే కలపటానికి నిశ్చయమైంది. దాన్ని సహించని రామమూర్తిగారు 1935లో పర్లాకిమిడిని వదలి రాజమండ్రిలో స్థిర నివాసం ఏర్పరుచుకొన్నారు. తనదికాని రాష్ట్రంలో ఉండదలచుకోని ఆంధ్రాభిమానం ఆయనది.

సాధారణంగా రామమూర్తిగారిని మహాపండితుడుగానే ఆంధ్రదేశం గుర్తించింది. ఆయన రసహృదయులు అని చెప్పటానికి తగినసాక్ష్యాన్ని తెలికిచర్ల వెంకటరత్నంగారు సమకూర్చారు. భారతిలో ప్రచురితమైన "యెనక జల్మంలోన యెవరమోనంటి", అనే యెంకిపాట చదివి ఆనందం పట్టలేక Marginలో 'a gem' అని రాసుకొని వెంటనే నండూరి సుబ్బారావుగారికి అభినందన సందేశం పంపారు.

రామమూర్తిగారి బహుముఖ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించే జీవిత చరిత్రలేదు. ఆయన్ని గురించి తెలుసుకోవటానికి ఇప్పటి వరకు ఉన్న ఆధారాలు - 1962లో అచ్చయిన సీతాపతిగారి స్వీయచరిత్ర, 1964లో అకాడమి అచ్చువేసిన సీతాపతి, వెంకటరత్నంగార్ల ఉపన్యాసాలు, 1964లో కృష్ణా పత్రికలో సీతాపతిగారు 'గత కాలపు స్మృతులు' అనే పేరుతో రాసిన వ్యాస పరంపర, 1933లో రామమూర్తిగారి 70వ జన్మదినానికి సమర్పించిన "వ్యాస సంగ్రహము", 1940లో ఆయన మరణానంతరం అచ్చయిన "ప్రతిభ" ప్రత్యేక స్మారక సంచిక ప్రధానమైన ఆధారాలు. కందుకూరి వీరేశలింగం పంతులుగారిలాగా ఈయన స్వీయ చరిత్ర రాసుకోలేదు. గురజాడ అప్పారావుగారిలాగా డైరీలు రాసుకున్నట్టు మనకు తెలీదు. ఈయన రాసిన ఉత్తరాలు ఎవరూ సేకరించలేదు. సీతాపతిగారి మరణంతో రామమూర్తిగారు రాసుకొన్న నోట్సులు, పుస్తకాలు అందినవారు అందినంతవరకు సంగ్రహించగా ఎంతవరకూ మిగిలిఉన్నాయో తెలియదు. అయినా ఉన్న కొద్దిపాటి ఆధారాలనుబట్టి చూస్తే ఆయన బహుముఖ వ్యక్తిత్వానికి మానవదృష్టే అంతస్సూత్రమని గుర్తించగలం. మహనీయమైన మానవతా మూర్తి గిడుగు రామమూర్తి. ఈ మూర్తి భౌతికకాయం 77 ఏళ్ళ జీవితం తరువాత దాదాపు అర్ధశతాబ్దానికి పైగా ఆంధ్రులకు, సవరలకు సేవచేసి 22-1-1940 తేదీన అస్తమించింది.

[హైదరాబాదు కళాసాహితి వారి ఆధునికాంధ్ర సాహితీ నిర్మాతలు (1975)లో ప్రచురితం. పే. 33-43.]

# సంఘ సంస్కర్తగా గిడుగు

## అడపా రామకృష్ణారావు

సాధారణంగా సంఘసంస్కరణ కార్యకలాపాలలో ఆసక్తిచూపే వ్యక్తులు రెండు వర్గాలలో ఏదో ఒక దానికి చెందినవారై ఉంటారు. కొందరు తాము నమ్మిన సాంఘిక దురాచారాలపై ధ్వజమెత్తి, తమ సంస్కరణాభిలాషను ఒక ఉద్యమంగా మార్చి, ప్రజలలో ప్రచారం చేసి, అనేకుల దూషణ భూషణ తిరస్కారాలకు లోనవుతూ, తమ లక్ష్యాన్ని సాధించడం కోసం సమాజంలో తీవ్ర సంచలనం కలిగిస్తారు; మరికొందరు తమ విశ్వాసాలను పనిగట్టుకుని ఇతరులకైతే బోధించరు గాని, తమ వ్యక్తిగత జీవితంలో మాత్రం తాము నమ్మిన ఆశయాలకు అనుకూలంగా ప్రవర్తించి తమ సంఘసంస్కరణ ప్రియత్వాన్ని ఆచరణలో వ్యక్తం చేస్తారు తెలుగుదేశంలో మొదటి వర్గానికి ప్రథమోదాహరణంగా పేర్కొనదగ్గవారు కందుకూరి వీరేశలింగం గారని నిరభ్యంతరంగా అందరూ ఒప్పుకుంటారు. కాని గిడుగు వెంకటరామమూర్తిగారు రెండవ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారని మాత్రం చాలా మందికి తెలియదు. రామమూర్తిగారనగానే వ్యావహారిక భాషకు సంబంధించిన వాగ్వివాదాలూ, భాషను భ్రష్టం చేస్తున్నారని నాటి పండితులు కొందరు ఆయనను తిరస్కరించడమూ, ఆయన వారిపాండిత్యాన్ని అంతకు మించిన పాండిత్యంతో ప్రతిఘటించి వారికి వాగ్బంధం చేసి గిడుగు-పిడుగుగా ప్రసిద్ధులు కావడమే అందరికీ జ్ఞప్తికి వస్తుంది. గొప్ప పట్టుదల గల మనిషి అనికూడా ఆయన పేరుపొందారు. ఐతే ఈపట్టుదల కేవలం భాషావివాదానికీ, పర్లాకిమిడిని ఒరిస్సాలో చేర్చాలనే నిర్ణయాన్ని ప్రతిఘటించడానికీ మాత్రమే పరిమితం కాలేదని ఏ కొందరికోగాని తెలియదు. రామమూర్తి గారు సంఘ సంస్కరణ ప్రియులు కావడంవల్ల నిత్యజీవితంలో తమ విశ్వాసాలకు అనుకూలంగానే నడిచేవారు. సాటివారు ఆక్షేపించినా, బెదిరించినా ఏమాత్రం చలించక తమకు ధర్మమని తోచిన ప్రకారమే జీవించేవారు. ఇది తెలుగువారందరూ అవశ్యం తెలుసుకోదగ్గ సంగతి.

పందొమ్మిదవ శతాబ్దం ఇంకా ఆరంభం కాకముందే మనదేశంలో [illegible] పునరుజ్జీవనం తల ఎత్తింది. రాజకీయ కారణాలవల్ల పాశ్చాత్యులతో [illegible] మన కరడిన

సంబంధం ముఖ్యంగా ఇందుకు ప్రేరకమయింది. యూరప్ ఖండంలోనూ, అమెరికా లోనూ భౌతికశాస్త్ర విజ్ఞానం ప్రబలినకొద్దీ శతాబ్దాల తరబడి ప్రజల భావనపై సామంతం సాగించిన మత విశ్వాసాల ప్రాభవం సడలిపోవడం ప్రారంభమయింది. క్రమంగా 18వ శతాబ్దంలో వ్యాపించిన హేతువాదం వల్ల కొంత, 19వ శతాబ్దంలో తీగెలు సాగిన మానవతావాదంవల్ల, కాల్పనికోద్యమం వల్ల మరికొంత, మనిషి జన్మతః నికృష్టుడనీ, పాపాత్ముడనీ తరతరాలుగా క్రైస్తవ మతం ప్రచారం చేసిన సిద్ధాంతాన్ని పాశ్చాత్య సమాజం తిరస్కరించింది. పుట్టుకతో మనిషి ఉదాత్త స్వభావం కలవాడే ననీ, పరిసరాలూ, అతని నడతను శాసించే ప్రభుత్వం వంటి సంస్థలూ అతని బాగోగులకు కారణమనీ, సమాజంలో ప్రతివ్యక్తి ముఖ్యుడేననీ, వ్యక్తుల నైచ్యానికి దారి తీసే సాంఘిక దురాచారాలను నిర్మూలిస్తే అందరూ సుఖంగా జీవించగలుగుతారనీ చాటే నూతన సిద్ధాంతాలు వ్యాప్తిలోకి వచ్చాయి. మొదట బ్రిటన్ వంటి యూరోపియన్ దేశాలలోనూ, తరువాత అమెరికాలోనూ బానిసల వ్యవస్థ, మితిమీరిన మద్యపానం, జైళ్ళలో బందీలను క్రూరంగా హింసించడం, విద్యాభ్యాసంపేర పిల్లలను పాఠశాలలలో అమానుషంగా బెత్తాంతో దండించడం, స్త్రీలకు ఆస్తిమీదగాని, వోటు వెయ్యడానికిగాని హక్కులేకపోవడం వంటి అనేక దురాచారాలకు వ్యతిరేకంగా సంస్కరణోద్యమాలు ప్రారంభమయ్యాయి.

మనదేశంలో అప్పుడు కలకత్తానగరం మొత్తం దేశానికి రాజధానిగా ఉండి, ఆవేశపరులైన వంగయువకులు పాశ్చాత్య సంస్కృతి ప్రభావానికి ఎక్కువగా లోను కావడం వల్ల ఈ సంస్కరణోద్యమాలు ప్రప్రథమంగా ఆ రాష్ట్రంలో తలఎత్తాయి. రాజారామమోహనరాయ్ ప్రోద్బలంతో సతీసహగమనం, బాల్య వివాహం వంటి దురా చారాలకు వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమయింది. ఆ ఉద్యమాల నీడ మన రాష్ట్రం మీద కూడా పడింది. వితంతు వివాహాలను జరపడం ఒక ఉద్యమంగా చేపట్టారు వీరేశలింగం పంతులుగారు. ఆనాడు వ్యాప్తిలోఉన్న కన్యాశుల్క దురాచారాన్ని ప్రతిఘటించే ప్రయత్నానికి దోహదంగా ప్రజలలో భావ విప్లవం కలిగించే సంకల్పంతో గురజాడ వెంకట అప్పారావుగారు "కన్యాశుల్కం" నాటకం రచించారు. వారికి సమకాలికులే గాక సన్నిహితులు కూడా అయిన గిడుగు వెంకట రామమూర్తిగారు సహజంగా విజ్ఞులు కావడం వల్ల వారికి కూడా సంఘసంస్కరణానురక్తి ఉండడంలో విశేషమేమీ లేదు.

రామమూర్తి గారి సంఘసంస్కరణా సక్తి ఆయన వ్యక్తిగత జీవితంలో ముఖ్యంగా మూడు సందర్భాలలో మనకు స్పష్టంగా కనిపిస్తుంది. పర్లాకిమిడిలో ఆయన అధ్యాపకులుగా ఉండగా **Reading Room** అనే పేరుతో ఆ ఊళ్ళో ఒక సాంస్కృతిక సమాజం ఉండేది దానికి కొంత కాలం పాటు వారే కార్యదర్శిగా ఉండేవారు. ఆ సమాజం పక్షాన తరచుగా సంఘసంస్కరణకు సంబంధించిన సభలూ, చర్చలూ

జరుగుతూ ఉండేవి. బాలవితంతువులకు పునర్వివాహం చెయ్యడం మంచిదని వీరేశలింగం పంతులుగారు చేస్తున్న వాదం రామమూర్తి గారికి నచ్చింది. కాగా ఆ సంఘ సంస్కరణకు వ్యతిరేకంగా నాటి సనాతన సంప్రదాయ బద్ధులైన వారు చేసే ఆక్షేపణలను ఎదుర్కోవడానికి ఆయన స్మృతులు చదివి సభలలో వీరేశలింగంగారి ఉద్యమాన్ని బలపరుస్తూ ఉపన్యసిస్తూ ఉండేవారు ఆ రోజులలోనే పర్లాకిమిడిలో ఒక బాల వితంతు పునర్వివాహం చెయ్యడానికి వారు అవసరమైన ఏర్పాట్లు చేసి వీరేశలింగంగారికి ఉత్తరం వ్రాశారు. కాని ఆ సంగతి తెలిసి వారి మిత్రులలో ముఖ్యులైన వారొకరు వారి ప్రయత్నం విరమింపజేశారు. ఈ సంఘటనను వర్ణించిన వారి కుమారులు గిడుగు సీతాపతిగారు ఆ మిత్రుని పేరు వెల్లడించక పోవడం వల్ల వారెవరో తెలుసుకునే అవకాశం లేకుండా పోయింది. అప్పటికే రామమూర్తిగారు కళింగదేశ చరిత్ర పరిశోధనలోనూ, సవరభాషకు సంబంధించిన పరిశోధనలోనూ నిమగ్నులై ఉండడం వల్ల కూడా వారు సంఘసంస్కరణోద్యమాలలో కార్యకర్తగా వ్యవహరించలేదు గాని తమ వ్యక్తిగత జీవితంలో మాత్రం తమ సంఘసంస్కార ప్రియత్వాన్ని ప్రకటిస్తూనే వచ్చారు.

మొదట తాము జరుపదలచుకున్న బాల్య వితంతు పునర్వివాహానికి ఆటంకం ఏర్పడినా, కొంత కాలం తరువాత-1928లో-మరొక సందర్భంలో రామమూర్తిగారు ఒక వితంతు వివాహానికి ప్రోద్బలం ఇవ్వడమే గాక స్వయంగా కన్యాదానం కూడా చేశారు. అది పర్లాకిమిడిలోనే జరిగింది. బంకుమల్లి మల్లయ్యశాస్త్రిగారు సుప్రసిద్ధ విద్వాంసులు. ఆయన తమ కుమార్తె వివాహాన్ని ఆమె చిన్నపిల్లగా ఉన్నప్పుడే సంప్రదాయానుసారంగా తమ శాఖకు చెందిన పిల్లవాడికి ఇచ్చి చేశారు. కాని ఆ పెండ్లి జరిగిన కొద్దికాలానికే ఆ పిల్లవాడు మరణించడం వల్ల మల్లయ్యశాస్త్రిగారికి తన కుమార్తె గతి ఏమవుతుందని చాలా దుఃఖం కలిగింది. ఒక ఆలోచన తట్టి ధర్మశాస్త్ర గ్రంథాలు పరిశీలించడం ప్రారంభించారు. ఆ గ్రంథాలు చదివినవారు అప్పటికి పర్లాకిమిడిలో అనేకులున్నా వారిలో చాలామంది పూర్వాచారపరాయణులు. గిడుగు రామమూర్తిగారూ, వాసా సూర్యనారాయణ శాస్త్రిగారూ, గాది నరసింగరావుగారూ - ఈ ముగ్గురు మాత్రం కొంత ఉదారంగా యోచించేవారు కావడం వల్ల మల్లయ్యశాస్త్రిగారు తాము ధర్మశాస్త్రాలలో కనిపెట్టిన విషయం వారితో చర్చించారు. తమ కుమార్తెకు తిరిగి వివాహం చెయ్యడానికి ధర్మశాస్త్రం సమ్మతిస్తుందని ప్రమాణవాక్యాలు చూపించారు. ఐతే ఆమెను ఒకసారి కన్యాదానం చేశారు గనుక మళ్ళీ కన్యాదానం చేసే అధికారం మాత్రం ఆమె తల్లి దండ్రులకు ఉండదని కూడా శాస్త్రాలలో ఉన్నది.

ఆ పిల్లను వివాహం చేసుకోవడానికి ఇష్టపడే యువకులకోసం అన్వేషణ జరిగింది. వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు సమ్మతించారు. ఆయన విద్వత్కవులు. శిష్టకుటుంబానికి చెందినవారు. సంబంధం మంచిదని అందరూ సంతోషించారు. వివాహం జరిగింది.

మల్లయ్యశాస్త్రిగారికి కన్యాదానం చేసే అర్హత లేదుగనుక గిడుగు రామమూర్తి దంపతులు పీటలమీద కూర్చుని ఆ అమ్మాయిని తమ కుమార్తెగా భావించి కన్యాదానం చేశారు. రామమూర్తిగారు ఆ సందర్భంగా చూపిన చొరవకు కొందరు హర్షించారు. కొందరు విముఖత్వం ప్రకటించారు. ఇతరుల ఇష్టానిష్టాలకు ఏమాత్రం చలించక రామమూర్తి గారు మాత్రం తాము ధర్మమని విశ్వసించిన ఆ కార్యాన్ని అంతఃకరణ ప్రబోధాన్ని అనుసరించి ఆచరించారు.

గిడుగు రామమూర్తి గారి సంఘసంస్కరణాసక్తిని నిరూపించే మరొక సంఘటన 1908లో జరిగింది. కన్నేపల్లి లక్ష్మీ నరసింహంగారు రామమూర్తిగారి దగ్గర యఫ్. ఏ. చదువుకున్నారు. తరువాత ఆయన ఇంగ్లండు వెళ్ళి బారిస్టర్ అయి స్వదేశానికి తిరిగివచ్చారు. రామమూర్తిగారినీ, తక్కిన మిత్రులనూ చూడడానికి ఆయన పర్లాకిమిడి వచ్చారు. రామమూర్తిగారి ఇంటిలోనే బసచేశారు. శిష్యుని మీది అభిమానం వల్ల రామమూర్తిగారు ఒకరాత్రి ఆయన గౌరవార్థం విందు ఏర్పాటు చేసి పదిమంది స్నేహితులను ఆహ్వానించారు. ఐతే పిలిచిన వారిలో ముగ్గురు మాత్రమే విందులో పాల్గొన్నారు. మిగిలినవారు రాలేదు సరికదా, సీమకు వెళ్ళి జాతిభ్రష్టుడై తిరిగి వచ్చిన వ్యక్తికి పంక్తి భోజనం పెట్టినందుకు రామమూర్తిగారిని ఊరి పెద్దలు ఆ మరునాటి నుంచి వెలి వేశారు.

వారి ఇంట్లో వంట చేసే వంటలక్క హఠాత్తుగా పని మానుకున్నది. మంచి నీళ్ళు తెచ్చే బ్రాహ్మణుడు తిరిగి ముఖం చూపించలేదు రామమూర్తిగారికి అత్యంత సన్నిహితులైన ఊరి పెద్దలే కొందరు కాశీ గంగ తీర్థం పుచ్చుకోవడానికి సమ్మతిస్తే వెలి తీస్తామని ఆయనకు వర్తమానం పంపారు. కాని అందుకు ఆయన ఒప్పుకోలేదు. "మరెందుకైనా ప్రాయశ్చిత్తం చేసుకుంటాను గాని ఇందుకు మాత్రం కాదు-మీరు వెలిలో ఉంచినా సరే, మానినా సరే" అని ఖండితంగా సమాధానం చెప్పారు.

మరి కొందరు మిత్రులు రామమూర్తిగారి కుటుంబాన్ని వెలిలో ఉంచడానికి ఒక వంక మనసొప్పక, కలుపుకోవడానికి మరొక వంక ధైర్యం చాలక ఊళ్ళోసభలు జరిపి సముద్రం దాటి విదేశాలలో ఉండి వచ్చినవారూ, వారిని తమలో కలుపుకున్న వారూ ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన అవసరం ఉన్నదా, లేదా అని చర్చించారు. కాని ఆ సభలవల్ల కూడా ప్రయోజన మేమీ లేకపోయింది. ఆ వెలి కొంత కాలం సాగి తరువాత ఏ ప్రయత్నమూ లేకుండానే తొలగిపోయింది. సనాతనాచార పరాయణుల బెదిరింపులకు ఏ మాత్రం లొంగక రామమూర్తిగారు మాత్రం ఆ సందర్భంలో తమ స్వతంత్ర ప్రవృత్తిని నిలబెట్టుకున్నారు. సీతాపతిగారు చెప్పినట్టు రామమూర్తిగారు "మొదటి నుండిన్నీ సబబులేని అధికారమునకుగాని, అట్టి అధికారము వహించే వ్యక్తులకు గానీ లొంగక, తమ పట్టుదల వీడక, తమకు ఉచితమని తోచినపని నిర్భయంగా సాగిస్తూ వచ్చా" రనడానికి ఈ వెలి సంఘటన చక్కని తార్కాణం. దేశకాల పరిస్థితు

లను లేశమైనా అర్థం చేసుకోక ఏనాడో రూపొందించుకున్న శాస్త్ర నిషేధాలను యథాతథంగా పాటించడం అజ్ఞత అని రామమూర్తిగారు ఆచరణలో నిరూపించారు.

ఇక రామమూర్తిగారి సంఘ సంస్కరణాసక్తిని వ్యక్తం చేసే మూడవ సందర్భం అస్పృశ్యత పట్ల ఆయన వైఖరికి సంబంధించినది. పర్లాకిమిడి ప్రాంతంలో ఉన్న సవరలు (శబరులు) అనే గిరిజనుల స్థితిగతులను చక్కబరచడానికి రామమూర్తి గారు వారి భాష నేర్చుకుని; నిఘంటురచన చేసి, వారికి చదువు చెప్పడానికి సొంత ఖర్చుతో పాఠశాలలు నెలకొల్పి ఎన్నో విధాల కృషి చేశారు. ఈ సవరలలో కూడా కులాలు, తారతమ్యాలు ఉన్నవి. వారిలో అంటరాని వారుగా పరిగణింపబడే పైడి ("పానో") జాతికి చెందిన తవుడు అనే సవర దగ్గర రామమూర్తిగారు మొదట ఆ భాష నేర్చుకున్నారు. అతనికి సవర భాషతో పాటు ఒరియా, తెలుగు భాషలు కూడా రావడం వల్ల అతడు అచ్చమైన సవరభాషను గాక కొంత మిశ్రమ భాషను నేర్పాడు. ఈ సంగతి వారికి కొంత కాలం తరువాత తెలిసింది. ఐతే ఇక్కడ విశేష మేమిటంటే మన దేశంలో అస్పృశ్యతా నిర్మూలనోద్యమం, హరిజనోద్ధరణ కార్యక్రమం ప్రారంభం కావడానికి 40 సంవత్సరాలకు ముందే, 1894 ప్రాంతంలోనే, రామమూర్తిగారు గిరిజనులైన సవరలను, వారిలో అంటరానివారైన పైడి ("పానో") జాతి వారిని తమ ఇంటిలో ఉంచుకుని తమకు దగ్గరగా కూర్చుండబెట్టుకుని సవరభాష నేర్చుకున్నారు.

అంతే కాదు. తరువాత కొంత కాలానికి హరిజనుల కోసం పాఠశాలలు వెలిశాయి. ఆ బడులలో చదువు ఎట్లా సాగుతున్నదో పరీక్షించడానికి తమ తోటి ఉపాధ్యాయులు వెనుకాడితే రామమూర్తిగారు మాత్రం సంతోషంగా వెళ్ళి ఆ బాధ్యత నిర్వర్తించి వస్తూ ఉండేవారు. మనిషికీ మనిషికీ మధ్య అంటరానితనం కేవలం నిరర్థకమైన ఆచారమని ఆయన మాటలలో వ్రాతలలో కాక తమ చేతలతో నిరూపించారు.

పైడి వాని దగ్గర తాను నేర్చుకున్న సవరభాష స్వచ్ఛమైనది కాదని రామమూర్తిగారు ఆ భాష నేర్చుకున్న రెండేండ్లకు గుర్తించారు. తరువాత వారు తమ కంటె వయస్సులో పెద్దవాడైన మరొక సవరతో "నేస్తం" కట్టారు-అంటే, స్నేహం చేశారన్నమాట. సవరలతో నేస్తం కట్టడం అనేది ఒక తతంగం.

మంచి రోజు చూసి నేస్తం కట్టదలచిన ఆ సవర కుండెడు తేనె, అరటి పండ్ల గెల, పసుపుకొమ్ములు, నాలుగు కొండ చీపుళ్ళ కట్ట, మండిగ నిండా జొన్నలు, అల్లము, పొగాకు తీసుకుని రామమూర్తిగారి ఇంటికి వచ్చాడు. ఆయన ఆ అతిథిని ఆదరించి కుర్చీలో కూర్చోబెట్టారు. అతడిచ్చిన కానుకలను అందుకున్నారు. ఒక ఎరుపు రంగు తలపాగాను, రెండు కమలా ఫలాలను, తవ్వెడు బియ్యాన్ని, పసుపు కొమ్మను, అల్లం ముక్కను, పానకాన్ని, రెండు పొగాకు చుట్టలను కానుకగా అతని కిచ్చారు. "గడిఞేన్, గడీనమ్," అని ఉభయులు మూడుసారులు

అన్నారు. చీపురుపుల్లలు ఒకరి చేతి నుంచి మరొకరు పుచ్చుకుని రెండేసి ముక్కలు చేసి పారవేశారు ఆ సవర మాటలకు "నా స్నేహితుడా, నీ స్నేహితుడను" అని అర్థ మట చీపురుపుల్లలు విరిచి పారవెయ్యడం ప్రమాణం వెయ్యడానికి సూచన. ఆయన ఈ విధంగా ఆ సవరకు సంతృప్తికలిగేటట్లు నేస్తం కట్టి, అతనితో సవరభాష మాట లాడుతూ, అతడు కుదిర్చిన ఒక సవర పిల్లవాడిని తమ ఇంట్లో ఉంచుకుని వాడిదగ్గర స్వచ్ఛమైన సవర భాష నేర్చుకున్నారు. ఇక్కడ మనం గమనించవలసిన దేమిటంటే- దాదాపు నూరేండ్ల క్రిందటనే రామమూర్తిగారు ఎక్కడో కొండలమధ్య నివసిస్తూ, అతి సామాన్య స్థితికి చెందిన ఒక సవర వ్యక్తిని తనతో సమానంగా భావించి, కుర్చీలో కూర్చుండబెట్టి నిజంగానే స్నేహితుడిగా పరిగణించారు. హరిజనులను, గిరిజనులను ఉద్ధరించడానికి కంకణం కట్టుకున్నామంటూ ఇటీవల మన సమాజంలో వెలిసిన స్వార్థ పరులైన వంచకుల వర్తనతో పోల్చి చూస్తే రామమూర్తిగారి ఔన్నత్యం మనకు స్పష్టంగా అర్థమవుతుంది.

మతపరమైన నిరర్థకాచారాలను పాటించక పోవడమే కాదు, రామమూర్తిగారు అర్థంలేని సాంఘిక సంప్రదాయాలను, అంధవిశ్వాసాలను కూడా తిరస్కరించేవారని కొన్ని సందర్భాలలో వారి ప్రవర్తనవల్ల తెలుస్తుంది.

పర్లాకిమిడిలో మకర సంక్రాంతి పర్వంలో కనుమునాడు పశువుల పండుగ చేస్తారు. ఆ రోజున పశువులకు చురకలు వేస్తారు. పశువులతోపాటు మనుష్యులకు కూడా చురకలువేసే ఆచారం అక్కడ సాగుతూ ఉండేది. రామమూర్తిగారు రాజాగారి కుమారునికి పాఠం చెప్పుతూ ఉండగా రాజసేవకులు ఆయన దగ్గరకు వచ్చి "అయ్యా! మీకు కూడా కడుపు మీద రెండు చురకలు వెయ్యవలసినదని మహారాజావారి సెలవయిం"దని చెప్పారు. ఆయనకు వల్లమాలిన కోపం వచ్చింది. "మిగిలిన సంస్థా నాలలో మావంటి వారికి పండుగనాడు కట్నాలూ, కానుకలూ ఇస్తారు. ఈ సంస్థా నంలో కడుపుమీద వాతలు పెట్టడం మర్యాదకాబోలు. చాలా చక్కగా ఉంది" అని కటువుగా అన్నారు. పాఠం చదువుతున్న రాజకుమారుడు సేవకులను మందలించి పంపివేశాడు. మహారాజావారి ఆజ్ఞ తిరస్కరించి ఆయన ప్రతిష్ఠకు భంగం కలిగించా రని సేవకులు రాజుగారితో చిలువలు, పలువలు చేర్చి చెప్పారు. "రాజాగారికి కోపం తెప్పించారు. మీ ఉద్యోగం ఊడిపోతుం"దని ఊరి పెద్దలు కొందరు రామమూర్తి గారితో అన్నారు. "ఉద్యోగం పోతే పోతుంది. అంతకంటె ఆత్మ గౌరవం నిలబెట్టు కోవడం నాకు ముఖ్యం" అని ఆయన సమాధానమిచ్చారు. ఐతే ఆయన ఉద్యోగం మాత్రం పోలేదు.

విజయనగర సంస్థానంలో ఆనందగజపతి మహారాజుగారి పిల్లలకు 1913లో రామమూర్తిగారు చదువుచెప్పుతున్న రోజులలో కూడా ఆయన ఈ విధంగానే తన ఆత్మాభిమానాన్ని, స్వతంత్రతను నిలబెట్టుకున్నారు. రాజాగారు సంగీత సభలను,

హరికథలను ఏర్పాటు చేసేవారు. ఒకసారి వారు సభ్యులందరూ కూర్చున్న తరువాత తమ వేశ్యను వెంటబెట్టుకుని సభకు వచ్చారు. సభలో ఉన్నవారందరూ గౌరవ సూచకంగా లేచి నిలబడ్డారు. వేశ్య కూడా రాజుగారి వెంట రావడంవల్ల ఇక అక్కడ ఉండటము రామమూర్తిగారికి ఇష్టం లేకపోయింది. వారి మిత్రులూ, ఆ సంస్థానం దివాన్ అయిన గురజాడ వెంకట అప్పారావుగారి వంక చూసి తాను వెళ్ళబోతున్నానని సైగ చేశారు. ఒక్క క్షణం ఆగవలసినదని అప్పారావుగారు ఆయనకు సూచించి, "మొన్న మీరు చెప్పిన పని పూర్తిచెయ్యవలసి ఉంది. గనుక నేనూ, రామమూర్తి తమసెలవు తీసుకొని వెడుతున్నా"మని రాజాగారితో చెప్పారు మిత్రులిద్దరూ వెళ్ళి పోయారు. నిజానికి వారప్పుడు నిర్వహించవలసిన రాచకార్యమేమీ లేదు. అది అప్పారావుగారి సమయస్ఫూర్తికి ఉదాహరణం మాత్రమే.

ఆనాటి నుంచి రాజాగారు ఏర్పాటుచేసే సభలకు రామమూర్తి గారు వెళ్ళడం మానుకున్నారు. "రామమూర్తి పంతులుకు చాలా గర్వం. రాజా వారి దర్శనంచేసుకోడు. వారి సభలకు రాడు" అని గిట్టని వారు రాజుగారితో చాడీలు చెప్పేవారు. కాని ఉదార హృదయుడు గనుక ఆయన వారి మాటలు పట్టించుకోలేదు. భోగం మేళాలను బహిష్కరించడం, వేశ్యలను ఉంచుకునే వ్యవస్థను ప్రతిఘటించటం ఒక ఉద్యమంగా సాగుతున్న కాలమది. కొంత కాలం పాటు మధురవాణిని తన పోషణలో ఉంచుకున్న గిరీశమే బుచ్చమ్మతో "దేవతలు విమానం పంపించి నన్ను స్వర్గానికి తీసుకువెళతారు. స్వర్గానికి వెళ్ళానని నాకు అక్కడ మాత్రం సుఖం ఉంటుందనుకున్నావా వొదినా? నవాభరణ భూషితురాలయి రంభ తక్కుతూ తారుతూ వొచ్చి 'హా' ప్రియా! గిరీశ ! నీలాటి సుందరుణ్ణి యెన్నడూ నేను చూడలేదు, రమ్మి, నన్ను చేకొమ్మి" అని రెక్కబట్టుకు లాగుతుంది. నేనేవంటాను? 'ఛీ! అవతలికి పో - నేను యాంటీనాచ్చి! సానిది తాకితే, పరమ అపవిత్రంగా తలుస్తాను. పియర్సు సబ్బు రాసి కడిగితేనే గాని యీ చేతికి కళ్మలం పోదు'.... అని అంటాను" అని ఉపన్యాస మిస్తాడుగదా. ఏ ఉపన్యాసాలూ లేకుండానే, విజయనగరం మహారాజా వారే ఏర్పరచిన సభ అయినా వేశ్య ముందు లేచి నిలబడడం ఆత్మగౌరవానికి భంగమని రామమూర్తి గారు అటువంటి సభలకు వెళ్ళక తమ స్వాతంత్ర్య ప్రియత్వాన్ని నిరూపించుకున్నారు.

మరొక సందర్భంలో మూఢవిశ్వాసాల పట్ల రామమూర్తి గారి విముఖత్వం స్పష్టంగా వెల్లడి అయింది. ఆయన పర్లాకిమిడిలో ఉంటున్న రోజులలో 1898 లో అక్కడికి ఒక జ్యోతిష శాస్త్రవేత్త వచ్చాడు. రాజాగారితో తాను త్రికాలవేదినని చెప్పుకుని, సభ జరిపి తన విద్వత్తును పరీక్షించ వలసినదిగా కోరాడు. సభ ఏర్పాటయింది. కేవలం జాతకచక్రం చూస్తే చాలు, ఆ వ్యక్తి పుట్టిన తిథి, మాస, సంవత్సర వివరాలు గ్రహాల ఉనికిని బట్టి తాను చెప్పగలనన్నాడు. కొందరు తమ జాతక చక్రాలను అతని కిచ్చారు. వాటిలో ఉన్న గ్రహస్థితిని బట్టి అతడు వారు పుట్టిన తేదీని సరిగానే చెప్ప

గలిగాడు. రామమూర్తి గారికి జ్యోతిష శాస్త్రం మీద నమ్మకం లేదు. "ఇప్పుడైనా ఆయనకు నమ్మకం కుదురుతుం"దని సభలో ఉన్నవారిలో ఒకన్నారు. వెంటనే రామమూర్తిగారు "ఇంతవరకు ఈ దైవజ్ఞుడు చెప్పింది ఖగోళ శాస్త్ర విషయమే కాని జాతక ఫల విషయం కాదు. ఖగోళశాస్త్రమూ, గణితమూ నేర్చుకున్న వారందరూ ఈ తేదీల సంగతి చెప్పగలరు. ఎట్లా చెప్పగలరో ఈ దైవజ్ఞుల నడిగితే వీరే చెప్పగలరు. నాకు నమ్మకం లేనిది జాతక ఫలాల విషయంలోనే కాని గణితానికి సంబంధించి కాదు" అని సమాధానమిచ్చారు. ఆ జ్యోతిష శాస్త్రవేత్త అంతటితో ఊరుకుంటే బాగుండేది. కాని సభలో తనకు గౌరవం పెరగాలని "గణితంతో నాకు పనిలేదు. భగవంతుడు ప్రసాదించిన దివ్యజ్ఞానంతో నేను చెప్పగల"నని ప్రగల్భాలు పలికాడు. రామమూర్తి గారికి విపరీతంగా కోపం వచ్చింది. "ఐతే మీరు జాతకచక్రం చూడగానే పుట్టిన తేదీ వివరాలు చెప్పరేం? కాగితం మీద అంకెలు వేసుకుని పావుగంట పైగా కాలక్షేపం చేసి చెపుతున్నారేం?" అని నిలదీసి అడిగి అతనికి వాగ్బంధం చేయించారు. తెలియనిది తెలిసినట్లు నటించే వారిని చూస్తే ఆయన ఎంత మాత్రం సహించలేక పోయేవారు.

పందొమ్మిదవ శతాబ్దంలో మన దేశంలో నవయుగోదయానికి వైతాళికులైన వారి పట్టికలో రామమూర్తి గారి పేరు తప్పక మనకు కనిపిస్తుంది. సందేహం వచ్చినప్పుడు అంతఃకరణ ప్రవృత్తినే ప్రమాణంగా పాటించి, తాను నమ్మిన ధర్మాన్ని నిర్భయంగా ఆచరించి చూపిన ఆదర్శజీవి ఆయన. సంఘ సంస్కరణాన్ని ఒక ఉద్యమంగా పాటించకపోయినా, ప్రధానంగా ఇతర వ్యావృత్తులలోనే కాలం గడిపినా, దైనందిన జీవితంలో మాత్రం తన సంస్కరణాసక్తి ననుసరించి ప్రవర్తించి అనేకులకు ఆయన మార్గదర్శకుడయ్యారు.

# కవిత్వంలో వ్యావహారిక భాషా ప్రయోగం

కడియాల రామమోహనరాయ్

వాడుక భాషలో కవిత్వం రాయాలన్న కవుల కోరిక కోరికగానే వుంది. ప్రయత్నాలైతే సాగుతున్నాయి గాని యింకా కవిత్వంలో కృతక గ్రాంధిక రూపాలు వదలటం లేదు. తెలుగు నుడికారానికి దూరమైన సంస్కృతపు పలుకుబడి, ఇంగ్లీషు పలుకుబడి కవిత్వాన్ని సామాన్య ప్రజలకు దూరం చేస్తున్నాయి. వేమన పద్యాలవంటి కవిత్వం తక్కువగా వచ్చింది. నన్నయకు పూర్వం నుండి ఇప్పటి వరకు ప్రజలు తమ సుఖ దుఃఖాలను జానపద సాహిత్య రూపంలో భద్రపరుచుకున్నారు. శిష్టసాహిత్యం ప్రజల్లో కొద్దిమందికే పరిమితమైపోయింది. నిజమైన తెలుగు, స్త్రీలనోళ్ళలో, శ్రామికుల కష్ట సుఖాల్లో, పిల్లల ఆటపాటల్లో, సంబరాల్లో, పండగల్లో వుంది గాని నిఘంటువుల్లో, వ్యాకరణాల్లో, ఛందో గ్రంథాల్లోలేదు. ప్రాచీన కావ్యాల్లో సంభాషణా రూపమైన కొన్నిపద్యాలు వాడుక భాషకు దగ్గరగా వుండేమాట నిజమే. కాని అంతటితో సరిపోదు. గ్రామ్యమనీ, అలగాజనం భాషఅనీ దేన్నైతే పండితులు నిందిస్తూ వచ్చారో ఆ భాషలోనే కవిత్వం రచించాల్సిన అవసరం ఇప్పుడెంతైనా వుంది.

గిడుగు రామమూర్తి పంతులుగారు రాసింది వాడుక భాషలో కాదనీ, క్రియా రూపాలు వాడుకభాషలోవున్నా మిగిలినదంతా గ్రాంధిక మేననీ పండితులు ఆక్షేపించారు. వాళ్ళ ఆక్షేపణ నిజమే. గిడుగు వారి వచన రచన తెనుగు నుడికారంతో తొణికిసలాడే జీవద్భాషకాదు. ఆ కొరతను గురజాడవారి 'కన్యాశుల్కం' తీర్చింది. కన్యాశుల్కం మొత్తంలో ఎక్కడా కృతక గ్రాంధిక రూపం చొరబడలేదు. కన్యాశుల్కంలో పాత్రల సంభాషణలు నిత్యజీవితంలో మాట్లాడినంత స్వాభావికంగా వున్నాయి. కాని గురజాడ వారు కూడ కవిత్వం దగ్గరకు వచ్చేటప్పటికి పూర్తివాడుక భాషను ప్రయోగించలేక పోయారు.

"ప్రాజ్ఞులకె కనికట్టు
చెరుచుట చిత్రమా! తీవలకు
తవిరుల తెరంగువ, కాంచనము
సింగారమందురు లలవలకు;

కానిమ్ము; గాని, కమ్మని తావి
గ్రమ్మెడి పుష్పనిచయము ప్రేమ
కా? అదిలేక మంకెనకెంపు
కాంతల యందము"

—('కాసులు': 'ముత్యాలసరాలు')-ఇటువంటి కొన్ని పంక్తుల్ని చూస్తే గుర జాడవారి వ్యావహారికం కవిత్వంలో పదునుదేర లేదనిపిస్తుంది. శ్రీ శ్రీ గారన్నట్లు గుర జాడవారి ముత్యాలసరాలు గనిలోనుండి తీసిన మొదటి వజ్రాలు.

గురజాడ వారి మార్గంలో నడిచిన శ్రీ శ్రీ వాడుకభాషపై అపరిమితమైన మక్కువ చూపుతారు. మహాప్రస్థానంలో ప్రజల వ్యవహారంలో లేని పదాలు "ఘూకం, భేకం, హాల్లీసకం, ఝుంఝూనిలం, షడ్జధ్వానం, ప్రదీప్తకీల, ప్రవాళమాల, మఖవ ధనుర్ద్యుతి, మిహిరవాజితతి" మొదలైనవి వున్నాయి. సంప్రదాయ వాసన పూర్తిగా వదలక పోవడం చేతనే నానా విధంగా రచించానని శ్రీ శ్రీ స్పష్టం చేశారు. విరసంలో చేరాక కష్టజీవుల భాషలో శ్రీశ్రీ 'ఏమ్నటి జట్కావాల' గీతం రచించారు. ఉద్దేశ్యమైతే మంచిదే గాని ఆయన ప్రయత్నం సరిగా ఫలించలేదు. జట్కావాలా భాష కాలేది. జట్కావాలా జీవితాన్ని, భాషను శ్రీశ్రీ సరిగా అర్థం చేసుకోలేదు.

శ్రీశ్రీ తరువాత విప్లవకవులు జనసామాన్యానికి అర్థమయ్యే రీతిలో ఉత్తమగీతాలు కొన్ని రచించారు. శివుడు, గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు, మొద లైన వారు రాసిన గీతాలు ప్రజల్ని ఉత్సాహపరుస్తున్నాయి, చైతన్య వంతుల్ని చేస్తు న్నాయి. ఈ కవుల గీతాల్లో కృత్రిమ రూపాలు చాల తక్కువ. జానపద గేయాలనుండి వీళ్ళు ప్రేరణ పొందటంచేత ప్రజల భాషలో వీరికి పట్టు చిక్కింది. కవిత్వం జన జీవితంలో ఒక భాగమని ప్రజలు గ్రహించేటందుకు వీరి కవితలు తోడ్పడుతున్నాయి. ఆధునిక కవిత్వానికి 'పాట' ఒక్కటే శరణ్యం కాదు. వచన కవిత్వం ఆధునిక భావా లను సామాన్యులకు అందించటానికి బాగా పనికొస్తుంది. పాట ఎక్కువ మందిని చేరు తుందని, అంతమాత్రం చేత వచన కవిత్వాన్ని తక్కువ అంచనా వెయ్యకూడదు. కవిత్వగుణం దేన్లోనైనా సరిసమానంగా వుండొచ్చు.

కవిత్వమనేటప్పటికి మామూలు మనుష్యులు మాట్లాడుకునే భాషకంటె భిన్నమని ఒక అభిప్రాయం కవుల్లో బలంగా నాటుకొని వున్నది. కవిత్వంలో పదాల కనువైన లయ, తూగు వుండాలని, గొంతెత్తి చదివినా, పాడినా చెవికింపుగా వుండాలని కవులు కోరుకుంటారు. కాని భావావేశంలో తాము పలుకుతున్నది తమగొంతుతో కాదన్నది మరచిపోతారు. తెలుగుదేశంలో 'అభినవ' బిరుదులతో పెక్కుమంది కవులు కన్పిస్తారు. కవిత్వమంటే ప్రతిధ్వని కాదని, ప్రతికవీ సొంతగొంతుకోసం వెతుక్కోవాలని మర్చి పోతారు. ఈ శతాబ్దంలో కూడ విశ్వనాథ, జాషువా, కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీల ప్రతిభకు మురిసిపోయి, వారిశైలిలో రాసి కాలగర్భంలో కలిసిపోయిన, కలిసిపోతున్న కవు

లెందరో వున్నారు.

ఆధునిక కవులు కొందరు కవిత్వంలో సంగీతానికి ప్రాముఖ్యం లేదని తలచి 'వచన కవిత్వం'తో తమ భావాలను వెదజల్లారు. వీళ్ళు తమభావాలు ప్రజలకు అర్థం కావాలని తలచటంచేత వీలైనంతవరకు గ్రాంథిక రూపాలను వదిలి పెట్టారు. కాని ప్రసిద్ధులైన కొందరి కవితల్లో గ్రాంథిక రూపాలు కూడ అక్కడక్కడ కన్పిస్తున్నా యంటే కవిత్వం యింకా నేల విడిచి, గాలిలో సామాన్యప్రజలకు అందీ అందనంత ఎత్తులో విహరిస్తున్నదన్న మాట.

కవిత్వం వాడుకభాషలోనే ఎందుకురాయాలన్న ఆక్షేపణకు యీవ్యాసంలో జవాబు చెప్పను. అస్సలు ఏరచనైనా వాడుక భాషలోనే ఎందుకుండాలి? అనే ప్రశ్నకు గిడుగు మొదలైన వారు జవాబు చెప్పివుండటాన కథ, నవల, నాటకం, వ్యాసంలో లాగ కాకుండ కవిత్వంలో భాషవేరుగా వుండాలని వాదించేవారు గమనించ వలసిన కొన్ని అంశాల్ని ప్రస్తావిస్తాను.

"నన్నయ ఆంధ్ర మహాభారతంలో రాసింది 11వ శతాబ్దం నాటి ప్రజలవాడుక భాషకాదా?" అని ప్రశ్నిస్తే కాదనే చెప్పవలసివుంటుంది. తెలుగుదనానికి దూరమైన

"ప్రక్షాళిత పాణి పాదవదనుండు
దూరీకృత కంటక పాషాణ శల్యశకలంబును"

మొదలైన పెక్కురూపాలను నన్నయ ప్రయోగించాడు. ఇది యేకాలంలోను తెలుగు ప్రజల వాడుకభాష కాదు. వాడుక భాషకు సన్నిహితంగా కన్పించే కొన్ని పద్యాలు నన్నయ రచించాడు.

"వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె యహహ ! మహారాజ్య మదాంధకారమది పాసెనొకో"

(ఆదిపర్వము-షష్ఠాశ్వాసము-90)

"నీవును బ్రహ్మచారివి వినీతుడ వేన్నును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగనన్నుఁబరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయఁ జేయుమునాకుఁ బ్రియంబు నావుడున్"

(ఆదిపర్వము-తృతీయాశ్వాసము-129)

ఇటువంటివికూడ పూర్తిగా వాడుక భాష అని చెప్పటానికి వీల్లేనివి. "సత్సభాంతర సరసీవనాల"లో పండితుల మెప్పుకోసం ప్రజల భాషను ఛందోబద్ధంగా 'సంస్కరించి'నవే.

తిక్కన కవిత్వంలో తెనుగునుడికారం ఎక్కువని, పాత్రలస్వభావాలను తెలుగు వారనిపించేలాగ చిత్రించాడని మహాభారత విమర్శకులు తలుస్తారు. కుంతి, ద్రౌపది తెలుగువారి ఆడపడుచుల్లాగా కన్పిస్తారు. ఉపమానాలు, నవ్వులు, చూపులు ఎన్నిట్లోనో

తిక్కన విశిష్టతను కనబరచాడు. తిక్కన తన కాలంనాటి వాడుకభాషలో మహాభారతం రచించాడనిగూడ ఒక ప్రచారం వున్నది. ఈ ప్రచారం కొంతవరకే నిజం. నెల్లూరు మాండలికాలను ప్రయోగించటం, వాక్య విన్యాసంలో తెనుగు నుడికారానికి ప్రాధాన్య మివ్వడం వాస్తవమే. కాని ఆనాటికి కూడ ప్రజల వ్యవహారంలో లేని పదాలు అనేకం ఆయన ఉపయోగించాడు. మాట్లాడినంత సహజంగా దొర్లిన

"నీవు సుభద్రకంటెఁగడు నెయ్యము గారవమందలిర్ప సం
భావన చేయు దిట్టినను(బంకజనాభ యొకండు రాజ సూ
యావ భృథంబు నందు శుచియై పెనుపొందిన వేణిఁబట్టి యీ
యేవురుఁజూడగా సభకునీడ్చెఁగులాంగన నిట్లొనర్తురే"

(ఉద్యోగ-తృతీయ-110)

"ఇవి దుస్ససేను వ్రేళ్ళం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి కౌ
రవుల కడఁ దీఱు మాటల
యవసరమునఁదలఁప వలయు నచ్యుతవినిన్"

(ఉద్యోగ-తృతీయ-116)

మొదలైన పద్యాలు గమనిస్తే తిక్కన సంస్కృత ప్రాధాన్యాన్ని తగ్గించాడని పిస్తుంది. కాని అవసరమనుకున్నచోట్ల సంస్కృతపదభూయిష్ఠమైన సమాసాలనుపయోగించి పద్యాలు రచించాడు.

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగులో మత్పతుల్
గీర్వాణా కృతులేవురిష్ట నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణముంగొనుట తథ్యం బెమ్మెయింగీచకా!"

(విరాట-ద్వితీయ-౯౯)

మొదలైన పద్యాలు వాడుకభాషకు దగ్గరైనవి కావు.

ఎఱ్ఱా ప్రెగ్గడ మహాభారత రచనలో నన్నయను అనుసరించినా హరివంశంలో ఆయన శైలిభిన్నంగా వుంటుంది. కృష్ణలీలలు, కృష్ణుని బాల్యవర్ణనల్లో పద్యాలు వాడుక భాషకు దగ్గరగా వుంటాయి.

"నాయింటం బది గడవల
నేయి పెరుగుఁబాలుఁద్రావె నీప్రియ తనయుం
డోయమ్మ కడవలన్నియు
గేయని బోరగిలఁద్రోచి కేరుచు వచ్చెన్"

(హరివంశము-శ్రీకృష్ణుని బాల్య క్రీడలు)

ఎఱ్ఱయ కూడ కొన్ని చోట్ల జటిలమైన పదాలనుపయోగించి శైలిని క్లిష్టతరం

చేశాడు.

విద్వదౌషధమని పేరు గాంచిన శ్రీనాథుని శృంగార నైషధంలో అక్కడక్కడ తేటతెనుగు నుడి కారంతో సాగిన పద్యాలు

"నిఱుపేద యింటికేఁగిక
ఱఱతెంచు నిధాన మట్లు పఱతెంచెన యే
నిఱుపేద యభాగ్యతఁ దలు
పిఱియఁగ నిడుగాక చొరఁగ నిచ్చునె దానిన్

(శృంగార నైషధము - చతుర్థ 73-)మొదలైనవి కొన్ని లేకపోలేదు. కాని శ్రీనాథుని పల్నాటివీర చరిత్రలో, చాటువుల్లో వాడుక సొగసులెక్కువగా కన్పిస్తాయి.

"రసికుఁడు పోవఁడు పల్నా
డెసఁగంగా రంభయైననేకులె వడుకున్
వసుధేశుఁడైన దున్నును
గుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్"

(చాటువు) - ఇటువంటి చాటువుల్లో, వాగ్ధార కట్టలు తెంచుకొని వచ్చేస్తుంది కాబట్టి వాడుక భాషకు దగ్గరగా వుంటుంది.

'పోతన్న తెలుగుల పుణ్యపేటి' - ఆయన భక్త్యావేశంతో హృదయాన్ని చీల్చుకు వచ్చిన పద్యాలు వాడుక భాషలోవే అనిపిస్తాయి. కలకండ పలుకుల వంటి పద్యాలు

"చేతులారంగ శివునిఁ బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపు చేటు" (ప్రథమ - 12)
ఓయమ్మ! నీ కుమారుఁడు
మా యిండ్లను బాలు పెరుఁగు మననీఁడమ్మా!
పోయెద మెక్కడికైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ!

(దశమ 328) లాంటివి లెక్కకు మిక్కిలిగా కన్పిస్తాయి. శబ్దాలంకార ప్రియుఁడైన పోతన 'సహజ పండితుడు' కూడ. అంత్యప్రాసల, యమకాల మోజులో ప్రజలకు దూరమైన భాషలో పద్యాలనేకం రాశాడు.

"కనియెన్ బుణ్యజనేజమున్ విగతరోగ స్వప్న పీడాన్న భా
దన సంకోశముఁ బుష్ప పల్లవ ఫలోద్దామద్రుమానీకమున్
స్వనితోద్ధూత పతాకమున్ బ్రవిచర ద్వైమాని కానీకమున్
ఘనగంగా సరిత్తైకమున్ మఘవయుక్త శ్రీకమున్ నాకమున్
(అష్టమ - 448) లాంటి పద్యాలు ఎవరిస్తేగాని సామాన్యులు తెలుసుకోలేనివి

తాళ్లపాక కవుల రచనల్లో సింహగిరి నరహరి వచనాల్లో కవిత వాడుక భాషలో వున్నట్లనిపిస్తుంది. కాని అది ఆనాటి ప్రజల భాషకాదు. వృత్తగంధి వచనంలో, ద్విపదల్లో ఒక విలక్షణమైన శైలిలో సాగిన ఆ రచనల్లో భాష సులభంగానే వుంటుంది గాని ప్రజల వాడుకలోది మాత్రం కాదు.

శ్రీకృష్ణదేవరాయల వారి 'ఆముక్తమాల్యద'లో తెలుగు పదాలధికంగా వున్న పద్యాలు చాలా వున్నాయి.

"ఎన్నినుఁగూర్తునవ్వ, విను, షేమును దాల్చిన మాల్యమిచ్చిన
ప్పిన్నది రంగ మందయిన పెండిలి సెప్పుము: మున్నుగొంటి నే
వన్నన దండయొక్క మగవాఁడిడ, నేను దెలుంగు రాయఁడ
న్గన్నడరాయ యెక్కొదువఁ గట్టు ప్రియాపరిభుక్త భాక్కథన్

(ప్రథమ - 14) - ఇటువంటి పద్యాల్లో భాష వాడుకభాష కాదు. ఆయనే ఏర్ప రచుకొన్న విలక్షణమైన శైలి యిది.

పెద్దన కవిత్వంలో వాడుక భాషకు సన్నిహితమైన పద్యాలు చాలా వున్నాయి.

"ఎక్కడియూరు? కాల్నిలువకింటికిఁ బోయెదనంచు! బల్కెడీ
వక్కట! మీ కుటీర నిలయంబులకున్ సరి రాకపోయెనే?
యిక్కడి రత్నకందరము లిక్కడినందన చందనోత్కరం
బిక్కడి గాంగసైకతము లిక్కడి యీ లవలీనికుంజముల్

(మనుచరిత్ర - ద్వితీయ - 50) లాంటి పద్యాలు రాసిన పెద్దన కొన్ని ప్రౌఢమైనవీ రాశాడు. ప్రసిద్ధమైన "అటజనికాంచె" పద్యంలో వర్ణ్య వస్తువేమిటో వ్యాఖ్యానం చూస్తేనే గాని సామాన్య పాఠకులకు బోధపడదు.

తెనాలి రామకృష్ణ కవి రచన "ప్రారంభించిన వేద పాఠమునకున్ ప్రత్యూహమౌ నంచునో యేరా తమ్ముఁడ! నన్నుజూడఁ జనుదేవెన్నాళ్లనోయుండి" అనే పద్యం వినగానే యిది వాడుక భాషేగదా అన్పిస్తుంది. కాని ఆయన కూడ ప్రౌఢమూ, క్లిష్టమూ అయిన పదబంధాలు కూర్చి పండితులతో పోటీపడిన ఘట్టాలూ వున్నాయి.

చేమకూర వేంకటకవి కావ్యాల్లో కొన్ని పద్యాలు ఇప్పటి భాషలో వున్నట్టే వుంటాయి.

"చక్కెరబొమ్మ నా వ్రతము చందముఁ దెల్పితి నంతె కాక నీ
చక్కదనంబు గన్న నిముసంబయిన న్నిలుపోప శక్యమే
యెక్కునఁజేర్చ కంచు దయనానతి యీఁ దలపంచె నంతలో
నెక్కడ నుండి వచ్చెఁదరళేక్షణకున్నను సిగ్గు దొంతరల్

ఇటువంటి పద్యాలు సులభంగా అర్థమవుతాయి. కాని యీ పద్యంలో నుడి కారం వేంకట కవి నివసించిన సీమలో ప్రజల నుడికారం కాదు. ప్రబంధ కవుల ప్రౌఢి మను మార్చి తేటపరిచింది.

వాగ్గేయకారులు త్యాగయ్య, క్షేత్రయ్యల తెలుగు మాటల పొందిక వినసొంపైనవి. వారి ఆర్తి హృదయం పట్టక చీల్చుకొని వచ్చినచోట వాళ్ల వ్యాకరణాన్ని లక్ష్యపెట్టలేదు. దీనివల్ల వాళ్ల కవిత్వానికి, సంగీతానికి లోటేమీ రాలేదు.

శతాబ్దాల తరబడి "నోరూరగ చవులు పుట్ట" నీతులు చెప్పిన శతక కవులు, ముఖ్యంగా వ్యాజస్తుతి చేసిన కాసుల పురుషోత్తమ కవి, రామలింగ శతక కవి, చంద్రశేఖర శతక కవి, భగవంతునికి సూటిగా హృదయాన్ని నివేదించుకొన్న ధూర్జటి కవుల వాక్కు వాడుకభాషకు దగ్గరగా వచ్చింది.

వేమన అచ్చమైన తెలుగుకవి. 'అచ్చతెనుగు' కవి కాదు సంస్కృతాన్ని మింగి తెలుగులో దించిన పొన్నిగంటి తెలగన్న వంటి కవుల అచ్చతెనుగు కాదు వేమన్నది. నిక్కపురాలలో మంచిముత్తె మొక్కటి చాలదా అన్నట్టు వేల కొలది పద్యాలు వేమన పద్యాల్లో కలిసి పోయినా సహృదయులు వేమన వాక్కును పోల్చుకో గలుగుతున్నారు.

"ఉప్పుకప్పురంబు నొక్క పోలిక నుండు"

"ఉర్వివారికెల్ల నొక్క కంచము పెట్టి"

"కులము గలుగువారు గోత్రంబు గలుగువారు"

మొదలైన పద్యాలు, వ్యాకరణం, ఛందస్సు వున్నప్పటికి ప్రజల వాక్కులో నుంచి వచ్చినవే "తయారుచేసినవి" కావు.

ఆధునిక కాలంలో వీరేశలింగం పంతులు గారు జీవితపు చివరి దశలో వాడుక భాషను అంగీకరించారు. "ఆయనే బతికుంటే" అన్న ఊహ చెయ్యటమెందుకు గాని, వాడుక భాషకు మేలు జరిగేదని మాత్రం చెప్పొచ్చు. గాలి, నీరు, వెలుగు లాగే విజ్ఞానం కూడా అందరికీ అందాలి అని జీవితాంతం తపించిన ఆ మహా పురుషుడు, వాడుక భాష ప్రాముఖ్యాన్ని ఆలస్యంగానైతేనేం గుర్తించాడు, అదే చాలు. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధం నుంచి ఆయన బ్రాహ్మ వివాహం దాకా ముందుకు సాగటమే విశేషం.

గురజాడవారి ముత్యాల సరాల్లో

"మంచిగతమున కొంచమేనోయ్

మందగించక ముందు అడుగేయ్" (దేశభక్తి)

కాసుకులోనై తల్లి తండ్రీ

నెనరూ న్యాయం విడనాడి

పుత్తడి బొమ్మను పూర్ణమ్మను

ముదుసలి మొగుడుకు ముడివేస్రిసి. (పూర్ణమ్మ కథ)

పట్టమేలే రాజు అయితే

రాజునేలే దైవముండడొ

ఘనువు నిలవను పౌరుషము మీ

కేం కలుగదొకో ?. (కన్యక)

మొదలైన గీతాల్లో వాడుకభాష సొగసుకు మురిసిపోతూనే యింకా ఆయన కాలానికి వాడుకభాష కావ్యాల్లో తప్పటడుగులు మాత్రమే వేస్తున్నదని అంగీకరించాలి.

గిడుగువారి వాడుకభాషోద్యమాన్ని ముందుకు తీసుకుపోయే ప్రయత్నంలో గిడుగు సీతాపతిగారు 'భారతీ శతకం' రాశారు. కాని అందులో కవిత్వాంశ చాలా తక్కువ కావటంవల్ల వాడుకభాషా ప్రయత్నానికి తగినంత గౌరవం రాలేదు.

పండిత పామర జనరంజకంగా నాటకాలు రచించిన తిరుపతి వేంకటకవులు 'బావా ఎప్పుడు వచ్చితీవు' మొదలైన రచనలతో పద్యాలపై మక్కువ కలిగించారు. గొడ్లుకాసే బుడ్డాడి మొదలు కుండలాల పండితులదాకా తిరుపతి వేంకటకవుల పద్యాలను ఆనందిస్తున్నారు. తిరుపతి వేంకటకవుల పద్యాలు వాడుక భాషకు దగ్గరగా వుండటమే గాక, మహాభారత కథా గౌరవాన్ని దీపించేటట్లు అక్కడక్కడా సమాసాలు జొప్పించినా, అవికూడా వాడుకభాషలో కలిసిపోయి హాయిని కలిగిస్తున్నాయి. ఈ సంప్రదాయాన్ని కొంతవరకు కొనసాగించినవారు చిలకమర్తి బలిజేపల్లి కవులు. "అల్లుడారమ్మని ఆదరంబున బిల్చిబంపుమామను బట్టి చంపగలమె." మొదలైన గయోపాఖ్యానం పద్యాలు వాడుకభాషలోవే అనిపిస్తాయి. అలతి అలతి మాటలతో కరుణ రసాన్ని వొలికింపజేసే పద్యాలు 'హరిశ్చంద్ర' నాటకంలో చాలా ఉన్నాయి. "చతురంభోధి పరీత.." వంటి నోరు పట్టని సమాసార్భటితో కూడిన జటిలమైన పద్యాలుకూడ హరిశ్చంద్రలో వున్నాయి.

ప్రాచీన సంప్రదాయంపై అపరితమైన అభిమానం చూపి విశ్వనాథ సత్యనారాయణగారు ప్రౌఢమైన కవిత్వం రచించి 'పాషాణ పాకప్రభు' వనిపించుకున్నారు. కాని ఆయన కొన్ని పద్యాలను వాడుకభాషలో రాశారు.

"ప్రక్క యంతయుఁ జిమ్మివైచితి పద్మనాభ
అన్న చూడుము పుస్తకమట్లు పండు
కొనును నీవేమొ ప్రక్క యంతయు క్రుమ్మి క్రుమ్మి
ప్రక్క యటులుండ నీవిటు పండుకొందు" (ప్రాతఃస్తవము)

ఇటువంటి పద్యాలు రామాయణ కల్పవృక్షంలో కూడా వున్నాయి.

"తానో 'లాములు' తండ్రిపేరెవరయా? 'దాచాతమాలాలు';నా
రే! నాపేరన 'వమ్మగాల' నఁగ నోలిందల్లి కౌసల్య తం
డ్రీ! నాగానన(జోయి రాక కనులన్ నీర్వెట్టఁ 'గౌసల్యనౌ
గా'నే నౌను' లేయమ్మనే యని ప్రభున్ గౌసల్య ముద్దాడెడిన్.

ఇటువంటి సుమధురమైన శైలిని విడిచిపెట్టి పాండిత్యద్యోతకమైన ప్రౌఢ ప్రయోగాలు చేసి, వివాదాలకుగురై, విమర్శను సహించలేక తన భాషను సమర్థించుకోవటానికి విపరీతమైన తర్కానికి దిగారు.

భావకవితా యుగంలో మొదటగా చెప్పదగిన రాయప్రోలు పద్యరచన తేట అయినదే గాని వాడుకభాషకు దగ్గరైనది కాదు. క్లిష్ట పదాలు, గొట్టు పదాలు లేకపోవటం చేత ఆయన పద్యాలు కొబ్బరి నీళ్ళకు మల్లే రుచి కల్గిస్తాయి. వాక్య విన్యాసం చూస్తే రాయప్రోలు పద్యాల్లో వాడుకభాష తక్కువ.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు 'కృష్ణ పక్షము-ఇతర కృతులు' తెలుగులో రాయ లేదనే ఒక చమత్కారపు ఆక్షేపణ వినవస్తూ వుంటుంది. ఈ ఆరోపణ కొంతవరకు నిజమే. శబ్ద సౌందర్యమెరిగిన మహా శిల్పి శ్రీ కృష్ణశాస్త్రి. ఒక సుందరలోకం నిర్మిం చుకొని అందులో వుండిపోయారు కృష్ణ పక్షంలో. ఆయన రచనలు కొన్నిటిలో వాడుక భాష సొగసులు బాగా వెల్లడయ్యాయి.

"ఏమండీ! ఇక లెండి! వాకిటికి రానేవచ్చె సంక్రాంతి ఏ
వేమో ఎన్నడు యోచనల్ తెగవు మీ కీలాగు, కూర్చుందురం
డీ! మానండి దిగుళ్ళు మీ మనసులో! ఈ లోక భారమ్ము మీ
రేమోసేరె? సుకమ్ముగా నడపలేరీ కాస్త సంసారమున్"

ఇటువంటి పద్యాల్ని చూస్తే కృష్ణశాస్త్రి పట్టిందంతా బంగారం చెయ్యగలరని పిస్తుంది.

ఈ శతాబ్దంలో భావ విప్లవానికి దారితీసిన రామలింగారెడ్డి, త్రిపురనేని, దువ్వూరి రామిరెడ్డి, జాషువా వంటి కొందరు ప్రసిద్ధ కవులు, గిడుగువారి పోరాటం తర్వాత కూడా వాడుకభాషపై దృష్టి మరల్చక పోవటం వింతగా కన్పిస్తుంది. భావ విప్లవం భాషా విప్లవం రెంటినీ జోడించకూడదని వారు తలచినట్లు కన్పిస్తుంది.

పద్యాన్ని మంచినీళ్ళ ప్రాయమనిపించి నోరారా చదువుకొనే పద్యాలు రచించిన 'కరుణశ్రీ' వాడుక భాషావ్యాప్తికి పరోక్షంగా తోడ్పడ్డారు.

వచన కవిత్వంలో ప్రయోగాలు జరిగిన తొలి దశలో శిష్ట్లా, ముద్దు కృష్ణ, శ్రీశ్రీ, పాప మొదలైనవారు వాడుకభాషలో వచన గీతాలు రాయటానికి ప్రయత్నిం చారు. పాలగుమ్మి పద్మరాజుగారి 'పురిటిపాట' వాడుక భాషలో సాగిన రసవంతమైన గీతం. శ్రీశ్రీ మహాప్రస్థానంలో "వాడు; బాటసారి; ఆః; వ్యత్యాసం; మిథ్యావాది; చేదుపాట; నిజంగానే" మొదలైనవి వాడుకభాషకు దగ్గరగా వచ్చాయి.

శ్రీశ్రీ తర్వాత వచ్చిన వచన కవులలో కుందుర్తి రచనల్లో వాడుకభాష సహజంగా కన్పిస్తుంది. "ఆయన కవిత్వం సామాన్యునికి దగ్గర చుట్టం", తిలక్‌లో సంస్కృత సమాసాల పోషణింపు, ఆరుద్రలో ఇంగ్లీషు పదాలపై మోజు సామాన్య పాఠకులను కొద్దిగా ఇబ్బంది పెడతాయి. అట్టడుగున వున్నవారి మేలుకోరిన విప్లవ కవులలో కొందరు బరువైన సమాసాలను, క్లిష్టమైన పదబంధాలతో చదువరులను బెదరగొట్టటం ఆశ్చర్యంగా వుంటుంది. అసంఖ్యాకంగా వచన కవితలు రాస్తున్న కవులు ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యాలనుకొంటే సామాన్య ప్రజలకు అర్థంగాని

మాటల్ని వాడటం మానుకోవాలి. ఈ సాంఘిక బాధ్యతను పాటను ప్రచార సాధనంగా స్వీకరించిన విప్లవ కవులు కొందరైనా గుర్తించటం చాలా సంతోషించదగ్గ విషయం.

"నాది ప్రజల ఉద్యమం; దాన్ని ఎవర్ని సంతోషపెట్టటానికీ వదులుకోను" అని ప్రజలకు దూరమైన, వ్యాకరణ యుక్తమైన భాషలో కళింగదేశ చరిత్ర రాయటానికి ఒప్పుకోని గురజాడ మార్గంలో కవులు, రచయితలు నడిస్తేనే జాతికి ముక్తి. చెప్ప దలచుకొన్న భావం లాగి విడిచిన బాణంలాగా సహృదయుల మనస్సుల్లో నాటుకోవా లంటే వాడుకభాషలో రాయడంతప్ప మరో మార్గం లేదు.

# గిడుగు మెమొరాండం : గురజాడ డిసెంట్ పత్రం

పోరంకి దక్షిణామూర్తి

తెలుగు వాడుక భాష 'ప్రామాణిక భాషగా గుర్తింపు పొందడానికీ అది అన్ని రంగాల్లోనూ వ్యాపించడానికీ ప్రధాన కారకులు గిడుగు, గురజాడ. వీరిద్దరూ ఆధునిక భాషావాదులు కావటంవల్ల ఆ కాలపు చాదస్తపు పండితులంతా ఒక్కటయి వీరి వాదానికి వ్యతిరేకంగా సభలు జరిపి, తీర్మానాలు ప్రకటించి, ప్రభుత్వానికి మహజర్లు పంపుకొని ప్రాచీన కావ్యభాషను బడి పిల్లల పుస్తకాల్లో కొనసాగించడానికి తీవ్రంగా ప్రయత్నించారు. గిడుగు గురజాడల ఆధునిక భాషోద్యమం అంతకన్న తీవ్రంగా సాగింది. రామ్మూర్తి పంతులుగారు ప్రత్యేకంగా పనిగట్టుకొని మద్రాసు, నెల్లూరు, గుంటూరు, మచిలీపట్నం, కాకినాడ, విశాఖపట్నం, విజయనగరం పట్నాలకు వెళ్ళి అక్కడి విద్యావంతులతో చర్చించి తమ వాదాన్ని విస్తృతంగా ప్రచారం చేశారు. అప్పటికి ముప్ఫై ఏళ్ళగా ప్రాథమిక పాఠశాల స్థాయినించి కళాశాల స్థాయి వరకు బోధనానుభవం ఉన్నవారు ఆయన. అంతే కాకుండా ఇంగ్లండులో, ఫ్రాన్సులో, ఇతర నాగరిక దేశాల్లో విద్యారంగం సాధించిన ప్రగతిని గురించి రాసిన పుస్తకాలు చదివారు. పర్లాకిమిడి మునిసిపల్ కౌన్సిల్ సభ్యులుగా, గ్రామీణ పాఠశాలల మేనేజరుగా, పురపాలక సంఘ పాఠశాలల సూపరింటెండెంటుగా, తదితర విద్యా సంస్థల సంబంధిగా పొందిన అనుభవం ఆయన వాదానికి ఎంతో బలమిచ్చింది. సునిశితమైన భాషాశాస్త్ర పరిజ్ఞానం, సహేతుకమైన లోకజ్ఞానం ఆయనలో చక్కగా మేళవించాయి. వీటికి తోడు, తమ వాదం సరైనదన్న ఆత్మవిశ్వాసమూ దాన్ని విద్యావంతులకు వివరించి వాళ్ళందరూ అంగీకరించేటట్టు చెయ్యాలన్న గట్టి పట్టుదలా ఆయనలో ఉన్నాయి.

గురజాడ ప్రధానంగా భావుకుడు, కవి, రచయిత, పరిశోధకుడు. గిడుగు ప్రధానంగా భాషాశాస్త్రవేత్త. వీరిద్దరూ ఒకే లక్ష్యంతో వేరువేరుగా రెండు పుస్తకాలు ప్రచురించారు. 'ఎ మెమొరాండం ఆన్ మోడర్న్ తెలుగు' (1913) గిడుగు వారిది; 'మినిట్ ఆఫ్ డిసెంట్' (1914) అన్నది గురజాడ వారిది. ఆధునిక వ్యావహారిక భాషను ప్రామాణిక భాషగా గుర్తించడం వల్లా ప్రాథమిక పాఠశాలల్లోనూ సెకండరీ పాఠశాల

ల్లోనూ దీన్ని వాడటానికి అనుమతించడంవల్లా కలిగే లాభాలు వివరించడం వీరిద్దరి ప్రధానోద్దేశము. ప్రాచీన కావ్య భాషావాదుల వాదాల్ని సునిశితంగా, సహేతుకంగా, ఇద్దరూ ఖండించారు - శబ్దస్వరూప నిర్ణయంలో పండితులు పడే పొరపాట్లు బట్టబయలు చేశారు అంతర్జాతీయ స్థాయిలో ప్రామాణిక భాషా శాస్త్రవేత్తలుగా గుర్తింపు పొందిన వారి అభిప్రాయాలు పరిశీలించి వాటిని తమ వాదానికి ఉపబలకంగా చేర్చుకొన్నారు. ఇద్దరూ శబ్దస్వరూపాల్ని వివరించే పట్టికలతో, విమర్శలతో అనుబంధాలు చేర్చారు. అయితే రెంటికీ ఒక్క తేడా ఉంది. గురజాడ వారిది 'డిసెంట్ పత్రం'. ఇది, మద్రాసు విశ్వవిద్యాలయం వారు భాషా వివాద పరిష్కారం కోసం నియమించిన 'తెలుగు కాంపో జిషన్ సబ్ కమిటీ' మెజారిటీ సభ్యులు ఇచ్చిన నివేదికకు అనంగీకారం ప్రకటిస్తూ సమ ర్పించిన పత్రం. అందువల్ల కమిటీ సమావేశాల్లో ఆయా సందర్భాల్లో చర్చకు వచ్చిన అంశాలు ఆయా వ్యక్తుల ధోరణులూ స్పష్టంగా వెల్లడించడం జరిగింది. మొత్తం మీద ఈ రెండు పుస్తకాలూ తెలుగు వ్యావహారిక భాషోద్యమ చరిత్రలో నిలిచే తోరణ స్తంభా లని చెప్పవచ్చు.

*మెమొరాండం*

ఈ పుస్తకం రాయటంలో రామ్మూర్తి గారు తమ ఉద్దేశాన్ని మొదటి పేరాలోనే స్పష్టం చేశారు. మాతృభాషలో బోధించవలసి ఉన్న బడిపిల్లల పుస్తకాల్లోనే కాకుండా ప్రభుత్వం కాని, ప్రభుత్వాధికారులు కాని తెలుగు ప్రజలకు రాసే ఉత్తరాల్లో పంపే వర్త మానాల్లో, ప్రచురించే పుస్తకాలలో, కర పత్రాల్లో, వ్యవసాయం, వాణిజ్యం, పారిశుద్ధ్యం మొ॥ విషయాలు జనసామాన్యానికి తెలియడానికి ప్రచురించే వాటన్నిటిలోనూ వాడుక భాష వాడడానికి అనుమతించాలని చెప్పారు. 1903 మార్చి 11నాడు గవర్నర్ జనరల్ కౌన్సిల్ వారి తీర్మానంలో పేర్కొన్నట్టు దేశ భాషల్ని ఉపేక్షించడం జరుగుతోందనీ, ఈ దుస్థితికి మూలకారణం ప్రజలు మాట్లాడే అసలు భాషను - మాతృభాషను-ఉపేక్షిం చడమేనని చెప్పారు. పండితులనిపించుకున్న వాళ్ళంతా సంస్కృతం మీదే మోజు చూపిస్తున్నారనీ తెలుగును పెంపొందింప జెయ్యాలన్న ఆసక్తి వాళ్ళలో లేదనీ అన్నారు.

ప్రాచీన సాహిత్యంలో చెప్పుకోదగ్గ వచన రచన లేనేలేవు. బ్రిటిష్ ప్రభుత్వం సార్వజనిక విద్యావిధానం ప్రవేశ పెట్టిన కొంత కాలానికి తెలుగులో వచనరచనలు చేసే ప్రయత్నం జరిగింది. కాని దురదృష్టవశాత్తు అది భాషాభేషజం ప్రదర్శించే పండితుల చేతుల్లో పడింది. అయితే పాశ్చాత్య సాహిత్య గ్రంథాల వల్ల ప్రభావితులైన రచయితలు కొందరు అప్పుడప్పుడు, ప్రాచీనమూ కృతకమూ అయిన కావ్య భాషను ఆధునిక అవసరాలకు అనుగుణంగా 'సరళీ కరించడం'లో, 'ఆధునికం చేయడం'లో కొన్ని ప్రయోగాలు చేసిన మాట వాస్తవం. వీరేశలింగం గారి వంటివారు కొద్దిమంది తప్ప తక్కిన వాళ్ళు దీన్ని సాధించలేక పోయారు. అయితే వీరేశలింగం గారు కూడా, భాషను

ఎంత సులభం చేసినప్పటికీ వాక్య నిర్మాణమూ వ్యాకరణమూ పాత పండితుల కృతక పద్ధతిలోనే ఉండిపోయింది - అన్నారు రామ్మూర్తి పంతులు గారు. ఈ సందర్భంలో డా॥ గ్రియర్సన్ భారతీయ భాషల్ని గురించి చేసిన వ్యాఖ్యలు ఉదాహరించారు- "The vernacular has been split into two sections-the tongue which is understanded of the people, and the literary dialect, known only through the press and not intelligible to these who do not know Sanskrit Literature has thus been divorced from the great masses of the population and to the literary classes". అలాగే, 'న్యూ ఇంగ్లీష్ గ్రామర్' రచయిత స్వీట్, వ్యాకరణ శాస్త్ర అధ్యయన లక్ష్యాన్ని గురించి చెప్పినవి కూడా ప్రస్తావించారు. సర్ థామస్‌మన్రో 1822లో, మద్రాస్ ప్రెసిడెన్సీలో అమలులో ఉన్న భాషాబోధన సామగ్రి గురించి చెప్పిన మాటలు ఇప్పటికీ వర్తిస్తాయనీ, అప్పటికీ ఇప్పటికీ దేశీయ భాషాబోధన ఏమీ మెరుగు కాలేదనీ అన్నారు. (1) విద్యార్థి తాను సులువుగానూ బలంగానూ సరిగానూ ఏదైనా చెప్పడానికి రాయడానికి భాషాబోధన తోడ్పడాలి. (2) మనస్సులో అనుకున్నది సొంతంగా చెప్పగలిగేలా చెయ్యాలి, (3) నిర్దిష్ట శ్రోతలకు నిర్దిష్టలక్ష్యంతో చెప్పగలిగేటట్టు చెయ్యాలి. (4) క్రమ బద్ధమైన ఆలోచనకు విద్యార్థి అలవాటు పడేటట్టు చెయ్యాలి. (5) వాస్తవ విషయాల గురించి ఊహించగల శక్తి, లోకజ్ఞానం విద్యార్థిలో పెరగాలి. (6) ఒక విషయం మీది నుంచి దృష్టి మళ్ళకుండా నిలకడగా కొనసాగే అలవాటు కావాలి (7) మనస్సుకు విషయ గ్రహణ శక్తి బాగా అలవడాలి. ఈ విధంగా విద్యార్థిలో సమగ్ర వికాసం కలగడానికి భాషాబోధన తోడ్పడుతుందని ఆంగ్ల భాషావేత్త చెప్పిన అంశాలు తెలుగు పండితుల దృష్టికి తీసుకువచ్చారు రామ్మూర్తి పంతులు గారు

"విద్యార్థులకు నిర్ణయించే పాఠ్య పుస్తకాలు సులువుగా అర్థమయే భాషలో రాసినవే కావాలికాని పరిచయం లేని కావ్యభాషా శైలిలో రాసినవికాదు," అంటూ 'ది ఇండియన్ ఎడ్యుకేషనల్ పాలసీ'లో స్పష్టం చెయ్యడం జరిగింది· సులువుగా అర్థమయ్యే భాష, ప్రజలకు పరిచితమైన భాష వాడుక భాషేనని అంగీకరించినప్పటికీ దేశంలో వివిధ వర్గాలవారి పిల్లలు, వివిధ మాండలికాలు మాట్లాడుతూంటారు కాబట్టి ఏకరూపత, ప్రామాణికత కొరవడతాయని చెప్పి వాడుక భాషను నిరసించేవాళ్ళకి రామమూర్తి పంతులుగారు సహేతుకమైన సమాధానమిచ్చారు. ఇంగ్లండులోకూడా కింది వర్గాలవాళ్ళ పిల్లలు తమతమ మాండలికాల్లో మాట్లాడుకుంటారు. కాని వాళ్ళందరికీ ప్రామాణిక భాష బోధిస్తున్నారు. అలాగే తెలుగుదేశంలో కూడా ఆ మాదిరి ప్రామాణిక భాష - వాడుక భాష - బోధించవచ్చు. ఉన్నత వర్గాలవారి వాడుకలో ఏకరూపత లేదని కొందరివాదం. కాని కావ్యభాషలో ఉన్నంత రూపభేదం వాడుక భాషలో లేదని చెప్తూ గిడుగువారు 'ఒకరైె' అన్న మాటకు 52 రూపాంతరాలూ, 'ఒకడు'కు కనీసం 16 రూపాంతరాలూ

ఉన్నాయని ఉదాహరించారు. నిజం చెప్పాలంటే ప్రామాణికమైన తెలుగు (వాడుక) భాషలో ఉన్నపాటి పై విధ్యం ప్రామాణికమైన ఇంగ్లీషు భాషలో కూడా ఉందన్నారు "పండితుడి నిరంకుశత్వం వల్లనే తెలుగులోకి విజ్ఞానం రాకుండా పోయింది," అని బాధపడ్డారు.

చివరికి, తెలుగు బోధన సామాన్యమూ ఐచ్ఛికమూ అంటూ రెండు విధాలుగా ఉండాలనీ, 'ఐచ్ఛికం' కేవలం ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చెయ్యదలుచుకున్న వాళ్ళకి బోధిస్తే చాలుననీ 'సామాన్యం' విద్యార్థులందరికీ నిర్బంధంగా బోధించాలనీ సూచించారు. 'సామాన్యం' ఆధునిక భాషలోనే ఉండాలి. చరిత్ర, పౌరశాస్త్రం, భూగోళశాస్త్రం మొదలైనవి ఈ కోవలోకి వస్తాయి. ఈ శాస్త్రాలు నేర్పే ఉపాధ్యాయుడే వివిధ విషయాలమీద తెలుగులో కాంపోజిషన్ రాయిస్తాడు. ఆ విధంగా ఆధునికభాషకు అర్హమైన స్థానం ఇచ్చినవాళ్ళ మవుతామని రామమూర్తి పంతులుగారు తమ వాదం ముగిస్తూ చివర రెండు అనుబంధాలు చేర్చారు.

తెలుగువారి ఉచ్చారణలో వచ్చిన ధ్వని విపరిణామాల తీరు తెన్నులు, పద స్వరూప నిర్ణయంలో కావ్యభాషావాదుల్లో కనిపిస్తున్న గందరగోళం, కాలగతిలో ప్రాచీన, ఆధునిక రూపాలమధ్యా, అర్థాలమధ్యా ఏర్పడ్డ అంతరం ఉదాహరణలతో వివరించడం జరిగింది.

ఈ అనుబంధంలోనే, 'పడు' అనుయోగ క్రియతో ఛాందస పండితులు ఒక్క పేజీలోనే డజనుకు పైగా కృతకమైన 'పాసివ్ ఫామ్స్' ఎలా ప్రయోగిస్తూ ఉంటారో గిడుగువారు చూపించారు. అవి నిజానికి 'పాసివ్ ఫామ్స్' కావు. పూర్వ కవులు అలాటివి చాలా అరుదుగానే ప్రయోగించారు. కేతన 'దశకుమార చరిత్రం' మొత్తంలో ఒకే ఒక్క రూపముంది. తెలుగు భారతంలో పర్వాని కొకటితప్ప ఉండదు. It is grammatically wrong to call such forms 'passive'. Genuine Telugu has no passive voice. It does not require it. If employs other devices which serve the same purpose for which the passive is used in other languages, e g. Sans, శ్రూయతాం; Tel. విను(ము); భగ్నం Tel. విరిగినది, 'It is torn' అది చిరిగినది," అంటూ స్పష్టం చేశారు.

రెండో అనుబంధంలో, మద్రాసులో ఆంధ్ర సాహిత్య పరిషత్తు సమావేశంలో పండితులు చేసిన తీర్మానాలు (1912లో కృష్ణా పత్రికలో అచ్చయినవి) తీసుకొని ఒక్కొక్క తీర్మానాన్నే సహేతుకంగా ఖండిస్తూ వచ్చారు గిడుగువారు. ముఖ్యంగా విద్యార్థుల వాచక పుస్తకాల్లో శృంగారరసప్రధానమైన కావ్యభాగాలు ఎంపికచేసే విషయమై పండితులు వెల్లడించిన అభిప్రాయాన్ని గట్టిగా విమర్శించారు.

*డిసెంట్ పత్రం*

విద్యార్థుల వ్యాసరచనకు ఉపయోగకరమైన ప్రామాణిక శైలిని నిర్ధారణచేసి

చెప్పడానికి మద్రాసు విశ్వవిద్యాలయంవారు 1910 జూలైలో దక్షిణాది భాషల్లో ఒక్కొక్క భాషకు ఒక్కొక్క కమిటీ వేశారు. తెలుగు భాషకు సంబంధించిన కమిటీలో, ఎం. రంగాచార్యులుగారు (సమావేశకర్త), కందుకూరి వీరేశలింగంగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, పి. టి. శ్రీనివాసయ్యంగారు, పి. రామారాయణింగారు, రివరెండ్ జె. ఆర్. స్టిల్‌వెల్ సభ్యులు. ఆ తరవాత గుమ్మిడూరి వెంకట రంగారావు గారిని, గురజాడ అప్పారావుగారిని కూడా ఆ కమిటీలో సభ్యులుగా నియమించడం జరిగింది. ఈ కమిటీవారు చాలాసార్లు సమావేశాలు జరిపి, ఇంటర్మీడియట్ విద్యార్థులు శిష్ట వ్యావహారికంలో రాయడానికి అనుకూలించే విధంగా తీర్మానించారు. ప్రాచీన కావ్య భాషాభిమానులకు ఇది దుర్భరమైంది. వ్యావహారిక భాషావాదాన్ని ఎదుర్కోడానికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు (**Telugu Academy**) స్థాపించారు. శిష్ట వ్యావహారికాన్ని గ్రామ్యమని నిరసించారు. ఊరూరా సభలు జరిపి, సంతకాలు సేకరించి ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకురావడానికి ప్రయత్నం చేశారు. అన్ని రంగాల్లో మాదిరిగానే విద్యారంగంలోకూడా రాజకీయ తంత్రం ప్రయోగించి, విశ్వవిద్యాలయం నియమించిన ఉప సంఘంలో రాయలసీమకు ప్రాతినిధ్యం కల్పించాలన్న కారణంతో వ్యావహారిక భాషా వ్యతిరేకులకు స్థానం కల్పించారు. కోలాచలం శ్రీనివాసరావుగారు, టి. శంకర లింగంపిళ్ళెగారు, నాగపూడి కుప్పుసామయ్యగారు, బారిస్టర్ కె. సుబ్బారెడ్డిగారు అలా వచ్చిన సభ్యులే. దాంతో త్రాసు మొగ్గుమారింది. ఆ మెజారిటీ సభ్యుల అభిప్రాయానికి గురజాడ అప్పారావుగారు అనంగీకారం ప్రకటించారు. ఆ అనంగీకార పత్రమే గురజాడ 'డిసెంట్ పత్రం'.

వేదం వెంకటరాయశాస్త్రిగారూ, కొమర్రాజు లక్ష్మణరావుగారూ మొదలైన కమిటీ సభ్యులు ఆధునిక భాషావాదులతో అంగీకారానికి వచ్చే ప్రయత్నం ఏమీ చెయ్యలేదన్న విమర్శతోనే డిసెంట్ పత్రం మొదలయింది. శిష్టుల వాడుకలో ఉన్న 'వస్తాడు' వంటి రూపాలు స్వీకరించాలని ప్రొ॥ రంగాచార్యగారు ప్రతిపాదించిన సవరణను వారిద్దరూ పట్టించుకోకుండా వాడుకభాషకూ కావ్యభాషకు సమానంగా ఉన్న రూపాలతోనే పద పట్టికలు తయారు చేశారని గురజాడవారు ఎత్తిచూపించారు. సులభీకరణ పేరుతో ప్రసిద్ధ రచయితలు రాస్తున్న వ్యాకరణ విరుద్ధమైన రూపాల్ని గట్టిగా విమర్శించారు. 'వస్తాడు' మాదిరిగా 'స'కార,'త' కార సంశ్లిష్ట రూపాలు అనేకం విరివిగా వాడుకలో ఉన్నా పండితులు వాటిని స్వీకరించడం. లేదని విమర్శిస్తూ వివిధ జిల్లాలలో ఉన్న ప్రజలు రాసుకొనేఉత్తర ప్రత్యుత్తరాల్లోనూ గెజిట్ అనువాదాల్లోనూ క్రైస్తవ సాహిత్య గ్రంథాల్లోనూ, కథల పుస్తకాల్లోనూ, వివేకవల్లి (శ్రీకాకుళం), దేశమాత (రాజమండ్రి), జ్ఞానోదయ, ఆంధ్రభారతి (మచిలీపట్నం), హిందూజన సంస్కారిణివంటి పత్రికల్లోనూ జనరంజకగ్రంథాల్లోనూ, జానపద సాహిత్యంలోనూ, మెకంజీకైఫియత్‌లలోనూ ఆ మాదిరి రూపాలు ఎంత విరివిగా వాడుకలో ఉన్నయో తెలియడానికి సమృద్ధిగా

ఉదాహరణలు ఇచ్చారు. అంతేకాకుండా శక సం॥ 1010 నుంచి వివిధ శాసనాల్లో ప్రయోగిస్తూ వచ్చిన రూపాలు చూపించారు.

అదే విధంగా అనుస్వారాంతంగా వాడుకలో ఉన్న రూపాలను కూడా కమిటీ వారు పరిగణనలోకి తీసుకోకపోవడం తప్పని అప్పారావుగారు స్పష్టం చేశారు. "Whether or not the final *mu* (ము) which Sanskritic neuter nouns take in the literary dialect correctly represented a speech - sound which really existed in the past, the spoken form with an *anuswara* has claims to be considered at least as ancient as the form in *mu* (ము)" సముచ్చయార్థకాల గురించి చర్చిస్తూ వివిధ ద్రావిడ భాషల్లో వాటి స్వరూప పరిణామాలు ఎలా వచ్చాయో వివరించారు. ఆధునిక ప్రాచీన రూపాలు, ప్రామాణిక వ్యావహారిక భాష, ప్రామాణిక భాషలో ఏకరూపత అన్న అంశాల గురించి సుస్పష్టంగా చర్చ చేశారు. వవ్యకావ్యభాష అనేది వట్టి మిథ్యావాదంగా నిరూపించడానికి ఆధారాలు చూపించారు. మహా మహా కొమ్ములు తిరిగిన పండితులు సైతం ఎంత అస్తవ్యస్తంగా, వ్యాకరణ విరుద్ధంగా రాస్తారో కళ్ళకి కట్టించారు. అసలైన సంప్రదాయాన్ని కొనసాగిస్తున్న వారు ఆధునిక భాషా వాదులేనని నిరూపించారు. పత్రం చివర ఎనిమిది అనుబంధాలు చేర్చారు. మొదటి అనుబంధంలో, ప్రాచీన శాసనాల్లో అనుస్వారాంతంగా నామవాచకాలు (ఉదా॥ రక్తం, సుంకం, సగం, మొ॥) ఆధునిక సముచ్చయార్థకాలు (చేనున్న, పుణ్యంగాను, తల్లికిన్ని మొ॥) ఉదాహరించారు. రెండో అనుబంధంలో ఆధునిక భాషా రూపాలగురించి పాశ్చాత్య భాషావేత్తలు వెల్లడించిన అభిప్రాయాలు అందించారు. కందుకూరి వారు, చిలకమర్తి వారు ప్రజలకు వాడుకలో లేని ప్రాచీన రూపాలు ఎలా ప్రయోగించారో చూపించారు. కందుకూరి, వేదం, చిలకమర్తి వంటి రచయితలు, వాడుకలో ఉన్న తత్సమాల్ని కాదని వాడుకలోలేని తద్భవాలు ఎలా ప్రయోగించారో నాలుగో అనుబంధం పట్టికల ద్వారా నిరూపించడం జరిగింది. పదమధ్యంలో అనుస్వారం లేని రూపాలు వాడుకలో ఉన్నప్పటికీ (ఉదా॥ వెలుగు) కొందరు రచయితలు అనుస్వారంతో ఉన్న రూపాలే (ఉదా॥ వెలుంగు, అతండు, తొలంగు) వాడుతున్నారని ఐదో అనుబంధంలో పట్టిక ఇచ్చారు. ఆ తరువాతి అనుబంధంలో వాడుకలోలేని రూపాలనేకం వివిధ రచనల్లోంచి సేకరించి అకారాదిగా ఒక పట్టిక తయారు చేశారు. ఆ తరువాత వాడుకలో లేని సాహిత్య రూపాలూ వాడుకలో ఉన్న సాహిత్యేతర రూపాలూ వివిధ రచయితల రచనల్లోంచి ఉదాహరించారు. చివరికి 1912 సెప్టెంబరు ఏషియాటిక్ క్వార్టర్లీ రివ్యూ పత్రికలో 'అరిఫ్' అనే ఆయన రాసిన The Arabic Language Question in Egypt అన్న వ్యాసాన్ని తెలుగు పండితుల పరిశీలనార్థం ఇందులో పునర్ముద్రించారు. ప్రాచీన భాషావాదులకూ, ఆధునిక భాషావాదులకూ కలిగే అభిప్రాయ భేదాల తీరుతెన్నులు తెలుసుకోడానికి ఈ అనుబంధం బాగా ఉపయోగపడుతుంది.

మొత్తం మీద, 'మెమొరాండం'లో గిడుగువారూ, 'డిసెంట్ పత్రం'లో గురజాడవారూ చెప్పదలచిన ప్రధాన విషయం ఒక్కటే. ఇద్దరి వాదసరళి ఒక్కటే. ఇద్దరూ దేశవిదేశ భాషా సాహిత్యాల తీరుతెన్నులు అవగాహన చేసుకొన్నవారే. శాస్త్రసమ్మతంగా, సతార్కికంగా చర్చచేసేవారే. ఒకరు ఉదాహరణలు ఎక్కువ ఇవ్వవచ్చు. మరొకరు తక్కువ ఇవ్వవచ్చు. ఈ ఇద్దరిలోనూ విషయ విస్తృతి చూపించినవారు గురజాడవారు. మధ్యమధ్య కమిటీ సభ్యులతో జరిగిన వాద ప్రతివాదాలు కూడా ప్రస్తావించడం జరిగింది.

తెలుగు భాషోద్యమ చరిత్ర అధ్యయనం చేసేవాళ్ళకు ఈ రెండూ బాగా ఉపకరిస్తాయి. విషయం ఒకటే అయినా, చర్చల తీరుతెన్నులు సమగ్రంగా గ్రహించడానికి రెండూ అవసరమే. ఇప్పటికి దాదాపు 70 ఏళ్ళకిందట వెలువడ్డ ఈ పుస్తకాలలో తేల్చిన విషయాలు పూర్తిగా బుర్రకెక్కించుకోని వాళ్ళు ఇప్పటికీ ఉన్నారంటే ఆశ్చర్యపోనక్కరలేదు. వాళ్ళ బుర్రలు మరమ్మతు అయినా కాకపోయినా, తెలుగువాడు వీటిని కళ్ళకద్దుకుంటాడు; వారిద్దరినీ వినమ్రంగా తలుచుకుంటాడు.

# గురువుకు తగ్గ శిష్యుడు

ఏటుకూరి ప్రసాద్

"మొఖానికి బొట్టు లేదేం ? " అన్న పిడుగులాటి ప్రశ్నకు ఎలా సమాధానం చెప్పాలో తోచలేదు ఓ విద్యార్థికి. ఎలాగోలా సంబాళించుకొంటూ లేచి నిలబడి, "నేను నాన్‌బ్రాహ్మణ్ణండీ అన్నాడు". "ఏం, అయితే బొట్టక్కర్లేదా ? " మరో గర్జన. తుళ్ళిపడ్డం విద్యార్థి వంతైంది. అలా మొదలైందో గురుశిష్యుల అనుబంధం.

ఈ సంభాషణ నిన్నా మొన్నటిది కాదు. 1905 నాటి ముచ్చట. జరిగింది పర్లాకిమిడి కాలేజీలో. గర్జించింది గిడుగు రామమూర్తి. తుళ్ళిపడ్డది బండారు ధర్మారావు. అదే తాపీ ధర్మారావు. ధర్మరావుగారి అసలింటిపేరు బండారువారు. వీరి తాతలు తాపీ మేస్త్రీలుగా ఉండేవారు. అదే క్రమంగా వీరింటిపేరైంది.

తగాదాతో ప్రారంభమైన వీరి అనుబంధం మధ్యలో శత్రుత్వంగామారి చివరికి గిడుగు ఉద్యమానికి సరైన వారసుడు దొరికాడన్న తృప్తితో గిడుగు కన్నుమూసేలా పరిణమించింది.

ధర్మారావుగారు విజయనగరంలో మెట్రిక్ ఫస్టు క్లాసులో పాసయి, ఎఫ్. ఏ లో జేరటానికి పర్లాకిమిడి వెళ్ళక తప్పిందికాదు. అప్పుడక్కడ చరిత్ర అధ్యాపకులుగా గిడుగు ఉండేవారు. ఆ కాలేజికి వీరు వైస్ ప్రిన్సిపాల్‌కూడాను. ప్రిన్సిపాల్ మంగు శ్రీనివాసరావుగారు. వైస్ ప్రిన్సిపాల్ అంటే కాలేజి అంతా గడగళ్ళాడేది. ధర్మారావు గారికి వీరు గ్రీసు, రోము చరిత్రలు చెప్పేవారు. తాపీవారి జ్ఞాపకాలపొరలు తిరగేస్తే " ఆ చరిత్రలు అలా చెప్పేవారు మద్రాసు రాజధానిలో మరెవ్వరూ లేరని ప్రతీతి. చరిత్ర చెప్తూంటే ఆ యా పాత్రలు ప్రత్యక్షమైనట్టు చెప్పేవారు. వారి లెక్చర్లు వింటే చాలు. పుస్తకాలు చదవనక్కర్లేకుండానే పరీక్షలు పాసవుతారని నమ్మకం". అందుకే తాపీ అక్కడ చదువుకోటానికెళ్ళారు. అప్పుడక్కడ జంకుమల్లి మల్లయ్యశాస్త్రిగారు తెలుగు చెప్తూండేవారు.

బొట్టుతో ఆరంభమైన తగాదావల్ల తాపీవారు బొట్టెట్టుకొని క్లాసు కొచ్చేవరకు గిడుగు తాపీవారి మొఖం కనపడకుండా ఉండాలని వీరివైపు వీపుబెట్టే పాఠం చెప్తుండే వారు. అలా రెండుమూడు నెలలు గడిచాయి. ఇద్దరూ ఇద్దరే. ఇంతలో ధర్మారావుగారి

పాండిత్యం "అటు లెక్కల్లోనూ, ఇటు ఇంగ్లీషులోనూ అందరికీ తెలిసింది. లెక్చరర్లు కూడా వీరిచేత విద్యార్థులకు పాఠాలు చెప్పిస్తూండేవారు.

గిడుగువారు పాఠం చెప్పే పద్ధతి చాలా గమ్మత్తుగాఉండేది. చరిత్రను అనేక రకాల పటాలతో, రిఫరెన్సు పుస్తకాలతో గుప్పించేసేవారు. అదంతా లెక్చరింగ్‌పద్ధతిగా అనిపిస్తూనే ఓ కావ్యం చెప్తున్నారా ?! ఓ నాటకం ఆడిస్తున్నారా?! అనే అనుమానం వస్తూండేది క్లాసులోవాళ్ళకి. దాన్ని ధర్మారావుగారు గమనించారు. గిడుగు క్లాసులో సూచించే పుస్తకాలన్నీ చదువుతూండేవారు. ఇతర్లనడిగే ప్రశ్నలకు కూడా తానే కల్పించుకొని సమాధానంచెప్పటం ఆరంభించారు. అలాగైనా గిడుగుకు తనమీదొచ్చిన చిరుకోపం ఉపశమిస్తుందేమోనన్న ఆశే తాపీవారికుండేది.

పిల్లలచేత పనిచేయిస్తూ పాఠంచెప్పే వ్యక్తి గిడుగు. ఇదిప్పుడు అత్యంత ఆధునికమైన పాఠంచెప్పే పద్ధతిగా గుర్తించారు బోధనా పద్ధతుల్లో. చరిత్రలోభాగం మాప్ డ్రాయింగ్.

ఓనాడు గిడుగు పిల్లలవైపు వీపు పెట్టి బోర్డుకు తగిలించిన మాప్‌లో స్పార్టా చూపించమని విద్యార్థుల్నడుగుతున్నారు. అందరూ బిక్కమొగాలేసుకున్నారు. ఒకడు మాత్రం స్పార్టా చూపాడు. "ఎవడ్రా వీడు" అంటూ వెనక్కి తిరిగారు గిడుగు. ఇంకెవరు ! తాపీవారే. దాంతో ధర్మారావంటే గిడుగుకు ఉన్న కోపం పోయింది.

లైబ్రరీకి ధర్మారావుగారిని తీసికెళ్ళి "ఇతనికేం పుస్తకం కావాలన్నా ఇవ్వండి" అంటూ ఓ ఆర్డరు జారీ చేశారు గిడుగు.

క్లాసులోని విద్యార్థులు ఏమేం పుస్తకాలు గ్రంథాలయం నుండి చదువుతున్నారో ప్రతి వాడూ పుస్తకంలో రాయాలన్న రూలొకటి పెట్టారు గిడుగు. ఓనాడు ధర్మారావుగారి పేజీలో 'తారాశశాంక విజయం' రాసుండటం గిడుగు గమనించి తాపీగారి నడిగారు. అందులో పద్యాలతోసహా వివరించారు ధర్మారావు. ఆశ్చర్యపోవడం గిడుగు వంతైంది.

దాంతో ధర్మారావుగారికి తన సొంత గ్రంథాలయంలో పుస్తకాలు చదవమని ఇస్తూండేవారు. ఆ పుస్తకాల్లో గిడుగు చేసిన క్రీగీతలూ, రాసిన కామెంట్సూ చూస్తే అసలు పుస్తకాన్నెలా చదవాలో తెలిసిందని ధర్మరావుగారన్నారు. విజయ విలాసాన్ని అంతటి ప్రతిభా పాండిత్యాలతో అధ్యయనం చేయగలసత్తా, దృష్టి గిడుగువారు ప్రసాదించిన వరమే అనాలి తాపీగారికి. ప్రాచీన ప్రబంధాలను చదవటం తనకు అలవాటు చేసిన వ్యక్తి గిడుగేనంటారు తాపీ. పిల్లలకు ఎలా విద్యాబోధనచెయ్యాలో వారితో ఎలా మెలిగి సరైన మార్గానికి తిప్పాలో ధర్మారావుగారు గిడుగు శిష్యరికంలోనే నేర్చుకున్నారు. తాను న్యూయింగ్‌టన్ కాలేజిలో పనిచేసినా, జమీందార్లకు ట్యూటర్‌గాఉన్నా, విజయనగరంలో ట్యుటోరియల్ కాలేజి నడిపినా, నాడు తనకు గిడుగు చూపించిన మార్గమే ఇన్నిచోట్లా ఆసరాగా నిల్చిందన్నది వారి అభిప్రాయం.

మన ప్రాచీన పరీక్షా విధానంలో 'శలాకా' పద్ధతని ఓటుండేది. అలాగే గిడుగు వారి పద్ధతీనూ. ఉన్నట్టుండి ఓ టాపిక్‌ను క్లాసులో చెప్పి ప్రశ్నల పరంపర కురిపించేవారు. అలాగే ఓనాడు తాపీవారి క్లాసులో 'ఈవేళ రాజ్యాంగాన్ని గురించి మాట్లాడుకుందాం' అంటూ మొదలెట్టారు గిడుగు. ఓ ప్రశ్న విసిరారు. క్లాసంతా తెల్లమొగం వేసింది. తాపీవారి బెంచీమీదకొచ్చి కూచొని "ఊ నువ్వు" అన్నారు. ఆయనా మెజారిటీలో కల్సిపోయారు. గిడుగు తన కిష్టమైన ప్రోంపెట్ పేసి బల్లమీద విసిరేసి ఇక ఈ క్లాసుకు తాను రాననీ, ఎవ్వరూ రానక్కరలేదనీ కబురెట్టి వెళ్ళిపోయారు. వారి కోపమంతా తాపీ మీదనే. తన అభిమాన విద్యార్థికూడా ప్రశ్నకు సమాధానం చెప్పలేకపోయాడే అన్న కోపం. ఓ కుర్రాణ్ణి "ధర్మారావు దగ్గరున్న నా పుస్తకాలన్నీ ఊడ్చుకు రండి" అని పంపించారు. తాపీ తక్కువ తిన్నాడా! ఇవ్వను పొమ్మన్నాడు. ప్రిన్సిపాల్ కలుగచేసుకొని ఇద్దరికీ సామరస్యం కుదర్చడంతో ధర్మారావుగారు గిడుగు వారింటికెళ్ళి పుస్తకాలు అప్పగింతపెట్టిరావడంతో ఆ సమస్య తేలిపోయింది.

అలా ధర్మారావుగారి గిడుగు శిష్యరికం కోపంతో ఆరంభమై మిత్రత్వంతో ముగిసింది. ఎప్పుడైతే గిడుగు వ్యావహారిక భాషా ఉద్యమాన్ని తలకెత్తుకున్నాడో అప్పటి నుండీ వారికి వ్యతిరేకంగా తాపీ గ్రాంధిక భాషాఉద్యమాన్ని నిర్వహించడం ఆరంభించారు.

గిడుగువారి కార్యదీక్ష, వారిజ్ఞానం, వాదనా పటిమా, క్షుణ్ణంగా దగ్గరుండి గమనించిన వ్యక్తి తాపీ గనుక అలాగే వారి వాదాన్ని ప్రతిఘటించాలని తలపెట్టారు. గిడుగు కృషి తెలుగునాట ఇంకా ఉద్యమ స్థాయికి చేరుకోకముందే వారి వాదాన్ని మొగ్గలోనే తుంచాలన్న అభిప్రాయంతో 1908 – 1909 మధ్య తాపీవారు 'గ్రాంధికభాషా వాదము' అనే చంపక మాలికను రాశారు. ప్రతి సభలోను దాన్ని చదివేవారు. దీన్ని ఖండిస్తూ ఆ రోజుల్లోనే సెట్టి లక్ష్మీనరసింహంగారు ఓ శార్దూల మాలికను రాశారు.

ధర్మారావుగారి దృష్టిలో మొదటి రోజుల్లో బ్రాహ్మణుల మీద రవంత కోపం ఉండేది. దానికి చాలా కారణాలున్నాయి. వాళ్ళ నెదిరించాలంటే, వాళ్ళు ప్రయోగించే సాంప్రదాయ పద్ధతిలోనే భాషను అభిమానిస్తూపోయి వాళ్ళకన్నా గొప్పవాడవనిపించుకోవాలనుకున్నారు. అప్పుడే వాళ్ళ కంటిని వాళ్ళ వేలితోనే పొడిచినట్టవుతుందని భావించారు. దానికి తోడు, నాటికి బాగా ప్రచారంలో ఉంది గ్రాంధిక భాష. ఆ గాలిలోనే కొట్టుకెళ్ళారు.

ఎప్పుడైతే జమీందార్ల దగ్గర పన్జేస్తూ వారి గ్రంథాలయాల్లో ప్రపంచ సాహిత్యాన్నీ, సామాజిక చరిత్రలను అధ్యయనం చెయ్యడం ఆరంభించారో భాష ఒక వర్గం చేతులోది కాదన్న అంశం బోధపడింది. తాను ఎదుర్కోవలసింది బ్రాహ్మణులను కాదనీ, బ్రాహ్మణ తత్వాన్ననీ; వారి పెత్తందారీ తత్వాన్ననీ తెలుసుకున్నారు. కనుక బ్రాహ్మణులు నిర్వహిస్తున్నారని వారు నడిపే ఉద్యమాన్ని ద్వేషించటం కూడదనీ,

సామాజిక పరిణామంలో భాషా పరిణామం ఓభాగం అవుతుందనీ నమ్మటం ఆరంభిం చారు. ఆ పరిణామం తెలుగునాట వ్యావహారిక భాషా ఉద్యమమేనని నమ్మారు. అయినా తాపీవారు ఈ అంశాన్ని దృఢంగా నమ్మటానికి 1936 వరకూ పట్టింది. గిడుగువారి ప్రతి భాషా వాదం అధ్యయనం చేశారు. అనేక కవి పండిత సభల్లో పాల్గొన్నారు. గిడుగు వారితో ఆయా సాహిత్య సభల ద్వారా మరింత సాన్నిహిత్యం సంపాదించారు. బరంపురంలో జరిగిన అఖిలాంధ్ర కవిపండితుల సభలకెళ్ళారు. గిడుగువాదాన్ని ప్రతిఘటిస్తున్న కుందలాల వారి వాదంలో బలహీనతలను, దొల్లతనాన్నీ గమనించారు. గురజాడ గిడుగుకు అందించిన సహకారాన్నీ, కందుకూరి తాను చనిపోయే దశలో గిడుగు వాదాన్ని సమర్థించి ఓ సంఘాన్ని స్థాపించిన పరిస్థితినీ అంతా తాపీ శ్రద్ధగా చూశారు.

అంతే అంతవరకూ తానేవాదాన్ని మోస్తూ వచ్చారో, ఎవరికి ప్రతిద్వంద్విగా నిలిచారో దాన్ని విడిచేశారు.

1936లో తాను వ్యావహారిక భాషా ఉద్యమంలో చేరుతున్నట్టు గిడుగు మేష్టారికో లేఖ రాశారు. ఈ ఉద్యమాన్ని ఓ "మిషనరీజీల్"తో సాగించాలని చెప్పారు. ఈ ఉత్తరం చదివి గిడుగు "ఇక మన వ్యావహారిక భాషోద్యమానికి ఎలాంటి ఢోకాలేదు. మంచి సాంప్రదాయ పునాదులమీద పైకొచ్చిన ఓ పండితుడు ఆధునిక వాది మనతో చేతులు కల్పుతున్నాడు. ఆయనే తాపీధర్మారావు" అని గిడుగు సీతాపతిగారితో అన్నారు. తన బరువు కొంతన్నా మోసేవాడొచ్చారని చాలా సంతోషించారు. ఈ అంశాన్ని గిడుగు సీతాపతిగారే ధర్మారావుగారికి మద్రాసులో జరిగిన ఓ సన్మాన సభలో స్వయానా ప్రకటించారు. అయితే దురదృష్టవశాత్తూ ధర్మారావుగారు రాసిన ఆ ఉత్తరం ఎక్కడా దొరకలేదు ఈ విషయం తాపీవారు అక్కడక్కడా ప్రస్తావించారు

గిడుగుకు మనసుకెక్కిన శిష్యుడుగా ఉండి మధ్యలో నిరంతరం తనతో పోరాడిన తాపీ నిజాయితీని, చివరకు ఆ తాపీయే సామాజిక పరిణామంలో భాషల మార్పిడి అవశ్యకతను గుర్తించి తనకు లొంగిపోయిన ఘట్టం గిడుగు మనస్సును కదిల్చి ఉండాలి. తనంతటి శిష్యుడు తనకు దొరికాడని పొంగిపోయి ఉండాలి. అలాంటి గురువుకు తాపీ ఇచ్చిన శ్రద్ధాంజలి; పత్రికల్లో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టడం, సినిమాల్లో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టడం, విశ్వవిద్యాలయాల్లో ప్రవేశపెట్టడానికి తీవ్రకృషి చెయ్యడం; తనకుతాను ఆ ఉద్యమంలో ముందు పీటీని ఉండడం. ఇంతకు మించి ఏ శిష్యుడు ఏ గురువుకేం ఇవ్వగలడు. పాత పాళీనిసిరేసి కొత్త పాళీ కట్టి సరికొత్త సిరాతో రచనలు సాగించడంతప్ప. సరిగ్గా అలాగే చేశారు తాపీ. గిడుగు అందించిన వారసత్వం అందుకున్నారు.

# తెలుగు పత్రికా రచనలో వ్యావహారిక భాషా పరిణామం

ఏ. లక్ష్మణరెడ్డి

తెలుగు ప్రజల సామాజిక, సాంస్కృతిక, రాజకీయ జీవితాన్ని ప్రభావితం చేసిన తెలుగు పత్రికా రచనకు రమారమి నూటయాభై సంవత్సరాలకు పైబడిన ఉజ్జ్వల చరిత్ర వుంది. ముద్రణ కళావికాసం పత్రికా ప్రచురణకు పూర్వరంగం సిద్ధం చేసింది. పత్రికలలోనే ఆధునిక తెలుగు సాహిత్యంలో వెలసిన ప్రక్రియలు రూపురేఖలు దిద్దుకున్నాయి. దీని ఫలితంగా వచన రచన అనివార్యమైంది. ఆ విధంగా తెలుగు వచన రచనాభ్యుదయానికి, భాషా వికాసానికి తెలుగు పత్రికలు ఎనలేని సేవచేశాయి. ముఖ్యంగా వ్యావహారిక భాషా వికాసంలో తెలుగు పత్రికలు నిర్వహించిన పాత్ర మహోదాత్తమైంది.

పత్రికా ముఖంగా మొదటిసారిగా తెలుగు దర్శనమిచ్చింది 'ఫోర్ట్ సెంట్ జార్జి గెజిట్"లో. ఇది 1834 నాటి మాట. ఆనాటి గెజిట్‌లో కన్పించేది వ్యావహారికాంధ్రం. ఆనాటి తెలుగులో ఇంగ్లీషు, హిందూస్తాని మొదలైన భాషల శబ్దాలు విరివిగా కన్పిస్తాయి.

1838 ప్రాంతాల్లో ప్రారంభమై షుమారు నాలుగేండ్లు నడిచిన 'వృత్తాంతి' కూడా వాడుక భాషలోనే కొనసాగినట్లు దాఖలాలున్నాయి. 'వృత్తాంతి' పత్రిక ప్రతి ఒక్కటి కూడా లభించటంలేదు. అయితే గిడుగు రామమూర్తిగారు "గద్య చింతామణి" (మొదటి భాగం, 1933, పుటలు 178-181)లో 'వృత్తాంతి'లో అచ్చయిన జాబును ఉదాహరించారు. ఒక చందా దారుడు 'వివాహములను గురించిన దుర్వ్యయము'ను విమర్శిస్తూ రాసిన లేఖ అది. ఈ లేఖ 1841 ఫిబ్రవరి 15వ తేదీనాటిది. ఆ విధంగానే బ్రౌన్ జాబుల సేకరణలలో (వాల్యూ. ఎమ్ 411, జి ఓ ఎమ్.ఎల్ మద్రాసు) 'వృత్తాంతి'లో ప్రచురితమైన ఒక వార్తా ఖండిక ఉదాహరించబడింది.

పై పేర్కొన్న లేఖగానీ, వార్తా ఖండికగానీ వాడుక భాషలోనే వున్నాయి. 'వృత్తాంతి'లో రెండోది, మూడోది నాలుగోది, అయిదోది, ఆరోది లాంటి అచ్చమయిన వ్యావహారిక ప్రయోగాలు కన్పిస్తాయి. 'తైనాతు' లాంటి తమిళ పదాలు, 'ప్రామిసరీ నోట్లు,' 'డిస్కౌంటు', 'సొసైటీ' లాంటి ఆంగ్ల పదాలు 'వృత్తాంతి' భాషలో చోటు చేసుకున్నాయి. వాక్యాలు కొద్దిగా పెద్దవైనా సముఖాను వేంకట కృష్ణప్ప, కళువె వీర

రాజుల వాక్యాల లాంటివి కావు.

1842 జూన్ ఎనిమిదో తేదీన ప్రారంభమ న 'వర్తమాన తరంగిణి' అనే తెలుగు వార పత్రికకూడా వ్యావహారికం మీదనే నడిచింది. మచ్చుకు 1842 నవంబరు మూడో తేదినాటి వర్తమాన తరంగిణిలో ప్రచురిత మయిన ఒక వార్తా ఖండిక చూడండి:

పోయిన నెల-౨౩ తేదీనాటి రాత్రి ఆరుకాటులో ౭ కేవిల్‌రీ యిలాకా కార్‌నెట్టు బెర్‌నెల్ యింట్లో కొందరు దొంగలు జొరబడి కిటికీగుండా దారి చేసుకొని ఆ ఆఫీసరు తొడుక్కొనే బట్టలున్ను యింకా కొంత వేరే సామానులున్ను నిండా వెల కలిగినవి దొంగలించుకొని పోయినారు - మర్నాటి తెల్లవారి చూస్తే ఆ యింట్లో వక కత్తి పడి యుండినది-అది చూడగా ఆ దొంగలు తమ్ము నడ్డగించ వలెనని యెవరయినా వస్తే అప్పుడు అది వుపయోగించు కోవలెనని తెచ్చుకొన్నట్టు తోస్తున్నది - ఆ దొంగలు సామాను యెత్తుకొని పొయ్యే అవసరములో కొన్ని కొన్ని కొద్దిపాటివి అక్కడక్కడా విడిచిపెట్టి పోయినారు గాని ముఖ్యమయినవి మాత్రం యెత్తుకొనే పోయినారు - అప్పట్లో వాండ్ల జాడ యెంత తీసినా దొరికినది కాదు-

వర్తమాన తరంగిణి భాషలో ఇంగ్లీషు, తమిళ, హిందూస్థానీ పదాలు యథేచ్ఛగా ప్రయోగించబడ్డాయి. చిత్రి, వైయ్యాశి, ఆణి, ఆడి, పెరటాశి, అల్పిశి మొదలైన తమిళ పేర్లతోనే నెలలు పేర్కొనటం గమనించదగ్గ విశేషం. ఇవేగాక నిండా (చాలా), అగత్యం-లాంటి 'మదరాసు తెలుగు'లో వాడబడే పదాలు వర్తమాన తరంగిణి భాషలో కన్పిస్తాయి. బాజారి ఖబురు, చాపే ఖానా లాంటి అన్యదేశ్యాలు, కొల్లలైన ఆంగ్లపదాలు వర్తమాన తరంగిణి భాషలో కన్పిస్తాయి. అయితే గూఢపదాలు, దీర్ఘ సమాసాలు, క్లిష్టార్థ వాక్యాలు కన్పించవు. 'యింగ్రేజి' పత్రికల్లో వు-దేవాటిని తర్జుమా చేసే విషయంలో 'హస్సలు కలం' (ఒరిజినల్ రైటింగ్)లో చెప్పటం లేదని, అందువల్ల వేసట యున్ను, అరుచిన్ని పుట్టడానకు హేతువ అవుతుందని ఒక పాఠకుడు వర్తమాన తరంగిణి (1842 ఆగస్టు 20) ఎడిటరుగారికి రాసిన ఉత్తరం వల్ల తెలుస్తుంది. దానికి పత్రికాధిపతుల జవాబు 1842 సెప్టెంబరు 8న వర్తమాన తరంగిణిలో ప్రచురితమైంది. సి.పి.బ్రౌన్ తన మిశ్రభాషా నిఘంటువులో 'గిన్నెకాసు' అనే పదానికి అర్థ వివరణ చేస్తూ వర్తమాన తరంగిణి పత్రికను ప్రమాణంగా ఉదాహరించారు.

1848 నుంచి జె. ఎడ్మండ్ షార్కీ మచిలీపట్నం నుంచి 'హితవాది' అనే మాస పత్రిక ప్రచురించారు. 'హితవాది' వాడుక భాషలోనే సాగింది. మచ్చుకు 1862 నవంబరు సంచికలో ప్రచురితమైన ఒక వార్తాఖండిక చూడండి :

చీనా, హిందూ, ఆఫ్రికా మొదలైన దేశముల నుంచి వచ్చి, ఇంగ్లండులో ప్రవేశించినవారు, చలి, వ్యాధి, ఆకలి, దప్పులుకలిగి, తెచ్చుకొనిన సొమ్ము

> అక్కడే దగా కోరులకు సమర్పించి, ఇల్లున్ను, స్నేహితులున్ను, దిక్కున్ను, లేక వారిలో అనేకులు చావడమున్ను, శ్రమ పడడమున్ను చూచి, కొందరు ఉపకారులు, అయిదు సంవత్సరముల క్రిందట ఒక ఆశ్రయపు ఇల్లు వారికిగాను కట్టి, వారు ఆ దేశములో ఉన్నంత కాలమున్ను వారిని అందులో ఉంచి, వారి వారి దేశములకు పంపుతున్నారు.

వర్తక సంఘం పాలనా కాలంలో వెలువడ్డ తెలుగు పత్రికలలో పేర్కొనదగ్గ మరో పత్రిక 'దినవర్తమాని'. ఈ వార పత్రికను రెవరెండ్ పీటర్ పెర్సివల్ అనే ఆంగ్లేయుడు 1856 జూలై నుంచి మద్రాసు నుంచి వెలువరించాడు. ఈ పత్రిక భాష కూడా వ్యావహారికమే. 'పోయిన తూరి', 'మున్నూరు'. 'కొల్లైత్తు వాండ్రు', 'పటాళములు'—అంటి మద్రాసు ప్రాతీయ మాండలికాలు ఈ పత్రికాభాషలో కన్పిస్తాయి.

కుంఫిణీ యుగంలో వెలువడ్డ తెలుగు పత్రికలన్నీ వ్యావహారిక శైలినే అనుసరించాయి. అరసున్నలు, శకట రేఫలు ఆనాటి పత్రికా భాషలో కన్పించవు. పద ప్రారంభంలో వు, వూ లు ఉపయోగించేవారు. యడాగమం వాక్య ప్రారంభంలో ప్రయోగించేవారు. ద్రుత ప్రకృతికం పై యడాగమం కన్పిస్తుంది. ఆనాటి పాత్రికేయులు విసంధిగా రాసేవారు. ఆ రచనలన్నిటిలో 'పేరా' విభజనల్లాంటివి పాటించారు. వలపల గిలక కుంఫిణీ యుగంలోని పత్రికలన్నిటిలో కన్పిస్తుంది.

అయితే ఆ శైలిలో కొన్ని విలక్షణాలుండేవి. 'స'కు'శ' రాయటం, సంస్కృత పదాల వర్ణ క్రమం తిన్నగా పాటించక పోవడం మొదలైనవి. ఆ శైలిలో 'న్ను'లు ఎక్కువ. దీనికి తోడు విరతి గుర్తులు నియతంగా పాటించే వారు కారు. ముగింపు చుక్కకు బదులు అడ్డ గీత పెట్టేవారు.

పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలో వెలువడ్డ పత్రికల్లో సుజన రంజని, ఆంధ్ర భాషా సంజీవని, అముద్రిత గ్రంధ చింతామణి లాంటి పత్రికలు గ్రాంధికంలో నడిచాయి. వీటిలో పెక్కింటిని తెలుగు పండితులు నిర్వహించారు ఆ పత్రికలలో భావ ప్రాధాన్యంకన్నా భాషాప్రాధాన్యమే హెచ్చుగా వుండేది. ఈ విషయం గురించి 1882 జూన్ 'వివేక వర్ధని' పత్రికలో వీరేశలింగంగారు ఇలా రాశారు:

> కేవల సాహిత్యపరులు వృత్తాంత పత్రికా లేఖనకు పూనుకొనుట వలన వారి వ్రాతయందు గూఢ పదములును, దీర్ఘ సమాసములును, క్లిష్టార్థ వాక్యములును, యమకాదులును తప్ప ఉపయుక్తవిషయము లంతగా కానరాకున్నవి.

తెలుగు పత్రికారచన జటిల సమాసాలతో నిండి సామాన్య అక్షరాస్యుడికి కొరకరాని కొయ్యగా మారిన సందర్భంలో 1872లో మచిలీపట్నం నుంచి ఉమా రంగనాయకులుగారు ప్రారంభించిన 'పురుషార్థ ప్రదాయిని' భాషా సౌలభ్యానికి బాటలు వేసింది. ప్రజల సమస్యలను చర్చించిన 'పురుషార్థప్రదాయిని' పత్రికా భాషకు

పండితుల గుప్పిట్లో నుంచి విముక్తి కలిగించటానికి ప్రయత్నించింది. మొదటి సంపుటి ఏడో సంచికలో 'మాస విషయములు' అనే శీర్షిక కింద 'పురుషార్థ ప్రదాయిని' ఇలా రాసింది:

తెలుగు భాషను వినిగాని చదివిగాని సాధారణముగా తెలిసికొన గలవారి కందరికి కూడను ఇట్టి ఇహపర సాధనములైనవన్నియును సులభముగా తెలిసి అత్యంత ఉపయుక్తములగుటకు వీలుగా సులభ తరమైన శైలితో సామాన్యపు వచన రూపముగా వ్రాయబడి ప్రచురమై యుండలేదు. ఉన్నయవి సర్వమును విశేషముగ పద్యకావ్యంబుననే యుండి సాధారణముగ గ్రహించ శక్యము గాక యున్నయవి.

....జ్ఞానమే జనులకు సర్వపురుషార్థసిద్ధికి మూలమైయుండగా ఇట్లుండుట గొప్ప లోపముగదా! అయినను ప్రకృతి శాస్త్రాది గ్రంథములు సులభమైన వచన కావ్యంబున నుండుట యుక్తము.

....కాలక్రమమున నిట్టి తగని కొరతలను లేకుండ జేయుచుండు గొప్ప ప్రయత్న మునందుండుటయే ఈ పత్రిక యొక్క ముఖ్యోద్దేశము.

కుంఫిణీ యుగం తరువాతి కాలంలో మొదటి సారిగా పాక్షికంగా అయినా వాడుక భాషను పత్రికలలో ప్రవేశపెట్టిన కీర్తి వీరేశలింగం గారికి దక్కింది. 'బ్రాహ్మ వివాహం', 'వ్యవహారబోధిని' అనే నాటకాలు వాడుక భాషలో రాసి 'హాస్య సంజీవని'లో ప్రచురించారు. వివేకవర్ధని, హాస్యసంజీవని, సత్య సంవర్ధని లాంటి వారి పత్రికల్లో ప్రచురితమైన ప్రహసనాలు, హాస్య ప్రసంగాలు మొదలైన వాటిలో వాడుక భాష ఉపయోగించబడింది. పత్రికా భాష గురించి వీరేశలింగం గారు ఇలా రాశారు:

... .... .... .... .... .... .... .. ....

పత్రికలు గ్రాంథిక ఫణితి నున్న
బండితులు గాని వారికి బనికిరావు
పత్రికోద్దేశమే కొఱవడును దాన
గావ నెపుడు సర్వజనోపకార మొదవ
పామరులకును దెలియంగ వ్రాయవలయు

పందొమ్మిదో శతాబ్ది చివరి దశకంలో పాత్రోచిత భాషా వివాదం తెలుగు పత్రికల్లో తలెత్తింది. గ్రాంథిక భాషాభిమానులైన పూండ్ల రామకృష్ణయ్య లాంటి పాత్రికేయులు కూడా పాత్రోచిత భాషా వాదాన్ని సమర్థించారు. 'కన్యాశుల్కం' భాషను ప్రశంసిస్తూ 'అముద్రిత గ్రంథ చింతామణి' లో రాశారు. ఆ విధంగా వ్యావహారిక భాషా ప్రాచుర్యానికి కావలసిన పూర్వరంగం సిద్ధం చేశాయి ఆనాటి తెలుగు పత్రికలు.

ఈ శతాబ్ది ప్రథమ దశకంలోనే అంటే 1910లో 'ఆంధ్రభారతి' వ్యావహా

రికంలో రచితమైన 'దిద్దుబాటు', 'మీ పేరేమిటి' అనే గురజాడ వారి చిన్న కథలు ప్రచురించింది. గురజాడ వారు వ్యావహారికంలో రచించిన 'లోకచుక్క', 'లవణరాజు కథ', 'కన్యక' మొదలైన కవితలను మొట్ట మొదట 'ఆంధ్ర భారతి' ప్రచురించింది. గురజాడ మహాకవి వ్యావహారిక రచనలను ప్రప్రథమంగా 'ఆంధ్ర భారతి' పత్రికలో ప్రచురించిన సుకృతం అయ్యంకి వెంకట రమణయ్య గారిది.

ఇరవయ్యో శతాబ్ది రెండో దశకంలో వ్యావహారిక భాషా వివాదం తీవ్ర రూపం దాల్చింది. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక వ్యావహారికోద్యమాన్ని ప్రతిఘటించింది. 1913 నాటికి కృష్ణా పత్రిక వ్యావహారికానికి పాక్షికంగా స్థానం ఇచ్చి ఆదరించింది. ఆ సంవత్సరం బాపట్లలో జరిగిన ఆంధ్ర మహా సభల విశేషాలను ముట్నూరి కృష్ణ రావు గారు 'కబుర్లు' అనే శీర్షిక కింద వ్యావహారిక భాషలో రాశారు.

1914 లో సుప్రసిద్ధాంగ్ల దిన పత్రిక 'హిందూ' ఈ విషయమై ఒక చర్చా వేదిక నిర్వహించింది. ఈ సంవత్సరమే గిడుగు వారు పండితులకు సవాలుగా 'ప్రౌఢ దెనుం గుంగమ్మ' అనే లేఖను అతి ప్రాచీనమైన తెలుగులో రాసి పరిషత్పత్రికలో ప్రచురించారు. ఈ లేఖ మీద అనేక తర్జన భర్జనలు చెలరేగాయి. ఈ వాదోపవాదాల్లో ఆనాటి అతిరథ మహా రథులందరూ పాల్గొని పారక లోకాన్ని విజ్ఞాన వికాసమయ అక్షర జగత్తులో తలమునకలు చేశారు. వాదే వాదే జాయతే తత్త్వ బోధః- అనేది ఆనాటి వారి మతం.

1919 ఫిబ్రవరి 28వ తేదీన వీరేశలింగం గారి అధ్యక్షతన 'వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజం' ఏర్పడింది. ఈ సమాజం ఆధ్వర్యంలోనే గిడుగు వెంకట రామమూర్తి గారి సంపాదకత్వంలో 1919 సెప్టెంబరులో పర్లాకిమిడి నుంచి 'తెలుగు' పత్రిక వెలువడింది. ఒక సంవత్సరం మాత్రమే నడిచినా 'తెలుగు' సాధించిన ఫలితాలు అమోఘమైనవి కుంఫిణీ యుగం తరువాత కేవలం వ్యావహారికం మీదనే నడిచిన పత్రిక ఇదే.

ఈ పత్రిక ప్రారంభ సంచికలో 'విన్నపము' అనే శీర్షిక కింద గిడుగు తమ అభిప్రాయాలు వివరించారు. అందులో కొన్ని వాక్యాలు :

> ఎందుకీ క్రొత్త తెలుగు పత్రిక మరి ఒకటి? దేశములో కావలసినన్ని ఉన్నవే పత్రికలు, అనేక విధములైనవి; వాటి వల్ల నెరవేరనిదీ, దీని వల్లనే కాదగ్గదీ ఏమున్నది విశేష ప్రయోజనము? ఈ ప్రశ్నకు ప్రత్యుత్తరము వివరించి మనవి చేస్తున్నాము. చదువరులు సావధానముగా పక్షపాతము లేక చిత్తగింతురు గాక! నిజమే! అనేక పత్రికలున్నవి? పత్రికాధిపతులూ సంపాదకులూ చాలా కష్టపడి ధనము ఖర్చు పెట్టి జనులకు అనేక విధాల ఉపకారము చేయడానికి ప్రయత్నము చేస్తున్నారు. వారి ఉద్దేశము దొడ్డదే. వారి ఉద్యమము కొనియాడ దగినదే. గాని, వారి ఉద్దేశము చక్కగా నెరవేరలేదనిన్నీ, వారి ఉద్యమము

పూర్ణముగా ఫలించకుండా కొంత మట్టుకయినా వ్యర్థమవుతున్నదనిన్నీ మాకు తోస్తున్నది. ఇట్లే పుస్తకములు వ్రాస్తూఉన్న వారి ఉద్యమము సార్థకము కావదము లేదు. వ్యర్థముగా ధనము వెచ్చించడమే కూడని వ్యసనమంటారే, ధనము కన్న ఎక్కువ విలువగల దేహబలము, బుద్ధిబలము వ్యర్థముగా వెచ్చించడము ఎంత కీడో గదా!...

లోక వ్యవహారములో తేటతెలుగున నలుగురూ వాడుకొనే మాటలతో చెప్పితే స్పష్టముగా బోధపడే విషయము వాడుకలో లేని మాటలతో చెప్పితే వృథా ప్రయాసము కాదా? దానివల్ల ఏమయినా లాభమున్నదా? లేదని తెలిసినా చాలా మంది వ్యర్థముగా తాము ఆయాసపడి చదివే వారిని ఆయాస పెట్టుతున్నారు ...

ఈ పత్రికలో మొట్టమొదట చర్చించే విషయము వ్యావహారిక భాష, దాని ప్రవృత్తి, దాని ఉపయోగములు, దాని గౌరవము, దానిని ఉపేక్షించడము వల్ల దేశమునకు కలుగుతూ ఉన్న నష్టములు.

ఈ పత్రిక ద్వారా వ్యావహారిక భాషోద్యమ ప్రచారానికి గిడుగు వారు చేసిన కృషి ఫలించింది. ఆంధ్ర వచన రచనా మార్గం వ్యావహారిక భాషోన్ముఖమైంది యువ రచయితల కంఠాల్లోని గడియలు విడిపోయాయి. పాండిత్యం వుంటేగాని రచనకు దిగ కూడదనే బెదురు పోయింది. వ్యావహారిక భాషా వాదం రూఢమై మాతృ భాషలో స్వేచ్ఛగా రాయవచ్చుననే ప్రత్యయం కలిగింది. దాంతో వ్యాకరణ భయం లేకుండా వచన రచన ప్రబలింది. 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం' పరాస్తమై బాలకవులకు శరణ్యం లభించింది.

"తెలుగు" పత్రిక చదివి ఉత్సాహవంతులైన యువకులు "సాహితీ సమితి" నెలకొల్పారు. గిడుగు రామమూర్తిగారిని ఆ సమితికి గౌరవసభ్యులుగా ఎన్నుకున్నారు. "సాహితీ సమితి" 1919లోనే "సాహితి" పత్రికను వెలువరించింది. ఆ పత్రిక వ్యావహారిక రచనలకు స్థానమిచ్చింది. వ్యావహారిక భాషాప్రాచుర్యం హిమవత్తుంగంలా పెరిగి బహుజనాదరణ పాత్రమైంది.

దీన్ని ఎదుర్కోదలచి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 1925 జనవరి నుంచి గ్రాంథికాంధ్ర వేదికగా "వజ్రాయుధము" వెలువరించారు. ఈపత్రిక రెండో సంచికలో "గ్రామ్యాచార్యులు" అనే పేరుతో గిడుగువారిని నిందిస్తూ వ్యాసం రాశారు శ్రీపాద. మూడో సంచికలో గిడుగువారు "వజ్రాయుధం" సంపాదకులకు సవాలుచేస్తూ రాసిన లేఖ ప్రచురితమైంది. దానిపై గిడుగువారికి ప్రత్యుత్తరం ప్రచురితమైంది. ఆ ప్రత్యుత్తరం శ్రీపాద వారిది. నాలుగో సంచిక (1925 ఏప్రిల్)లో గిడుగువారి 'బహిరంగలేఖ' వుంది. తగవు పండిత పరిషత్తు తీర్చాలనీ, కొందరు పండితులతో ఈ పరిషత్తు ఏర్పర చాలనీ గిడుగువారు సవాలు చేశారు. శాస్త్రిగారు మొదట తటపటాయించినా చివరకు అంగీకరించారు. అయితే గిడుగువారు చెప్పినట్లు పరిషత్తులో అయిదుగురు చాలరనీ,

ఇరవై అయిదుమంది వుండాలనీ శ్రీపాదవారు ప్రకటించారు. దాన్ని అయిదో సంచికలో గిడుగువారు ఖండించారు. బుర్రా శేషగిరిరావుగారు విజయనగరంలో పరిషత్తు ఏర్పాటు చేయటానికి సంకల్పించి పిలిచారు. గిడుగు వచ్చారు. శ్రీపాద రాలేదు. ఇవే గిడుగు లేఖలోని విషయాలు. ఆ దిగ్దంతులు నాడు ప్రచురించిన వ్యాస పరంపరలు వాదోప వాద రూపంలో వికసించిన రసఝురులు. వాటిని పఠించిన రసజ్ఞుల హృదయాలు తన్మయత్వంలో ఓలలాడాయి.

1934 ఏప్రిల్ 'ప్రబుద్ధాంధ్ర'లో " తెనుగు పత్రికల సంపాదకులకు " అనే గిడుగుగారి వ్యాసం ప్రచురితమైంది. అందులో గిడుగువారు పత్రికా సంపాదకులు శిష్టవ్యవహారమందున్న భాష వాడవలసిందని విజ్ఞప్తి చేస్తూ ఇలా అన్నారు:

> ఇంగ్లీషువారు ఇంగ్లీషు వార్తా పత్రికలు చదివినట్లు, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక మొదలైన వార్తా పత్రికలలోని సంపాదకీయ వ్యాసములున్ను, గ్రాంధికాంధ్రమున రచించిన ఇతర వ్యాసములున్ను, జాబులున్ను తెలుగువారు చదవలేరు. ఈ విషయము అనేకసార్లు పరీక్షించి చూచినాను. ఇంగ్లీషు నేర్చిన తెలుగువారయినా ఇంగ్లీషు వార్తా పత్రికలు చదివినట్లు సుళువుగా తెలుగు వార్తా పత్రికలు చదవలేరు. ఇందుకు కారణము తెలుగు అక్షరములు చదవటమువారికి అలవాటు లేకపోవడముకాదు; గ్రాంధికాంధ్రము సుపరిచితము కాక పోవడము. తెలుగు పత్రికలన్నీ తెలుగు దేశమందున్న తెలుగువారందరికీ తెలియవలసిన విషయములు తెలియజేసి వారిని ఉద్ధరించడమునకు పుట్టినవి; గాని పండితుల కోసము పుట్టలేదు. పత్రికా సంపాదకులు ప్రాచీనాంధ్ర భాషా పాండిత్యము గలవారైనా వారి పాండిత్యము వార్తా పత్రికలలో ప్రకటించడము వ్యర్థ ప్రయాసము. ప్రజాస్వామిక పరిపాలనము ఏర్పడ్డ దేశములలో ప్రఖ్యాతిపొందిన వార్తా పత్రికల సంపాదకులు అట్టి పాండిత్యప్రకటనము వట్టి వంచమని నిందించినారు. వాస్తవమయిన పాండిత్యము తక్కువయిన కొలదీ పండిత మానుల వ్రాతలో వంచము అధికముగా ప్రకటిస్తారని ఆక్షేపించినారు. తెలుగువారిలో నూటికి పది మందైనా సంతకము చేయగలవారు లేనప్పుడు, వార్తా పత్రికలలోని సంపాదకీయ వ్యాసములు చదవగలవారు ఎందరుంటారు ? పత్రికలలోని వార్తలు వినడమునకు తెలుగుదేశమందు ప్రజలకు అభిలాష ఈ పది యేళ్ళలో ఎక్కువయినది, పట్టణములలోనేకాక, పల్లెలలోకూడా పురాణము చదివించి విన్నట్లు ప్రజలు ఆంధ్ర పత్రిక చదివించి వినడము నేను స్వయంగా చూచి సంతోషించినాను. అయితే వారి శ్రమకు అనురూపమయిన ఫలము కలుగలేదు. భాష సుపరిచితము కానప్పుడు ఉత్సాహభంగము అనివార్యముగదా !
>
> అభినవాంధ్ర భారతిని ఆంధ్ర సారస్వత పీఠముమీద కూర్చుండబెట్టి ఆ దేవికి పట్టాభిషేకము చేసే గౌరవము ఆంధ్ర పత్రికాధిపతులు పొందుదురుగాక

అని కోరుతున్నాను.

ఆ విధంగానే 1935 సెప్టెంబరు "ప్రబుద్ధాంధ్ర" లో మారేపల్లి రామచంద్రశాస్త్రి (కవిగారు) గారు "మన తెలుగు వార్తా పత్రికలలో వాడే భాష" అనే వ్యాసం రాసి వ్యావహారిక భాషా ప్రయోజనాన్ని ఎలుగెత్తిచాటారు.

1936 మేలో నవ్య సాహిత్యపరిషత్తు వేదికగా "ప్రతిభ" త్రైమాస పత్రికగా అవతరించి వ్యావహారిక భాషా ప్రచారానికి నడుం కట్టింది. "ప్రతిభ" ప్రారంభ సంచికలో గిడుగువారు నవ్య సాహిత్య పరిషత్కార్యదర్శి గారికి రాసిన ఉత్తరం ప్రచురితమైంది. భాషాపరిణామ దృష్టితో ఆ జాబు ముఖ్యమైంది. అందులో గిడుగువారు

> .. ...... .. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు వర్తమాన వ్యావహారిక భాషను చేపట్టి నవ్య సాహిత్యాభివృద్ధికి తోడుపడతారని ఆంధ్ర పత్రికా సంపాదకులు ఆశపడడము నాకు వింతగా కనబడుతున్నది. ........ ...
> ఇట్టి పరిషత్తులకన్న ఆంధ్ర పత్రికలే నవ్య సాహిత్యమును పోషించి అభివృద్ధిలోనికి తేగలవు. పత్రికలలో ప్రధానమైన ఆంధ్ర పత్రికకు సంపాదకులయిన దేశోద్ధారక శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు ఈ నవ్య సాహిత్య పరిషత్తు చతుర్థ సమావేశ ప్రారంభోత్సవము చేయడము అభ్యుదయ సూచకము. వారు పట్టుదలతో పనిచేస్తే ఒక్క సంవత్సరములో విశ్వవిద్యాలయాలూ పరిషత్తులూ చేయజాలని పని సాధించగలరు. .. అని ఆకాంక్షించారు.

1936లోనే కృష్ణాజిల్లా తేలప్రోలు నుంచి పాటిబండ మాధవశర్మ, రాజగోపాల్ గార్లు నడిపిన "వీణ" వ్యావహారిక భాషావాదానికి వేదికగా పనిచేసింది. 1936 జూలై "వీణ" గిడుగువారిని గురించి సంపాదకీయం రాసింది.

*గౌరవాచార్య పదవి*

అసలు పంతులుగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రత్యేక పీఠం ఏర్పడందే తెలుగు శాఖకి పూర్ణత్వంలేదు. రామమూర్తి పంతులుగారు నవ్యాంధ్రానికి చేసిన సంస్కారాలను యూనివర్శిటీ స్వీకరించి అమలు జరపడం పవిత్రమైన ధర్మమై వున్నది. ఆంధ్ర యూనివర్శిటీలో తెనుక్కి రీడరేనాలేదు. పంతులుగారి విజ్ఞానాన్ని యూనివర్శిటీ వారు దేశాభ్యుదయానికి వినియోగించ దలిస్తే వారిని వెంటనే ఏ రీడరుగానో నియమించాలి. అంతేగాని గౌరవాచార్యుడుగా కాదు ఎంత వ్యయం, ఎంత ప్రయాస సహించి ఇంత విజ్ఞానాన్ని కూడబెట్టినారో పంతులుగారు! ఇంతా తెలిసిన యూనివర్శిటీ ఆ విజ్ఞానరాశి అంతా ఉచితంగా వినియోగించుకుంటుందా? పంతులుగారిని ప్రొఫెసరుగా, కనీసం రీడరుగానయినా నియమించాలి. వారి వృద్ధాప్యం శిష్యకోటిమధ్య నిశ్చింతగా, ప్రశాంతంగా ప్రవర్తిల్లాలి. ఈ గౌరవం యూనివర్శిటీ దక్కించుకోవడం ఉచితం.

యూనివర్శిటీలో ప్రొఫెసరై పంతులుగారు, వృద్ధసింహం, వ్యావహారిక భాషా వాదం గర్జిస్తుంటే, విద్యార్థులు ఆంధ్ర భాషని ఉద్ధరించబోతున్న బాలవీరులు వింటూ తన్మయులవుతుంటే అది దివ్యదర్శనం. అది నిజంగా యూనివర్శిటీకి చరితార్థత!

'వీణ' 1937 ఫిబ్రవరి (సం.2. సం1, 2) సంచికలో గిడుగువారి సందేశం ప్రచురించారు. అది పఠనీయంగావుంది.

*సందేశము*

మహాశయా,

వాడుక భాష, శిష్ట వ్యవహారములో ఉన్నదైనా, కావ్యరచనకు పనికిరాదనీ, అట్టి భాషలో కావ్యములు ఎప్పుడూ ఎవ్వరూ రచించ లేదనీ ఇరవయి అయిదు సంవత్సరాలయి ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు పట్టుదలతో ప్రకటిస్తూ, నవ్య సాహిత్యము తలయెత్తకుండా అణగద్రొక్కడానికి యథాశక్తి పాటుపడుతున్నారు; గాని వారి ఉద్యమము నిష్ఫలమయినది. నవ్య సాహిత్యమందు అభిరుచి దేశములో వ్యాపిస్తూ ఉన్నది. ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు ఆదరిస్తూ ఉన్న కవులకూ పండితులకూ ఎంతమాత్రమూ తక్కువకాని కవులూ పండితులూ కలిసి నవ్యసాహిత్యము నిర్మిస్తున్నారు. శిష్టులు వాడుకొనేదే దేశభాష; దేశస్థులకు అందరికి ఉపచరించే గ్రంథాలు ఆ భాషలోనే రచించడము సదాచారముగా ఇంగ్లండు మొదలయిన దేశములలో భావిస్తారు.

పత్రికా సంపాదకులందరూ నవ్య సాహిత్య నిర్మాణ కార్యమందు దీక్ష వహించి ఆసక్తితో పనిచేస్తే అన్నివిధములా దేశము వృద్ధిపొందుతుంది. భాషాభిమానముతోటిదే దేశాభిమానము.

వాడుక భాష కావ్యమందు నిషిద్ధముకాదు. అది ప్రయోగించడము వల్ల "రసము" చెడదు. అర్థము శబ్దమును విడిచి వుండదు. వినగానే అర్థమును స్ఫురింపజేసే శబ్దాలుకూర్చి పద్యముగానీ, పాటగానీ రచిస్తే, వికసించిన పువ్వుల దండవలెను, సుగంధద్రవ్యములతో చేసిన కలపము వలెను హైయంగవీనముతో చేసిన వంటకము వలెను ఇంపుగా ఉంటుంది. కేవలమూ కళా కౌశలము మెచ్చుకోగలవారు ఎవరో ఉంటారు శాస్త్రజ్ఞులు.

గుంటూరు — ఇట్లు విన్నవించే

1937సం జనవరి 24. — గిడుగు వేంకటరామమూర్తి

తెలుగు పత్రికా రచనను వ్యావహారికంలోకి తేవటానికి తీవ్రంగా కృషి చేసిన వారిలో సింహాద్రి గోవిందాచార్య, తాపీ ధర్మారావు, నార్లవెంకటేశ్వర రావు ముఖ్యులు. ఈ ముగ్గురిలో ప్రథములు ఎస్ జి. ఆచార్య. వాడుక భాషను ముఖ

ముందుగా సాహిత్యేతర పత్రికా లోకంలో ప్రవేశ పెట్టిన గౌరవం ఆచార్య గారికే దక్కింది. వారు ప్రజాబంధు, జన్మభూమి మొదలైన పత్రికల ద్వారా వ్యావహారిక భాషకు వ్యాప్తి కలిగించారు. ఆంధ్ర విశారద తాపీ ధర్మారావు గారు 'ప్రజా మిత్ర'లో 'కొత్తపాళీ' తో వ్యావహారిక భాషకు రూపకల్పన చేశారు. తెలుగులో 'పాప్యులర్ జర్నలిజానికి' ఆచార్య పునాదులు వేస్తే, దానిపై భర్మహర్మ్యాలు నిర్మించినది 'తాపీ', ధర్మారావుగారు. వీరగ్రాంథిక వాదులైన పిఠాపురం మహారాజావారు 1936లో స్థాపించిన 'జనవాణి' దిన పత్రికను కేవలం వ్యావహారికం మీదనే నడిపించారు. తాపీ ధర్మారావుగారు. తర్వాతి కాలంలో కాగడా, జనవాణి (వారపత్రిక) మొదలైన పత్రికలద్వారా వీరు వ్యావహారిక భాషకు ఒకస్థాయి కల్పించారు. తెలుగు దినపత్రికలో వ్యావహారికానికి సంపూర్ణ ప్రవేశం కల్పించిన ఘనత ధర్మారావుగారిదే. 1936లో ఆంధ్రప్రభ ప్రారంభమైంది. ఆంధ్రప్రభ దిన పత్రికలో నార్లవారు వీర గ్రాంథిక భాషా వాదుల హృదయాలను సైతం చూరగొన గలిగిన వ్యావహారిక భాషను మలచి సరికొత్త రచనాశైలికి మార్గదర్శకులయ్యారు.

ఈ కాలంలోనే మాండలిక భాషా విశిష్టత కూడా గుర్తించబడింది. 'ప్రతిభ' ప్రారంభ సంచిక సంపాదకీయంలో "భాష ఏయే మండలాలలో ఏయే భేదములతో వాడుకలో ఉన్నదో తెలుసుకొనడము అభినవాంధ్ర భాషా పాండిత్య లక్షణములలో ఒకటి"—అని పేర్కొని "అందువల్ల రచయితలు తమ మండలములలో వ్యవహారములో ఉన్నరూపములు తమ వ్యాసములలో ప్రయోగించవలెనని" కోరింది. తెలుగు గ్రామీణ భాషకున్న శక్తినీ, పదనును నిరూపించింది 'జమీన్ రైతు.' ఆ పత్రిక మాండలిక భాషకు పట్టం గట్టింది. అలాంటి మాండలికాల ద్వారానే మన భాష బహుధా పరిపుష్ట మైంది. తేటతెలుగు మాటలతో చిన్నచిన్న వాక్యాలతో సులభ గ్రాహ్యమైన వ్యావ హారిక భాషను రూపొందించటంలో వామ పక్ష పత్రికలు చేసిన కృషి ప్రశంసనీయ మైంది. సువిశాలమైన తెలుగుదేశంలోని మాండలిక పదాలు ఉపయోగించి యావదాంధ్ర దేశానికి సంబంధించిన ఒక చక్కని వ్యావహారిక భాషా శైలిని రూపొందించటంలో ఈ పత్రికలు చాలావరకు కృతకృత్య మయ్యాయి. మొదట్లో దీన్ని 'ప్రజాశక్తిభాష' అని హేళన చేసినవారు సైతం, తర్వాత దీని విశిష్టత ఒప్పుకోక తప్పలేదు.

ఈవిధంగా కుంఫిణీయుగం తర్వాత వెనుకబడిన వ్యావహారిక రచన స్వాతంత్ర్యమహోదయం నాటికి తెలుగు పత్రికా రచనలో పునఃప్రతిష్ఠాపితమైంది. పత్రికలన్నిటిమీద తన ప్రభావం చూపించింది. వాటి మార్గం మార్చివేసింది. పాత్రికేయులకు కొత్త ఉపకరణం తెచ్చి ఇచ్చింది. పత్రికల అభివృద్ధికి పాటుపడింది. ఈ భాషా విప్లవానికి చోదక శక్తి గిడుగు పిడుగు.

# సమస్కంధులైన తండ్రీ కొడుకులు

## అక్కిరాజు రమాపతిరావు

ఒక జీవిత కార్యక్షేత్రంలో ఒకే రంగం ఎన్నుకొని ఒకే వంశంలోని తండ్రీ కొడుకులిద్దరూకూడా సమస్కంధులు, ప్రజ్ఞావంతులు, లబ్ధ ప్రతిష్ఠులు కావడమనేది లోకంలో అసంభవంకాదు కాని అరుదుగా జరుగుతూందని చెప్పవచ్చు. తెలుగు భాషా సారస్వతాలకు సంబంధించినంతవరకు గత కాలంలో తాళ్ళపాక వారి వంశంలోను, పిడపర్తి శైవ కవులింటనూ ఇటువంటి అపూర్వ వృత్తాంతం కొంత కనపడుతుంది.

ఆధునిక కాలాన గిడుగు వారి కుటుంబంలో ఇటువంటి విశేషం కనపడుతుంది. గిడుగు వెంకట రామమూర్తిపంతులు ఆధునిక భాషా సారస్వత రంగంలో చాలా పేరు ప్రఖ్యాతులు పొందిన వ్యక్తి. ఈ శతాబ్దిలో తెలుగు దేశంలో వ్యవహారిక భాషామహోద్యమానికి సారథ్యం వహించి, తెలుగు సాహిత్యంలో వ్యావహారిక భాషాసంప్రదాయాన్ని పునః ప్రతిష్ఠితం చేసిన కీర్తి రామమూర్తి పంతులుగారిది.

రామమూర్తి పంతులుగారి పెద్ద కొడుకు సీతాపతి. ఆంధ్ర విశ్వవిద్యాలయం తండ్రీ కొడుకు లిద్దరినికూడా కళాప్రపూర్ణ బిరుదంతో గౌరవించారు.

1885వ సంవత్సరం జనవరి 28వ తేదీన సీతాపతిగారు విశాఖపట్నం జిల్లాలోని భీమునిపట్నంలో మాతామహులింట పుట్టారు. సీతాపతిగారు పుట్టేనాటికి రామమూర్తి పంతులుగారికి ఇరవై రెండేళ్ళు. తొలిసంతానం. అప్పటికే పర్లాకిమిడి పాఠశాలలో వీరు చరిత్రాధ్యాపకులు.

సీతాపతిగారి బాల్య విద్యాభ్యాసమూ, కళాశాలలో ఎఫ్. ఏ. చదువూ పర్లాకిమిడిలోనే జరిగాయి. 1903వ సంవత్సరంలో ఎఫ్. ఏ. పూర్తి కాగానే సీతాపతిగారు మద్రాసు వెళ్ళి క్రిస్టియన్ కాలేజీలోచేరి 1905వ సంవత్సరానికి బి. ఏ. అయినారు. అటు తర్వాత 1908వ సంవత్సరం రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజీలో చదివి ఎల్. టి. పట్టాన్నికూడా పొందారు. సీతాపతిగారు మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో వేదం వెంకటరాయశాస్త్రిగారికి శిష్యులూ ఇష్టులూకూడా అయినారు. రెండో ఫారం నుంచీ బి. ఏ. వరకూ సీతాపతిపంతులు సంస్కృతం చదివారు. కాని పాఠ్యాంశంగా తెలుగు చదవనే లేదు. తెలుగులో ఆయన సంపాదించిన పాండిత్యమంతా స్వయం కృషితో సాధించిందే.

వస్తుపారంలో నలచరిత్రలోని యాభై పద్యాలు కంఠస్థం చేయటంతప్ప బి. ఏ. వరకూ తెలుగు తానేమీ పాఠ్య పుస్తకాలుగా చదవలేదని స్వీయ చరిత్రలో సీతాపతి పంతులు ప్రస్తావించారు. అయితే బి. ఏ. చదువుతూ పాఠ్య పుస్తకాలుగా చదువుకొనే సంస్కృత నాటకాల్లోని రసవత్తరమైన పద్యాలను, ఘట్టాలను తెలుగులోకి అనువదించి, వెంకట్రాయశాస్త్రిగారికి చూపుతూ వారి మెప్పుపొందుతూ ఉండేవారమని రాసుకున్నారు.

1911 వ సంవత్సరంలో రామమూర్తి పంతులుగారు ఉద్యోగ విరమణ చేసిన తర్వాత వ్యావహారిక భాషోద్యమం తీవ్రతను పుంజుకొంది. అప్పటికే రామమూర్తి పంతులు సవర భాషా కృషి ద్వారా విఖ్యాతుడైనాడు. 1912 వ సంవత్సరంలో మద్రాసు విశ్వవిద్యాలయంవారు లండన్ విశ్వవిద్యాలయంలో భాషాశాస్త్రోపాధ్యాయకుడిగా ఉన్న డేనియల్ జోన్సును ఆహ్వానించి 16 రోజులు ధ్వనిశాస్త్రం (ఫొనెటిక్స్) పైన ఉపన్యాసా లిప్పించారు. ఆ ఉపన్యాసాలకు పర్లాకిమిడినుంచి రామమూర్తిపంతులుగారు, సీతాపతి గారు, కొమర్రాజు సూర్యనారాయణగారు, విజయనగరంనుంచి బుర్రా శేషగిరిరావు, విశాఖపట్టణంనుంచి పి. టి. శ్రీనివాసయ్యంగార్ ప్రభృతులు హాజరైనారు. అటు తరువాత డేనియల్ జోన్సుకు గిడుగువారికీ భాషాశాస్త్రచర్చా విషయికంగా ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి. జోన్సు రామమూర్తి పంతుల్నీ, సీతాపతినీ చాలా ప్రశంసించారు. 1911 నుంచి 1928 వరకూ పర్లాకిమిడి కాలేజీలో చరిత్రోపన్యాసకులుగా ఉంటూ తండ్రిగారికి సవర భాషా కృషిలోను వ్యావహారిక భాషోద్యమంలోనూ సీతాపతిగారు తోడ్పడ్డారు.

1912వ సంవత్సరంలో మద్రాసు విశ్వవిద్యాలయంలో జోన్సు ఎక్స్టన్షన్ ఉపన్యాసాలు ఇచ్చిపోయిన తర్వాత యూరోపియన్లు తెలుగు నేర్చుకునేందుకు అనువైన తెలుగురీడరును ఫొనెటిక్ స్క్రిప్టును ఉపయోగిస్తూ ఇంగ్లీషులో తయారుచేసి దానికి అవసరమైన వివరణను కూడా జోడిస్తూ తనకు పంపవలసిందిగా 1914వ సంవత్సరంలో జోన్సు రామ్మూర్తిగారిని అభ్యర్థిస్తూ లేఖ వ్రాశాడు. ఫొనెటిక్ స్క్రిప్టుకు సంబంధించిన టైపు మిషన్‌ను పంపిస్తే జోన్సు కోరిన సమాచారాన్ని అందించగలమని రామ్మూర్తి రాయగా, జోన్సు అటువంటి టైప్‌మిషన్ పంపించారు. అప్పుడు తండ్రీ కొడుకులిద్దరూ కలిసి యూరోపియన్లు తెలుగు నేర్చుకోవడానికమవైన రీడర్‌ను తయారు చేసి జోన్సుకి పంపించారు. జర్మనీ లోని భాషా శాస్త్రవేత్తలతో సంప్రదించ డానికి జోన్సు పండితుడు ఈ గిడుగు పండితుల గ్రంథాన్ని జర్మనీ తీసుకొని వెళ్ళాడు. ఇంతలో మొదటి ప్రపంచయుద్ధం మొదలైంది. ఏతావాతా ఆ గ్రంథం అచ్చుకాలేదు 1933వ సంవత్సరంలో లండన్‌లో సీతాపతి జోన్సును కలిసినప్పుడు ఈ విషయాన్ని గూర్చి వాకబు చేశారు. మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభం కాగానే జర్మనీనుంచి బయటపడటంలో ఆ రీడరు జర్మనీలోనే చిక్కుబడిపోయిందనీ, 1920లో -కాని అది మళ్ళీ తన చేతికి రాలేదనీ ఆ వాచకం తాలూకు అద్యంతాలు గ్రంథం చిన్నగ

పోయి కనబడకుండా పోయిందనీ జోన్సు తెలిపాడు. ఆ మొదలు చివర లుప్తమై పోయిన భాగాన్ని సీతాపతిగారు అక్కడికక్కడే పూర్తిచేసి జోన్సుకి ఇచ్చారు. అప్పటినుంచీ ఆ గ్రంథాన్ని లండన్ యూనివర్శిటీలో ద్రావిడ భాషల ధ్వని శాస్త్రాన్ని బోధించే ఫర్త్ అనే పండితుడు ఉపయోగించుకొన్నాడు. యూనివర్శిటీకి వెళ్ళి రెండుమూడు రోజుల పాటు ఆ గ్రంథాన్ని విడమర్చి ఫర్త్‌కు బోధించినట్లు సీతాపతి స్వీయచరిత్రలో రాసుకున్నారు.

లండన్ నుంచి పారిస్ వెళ్ళి సీతాపతి యూల్స్‌బ్లాక్‌ను కలుసుకున్నారు. యూల్స్‌బ్లాక్ ఆ కాలంలో గొప్ప భాషా శాస్త్ర విద్వాంసుడిగా పేరుపొందడమే గాక పారిస్ విశ్వవిద్యాలయంలో మహారాష్ట్రి భాష బోధించేవారట. గిడుగు వారితో యూల్స్ బ్లాక్ కూడా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ ఉండేవాడు సీతాపతి ఇంగ్లండుకు బయలుదేరడానికి ముందే యూల్స్‌బ్లాక్ సవరల వాయిద్యాలు తనకు తెచ్చిపెట్టవల సిందిగా కోరి ఉన్నందువల్ల సీతాపతి తనతో తీసుకొని వెళ్ళిన రెండు సవర వాయిద్యా లను బ్లాక్ పండితుడికి బహూకరించారు. సవరల సంగీతాన్ని గూర్చి వివరిస్తూ తాను రాసిన వ్యాసాన్ని కూడా బ్లాక్ పండితుడికిచ్చారు. పారిస్ విశ్వవిద్యాలయ పత్రికలో బ్లాక్ సీతాపతి వ్యాసాన్ని ఫ్రెంచి భాషలోకి అనువదించి ప్రకటించాడు.

సర్ జార్జ్ గ్రియర్సన్ 80వ జన్మదినోత్సవానికి ఆయన అభిమానులు తలపెట్టిన అభినందన సంచికలో సీతాపతి 'Accent in Telugu Speech and metre' అన్న విషయం వివరిస్తూ ఒక వ్యాసం రాశారు. ఆ వ్యాసాన్ని ఎంతగానో మెచ్చుకుంటూ గ్రియర్సన్ సీతాపతికి లేఖ వ్రాశాడు. 1936లో ఇంగ్లండ్ వెళ్ళినప్పుడు సీతాపతి గ్రియర్సన్‌ను కలుసుకొని సవర భాషనుగూర్చి ఆయనకనేక కొత్త విషయాలు తెలియజేశారు. సవర భాషాకుటుంబానికి చెందిన పరేంగ్, రేమో భాషలను గూర్చి గ్రియర్సన్ పడ్డ పొరపాట్లను గూర్చి తెలిపితే ఆయన ఇట్లా అన్నారుట. 'భారతదేశ భాషల సర్వే కృషిలో నాకు నీవంటి పండితుల సహాయమే లభించిందను కుంటున్నావా? అందరూ నీలాంటి వాళ్ళుకాదే! అంచేత సహజంగా కొన్ని లోపాలు ఉండి ఉంటాయి. మళ్ళీ నా 'లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా' సంపుటాలు పునర్ముద్రణం చేయవలసి వస్తే నీ తోడ్పాటు కోరవలసిందిగా ఇండియా గవర్నమెంట్‌కు రాస్తాను. ఇప్పటికే నేను పెద్దవాణ్ణి. నే బ్రతికి ఉండగా మళ్ళీ ఆ సంపుటాల పునర్ముద్రణ జరుగు తుందనుకోను."

సీతాపతి కావ్యాలుగాని, ప్రామాణికమైన విమర్శ గ్రంథాలుగాని రచించలేదు. అయినా రాసిన కొద్ది సంఖ్యలోవే అయిన వ్యాసాలు, భారతీశతకం, కువలయావళి అనే నామాంతరంగల రత్న పాంచాలిక ఆంధ్రానువాదం, ఇంగ్లీషులో రాసిన తెలుగుభాషా చరిత్రా, గురజాడ అప్పారావు జీవిత వృత్తాంతం, సవర పాటల ఇంగ్లీషు అనువాదం, వివిధ గ్రంథాలకు రాసిన పీఠికలూ, బాలవాఙ్మయంలో చేసినకృషీ, సీతాపతిగారి గొప్ప

ఉపజ్ఞను, ప్రతిభావ్యుత్పత్తులను చాటి చెప్పగలవు.

1940 వ సంవత్సరంలో సీతాపతి పంతులు పది నెలలపాటు భారతి పత్రికకు సంపాదకత్వ బాధ్యత వహించారు. అప్పుడు మొట్ట మొదటిసారిగా భారతి వంటి ప్రౌఢ సాహిత్య మాసపత్రికలో బాలవాఙ్మయానికి ప్రవేశం కల్పించారు. భారతి పత్రికలోనే సవర పాటల తెలుగు అనువాదాలు కూడా ప్రకటించేవారు. కట్టబొమ్మన్ అనే చారిత్రాత్మక నాటకాన్ని రచించారు సీతాపతిగారు. ఆయన చేసిన రచనల్లో పేర్కొనదగింది తెలుగు ఛందోరీతులన్న అపూర్వ గ్రంథం షేక్స్పియర్ చతుశ్శత జయంతిని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్వహించిన పోటీకి షేక్స్పియర్ జీవితమూ రచనలూ అనే గ్రంథాన్ని తెలుగులో రచించారు సీతాపతిగారు.

తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధికెక్కిన రచనా ఘట్టాలను ఆయా గ్రంథాలనుంచి ఎన్నికచేసి వాటిని సంస్కృతంలోకి అనువదించి కవితోదయ చంద్రిక పేరున ప్రకటించారు సీతాపతిగారు. మనుచరిత్ర, వసుచరిత్ర, క్షేత్రయ్య పదాలు, వేమన పద్యాలు ఈ కవితోదయ చంద్రికలో అనువాద ఘట్టాలుగా చేరాయి.

చరిత్ర, సాహిత్యం, మానవ పురాతత్వశాస్త్రం (ఏంత్రోపాలజీ) శాసన విజ్ఞానం, సంగీతం, నాట్యం, ఆదివాసుల భాషా విశేషాలు మొదలైనవన్నీ సీతాపతిగారికి అభిమాన విషయాలే. అనంతవర్మ చోడగంగుదేవ తామ్రశాసనాలు పరిశోధించి భారతిలో సీతాపతిగారు రెండువ్యాసాలు ప్రకటించారు. ఈ శాసనాలను ఇంగ్లీషులోకి అనువదించి ఆంధ్రా హిస్టారికల్ రిసర్చ్ సొసయిటీ జర్నల్‌లో కూడా ప్రకటించారు. కొత్తగా మరెన్నిటినో కూడా సేకరించి క్షేత్రయ్య పదాలను విపులమైన పీఠికతో చేర్చి ప్రకటించారు. క్షేత్రయ్య పదాలలో ముప్ఫైని ఎన్నుకొని రస, భావ, అభినయరీతుల సంబంధి విలక్షణమైన వాటిని ఎంచి సంస్కృతంలోకి అనువదించి కవితోదయ చంద్రికలో చేర్చారు.

1943 నుంచి 1957 వరకు తెలుగు భాషా సమితివారి విజ్ఞాన సర్వస్వ నిర్మాణంలో సంగ్రాహకులుగా ఉన్నారు. మొదటి సంపుటమైన చరిత్ర-రాజనీతికి సీతాపతిగారే ప్రధాన సంపాదకులు. తక్కిన సంపుటాలకు కూడా సంగ్రాహకులుగా ఉన్నారు.

1946 సంవత్సరంలో నాగపూర్‌లో జరిగిన సైన్స్ కాంగ్రెస్‌లో సీతాపతిగారు పాల్గొన్నారు. ఏంత్రోపాలజీ విభాగానికి చెందిన సదస్సులో **Interpretation of cultures-Dravidian and pre Dravidian** అనే అంశంపై సీతాపతి ఆ కాంగ్రెస్‌కు ఒక ప్రసంగ వ్యాసం సమర్పించారు. సదస్సులో ఆ వ్యాసం చదవటానికే గంటా పది నిముషాలు పట్టింది. ఆనాటి ఆలిండియా ఆర్కియాలాజికల్ ఆఫీసర్ శ్రీనివాస చక్రవర్తి తామీ విభాగానికి చెందినవారు కాకపోయినా సీతాపతిగారి ఉపన్యాసం పట్ల కుతూహలంతో హాజరై ఆ ఉపన్యాస వ్యాసాన్ని చాలా మెచ్చుకున్నారు. ఆనాటి చర్చా సదస్సులో పర్లాకిమిడి అనే ఊరిపేరుకూ, గోదావరినది పేరుకూ సవరభాషా పదాల ఆధారంగా వ్యుత్పత్తి

నిరూపించి చెప్పారు సీతాపతి. సవరభాషా విషయికంగా సీతాపతిపంతులు చేసినకృషికి గుర్తింపుగా, మెప్పుగా అమెరికాలో నెలకొనిఉన్న అంతర్జాతీయ సాహిత్యసంస్థ ఆయనకు డి. లిట్ గౌరవ పట్టానిచ్చి గౌరవించింది.

సంగీతంలోనూ నాట్యకళలోనూ కూడా సీతాపతిగారికి తగిన ప్రవేశం ఉన్నది. సవరల జానపద గీతాలకు, ఋగ్వేదంలోని ఋక్కులకు ఉన్న సారూప్యసాదృశ్యాలను గూర్చి ప్రసంగించి, ఆజ్జాడాదిభట్ల నారాయణదాసు, ద్వారం వేంకటస్వామి నాయుడు ఉన్న సభలో మెప్పించగలిగారుట సీతాపతి. సవర గీతాలను వీణమీద పలికించి భారతీయ సంగీతంలోని నిషాదానికి సవర భాషలో సారూప్యాన్ని చూపి వివరించారుట ఆ సభలో.

రామ్మూర్తి పంతులుగారి భాషోద్యమానికి నూటికి నూరుపాళ్ళు వ్యతిరేకి అయినా పిఠాపురం మహారాజాగారు సూర్యరాయాంధ్ర నిఘంటువు 5,6,7, సంపుటాల ప్రచురణ బాధ్యత, పర్యవేక్షణలు సీతాపతి పంతులికి అప్పగించారు. పిఠాపురం రాజాగారితో సీతాపతికి మైత్రికూడా పెంపొందింది. రాజాగారి ధనసాహాయ్యంతో ప్రచురితమైన పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నం, దేవులపల్లి సోదరకవుల మహేంద్ర విజయం, రావు వంశ ముక్తావళి, సర్వజ్ఞ సింగభూప విరచిత రసార్ణవ సుధాకరం, సీతాపతి పర్యవేక్షణలోనే వెలువడ్డాయి.

1965లో సీతాపతి గారికి ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదమిచ్చి సత్కరించింది. ఆంధ్రప్రదేశ్ సంగీత సాహిత్య అకాడమీల విశిష్ట సభ్యతాలు కూడా లభించాయి. కేంద్ర సాహిత్య అకాడమీ సీతాపతి పంతులుచే తెలుగుసాహిత్య చరిత్ర ఇంగ్లీషులో రచింపజేసి ప్రకటించింది.

ఎనభై నాలుగు సంవత్సరాల పూర్ణాయుర్దాయం అనుభవించారు సీతాపతి. 1969 ఏప్రిల్ 19 సీతాపతి కాలగతి చెందారు. తెలుగుసాహిత్యంలో ఆధునికయుగాన్ని గూర్చి విశ్లేషించాల్సివస్తే సర్వతోముఖంగా తెలుగుభాషాసాహిత్యాలు వికసించటానికి రామ్మూర్తి పంతుల వ్యావహారిక భాషోద్యమం ఎంతో అండ చేకూర్చిందనకతప్పదు. ఈ మహోద్యమంలో తండ్రికనేక విధాలుగా తోడ్పడ్డాడు సీతాపతి.

తండ్రిగారికన్నా కూడా సీతాపతి ఒకటి రెండు విషయాలలో మౌలికమైన ప్రతిభ ఉన్నవాడు. రామ్మూర్తి పంతులుగారికి సృజనాత్మక రచనలు చెయ్యాలని ఆసక్తి ఉన్నట్టు కనిపించదు. ఎంతసేపూ ఆయనలో విశ్లేషణం, విమర్శ మాత్రమే కన్పిస్తాయి. సీతాపతిగారు మంచి కవిత్వం రాశారు. బాలసాహిత్యంలో గొప్ప సృజనాత్మకమైన ప్రతిభను ప్రదర్శించారు. చిలకమ్మ పెళ్ళి లాంటి పాటలు సీతాపతిగారి ఉపజ్ఞను సృజనప్రతిభను చాటుతున్నాయి.

రామ్మూర్తి పంతులు పదవీ విరమణ చేసి వ్యావహారిక భాషోద్యమ నాయకత్వం వహించేనాటికి సీతాపతి పాఠశాలాధికారిగా [illegible]. గురజాడ అప్పారావు

ఆనంద గజపతి సంస్థానపు వాద వివాదాల్లో, న్యాయ స్థాన అభిమోగాల్లో తల మున్కలై ఉన్నాడు. ఆ తర్వాత నాలుగేళ్ళలోనే పాపం అపమృత్యువు వాత పడ్డాడు. అందువల్ల రామ్మూర్తిగారికి కుడి భుజం సీతాపతే అయినాడు. అప్పారావుగారి దగ్గర రామ్మూర్తిగారికి బాగా చనువుండేది. కన్యాశుల్కంలోని త్రివిషయైక్యత గూర్చి బాగా చర్చించానొకసారి అని సీతాపతి రాసుకున్నారు. సీతాపతి గారంటే ప్రేమతో కూడిన బెదురు లేదా జంకు కూడా అప్పారావుగారి కుండేవి. ప్రశ్నలు వేస్తాడని!?

అప్పకవీయ పరిష్కరణ ముద్రణకి సీతాపతి పంతులు రాసిన పీఠికలో పుట్‌నోట్‌లో ఆయన ఏం రాశాడో చూడండి:

"వ్రాత ప్రతులు సంగ్రహించుటలోను పాఠములు సంప్రదించుటలోను విషయ విచారణలోను మా తండ్రిగారు మ. రా. రా. శ్రీ రావు సాహేబు గిడుగు వేంకట రామ మూర్తి పంతులుగారు నాకు సహాయులుగా ఉన్నందున ఈ పీఠిక నేనే వ్రాసినా 'మేము' అని బహువచనము వాడి ఉన్నాను. (గి.వేం.సీ.)" ఈ పీఠిక 1922వ సం॥ జూలై 18వ తేదీన పర్లాకిమిడి నుంచి అని నమోదై ఉన్నది. 82 పుటల డెమ్మీ సైజులో చాలా గొప్ప పీఠిక ఇది. ఛందస్సుకి సంబంధించిన అపూర్వమైన మేధా విలసితమైన విషయాలెన్నో చర్చించారు సీతాపతి ఇందులో. కాబట్టి తండ్రికి కొడుకు సాయపడ్డం కాదు, కొడుక్కే తండ్రి సహాయకుడిగా ఉన్నాడన్నమాట ఛందస్సుకి సంబంధించిన విషయాలలో.

ఇక బాల కవి శరణ్యం ద్వితీయ ముద్రణ విజ్ఞప్తిలో సీతాపతి ఇట్లా ప్రస్తావించారు.

"....మొదటి రెండు ప్రసంగములున్ను- అంతే కాక చిల్లర సంగతులలో కొన్నిన్ని, కట్టకడపటి ప్రసంగమున్ను మా తండ్రిగారు రచించినారు. తక్కిన గ్రంథ మంతా మా తండ్రిగారు సేకరించి యుంచిన ప్రయోగములను, నోట్సును ఆధారముగా పెట్టుకొని నేను రచించినాను." బాలకవి శరణ్యంలో ప్రధాన విషయ విభాగం కింద నలభై ఎనిమిది పద్దులు, చిల్లర సంగతుల వివరణంలో అరవై అయిదు పద్దులు ఉన్నాయి. అంటే సీతాపతి కృషి ఎంత గొప్పదో గ్రహించండి.

రామ్మూర్తి పంతులుగారు కూడా ఉపోద్ఘాతంలో తలవని తలంపుగానే ఏమో "ఇది ఒక చిన్న గ్రంథము; దీనిలో మేము చెప్పే విషయము కొన్ని కొత్త తెలుగు మాటల సాధుత్వము" అని మొదలు పెట్టారు. ఈ మేములో సీతాపతిగారు ఉన్నారని తెలుసుకోవాలి.

రామ్మూర్తి పంతులికి ఉద్యోగవిరమణ చేసే వరకూ పద్యాలలో రచనా సంబంధమైన తప్పొప్పులు తెలీవు. సీతాపతి పన్నెండేళ్ళ వయసున పద్యాలు రాస్తే ఆ పద్యాల్లో తప్పులేమైనా ఉన్నాయా దిద్దిపెట్టాల్సిందని రామ్మూర్తి పంతులు పండితుల దగ్గరికి తీసుకొని వెళ్ళి చూపాట్టు. ఈ విషయం సీతాపతి తండ్రిగారి జీవిత చరిత్ర

రాస్తూ ప్రస్తావించారు. ఈ జీవిత చరిత్రను బెజవాడలో ఆనాడున్న ప్రజాశక్తి కార్యాలయం వారు 1945 లో అచ్చువేశారు అందులోని ఈ సంగతి చూడండి:

సీతాపతి రాస్తున్నాడు. "1918లో నేను కన్నడం మొదటి వాచకం చదువుతూ ఉంటే 'కన్నడమా చదువుతున్నావు; ఏదీ ఇలాతే' అని ఒక పాఠం గబగబ చదివి అర్థం చెప్పారు. 'చాలా కాలమైనది చదివి, మరచి పోలేదు' అన్నారు. (పుట 19)- ఈ విధంగా తండ్రీ కొడుకులు కలిసి సాధించారన్నమాట, చాలా విషయాలు. తండ్రి గారి గూర్చి కొడుకెలా వ్యాఖ్యానిస్తున్నాడో చూడండి." . వీరికి అరవం, కన్నడం, మళయాళం భాషలతో గల పరిచయము భాషాతత్వ పరిశోధనకే కాని నిత్యవ్యవహారానికి ఉపచరించేది కాదు . నవరభాషా లక్షణము తెలిసినంత సవిస్తారంగాను, స్పష్టంగాను నాకు తెలుగు భాషా లక్షణము తెలియదనే చెప్పవలెను అని వీరు 1934లో ఒకసారి సభలో చెప్పారు" (పుట 19). బహుశా సర్వేపల్లి రాధాకృష్ణయ్య అధ్యక్షతన తన నవర నిఘంటువు విక్రమదేవ వర్మకి కాన్క పెట్టే సందర్భంలో రామ్మూర్తి పంతులి మాట అని ఉంటారు. ఇంకోటి కుతూహలం కలిగించే వృత్తాంతం:

" . భారతం చదివి, ఆ కాలపు నుడికారము వర్గీకరణం చేసి నాకు బోధపరచి, పట్టికలు నా చేత వ్రాయించి ఎదుట పెట్టుకొనే వారు. అందుచేతనే "ప్రాదెనుఁగుఁగమ్మ" రచించడం వారికి సాధ్యమైనది" (పుట 27). ప్రాదెనుగుకమ్మ రచనా కాలం 1912. కాబట్టి తొలి రోజుల నుంచీ తండ్రీ కొడుకుల సారస్వత కృషి సమస్సమ విభక్తాంగంగా సాగుతూనే వచ్చిందని తెలుస్తున్నది.

సభల్లో రామ్మూర్తి పంతులు ప్రసంగించేప్పుడు ఆయనకు కావల్సిన సమాచారమంతా ప్రయోగాలు, వివరణలు, అన్నీ సర్వసిద్ధంగా అమర్చి పట్టుకొని ఉండేవాడు సీతాపతి తొలినాళ్ళలో. అంతటి మమేకం ఆ తండ్రీకొడుకుల భాషా కృషి. తప్పొప్పు కూర్చేపని సీతాపతి చూసుకునే వాడని, రామ్మూర్తి పంతులును గూర్చి ఆయన శిష్యులు రాసిన స్మరణ వ్యాసాలలోనూ, సీతాపతే రాసిన ఏడెనిమిది స్మరణ వ్యాసాలలోనూ పేర్కొనబడింది.

సీతాపతి రాసిన భారతీశతకం ఒక విషయంలో చాలా అద్భుతం గొలిపే రచన. వ్యావహారిక భాషా ప్రయోగ సమర్థనం కోసం రాసినా ఆ పద్యాలు ఎంతో ధారాశుద్ధితో ముద్దులు మూట గట్టేలా ఉన్నాయి. భావుకత, కవిత్వానికి కావలసిన హృదయోద్వేగమూ ఆ పద్యాల్లో పుష్కలంగా కన్పిస్తాయి ఈ ప్రయోగాలన్నీ బాలకవి శరణ్యంలో వచన వివరణ రూపంగా వ్యాఖ్యాతాలైనాయి. తండ్రి గారికి గొప్ప అండగా ఉండబట్టే రామ్మూర్తి పంతులు సారస్వత విషయాలలో సీతాపతితో సంప్రదించడమే కాక, అతడి అభిప్రాయాన్నీ కోరేవారు.

సీతాపతి రాసిన పీఠికలు, వ్యాసాలు ఒక చోట చేర్చి సంపుటంగా తెస్తే ఆయన కృషి, సాధనలోని విషయ వైవిధ్యం కనబడతాయి. రామ్మూర్తి పంతులు గారి కృషి

అంతా ఐదారు ప్రామాణిక సంపుటాలలోనూ, 1919లో సుమారొక ఏడాది పాటు నడిపిన తెలుగు పత్రిక ద్వారాను సాహిత్య లోకానికి వెల్లడవుతున్నది. సీతాపతి కృషికి అలాంటి సంపుటీకరణ రూప కల్పన ఇంత వరకూ జరగలేదు.

1909లో ప్రారంభమైన తండ్రీకొడుకుల సాహిత్య కృషి, 1940వ సంవత్సరం రామ్మూర్తి పంతులు పరమ పదించినా 1968 వరకూ సీతాపతి సాగిస్తూనే వచ్చారు.

తండ్రి పేరు స్మరించ వలసిన సందర్భంలో తప్పక కొడుకు పేరు కూడా తెలుగు భాషా సాహిత్యాభిమానులు స్మరించుకోవడం సముచితం.

# గిడుగా ? పిడుగా ?

## చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

" గిడిగు గాడిది పిల్లల పిడుగు గాని " అని పెద్ద పెద్ద విమర్శకు లందఱూ శంకరగిరిమాన్యాలట్టుకొని పాఱిపోయే ప్రజ్ఞాశాలి ఒక మహనీయుణ్ణిగూర్చి నాలుగు మాటలు వ్రాస్తాను. చక్కని విమర్శకులు యింగ్లీషువారిలో వున్నారంటూ వినడమేకాని దాన్ని తెలుసుకోవడానికి ఆ భాష బొత్తిగా రానివాడను కావడంచేత నాకధికారం లేదు కదా? యిక అంతోయింతో వచ్చిన భాషలు సంస్కృతాంధ్రాలు. పుట్టి బుద్ధివచ్చింది మొదలు ఆ భాషాద్వయంలోనున్నూ కొందఱిని కొందఱు విమర్శిస్తూనే వున్నారు, చూస్తూనే వున్నాను. కొన్నిటిని గ్రంథకర్త ప్రమాదాలను చూపినా, చాలా భాగం విమర్శకులు స్వంత ప్రమాదాలు ప్రకటించు కొన్నట్టే కనపడుతుంది. వ్యక్తి దూషణను గూర్చి చెప్పనే అక్కఱలేదు. ఆయా విమర్శకులు లోకోపకారార్థం విమర్శన కారంభించినట్లు కొన్ని మాటలు వ్రాసి ప్రధానాంశంలోకైతే దిగుతారుకాని, అసలు వారికి ముఖ్య ప్రయోజనం గ్రంథకర్తను దూషించడమేకాని గ్రంథ విమర్శనం కానేకాదని ప్రమాణంచేసి చెప్పవచ్చును. యీ విమర్శకులలో చాలా మందికి శాస్త్ర జన్య జ్ఞానం వుండదు. వుండక పోయినా యెందఱినో అట్టిజ్ఞానం కలవాళ్ళని విమర్శించడంకలదు. అదిచూచి దాని తత్త్వం తెలుసుకునేవారు అరుదుగా వుండడంచేత— "ఫలానావారు విమర్శించి చాలా తప్పులు పట్టి వోడించా" రంటూ చెప్పుకోవడమే తటస్థిస్తూ వుంటుంది. విమర్శకులసారం యెఱుఁగినవాడవడంచేత వారితో మనకెందుకని గ్రంథకర్త జవాబివ్వక వూరుకుంటేనో? యిక చెప్పేదేమిఁట? యిలా వుంది యిప్పటి ప్రపంచకం. యాభై అఱవై యేళ్ళ నుంచి యీలాగేవుంది యీ విమర్శనాల కర్మం. ఆయా విమర్శనాలలోవుండే వేశాకోశపు మాటలు పుచ్చుకొని జాబితా వ్రాయవలసి వస్తే గ్రంథం చాలా పెరుగుతుంది. ఆ మాటలవల్లనే వ్యక్తిగత ద్వేషం వున్నట్లు స్పష్టపడుతుంది. విమర్శనమాట యేలావున్నాసరే! చాలా గ్రంథం వ్రాసినటు కొన్నాళ్ళకు జనసామాన్యానికి వ్యక్తం అవుతుంది. అంతేనేకాని ఆ పస యేలావుందని విచారించే వ్యక్తులు తక్కువ. విమర్శనాలగతి యీలావుంది. యిక కవిత్వాలు యేవో అవి యివీ కానివీ వ్రాయడం, వాట్లని చూచేవారెవరూ లేకపోవడం, దానితో విసుగు రావడం, అప్పుడేదీ

వుపాయం తోఁచక యిదివఱలో శ్లోకాలుగా వుండేదాన్ని పద్యాలుగానో, పద్యాలుగావుండే దాన్ని శ్లోకాలుగానో లేకపోతే వచనంగానో వ్రాయడానికి మొదలెట్టడం ఆ గ్రంథం అదివఱకే అట్టి మార్పులు పొందివుండడంచేత యెవరో దానికి దీనికి తారతమ్యం వుం దంటూ మొదలెట్టడం, అలా అనడమేమి అని వారిని తిట్టడానికి ప్రుపక్రమించడం, యిలా వుంది రచన అవస్థ. యేలావుంటే యేమి యింత గ్రంథం వ్రాయడం కష్టంగాదా అనేది తుట్టతుదకి తేలే పర్యవసానం. కవిత్వానికి ప్రధానమయిందేదో అట్టి రసాన్నిగూర్చిన చర్చకు అవకాశం లేనేలేదు. యెవరేనా ఆ ప్రసక్తి తెస్తే వినే దెవరు ? అందుచేత — "నలుగురితోపాటు నారాయణ కులంతోపాటు గోవిందా" అని వీఁడుకూడా నలుగురితో యేకీభవించి "జే, జే" అంటూ తాళం వేయడమే సర్వత్రా జరుగుతూవుంది.

గ్రంథ రచనలను గూర్చి మరొకప్పుడు మాట్లాడుకుందాం. యిప్పుడు విమర్శ నలే పుచ్చుకుందాం. విమర్శింపఁబడేవారు గాని విమర్శించేవారు గాని బొత్తిగా తెలియని వారెవ్వరున్నూ కారు. కాని విమర్శకులు గ్రంథకర్తలను మాత్రం యేమీ తెలియని మూర్ఖులనుగా అపలించడం సహజమైపోయింది. యీలాగే కాలం జరుగుతూవుంది. ఆయా గ్రంథకర్తలున్నూ విమర్శకులున్నూ వున్న కాలంలోనే శ్రీయుతులు గిడుగు రామమూర్తి పంతులుగారొకరు కూడా బయలుదేరి వున్నారు. వీరికి వున్న విమర్శనాజ్ఞానం యింతా అంతా అని చెప్పడానికి నాతరం కాదు. యీయన యింగ్లీషులో బి.ఏ. తెలుఁగులో యే పండితులున్నూ యీయనకు చాలరు. సంస్కృతంలో యీయన వ్రాసే విషయం చూస్తే దానిలో యెంత పాండిత్యం వుందో తెలుసుకోవడానికి శక్యం కాదు. యింకా ఆయీ భాషలతో సంబంధం వున్నవీ సంబంధం లేనివీ కూడా యీయనకు హృత్కవిలి. అట్టి యీసర్వజ్ఞునకు వ్యావహారిక భాషలోనే గ్రంథాలు కవులు రచించాలి గాని గ్రాంథిక భాషలో రచించడం పనికిరాదనే పట్టుదల పూర్తిగా వుంది. అది నెగ్గుతుందో నెగ్గదో చెప్పలేను గాని, ఆయనకు మాత్రం కొన్నాళ్ళల్లో తన సంకల్పం నెరవేరుతుందనే నమ్మకం మాత్రం పూర్తిగా వుంది. ఆ సంకల్పాన్నుంచి ఆయన్ని మాత్రం బ్రహ్మ దేవుడు కూడా తిప్పనేలేడు. ఆయనకి వయస్సిప్పుడు యెనభైయోపడిలో నడుస్తూవుంది. యిప్పుడున్నూ ఆయన చేసేకృషి దాని కోసమే. జీవితమంతా ఆ మహనీయుడు ఆ యీ కృషికే ధారపోయడం లోక మెరిగిందే. వెనక యెవరో వక బ్రాహ్మఁడు మంచిముత్యాల్లా వుసిరి కాయలంతవేసి యెవరికో నష్టయి చేస్తానని మాట యిచ్చినట్టున్నూ, దానికోసం దోసిలితో సముద్రం తోడడానికి ఆరంభించి నట్టున్నూ, అలా కొన్నాళ్లు జరిగాక సము ద్రుఁడికేమో ఆయనమీఁద దయవచ్చి వృద్ధబ్రాహ్మణ రూపంతో ప్రత్యక్షమై "ఏమి టయ్యా బ్రాహ్మఁడా చేస్తూన్నావు" అని ప్రశ్నించినట్టున్నూ, దాని కాబ్రాహ్మఁడు తన వుద్యమాన్ని స్పష్టంగా చెప్పినట్టున్నూ, దానిమీఁద సముద్రుడు "యిన్నాళ్ళ నుంచి తోడుతూన్నావు గదా? సముద్రం యేమాత్రం తరిగిం"దని అడిగినట్టున్నూ, చాలా భాగం తగ్గిందని ఆబ్రాహ్మఁడు జవాబు చెప్పినట్టున్నూ, ఆ మాట విని ఆ బ్రాహ్మఁడి

మనోనిశ్చయానికి సముద్రుఁడు చాలా సంతోషించి తన నిజస్థితిని చెప్పి నీ కెన్ని ముత్యాలు కావాలో అన్నిటినిన్నీ నేనే సముద్రుణ్ణి యీస్తూవున్నానని చెప్పి యిచ్చి నట్టున్నూ "యత్నే కృతే యది నసిధ్యతి కోఽత్ర దోషః" అనే శ్లోక పదానికి సంబంధించింది చెప్పకుంటూ వుంటారు. ప్రస్తుతం గిడుగు పంతులు గారి వుద్యమం కూడా అలాగే కనపడుతుంది.

అయితే ప్రస్తుతం వ్రాసే విషయం శ్రీ పంతుల వారి వ్యావహారిక భాషోద్యమాన్ని గూర్చి లేశమున్నూ కాదు. వారికి వున్న గ్రాంధిక భాషా పరినిష్ఠితత్వాన్ని గూర్చియ్యేవే. నన్నయ్యభట్టు మొదలుకొని నేఁటివర కున్నూ బయలుదేఱిన భాషానుశాసకులలో యెవరికిఁగాని గిడుగు పంతులు గారికి తెలిసినన్ని మహాకవి ప్రయోగ విశేషాలు తెలియవని యేప్రమాణం పడితే ఆ ప్రమాణం చేయడానికి జంకను. యిదివఱలో నాకు వీరిని గుఱించి వ్యావహారిక భాషాభిమానులనిన్నీ తగుమాత్రం గ్రాంథికం కూడా తెలిసిన వారనిన్నీ మాత్రమే అభిప్రాయం వుండేది. వారి వుపన్యాసాలు కాని అచ్చైన వారి గ్రంథాలు కాని నేనేవిన్నీ యెఱుగను. యెఱక్కపోయినా గ్రాంథికాంధ్రం చేతకాక వ్యావహారికాంధ్రంలోదిగిన బాపతని మాత్రం అనుకున్నవాణ్ణి కాను. సుమారు ముప్పైయేళ్ళకు పూర్వం వీరు బందరు దయ చేసినప్పుడు నన్ను కలుసుకుని కొంచెం ప్రయోగాల విషయమైన ప్రస్తావన చేశారు. ఏవో నాలుగు మాటలు నాకు తోఁచినవి వ్యతిరేకంగానే మాట్లాడినట్లు జ్ఞాపకం. ఆ మాటలు బహుశః పంతులవారి రికార్డులో వుండే వుంటాయి. వారి రికార్డు చిత్రరేఖా పటం కదా? యిటీవల మా తిరుపతిశాస్త్రుల్లున్నూ వారున్నూ కలుసుకున్నారు గాని నే నెప్పుడున్నూ వారిని కలుసుకోనేలేదు. ఇలా వుండఁగా గతించిన సంవత్సరంలో అనఁగా 1936 సం॥లో ఆగస్టులో కాఁబోలును నెల్లూరులో దీపాల పిచ్చయ్యశాస్త్రుల్లు గారు శ్రీ పంతుల వారి దంటూ వక పుస్తకం యిచ్చారు. దానిని నేను విప్పనేలేదు. మా రెండోచిరంజీవి దుర్గయ్య మాత్రం దాన్ని దాఁచాఁడు. శ్రీ పంతులవారి రాజమండ్రి మకాంగా ప్రవేశించిన తరువాత చాలాసార్లు నన్ను కలుసుకొనే కోరికతో వారు ప్రసంగించినట్లు కొందఱు ఆప్తుల వల్లనైతే విన్నాను గాని అసమర్థ స్థితిలో వుండడంచేత నైతే నేమి, వారికిన్నీ మనకున్నూ చుక్కెదురుగా వుంటుందనే కారణం చేత నైతేనేమి, శ్రీవారిని నేను కలుసుకోనేలేదు. పంతులవారి వాదం "పిడివాద" మ్మాత్రం కాదని యెఱుఁగుదును. యేలా తెలుసు కున్నావంటారేమో? "ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" ఇంతకన్న నాకు నిన్నమొన్నటి వఱకున్నూ పంతులవారి స్వరూప స్వభావాలనుగూర్చి లేశమున్నూ తెలియదు. సుమారు నాలుగేండ్లనాఁడు జరిగిన నా "షష్టిపూర్తి" సందర్భంలో పదుగురితోపాటు పంతులవారున్నూ వారికి తోఁచిన మాటలు నన్నుఁ గూర్చి వ్రాసి వున్నారు కాని అందులో వారు నాకిచ్చిన స్థానాన్ని గూర్చి నేను అంతగా వుప్పొంగలేదు. "కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా" అని యెత్తుకొని శ్రీ పంతుల వారు నన్నుఁ గూర్చి వ్రాసిన అతిశయోక్తిని నేను ఆశీర్వచనంగానే జమకట్టుకున్నాను, అంతేనేకాని

అప్పుడున్నూ నేను వారి విమర్శనలు వగైరాలు వక అక్షరం కూడా చదవనేలేదు. అప్పుడు నేను మఱీ వోపికతగ్గివున్న రోజులు.

సుమారు నెలరోజులనాఁడు శ్రీ పంతులవారికి శిష్యతాసంబంధం వున్న వక రిజిష్ట్రారుగారు చిత్తూరునుంచి శ్రీ పంతులవారి దర్శనానికి వచ్చి రాజమండ్రీ నుంచి నన్ను కూడా చూడటానికంటూ వచ్చారు. వారితో పంతులుగారు యేంతో ప్రీతిగా కబురు చేశారు, వకసారి రాజమండ్రీలోవున్న తమరిని కలిసికోవలసిందనీ, లేదా తామే వస్తామని, యీలోగా తమ శరణ్యగ్రంథం చూడవలసిందని. యీ మూటిలోనున్నూ మొదటి పనినే నేను ఆ రిజిష్ట్రారుగారి ప్రేరణచేత చేయఁగలిగాను. ఆ పూట పంతులవారింట్లోనే ఆఁగాను. పలకమీఁద వ్రాస్తూ యేవో కొన్ని మాటలు పరిమితిగా మాటలాడటం తటస్థించింది. తిరుపతిశాస్త్రి అతని జీవితకాలంలో శ్రీ పంతులవారికి యేదో వాగ్దానం చేసినట్టున్నూ, దాన్ని నేను నెఱవేర్చవలసి వున్నట్టున్నూ కూడా శ్రీ పంతులవారు ప్రసక్తానుప్రసక్తంగా ప్రసంగించారు. ఆ వాగ్దానాన్నికూర్చి యిప్పటికిన్నీ నాకు బాగా తెలియదు. బహుశః భాషావిషయకమే అయివుంటుందనుకుంటాను. అలవాటున్నవారికిఁ గాని శ్రీ పంతులవారితో ప్రసంగించి వారి అభిప్రాయాన్ని గ్రహించడం సులభసాధ్యం కాదుగదా? మరునాఁడుకూడా శ్రీ సోమెనవారింట నేనుండఁగా పంతులవారు దయచేసినారు. నా "జయంతి"ని గతదినం చూడఁగా మిగిలినదాన్ని నేను ఫోంచేసివచ్చేలోపున చూస్తూ కూర్చున్నారు. అందులో వక పద్యంలో నేను పంతులుగారు నాకు "విపక్షు" లని వ్రాసినందుకు నొచ్చుకున్నారు. దానికి సమాధానం యేదో తోచింది మనవి చేశాను. అంతే-అంతటితో మా ప్రసంగం ముగిసింది. యీమధ్య నా "జయంతి" శ్రీ పంతులవారి వద్దకు అభిప్రాయార్థం వచ్చినట్లు చూచినవారెవరో చెప్పఁగా విన్నాను. నేను పంపనిదీ యేలా వెళ్ళిందని సంశయించాను నేనెవరికిన్నీ అభిప్రాయార్థం పుస్తకాలు పంపే ఆచారంలేదు. యీసంగతి జగద్విదితం. అయితే కృష్ణాపత్రికవారికి కొంచెం విపులంగా నాలుగు పంక్తులు వ్రాసి అడ్వర్టైజుమెంటు చేసిపెట్టవలసిందని మాత్రం వ్రాసివున్నాను. దాన్నే పత్రికవారు అభిప్రాయం కోరినట్లు భావించి పంతులవారివంటివారు వ్రాస్తే బాగుంటుందని శ్రీ పంతులవారికి పంపియుందురేమో. అభిప్రాయం కోరేయెడల యీమధ్య నేనున్నూ వారున్నూ రాజమండ్రీలో కలిసినప్పుడే కోరివుండేవాణ్ణి, నే నల్లా విధిలేక వక్క జయంతివారినే అభిప్రాయం అడిగి వున్నాను. వారు యెంతో ఖండితంగా యీవలసి వున్ననూ యేలేశమో పిడివాదంవారికూడా అనుకూల్యం కనపఱుస్తూనే అభిప్రాయాన్ని యిచ్చివున్నారు. కాని ఆమాత్రం అనుకూల్యానికి వారి హృదయం సంతోషించక "లంచం తిన్నారు మీరు" అంటూ ఆ విద్యావయోవృద్ధులను యీసడించి గేలి చేయడానికి మొదలు పెట్టారు. బ్రః శ్రీః వేదుల సూర్యనారాయణశాస్త్రులు (పిఠాపురం సంస్థాన పండితులు) గారినే "వ్యాకరణం రా" దంటూ అపలపించే వారిలేఖిని కద్దేమిటి? ఆక్షేపించేవారు ఆశాస్త్రుల్లుగారు చదివి

శిష్యులకు పాఠాలు చెప్పిన గ్రంథాల పేళ్లేనా యెఱిగివుండాలా? శాంతం పాపం! అయితేనేమి? "నసాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి" అన్నాఁడుకదా? ఆ శాస్త్రుల్లుగారిని పైవిధంగా ఆక్షేపించి యిప్పటికి అయిదేళ్లు దాటవచ్చింది. ఆయన లేశ మేనా ప్రత్యుత్తరం యిచ్చారా? ఆ యివ్వక పోవడాన్నికూడా తమ పాండిత్య ప్రకర్షకు స్ఫోరకంగానే జమకట్టుకుంటే చేసేదేమిటి? యెంతటివారినైనాసరే యేలాటి మాటేనా అనడమే. పరిశీలించే దిక్కులేనప్పుడు అంటేమాత్రం వచ్చిన చిక్కేమిటి? రామయ్యపంతులుగారు లంచం తినడమంటే! ఆయీవాదోపవాదాలు వినడానికి అంగీక రించి సంబోధ్యమానులుగా వుండడం కాఁబోలును! యీలా యెవరిని సంబోధిస్తే వారినే ఆపవదిస్తే గతేమిటి? అయినా వారినిట్లు ప్రార్థిస్తాను. "అయ్యా, యీ ఆంధ్రదేశంలో మీకెవరి పేరు నచ్చుతుందో వారి తీర్పే నే నంగీకరిస్తాను. ఎవరినో వొక్కరిని వేలు మడిచి కనపర్చండి" అని చూస్తాను. పదచ్ఛేదం తిన్నఁగా చేసుకోక, సమాసార్థం చక్కగా కాక, సిద్ధసాధ్యభేదాన్ని గమనించక, పూర్వకవిలక్ష్యాలు జ్ఞప్తికి రాక, ప్రమాదపడి ఆక్షేపించిన ఆక్షేపణలు సరియైనవే అని చెప్పఁదగ్గ మనీషి, కాదుకాదు మనిషే అనుకుంచాం. యెక్కడ దొరుకుఁతాడో చూదామని నాకున్నూ బోలెఁడు కుతూ హలం వుంది. యిదివిషయాంతరం. ప్రస్తుతం శ్రీ గిడుగుపంతులవారి విషయం ముఖ్యం. ఆ పంతులవారికి కృష్ణవారు జయంతిని అభిప్రాయార్థమో విమర్శనార్థమో పంపివున్నా రన్నది ఆవాంతరం. వారికి తోఁచిందేమో వారు వ్రాస్తారనుకుందాం. అది ఆక్షేపకులకు అనుకూలిస్తే ధన్యులం. అన్యథాగా వుంటే "మంగళహారతులు" తగులుతాయన్నమాటే. యిలాటి పాండిత్యంతోటే నెగ్గుకురావడానికి జాతకాలలో యేలాటి గ్రహబలిమి వుండాలో పరిశీలించి చూడాలి. అది అలా వుండనియ్యండి.

మొత్తం గిడుగు పంతులుగారితోకాని వారి గ్రంథాలతోకాని మా తిరపతిశాస్త్రికి యేకొంచెమో సంబంధంవుంది కాని నాకు నిన్నమొన్నటిదాకా పరిచయం లేనేలేదు. ఆయన గ్రంథాలు విమర్శనకు సంబంధించినవి చదివి చూస్తిని. ఆయన పరార్థం కలిగించుకోవడంచేత స్వార్థమైన గ్రామ్యభాషా సమర్థనాన్ని అంతగా ప్రధానం చేసుకోక గ్రాంథికభాషాపాండిత్యానికే ప్రాధాన్యం యిచ్చి వ్రాశారు. అందులో పంతులవారి కాలంలో వుండే కవులనందఱినీ యెత్తుకున్నారు. వారివారి విమర్శనాలు కూడా చాలాభాగం యెత్తుకొన్నట్లే. ముఖ్యంగా శ్రీకళాప్రపూర్ణుల విమర్శనాన్ని గూర్చి పీల్చి పిప్పిచేస్తూ వచ్చారు. కృష్ణభారత ప్రయోగాలు అక్కడక్కడ తఱచుగా స్పృశిస్తూ ఆ గ్రంథానికీ గ్రంథకర్త వుద్యమానికిన్నీ లేశమున్నూ సంబంధమే లేదని ఋజువు చేశారు. ఆ నిరూపణాన్ని కాదనడానికి "విశ్వసృష్టియే రావలెన్." పంతుల వారి లేఖిని మామీఁదకికూడా దూఁకింది. "మహాగజాః పలాయంతే మశకానాంతు కాగతిః" అదియెక్కడ పరిశీలనాజ్ఞానమో? వొక్కొక్క శబ్దాన్ని యెత్తుకుని వర్గ త్రియాలు వ్రాయడం మొదలెడితే వంశవృక్షాలు వ్రాయడం మొదలెడితే అదే

వ్రాయడం, అదే వ్రాయడం. ఆ వ్రాయడంలో ఒక్క అక్షరం కూడా సూటి తప్పిన దంటూవుండదు. అదెక్కడి పాండిత్యమో? నిజంగా గ్రాంథిక కవులమని పేరు పెట్టు కొన్నవాళ్ళందఱూ ఆత్మవంచనలేనివాళ్ళే అయితే ఒక మహాసభచేసి వారివారి బిరుదాలన్నీ పంతులవారికి సమర్పించి ఆయన అనుగ్రహించి మళ్ళా యిచ్చేటట్టయితే అలంకారార్థం ధరించుకోవలసిందే కాని లేకపోతే వదులుకోవలసిందే.

నా స్వభావం శత్రువుదగ్గఱేనాసరే గుణంవుంటే దాన్ని కప్పిపుచ్చడం చేత కానిది. పంతులవారు అంతో యింతో నాకు శత్రుకోటిలో వారే గాని మిత్రకోటిలో వారు కారుగదా ! ఆ విషయం వారి వాదానికి అనుకూలించే "యెంకిపాటలను గూర్చి" నేను వ్యతిరేకించి వ్రాసిన వ్యాసాలే సాక్ష్య మిస్తాయి. పంతులు గారికిన్నీ నాకున్నూ వున్నమతభేదం అన్యత్ర నేను వివరించే వున్నాను. నామతం గ్రాంథిక భాషలో వ్రాసే వారు గ్రాంథిక భాషలోనే వ్రాసుకోవచ్చుననిన్నీ వ్యావహారిక భాషలో వ్రాసేవారు వ్యావహారికభాషలోనున్నూ వ్రాసుకోవచ్చుననిన్నీ వీరికీ వారికీ వివాదపడవలసిగాని తిట్టుకోవలసికాని లేశమున్నూ ప్రసక్తి వుండకూడదనియ్యేవే. అయితే గ్రాంథికకవుల పుస్తకాల్లో యెన్నో వ్యావహారిక ప్రయోగాలు కనపడడంచేత యీ గ్రాంథిక కవులు గ్రాంథిక కవులు కారంటూ పంతుల వారు తరచు ఆక్షేపించడం కలదు. దానికి నా సమాధానం యేమిటంటే, యెక్కడో ఒక్కటితప్ప ఆ వ్యావహారికపదాలు చాల వఱకు సాధ్యాలే అవుతవి. కానిదేదేనావుంటే అది ప్రమాదపతితంగా భావించవలసిందేగాని అంత మాత్రంచేత ఆ గ్రంథకర్త వ్యావహారిక భాషా కవి మాత్రం కాఁడనియ్యేవే శ్రీ పంతుల వారు కూఁతురు శబ్దం యెదుటివ్యక్తిని గూర్చి ప్రయోగించడంలో కూఁతురవు అనడానికి బదులుగా, కూఁతవు, వగయిరా ప్రయోగాలు చేసినవారిని గూర్చి కొంత వ్రాసివున్నారు. అవి యెవరున్నూ సమాధానం చెప్పఁదగిన ఆపత్తులు కావు. ప్రతి గ్రాంథికకవికిన్నీ అంత వెఱ్ఱిగా వుండేవి కాకపోయినా మఱోమాదిరివేనా కొన్ని వుండి తీరతాయి. "కూతఁవు-కూఁతను" యిత్యాది ప్రయోగాలు యెక్కువగా శాస్త్రాచారానికి అనుకూలించడానికి ప్రయత్నించి గోతిలో జాఱిపడడంవంటివి ఒక్కొక్కప్పుడు అయ్యవారిని చేయబోతే కోతికావడం కలదుకదా; "పసువుల్లంక రాజుల" మని చెప్పడానికి బదులు "ప్రసువుల్లంక రాజుల" మని చెప్పి అదేమిటయ్యా! అలా మాట్లాడుతూవున్నావంటే "నేను కొంచెం చిదుమ్ముకున్నాను" అని చెప్పడం వంటిది, ప్రమాదపతిత ప్రయోగం. "తలం పెట్టినన్" వంటిదైతే క్షమించవచ్చునేమోకాని యెక్కువ శాస్త్రజ్ఞానాన్ని వినియోగించ డానికి వుద్యమించి మొదటికే మోసం తెచ్చుకొన్న ప్రయోగాన్ని పంతులుగారు ఆక్షే పించి కృతక భాషఅంటే వివదించి చేయవలసింది లేదు. యెక్కడేనా యతిగాని ప్రాస గాని పోవడమో, సంధి తప్పడమో, గ్రామ్యపదం ప్రయోగించడమో జరిగితే దాన్ని బట్టి యావద్గ్రంథాన్నీ ఆలాగే వ్రాయరాదా అన్నమాదిరిగావుండే పంతులవారి వాదానికి నేను అనుకూలుణ్ణికాను. బియ్యంలో యెక్కడో చిన్నచిన్న జాళ్ళువుండడం అనుభూతం.

అవి అన్నంలోకి వస్తాయి. వాట్లను తొలగించుకొని భుజిస్తారు. కాని మఱుచటి రోజు నుంచి బియ్యం లేకుండా రాళ్ళతోటే పాకం తయారుచేయమనడం సర్వానుభవ విరుద్ధం కదా ? యేదో యీలాటి భేదం మాకూ మాకూ వున్నప్పటికి వారిని గూర్చి నేను గాని, నన్నుగూర్చి వారుగాని లేశమున్నూ ఖండనముండనాలకు వుపక్రమించలేదు. "గ్రామం గచ్ఛన్ తృణం స్పృశతి"గా అన్యోన్యమూ తలపెట్టడం లేక పోలేదు. వ్యావహారిక భాషలో వ్యాసాలువగయిరా వ్రాసేవాళ్ళందఱికీ కొత్తగా నరకాలు తయారవుతాయంటూ నేనెక్కడా వ్రాసింది లేదు. యిఁక ముందున్నూ వ్రాస్తానని తోఁచదు. లేదా ? పలువు రతోపాటు అంతో యింతో పంతులవారు మమ్మకూడా విమర్శించి వారి వాదాన్ని మా ప్రయోగాల మూలంగా సమర్థించుకోవడం కూడా పరిహాసంలోనే చేరుతుంది కనక విపక్షకోటిలోకే చేరతారనుకుందాం. అందుచేత కాఁబోలు "జయంతి"లో ధార యిలా పడింది. "నాకు విపక్షుం డతఁ డట్టులే గురునకున్ గూడన్ వివాదమ్ములన్."

విపక్షుణ్ణిగుఱించి వ్రాసేవ్రాఁతకే ప్రాజ్ఞులు దానిలో యథార్థమంటూ వుంటే యెక్కువ గౌరవం యిస్తారుగదా! సపక్షులను గూర్చి వ్రాసేవ్రాత కెప్పుడూ గౌరవం వుండదు. "దొంగలూ దొంగలూ కలిసి వూళ్ళు పంచుకొన్నట్లు" వుండే వ్రాఁతలు పనిపడితే వుపయోగించవనేకదా నేను "పుత్రైర్యశోలభ్యతే" అనే వ్యాసంలో విపక్షుల వ్రాఁతలనే చూపుతూ వచ్చాను. హరి నాగభూషణంగారు నాశత్రుత్వ మిత్రత్వాలను గూర్చి బాగాయెఱుఁగుదురు. నేను అంతగాని కొంతగాని సంగీతపాటకుణ్ణి కాకపోయినా బందరులో వుండేరోజుల్లో "అదిబాగూ, యిది వోగూ" అనే వాదాల్లో కొంచెం పాల్గొనడం వుండేది. కొన్ని వత్సరాలకు వత్సరాలు నాగభూషణంగారికి వ్యతిరేకపార్టీలో కోటయ్య గారి తరపున వుండి నాగభూషణంగారిని ఖండించడమే జరిగింది. నాతోపాటు కే. టి. రామారావు బి.యే.యల్.టి. (ప్రస్తుతం ఆశ్రమస్వీకారం చేసినారు)గారొకరు వుండే వారు. క్రమంగా నాగభూషణంగారు పెద్దస్థితికివచ్చి త్యాగరాయలవారినిగూర్చి హరికథ వకటి రచించి బందరులో సభలో వినిపించారు. ఆ రోజున పలువురు సభ్యుల యెదుట నేను ఆయన్ని గుఱించి మాట్లాడినమాటలు విని నాగభూషణంగారేకాక సభ్యులుకూడా ఆశ్చర్యపడ్డారు. శత్రుత్వమిత్రత్వాలు విద్యావిషయంలో అడ్డుతగిలేయెడల అట్టివాఁడు మనీషికాకపోవడమే కాక మనిషికూడా కాఁడని నేననుకుంటాను. యెందుకు యింతగా వ్రాస్తానంటే? గిడుగువారు వాదసదర్భంలో యెదటి పార్టీవారైనా వారి పాండిత్యం యేలాటిదో వారిరచనను బట్టి చెప్పవలసి వచ్చినప్పుడు హృదయాన్ని కప్పిపుచ్చడం కంటే మఱోపాపం వుంటుందని నాకు తోఁచదు.

క. శుక్రుఁడు కవియని చెప్పిన
శక్రుఁ డతఁడు "కాఁడుఁ" డని ప్రసంగించినచో
నక్రములు తప్పఁ జాలు ను
పక్రమణము మేలు మేల్! సెబా! సని నగరే ?

పంతులుగారంతటివిజ్ఞుఁడు, లేదా వారి ప్రజ్ఞలో సగభాగమేనా వున్న విజ్ఞుఁడు నేఁటిగ్రాంథిక కవులలో మృగ్యుఁడు. ప్రాచీనులలో వుంటే వుండవచ్చునేమో ఆలోచించాలి. ఆయన వ్యావహారికభాషావాదిగా వుండడంచేత ఆయనశక్తి యెఱిఁగివుండిన్నీ ఆయన వారివారి కవిత్వంలో తీరని తప్పులు చూపించారనే హేతువుచేత ఆయన ప్రజ్ఞనుగూర్చి మూకీభావం వహించడం సహృదయులు మెచ్చే పంథ కాదు. ఆయనకంటె మాకు యెక్కువ పాండిత్యం వుంటే, ఆయన చూపినప్రయోగాలను ఖండించి జవాబులు చెప్పి మా ప్రయోగాలను మేము సమర్థించుకోవలసిందే గాని "గ్రామ్యాచార్యులు" అనిన్నీ యింకా యేమో అనిన్నీ వృథాగా పరిహసిస్తే యేం ప్రయోజనం ? యెవరు పట్టుదలగా ఆయన్నిగూర్చి పై మాటను వాడుతూ వున్నారో, వాడినారో, వారివారి జీవితకాలంలోనే పంతులవారు సహృదయసమ్మతంగా వ్రాయఁదగ్గంత వ్రాసివున్నారు. వారిలో కొందరు పంతులవారి కేవిధమైన సమాధానమున్నూ వ్రాయకుండానే కాలం గడిపి స్వర్గ మలంకరించారు. కొందఱు దీర్ఘాయుష్మంతు లింకా వున్నారు. వారు లేశమున్నూ పంతులవారికి జవాబు వ్రాయడమైతే లేదుగాని వెక్కిరింపు మాటలతో అపవదించడం కలదు. ఆత్మవంచనాశక్తిని భగవంతుఁడు వారికిచ్చినట్లే నాకుకూడా యిస్తే పంతులవారినిగూర్చి నేనుకూడా చాటునా మాటునా అలాగే అపవదించేవాణ్ణేమో? దిక్కుమాలిన శక్తి ఆశక్తి నాకు జన్మజన్మలకూ అనుగ్రహించవద్దని మాయిలువేల్పులను గూర్చి ప్రార్థిస్తాను 'జవాబు చెప్పలేకపోయినవారిలో కొందఱు తూష్ణీంభావాన్ని వహించి వూరుకున్నారు. అది సహృదయత్వభంజకంగాదు. వెట్టిమొట్టి మాటలతో అపవదించడమనేదిమాత్రం దండించదగ్గ దుర్దోషం. పంతులుగారి పాండిత్యం తలుచుకుంటే యేంచెప్పేది కడుపంతా గాబరా అవుతుంది. నిజమైన భాషావేత్తృత్వమంటే యేభాషావేత్తృత్వం ? గ్రాంథిక భాషావేత్తృత్వం ఆబ్రాహ్మఁడిసొమ్మే. ముమ్మాటికీ సంశయం లేదు. అయితే అంత ప్రజ్ఞ వుండి వ్యావహారిక భాషనే అభిమానించి వాదించడం యెందుకంటారా ? అది ఆయన దోషంకాదు పరాశరుడేమన్నాఁడు ? "తేషాం నిందా నకర్తవ్యా యుగరూపాహితే ద్విజాః" అన్నాడు. యీ యిరవయ్యో శతాబ్దంలో అన్నీ అలాటివే జరుగుతున్నాయికదా! (1) శారదాబిల్లు వివాహాలు (2) చండాల దేవాలయ ప్రవేశాలు(3)వితంతు వివాహాలు వకటేమిటి ? ఎవరి యిచ్చ వచ్చినట్లు వారల్లా త్రోవలు తొక్కుతూవున్నారు, అలాగే గిడుగు వారున్నూ అనుకోవాలి. మనకుకావలసింది పంతులవారి సమకాలీనులలో పంతులవారితో శతాంశానికేనా పోలతగ్గ విమర్శకులున్నారా? అనే అంశమే. గ్రాంథిక భాషలో అంత మహా సముద్రుఁడై వుండి పంతులవారు వ్యావహారిక భాషకోసం పాట్లుపడడం యేలా వుందంటే! శ్రీయుతులు భమిడిపాటి కామేశ్వరరావు బి.ఏ.ఎల్.టి. గారు గానమిశితంగా లోకోత్తరంగా పద్యం చదివేవారిలో మూర్ధన్యులో ధన్యులో అయివుండి "గానం పద్యాలు చదవడంలో వాడడం పనికి రాదు" అని ప్రచారం చేయడంవంటి దంటాను. అట్టి శక్తివుండి దాన్ని నిషేధిస్తూనే అందముం

టుందిగాని ఆ శక్తిలేనివాఁడు దాన్ని నిషేధిస్తేయేం లాభమంటాను. "నిందతి కుష్క.... నారీకంచుకమేవ" అనేస్తారు. దానితో తీరిపోతుంది. పెద్దలేమన్నారు? "చెల్లియుండియు సైరణసేయునతఁడు" అన్నారుగదా? చెల్లనివాఁడు సైరణచేయకేంచేస్తాడు? అందుచేత పంతులవారి వాదానికి వారి పాండిత్యం అడ్డు తగలదు. వారి పాండిత్యం నిరుపమానం. యిలా వ్రాసి వారిచేత మెప్పుపొందుదామనే తాత్పర్యాన్ని నాకు కొందఱు ఆపాదిస్తారనిన్నీ నాకు తెలియకపోలేదు. ఆ పొందే మెప్పు యిదివఱకే జరిగింది పంతులుగారి ద్వారా "చిటికెన వేలు మీదఁకే యిదివఱకే యెక్కడం జరిగి చాలాకాలమయింది. అందుకోసం యిప్పుడు వేఱే శ్రమపడవలసి వుండదు.

పంతులుగారినిగూర్చి నేను వ్రాసే స్వభావోక్తిని కూడా యీలాటి శంకలు చేసే మహానుభావులు అన్యథాగా అపవదిస్తే అపవదించ వచ్చును ఆ కారణాన్ని పురస్కరించుకొని మానవలసి వుండదు. పంతులవారి విమర్శన గ్రంథాలు నేను నిన్నా నేఁడు చూడడం తటస్థించింది గాని లేకపోతే యీ మధ్య నేను వ్రాసిన వ్యాసాల కోసం భారతం మళ్ళా చదవ వలసినపనే వుండేదికాదు. భారతంలో కాని యితర కవుల గ్రంథాలలో కాని యెన్నో పుటలో యెన్నో పంక్తిలో యే అపురూప ప్రయోగం వుందో ఆ వివరమంతా పంతులుగారి 'బాలకవి శరణ్యం'లో వ్రాయఁబడేవుంది. పంతులుగారే మాలోచించి ఆ పుస్తకానికి 'బాలకవిశరణ్య' మని పేరు పెట్టారో కాని దానికి పేరు "ప్రౌఢకవిశరణ్యం" అన్నదే సర్వవిధాలా తగివుంటుందని నాకు తోఁచింది. నా సలహా యుక్తమయిందిగా వారికి తోఁచేయెడల వచ్చే ముద్రణంలో ఆలా మాఱుస్తారని తలుస్తాను. ఆయన గ్రంథాన్ని గుఱించి ఆత్మవంచన లేకుండా నేనీలాటి అభిప్రాయాన్ని యిచ్చినందుకు మిక్కిలీపరితపించి ఆయన గ్రంథాన్నిన్నీ నన్నున్నూ దూషించేవారు దూషిస్తారనిన్నీ యెఱుఁగుదును. అయినప్పటికీ వ్రాయవలసిన మాటలు వ్రాయకుండా మానేది లేదు. ఆ దూషించేవారికి శాస్త్రసమయాలు తెలియవుగదా, లోక సమయాలు కూడా తెలియవు, నిక్కం. యేమంటే? యెవరేనా యెవరి నేనా కొడితే కొట్టినట్టివారి మీద న్యాయాధికారి వద్ద అభియోగం తేవడం కలదు. ఆలా తెచ్చినప్పుడు ఉభయుల వాదోపవాదాలున్నూ అవగతం చేసుకొని న్యాయాధికారి తీర్పు చెప్పడమేకదా జరుగుతుంది. ఆ జరగడంలో ముద్దాయీ స్థానమందున్న మనిషి నేను నిన్ను తీర్పు చెప్పవలసిందని కోరలేదే అని అధికారిని తిరస్కరించినట్లు యెక్కడా కనబడదు. ఫిర్యాదీ ముద్దాయీల వాఙ్మూలాలు అచ్చుపడే వున్నాయికదా! తీర్పు కర్త చూచే వున్నారు. అట్టిస్థితిలో అట్టి అక్షరాలు వ్రాసేవారికివున్న లోకానుభవానికి వక నమస్కారమే కర్తవ్యం. మిక్కిలి ఉత్తమచరిత్ర కలిగినట్టిన్నీ "అగ్నిహోత్రంలో వకకాలు మంచి గంధంలో వకకాలూ"గా వుద్యోగ కాలమంతా గడపఁగలిగినటువంటిన్నీ మహాపురుషుణ్ణి "లంచగాఁ"డని అపవదించే సాహసానికి పరశ్శతనమస్కారాలు. యిట్టి సాహసాన్ని పూర్తిగా యెఱిఁగినవా రెందఱో వుండిన్నీ మనకెందుకని వూరుకుంటూ వున్న రోజుల్లో

శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారు కడుంగడు వృద్ధులై యుండి కూడా యీ దురన్యాయాన్ని సహించలేక తల కంటగించుకొని 380 పుటల గ్రంథం శ్రీ కల్లూరి మహాశయుల ప్రశంసను గూర్చి వ్రాస్తూ అందులో "సరాగ్రిజు పెళ్ళిలో గుర్రుజుకొకపోచగా" ఎత్తుకొని కొంత చర్చించినట్లు వారి కరపత్రాల వల్ల తెలిసింది. ఆ పుస్తకం ప్రచురించవద్దని నయానా భయానా గురువులు ప్రయత్నించి విఫలమనోరధులై నట్టుకూడా రూఢిగా విన్నాను. యెందఱో అట్టివారు బతిమాలడానికి లొంగేవా రుండడం చేత వీరభద్రరావు గారు కూడా ఆ తెగలో వారే అని గురువు అభిప్రాయపడి వుందురు. ఆ గ్రంథంలో ఆయన వ్రాసిన విషయమేనా అంతగా బాధించేది కాదు. గురువుల వ్యాకరణ పాండిత్యానికి సంబంధించి వున్నట్టు వింటాను. దాన్నిగూర్చి మొట్టమొదట కావ్యాలు చదువుకొన్నవారి వద్దనే జరిగినట్లు హరి కథలో వ్రాయించుకోవడం వీరభద్రరావుగా రెఱుఁగుదురో యెఱుఁగరో! వారల్లా "చెరలాటం"లో పేర్కొన్న వెంకటరామశాస్త్రుల్లు గారి గురుత్వాన్ని గూర్చే వ్రాసివుంటా రనుకుంటాను. మొత్తం అసత్యం జీవితానికి మిక్కిలీ హాన్ని కలిగిస్తుందని రావుగారు ఆ గ్రంథాల్లో వ్రాసి వున్నట్టు కరపత్రంలో కొన్ని మాటలవల్ల తెలుతుంది. ఆ మాటలు వుదాహరిస్తాను. "అట్టి యుత్తమశీలత్వము కవియందు కాన్పింపకున్న యెడల కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ బిరుదముల చేతఁ బేర్కొనఁబడినను స్వర్ణాభిషేక భాగ్యముఁ బొందగలిగినను, కవి గండపెండేర ధారణము వహించినను, నయ్యవి జీవితమునకు శోభస్కరములు గాకపోవుటయేకాక దేశమునకును సమాజమునకును నరిష్టదాయకములుగా నుండును." యింత నిర్భాగ మాటముగా యథార్థాన్ని వ్రాసేవారు వెనక కీ॥ శే॥ కస్తూరి శివశంకర కవిగారొక రుండేవారు, మళ్ళా వీరు కనపడుతూవున్నారు. మూఁడోవారు గిడుగువారు కూడా యీ కాలంలోనే వుండడంచేత వీరు ముగ్గురున్నూ ముగ్గురు మూర్తులని నేను సంతోషిస్తాను. రావుగారి గ్రంథం వల్ల యేయే విశేషాలు పైకి వస్తాయో అని కనిపెట్టుకున్న వాళ్ళల్లో నేను వక్కణ్ణి అని రావుగారికి మనవి చేస్తాను. చరిత్రలు వ్రాయకపోయినా నా జీవితంకూడా మీవలెనే అసత్యవాదుల అపవాదులు ఖండించడానికే చాలా భాగం కర్చుపడ్డదనిన్నీ యీ వార్ధక్యంలో కూడా అందుకే శ్రమ చేయవలసి వచ్చిందనిన్నీ శ్రీ వీరభద్రరావు పంతులు గారికి తెలుపుతూ వున్నాను. ప్రమాదంచేత అసత్య మాడితే అది క్షంతవ్యమవుతుంది కాని బుద్ధి పూర్వకంగా ఆడితే అది క్షంతవ్యమెట్లా? నేను మొట్టమొదట యీ చర్చకు సంబంధించిన వ్యాసాలకు వుపక్రమిస్తూ "నుతజలపూరి తమ్ములు" అనే పద్యాన్ని వుదాహరించి వున్నాను. దాన్ని గణించినట్లేలేదు. అవలివారు వీరభద్రరావుగారేలాగో యీ అంశాన్ని కనిపెట్టినందుకు వారిని అభినందిస్తూ వున్నాను. గిడుగువారిని గూర్చికూడా ఆ గ్రంథంలో యెత్తుకుంటే సరే, లేకపోతే ప్రత్యేకించి వ్రాయవలసిందని హెచ్చరిస్తాను.

విద్యావిషయంలో అభిప్రాయభేదాలు వున్నప్పటికీ ఆడరాని మాటలు ఆడడంగాని

ముఖముఖాలు చూచుకోకపోవడం గాని విద్వల్లక్షణం కాదు. యీరీతి పూర్వపండితు లకు అంతో యింతో ప్రతివారికిన్నీ వుండకుండా వుండదు ఆ పూర్వపురకం పండితులు గాని మఱివకరుగాని ప్రస్తుత విషయంలో స్పీడర్లను బట్టి నేర్చుకోవలసింది కొంత వుంటుం దని నాకు తోస్తుంది వారు పరస్పరమున్నూ వ్యతిరేకంగా కోర్టులలో యెంతో కఠినంగా వాదించివాదించి ఆ కోర్టు వదలి రావడంతోటట్టుగానే యెంతో సోదర భావంతో వర్తించ డం చూస్తే యెంతో ముచ్చటగా వుంటుంది. ప్రస్తుతం గిడుగువారు కూడా అలాగే వుంటారు గాని విద్యావిషయక మతభేదాన్ని పుచ్చుకొని లేశమున్నూ యెడమొఖము పెడమొఖమూ అన్నట్లుగా వుండరు. ఇది నేను స్వానుభవము మీఁద తెలుసుకున్నాను. మళ్ళా కలంచేత బట్టినప్పుడో! యెంత గాఢంగా విమర్శించాలో అంత గాఢంగానూ విమర్శించి కాని వదలరు. యేవో కొన్ని విషయాలలో అభిప్రాయభేదాలు వున్నప్పటికీ నాకు గ్రాంథిక భాషావాదులలో పరమశ్రోత్రియులనిపించుకొనే జయంతివారితో గాని వ్యావహారికంలో పరమశ్రోత్రియంగా వుండే గిడుగువారితోగాని లేశమున్నూ వైముఖ్యం లేదనే విషయం నేను దీనిలో వ్రాయకుండానే లోకం నా ప్రవృత్తిని బట్టి గ్రహిస్తుంది. యెవరికేనా సౌమనస్యం ఆవశ్యకంగదా? అట్టి సౌమనస్యం యెంత ఉండాలో అంతా పంతులవారి యందు మూర్తీభవించి ఉందని కాని; లేదా, సౌమనస్యమే యీ స్వరూ పంగా అవతరించిందని కాని నేను విశ్వసిస్తూవున్నాను. ఇట్టి మహనీయుణ్ణి గ్రామ్యభాషా వాది యైనంత మాత్రం చేతఁగాని, వారివారి గ్రంథాల్లో నిజమైన తప్పులు చూపించడ మనే హేతువుచేతఁగాని నిరసించడం కన్న పామరత్వం మఱొకటి వుండదు. అవసరాన్ని బట్టి నేఁటికవులనే కాదు, ప్రాచీన కవులనే కాదు యీయన వకవూఁపు వూఁపి చూచిన మాట నిజం. ఆయన పెట్టిన వాఁతలు శాశ్వతంగా నిలిచిపోయేవే కాని యేవో వెక్కిరింపు మాటలతో అంతరించేవి కావు. యితరులతోపాఁటు మాకున్నూ ఆయన వాఁతలు స్వల్పంగా తగిలివున్నాయి. అందులో కొన్ని సవరణవుతాయేమో కాని కొన్ని దిద్దుకో వలసిందే. నేను పిడివాదానికి వుపక్రమించే వాణ్ణి కాను కాఁబట్టి యథార్థం వ్రాస్తూ వున్నాను. అన్యథాగా సమర్థించినప్పుడు అది నా పాండిత్య ప్రకర్షకు గుఱుతుగాని మఱొకటి కాదని ఆ ఘట్టంలో నేను వ్రాయడం ఆచారమే. నాలాగే తక్కినవారు కూడా పంతులవారి ఆక్షేపణలు దిద్దుకొంటూ వారికి భాషా చరిత్రలో యెంత గౌరవం యివ్వాలో అంత గౌరవమున్నూ యివ్వడం ఆంధ్రభాషాభిమాను లందఱికీ విధి. వ్యావ హారికంవారు శ్రీవారి నిదివఱకే గౌరవించి పూజిస్తూవున్నారు. నేనిప్పుడు చెప్పేది గ్రాంథికభాషావాదులు కూడా వారికివ్వతగ్గంత గౌరవం యిచ్చితీరవలసిందనియ్యేవే. యీ సభ ధనధాన్యాలతో సంబంధించి వుండనక్కఱ లేదు. కేవలమున్నూ గౌరవ వాక్యాలతో జరిగితే చాలును. వారికి కొన్ని బిరుదులు సర్వజనసమ్మతమైన విదివఱకే వున్నాయి. ఆ బిరుదులకు వారు తగుదురా? తగరా? అనేప్రశ్న యింతవఱకు రాలేదు. యెవరేనా తగినవారు శిఫారసు చేస్తే యింకో బిరుదు గవర్నమెంటువారు వారికి అను

గ్రహించకపోరేమో? కాని పంతులవారు దాన్ని ధరించడానికి సుతరామున్నూ వవ్పు కోరని నేను తలుస్తాను. యెందుచేతంటే? ఆ బిరుదుకు వున్న అర్థం వారికి తెలిసినట్లెవ్వరికీ తెలియనే తెలియదు. అందునుగూర్చి విమర్శించి పంతులు గారు వ్రాయవలసివస్తే యెంతేనా వ్రాస్తారు. వారి వ్రాఁతకు తిరుగంటూ వుండదని నా విశ్వాసం. పంతులుగారి విమర్శనానికి పంతులుగారి విమర్శనమే సాటి. "రామరావణయో ర్యుద్ధం రామ రావణయోరివ."

(15-5-1937 సం॥ర కృష్ణా పత్రిక)

# గిడుగు రామమూర్తి పంతులుగారు

'శాస్త్రి'

చిక్కనైన నిరసనతోటీ తీవరించిన ద్వేషంతోటీ, గడ్డకట్టిన ప్రాతి కూల్యంతోటీ పరిసరాలన్నీ ముజ్జిడ్డుగా వున్న పరిస్థితుల్లో యేటికెదురీది జీవిత సాఫల్యం పొందిన ఆధునికాంధ్రులు, కైలాసవాసి కందుకూరి వీరేశలింగం పంతులుగారి తరవాత గిడుగు రామమూర్తి పంతులుగారొక్కరే కనబడుతున్నారు.

తలుచుకుంటే శరీరం జలదరిస్తోంది.

దేశంలో చారిత్రక జ్ఞానం యేమీ లేదు. కాలం మార్పులు తెచ్చి పెడుతుందనే సత్యం అవగాహన కాలేదు. హేతు వాదానికి నిలవ నీడ లేదు. కేవలమూ వృద్ధ ప్రపితామహుల దగ్గిరనుంచీ సంక్రమించిన గుడ్డి నమ్మకం తప్ప మరేమీ లేని రోజులవి. అలాంటి సమయంలో-ఇరవై అయిదు సంవత్సరాల కిందట రామమూర్తి పంతులుగారు వ్యావహారికాంధ్ర భాషావాదం చేపట్టి గిడసబారి పోయిన పండితవలయంలో వురికారు.

పంతులు గారికి వెనక ఆసరా యేట్సుగారొకరు, శ్రీనివాస అయ్యంగారొకరు, గురజాడ అప్పారావు పంతులు గారొకరూను.

కానైతే యీ ముగ్గురూ కూలంకష ప్రజ్ఞావంతులే; అయినా పండితులు యీ వర్గాన్ని చూసి హేళన చేశారు.

కలం పట్టినప్పుడల్లా బ్రౌణ్యం తిరగవేసే పండితులికి యేట్సుగారు ఖండాంతరులై పోయారు. అయ్యంగారి దగ్గిర చిరకాలం విద్యాభ్యాసం చేసిన ఆంధ్రజాతికి వారు అరవ వారై పోయారు. ఇక అప్పారావుగారా? ఆయన వొక రాచకూతురికి వూడిగం చేస్తూ ప్రహసనాలు రాసుకునే మనిషి.

ఇంకేం వుందీ? పండితులంతా పంతులుగారి వాదాన్ని కుప్పిగంతులుగా భావించారు. "ఏమీ పని లేదా యేమిటి?" అంటూ విసుక్కున్నారు. "విశాఖపట్నాన్నుంచి తప్పించుకుని పారిపోయి వచ్చారు కాబోలు" అని జాలి తలిచారు.

అప్పటికప్పుడే పంతులు గారికి 'బ్రహ్మచెవుడు' ముదిరిపోయి వుంది. ఎలుగు రాసిన పండితుల కంఠధ్వనులు, పంతులుగారి చెవిదాకా, వెళ్ళలేదు.

పండితులు పంతులుగారి మీద శ్లేషలు కురిసేశారు. వ్యంగ్యాలు దిమ్మరించేశారు.

దీవనలు గుమ్మరించేశారు, కాని అవి కొండగుహలో ప్రతిధ్వనించినట్టు పండితుల చెవుల్లోనే గింగురు మన్నాయి.

చేసేది లేక పండితులు కలాలు పట్టారు. వెంటనే పంతులుగారు యెఱ్ఱపెన్సలు పుచ్చుకున్నారు.

చూడగా వొక్కొక్క పండితుడి వొక్కొక్క పుస్తకంలో రెండు-మూడు-వేల తప్పులు శ్రీకారం చుట్టడానికి కలం యెన్ని తిప్పులు తిప్పాలో పండితులెరగరని పంతులుగారు టొకాయించి చెప్పారు.

కాని ప్రభుత్వం పండితుల వాదానికే చేయూత యిచ్చింది.

పంతులుగారి మార్గానికి పర్వతం అడ్డు తగిలింది. నిజమే; కాని వారు జంక లేదు. అడుగు వెనక్కి వెయ్యలేదు.

అవును. ఎందుకు జంకాలి? ఎందుకు వెనక్కి వెయ్యాలి?

గమ్యం గమ్యంగానే వుంది. దానికేమీ విఘాతం కలగలేదు.

తెనుగు తల్లి "రావోయి నాయనా, యీ వేపునుంచి రావోయ్!" అంటూ ప్రేమతో చేతులు చాపింది.

వెంటనే పంతులుగారు దారి మార్చారు. ఈ సారి వారికి అప్పారావుగారి కలం పూర్తిగా సాయపడింది.

వ్యావహారిక భాషకి "స్వాధీన హక్కు భుక్తా" ల్లో నుంచి తప్పిపోయిన గురు పీఠాన్ని మళ్ళీ దఖలు పరిచిన వారీయిద్దరే.

అయితే, వొక్క చిన్న భేదం మాత్రం వుంది.

రామ మూర్తి పంతులుగారు భాషయొక్క పూర్వోత్తరాలన్నీ క్షుణ్ణంగా తెలిసిన పండితులు. పెద్ద పెద్ద సభల్లో మహా మహా మొనగాళ్ళని "గుఱ్ఱందిగూ" అంటూ వురిమి కిందికి లాగేసిన సరదారు.

అప్పారావుగారు శబ్దశక్తి తెలిసిన రచయితలు, రససిద్ధి పొందిన భావుకులు.

రామమూర్తి పంతులుగారి సింహగర్జనలు భాషా తత్వాన్ని బోధ పరిచాయి.

అప్పారావు పంతులుగారి కవిత వ్యవహార భాషలో వున్న జీవకళా, మాధు ర్యమూ, రసస్ఫూర్తీ, శక్తీ వెల్లడి పరిచింది.

ఇలాగ ఆ గర్జనలవల్ల సత్యం అవగాహనం కాగా, యీ కవిత వల్ల కుమార కవి సింహాలకు నూతనావేశం కలిగింది.

ఇంకేం కావాలి?

ఆంగ్ల వాఙ్మయ పరిచయం వల్లా, వివిధ దేశ పర్యటనాల వల్లా కొత్తపోకడలు పోతూవున్న యువ కవులంతా వ్యవహార భాషలోనే గ్రంధ రచన ప్రారంభించారు. దేశీయులు ఆంధ్రభాష యొక్క నిసర్గ మాధుర్యాన్ని అనుభవిస్తూ జాను తెనుగు నుద్ధరించిన పంతులుగారి పరిశ్రమని గుర్తించారు.

ఇదే మొన్నటి డిసెంబరు ౨౭డో తేదీని రాజమహేంద్రవరంలో నన్నయ భట్టు స్నానాలు చేసి జపంచేసిన గోదావరి వొడ్డున కార్యరూపం తాల్చింది.

ఆంధ్రజాతి అంతా అక్కడ కూడింది. ఆంధ్రుల వైభవం అంతా అక్కడ కొలువు తీరింది. ఆంధ్రుల రసికత అంతా అక్కడ గుబాళించింది.

ఆవేళ రాజమహేంద్రవరంలో (పరిషద్వార్షికోత్సవంలో) పంతులు గారికి చోటు లేకపోయింది. ఇవాళ రాజమహేంద్రవరం అంతా పంతులుగారి తేజస్సు నిండి పోయింది.

ఆ వేళ పరిషత్తు పంతులుగారికి ఆంక్ష చెప్పింది. ఇవాళ దేశం పరిషత్తుకే ఆంక్ష చెబుతోంది—

[భారతి-సంచిక : 11, సంపుటి : 2, (1934)లో 'మీగడ తఱకలు' శీర్షిక నుంచి]

# నా వాఙ్మయ మిత్రుడు

## కొడవటిగంటి కుటుంబరావు

1924 ప్రాంతంలో నేను విజయనగరం మహారాజావారి కళాశాలలో ఇంటర్మీడియట్ చదువుతూండేవాణ్ణి. గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు మా కళాశాలకి వచ్చి, తెలుగు వ్యావహారిక భాషమీద ఉపన్యాస మిచ్చేరు. మా అధ్యాపకులలో ఒకరు బుర్రా శేషగిరిరావు ఎమ్ ఏ. గారు. ఆయన రామమూర్తిగారి ముఖ్యానుచరులలో ఒకరు. బహుశా ఆయనే ఉపన్యాసాన్ని ఏర్పాటు చేసుంటారు.

పంతులుగారు సామాన్యం ఎత్తు, ఇది గిడుగుకాదు పిడుగు అన్నట్లుగాఉంటారు. బింకమైన మొహం. ఆయనకుండే పట్టుదల అంతా మొహంలోనే కనబడుతుంది. ఎరుపు ఛాయ, తలపాగ, కోటు, పంచ అన్నీ తెల్లటివే ధరించేరు. వారు ఉపన్యాసంలో మధ్య మధ్య గట్టిగా కేకలువేస్తూ వచ్చేరు. భాషా విషయంలో వారి ఉద్రేకం పట్టరానిది. ఆ ఉపన్యాసంలో నాకు బోధపడినది అంతే!

పంతులుగారి దగ్గర మా నాయనగారు పర్లాకిమిడిలో (1898) ఎఫ్. ఏ. చదువుకొన్నారు.

రామమూర్తిగారు తెలుగు అను పేరుగల పత్రికను కొన్ని నెలలు ప్రచురించేరు. దాని తాలూకు ప్రతులు మా ఇంటిలో ఉన్నాయి. ఆ తర్వాత వాటిని అప్పుడప్పుడు తిరగవేస్తూండేవాణ్ణి. పిమ్మట బైండు చేయించేను.

1929 ప్రాంతాలలో వాడుక భాషలో రచనలు కొంత సక్రతుగా ఉండేవి. నేను ఆ కాలంలో భారతికి, గృహలక్ష్మికి, పుస్తకాలమీద సమీక్షలను (రివ్యూలను) వ్రాస్తుండేవాణ్ణి. మొదట సులభ గ్రాంధికంలో వ్రాస్తూ, అది సహజంగా కనబడకపోగా, వ్యావహారిక భాషలో వ్రాయడం మొదలుపెట్టేను. దాని కంతకూ రామమూర్తిగారు దేశంలో నాటిన వ్యావహారిక భాషావిత్తనమే కారణం. నేను ఊరుకోక మరొకమెట్టు పైకి వెళ్ళేను; వ్యావహారిక భాషా రచనకి కొన్ని నియమాలు అను పెద్ద వ్యాసాన్ని రాసి భారతిలో (1933) అచ్చు వేశాను.

రామమూర్తిగారు పర్లాకిమిడిలో నివసించేవారు. ఆయన డెబ్బైయ్యో పుట్టినరోజు వస్తూంటే వారి శిష్యులు, అనుచరులు వారికి రాజమహేంద్రవరంలో పెద్ద ఉత్సవం

చేయించ సంకల్పించారు. ఆ రోజే అభినవాంధ్రకవి పండిత పరిషత్తునుకూడ చేస్తారు. దానికి రాయప్రోలు సుబ్బారావు ఎమ్. ఏ. గారు అధిపతి. తెలికిచర్ల వెంకటరత్నం ఎమ్. ఏ. గారు రామమూర్తిగారి రచనలను సంపుటాలుగా ప్రకటించడానికి పూను కొన్నారు. ఇది గొప్ప ప్రయత్నం. ఎక్కడెక్కడోవున్న వారి రచనలన్నిటికి గ్రంథ రూపం ఏర్పడుతుంది. ఆ ఉత్సవంలోనే ఆధునికాంధ్ర గ్రంథ ప్రదర్శనం కూడ ఏర్పాటయింది.

ఆ పెద్ద ఉత్సవం 27-12-1933 నాడు, ఆమన్నాడు జరిగింది. రాయప్రోలు వారు తమ అధ్యక్షోపన్యాసాన్ని పాటలాగు చదివేరు అది వారి ప్రత్యేకత అని తెలుసు కొని సభాసదులు ముచ్చటగా ఆలకించేరు. ఆధునిక గ్రంథ ప్రదర్శనాన్ని నేను చూస్తున్నాను. గిడుగువారు వచ్చి ఆ ప్రదర్శనంలో కొన్ని గంటలసేపు ఉన్నారు ప్రతి పుస్తకాన్ని వివరంగా పరిశీలించేరు. వాటిలో ఏదో ఒక గ్రాంథిక పుస్తకం ఉంది. దాని పేరు ఇప్పుడు నాకు బాగా జ్ఞాపకంలేదు. గిడుగువారు ఆ పుస్తకాన్ని ఎత్తి "ఇది కూడ ఇక్కడికెందుకు వచ్చింది" అన్నారు. వారికి వ్యావహారిక భాష, తమవాదము, అంతే ముఖ్యం. అట్టి పట్టుదల వల్లే వారి ఉద్యమం తెలుగులోకంలో వ్యాపించింది. వారి వాదము సరియైనది కాబట్టి అది వ్యాపించింది, అని మనం తృప్తిపడడానికి లేదు. వారికి పట్టుదల లేకుండా ఉంటే, అది పుట్టుకలోనె పురుగుముట్టుకు పోయుండేది. మంచి దయితేనే లోకంలో వ్యాపిస్తుంది, చెడ్డదైతేవ్యాపించదు అన్న నిబంధన లోకంలోఎక్కడా లేదు. ప్రచారం ముఖ్యం మొత్తంమీద గిడుగువారి ఉత్సవం అద్భుతంగా జరిగింది.

ఈ పట్టున వ్యావహారిక భాషోద్యమాన్ని గురించి టూకీగా చెప్తాను. తెలుగు వాఙ్మయంలో పూర్వకాలంనుంచి పద్యకావ్యాలను గ్రాంథికభాషలో రాయడం అలవాటు. సుమారుగా శ్రీనాధుడికాలందాక పద్యకావ్యభాషకి, నాడు వాడుకలోఉన్న భాషకి ఎక్కువ తేడా లేదని పండితులంటారు. పిమ్మట దేశంలో మార్పుచెందుతూన్న వాడుక భాషకి సంబంధం లేకుండా పద్యకావ్యభాష స్థిరపడి గ్రాంథిక భాష అనిపేరు పొందింది. ఇది నేటి వరకు కూడ పద్య కావ్యాలలో కవులు వాడుతున్నారు. అయితే పద్య కావ్యాలను విడిచిపెట్టి మిగత వాటికి-అనగా, శాసనాలు, గ్రంథవ్యాఖ్యలు, లేఖలు మొదలైన వచన రచన లన్నిటికి గ్రాంథిక భాషగాక, ఆ యా కాలాలనాటి వ్యావహారిక భాషను వాడుతూ వచ్చేరు. ఇది మన వచన సంప్రదాయం. అయితే అసలు తెలుగు దేశంతో రాజకీయ సంబంధం విడి పోయిన దాక్షిణాత్య ప్రాంతాలలోని దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయంలో వచన గ్రంథాలను చాలవరకు గ్రాంథిక భాషలోనే వ్రాసినారు. అది మొత్తం మీద తెలుగు వాఙ్మయ లక్షణమని చెప్పడానికి లేదుకదా ! పరిస్థితులిట్లుం డగా, పందొమ్మిదో శతాబ్దపు పూర్వార్థ భాగంలో పరవస్తు చిన్నయసూరి వచన సంప్రదాయాన్ని తారుమారు చేసి నీతి చంద్రికను (1854) గ్రాంథిక భాషలో వ్రాసేడు. అతను మంచి పలుకుబడిగల ఉద్యోగంతో ఉండడం చేత గ్రాంథిక వచన

రచనను పాఠశాలలలో వ్యాప్తిలోకి తెచ్చేడు. అనగా అతను సహజమైన వచన మార్గాన్ని అరికట్టి, అసజహమైన దానిని ఆచరణలో పెట్టేడు. అంతమాత్రంచేత సర్వమూ మారిపోలేదు కందుకూరి వీరేశలింగం తన ప్రహసనాదులను వాడుక భాషలోనే రాస్తూ వచ్చేడు. గురుజాడకవి ప్రఖ్యాతమైన తన నాటకాన్ని 1890 లో వాడుక భాషలోనే సృష్టించేడు. వేదంవారు పాత్రోచిత భాష అను పేరున దానికి ప్రతాప రుద్రీయంలో 1895లో స్థానమిచ్చేరు. ఏదైనా సంప్రదాయానికి ఎదురుగా గ్రాంథిక భాష కొంతకాలం నడిచింది. దాని అసహజత్వమె దానికి ముప్పు.

క్రమంగా గురుజాడ, గిడుగు మొదలైన యోధులు అసలు వచన సంప్రదాయాన్ని గ్రహించి, గ్రాంథికంమీద ధ్వజమెత్తేరు. కాని అప్పటి కప్పుడే పండితులు కొందరు గ్రాంథిక భాషను దిగద్రావి, ఆ పక్షం వహించడం వల్ల వ్యావహారిక వాదుల ప్రచారం ఏటికి ఎదురీత అయినమాట నిజం.

గ్రాంథికవాదులు, వ్యావహారికవాదులు ఘోరయుద్ధం చేసుకొన్నారు. గిడుగువారు నిజమైన సంప్రదాయం, ది మోడర్న్ తెలుగు (నవీన తెలుగు) అను పుస్తకాలను అచ్చు వేసేరు. జయంతి రామయ్య బి.ఏ.బి.యల్. గారు ఎ డిఫెన్స్ ఆఫ్ లిటరరీ తెలుగు (గ్రాంథికాంధ్ర సమర్థన) అను పుస్తకాన్ని ప్రచురించేరు. దీనిలో ఉండే ఒక విచిత్ర మేమిటంటే-గిడుగువారుగాని, జయంతివారుగాని, ఇతరులుగాని ఇగ్లీషుభాషలో పండితులు వారు తమ మాతృభాషలో కంటె కూడ ఇంగ్లీషులో గొప్ప పండితులని చెప్పినా తప్పు లేదేమో! దానికి వారు వ్రాసిన ఆంగ్ల రచనలే సాక్షి.

వ్యావహారిక భాషా వాదుల పట్ల సంప్రదాయం సహజత్వం కూడ ఉన్నాయి. ఎట్టకేలకు వారి వాదాన్ని అంగీకరించి, గవర్నమెంటు వారు 1913లో పాఠశాలలలో ప్రవేశపెట్టేరు. కాని గ్రాంథిక పండితుల గగ్గోలు రెచ్చిపోయింది. శెట్టిలక్ష్మీనరసింహ. వ్రాసిన గ్రీకు పురాణ కథలను పాఠ్యగ్రంథంగా నిర్ణయించగా, దానిమీద వావిలికొలను సుబ్బారావు ది మోడర్న్ తెలుగు ప్రోజ్ (ఆధునిక తెలుగు వచనము) అను విమర్శ గ్రంథాన్ని ప్రకటించేరు. బుర్రా శేషగిరిరావుగారు ప్రకటించిన విమర్శాదర్శ అను చిన్న పుస్తకం మీద ఆంధ్రభాషా సంరక్షక సమాజం వారు విమర్శాదర్శ విమర్శాం దర్శము అను మూడు సంపుటాల గ్రంథాన్ని 1916లో ముద్రించేరు. ఈ గోలను భరించలేక గవర్నమెంటు వారు తమ నిర్ణయాన్ని ఉపసంహరించుకొన్నారు. దీనినిబట్టి, తేలేది ఏమిటంటే సంస్కరణ ఒకేతూరి పైనుంచి శాసనంలాగు వస్తే ప్రయోజనం లేదనీ అధిక సంఖ్యాకులైన పండితులు కోరిన పిమ్మటే దానికి శాసనరూపం రావచ్చు అనీ.

1915లో బళ్ళారిలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తులో వ్యావహారిక భాషను హేళన చేయాలని ప్రతిపక్షులు కొందరు రామమూర్తిగారితో "బళ్ళారి ప్రాంతంలో 'బేడలు' అంటారు. వాటినే ఉత్తర సర్కారులలో 'పప్పు'అంటారు. ఈ మాండలికాలు ఒకరికొకరికి తెలియవు" అన్నారు. రామమూర్తిగారు లేచి, 'అయితే ఏ మాట వాడమం

టూరో సెలవియ్యండి' అన్నారు. పండితులు తెరమొహాలు వేశారు.

వ్యావహారిక భాష ప్రభుత్వ సింహాసనాన్ని ఎక్కి చవిజూచి, పదచ్యుతి కాగా, పట్టుదల ద్విగుణీకృత మవడంలో ఆశ్చర్యంలేదు. గిడుగువారు, వారి శిష్యులు, అనుచరులు ప్రచారానికి బద్ధకంకణులయేరు. వారి సంఖ్య నానాటికి వానర సైన్యంలాగు పెరిగిపోయింది.

వ్యావహారిక భాషావాదులు చాల వరకు శాస్త్రీయ పద్ధతులను అనుసరించేరు. ఒకమారు చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు "వారికి (వ్యావహారిక భాషావాదులకు) ఏ ప్రబంధంలో ఎన్ని అరసున్నలున్నాయో, బండిరలు ఉన్నాయో తెలుసు. నన్నయభట్టు ఎన్ని ఉత్పలమాలలను రాసేడో, తిక్కన ఎన్ని కందపద్యాలను రాసేడో చెప్పగలరు!" అన్నారు. చెళ్లపిళ్లవారుకూడా వ్యావహారిక భాషారచనను కృష్ణా పత్రికలో మొదలుపెట్టేరు. నేను గ్రాంథిక భాషలో రాయగలను అని చాతీ విరుచుకొని రామమూర్తిగారి ఎదుట నిలబడ్డ పండితుడు లేడనే చెప్పవచ్చు. ఆయనకు గ్రాంథిక భాష అంతక్షుణ్ణంగావచ్చు. అట్లు గిడుగువారు దేశంలో వ్యావహారిక భాషోద్యమాన్ని స్థాపించేరు. వారే ఆ ఉద్యమానికి నాయకులు.

రామమూర్తిగారు పర్లాకిమిడిలో ఉండేవారు. ఆయన అక్కడ కాలేజీలో ఉద్యోగం చేసి విశ్రాంతిని తీసికొన్నారు. ఇట్లుండగా పర్లాకిమిడి జమీందారీని ఆంధ్ర రాష్ట్రంలో చేర్చడమా ఒడ్ర రాష్ట్రంలో చేర్చడమా అను చర్చ బయలుదేరింది రామమూర్తిగారు, వాసా సూర్యనారాయణ శాస్త్రిగారు మొదలైనవారు ఆంధ్రరాష్ట్రం తరఫున కృషిచేసేరు రాజుగారికి వ్యతిరేక మయింది. దాని తాలూకు ఇబ్బందులు రామమూర్తి వర్గంవారు పడ్డారు. కడపటికి 1935 లో పర్లాకిమిడి జమీందారీలో కొంత ఆంధ్రానికి, కొంత ఒడ్రానికి విడగొట్టేరు. రామమూర్తిగారికి ఎదుటి పక్షం వారి ఒత్తిడి జాస్తి అయింది. వారు సంపాదించుకొన్న ఆస్తిపాస్తులను వదులుకొని, రాజమహేంద్రవరానికి 1935 ప్రాంతంలో చేరుకొన్నారు. అక్కడ ఆయన కుమారుడు సూర్యనారాయణమూర్తిగారు ఉపాధ్యాయోద్యోగంలో ఉన్నారు. ఆ ఊరికి వచ్చినప్పుడే నాకు రామమూర్తిగారితో పరిచయం ఎక్కువయింది.

వారు ఇన్నీసుపేటలో ఒక చిన్న మేడను బాడుగకు తీసుకొన్నారు. మేడ మీది చిన్నహాలు పంతులుగారికి ప్రత్యేకం. ఆయన "నేను పర్లాకిమిడిలో నాకు అనుకూలంగా ఉండేటట్లు మేడను కట్టుకొన్నాను. అదంతా విడిచి పెట్టుకొన్నాను" అని కొంచెం నొప్పితో అన్నారు. ఆయన భార్య ముసలితనం వచ్చినా ఓపికగల మనిషి. పంతులుగారు తమ మనుమడికి అప్పుడప్పుడు సంస్కృతాన్ని బోధిస్తూండేవారు. ఆయన చాల ఓపికగల మనిషి. ఎంతసేపయినా నిల్చునే మాట్లాడేవారు.

"నేను అచ్చువేసిన జానకిప్రేమ అను కథల సంపుటాన్ని మీకు అంకితమిస్తాను" అని అనగా, ఆయన "పూర్వకాలంలో రాజులకు అంకితమిస్తే, వారు ధనమో పొలమో

ఇచ్చేవారు. నేనేమి ఈయగలను ?" అన్నారు. 'ధనం కోసం అంకిత మీయడం పద్ధతి ఇప్పుడు పోయింది నాకు మీయందున్న గౌరవంకొద్దీ అంకితమిస్తున్నాను" అన్నాను. ఆ పుస్తకాన్ని వారికి అంకిత మిచ్చేను.

రామమూర్తిగారి ఉద్దేశమేమిటంటే - వ్యావహారిక భాషా రచనకి నిబంధనలు అక్కరలేదనీ, వాడుక భాషకి వ్యాకరమేమిటనీ. అందుకనే ఆయన శిష్యులు కొందరు "ఆయన ధ్వంసం చేయగలడుగాని పునరుద్ధరించలేడు" అన్నారు. చెడ్డని తొలగించడం మంచిని స్థాపించడం కోసమేగదా ! నేను భారతిలో 1933 ప్రాంతంలో అచ్చువేసిన, 'వ్యావహారిక భాషా రచనకి కొన్ని నియమాలు' అను వ్యాసాన్ని పుస్తక రూపంలో ప్రచురించ దలచేను. దానికి వారిని పీఠికను రాయమని కోరేను. అందుకు ఆయన, 'వ్యావహారిక భాషకి నియమాలు అక్కరలేదనీ, ప్రమాణ భాష అనేది లేదనీ రాస్తాను' అన్నారు. 'మీ అభిప్రాయం ఎట్లుంటే అట్లే రాయండి' అన్నాను. కాని వారు చెప్పినంత తీవ్రంగారాసినట్లు కనబడదు. వారి విపుల పీఠికతోనే పుస్తకాన్ని 1938లో అచ్చు వేసేను.

తాను తెలుగు భాషలో చేసిన కృషి అంతా, తాను ఉద్యోగంలోంచి విరమించిన తర్వాతే చేసేను అన్నారు. దేనిని చదివినప్పుడైనా ఒక పెన్సిలును చేతబట్టుకొని, మాటల ప్రయోగాల కింద గీటు పెట్టుకొంటూ పోయేవారు. నేను ఆయన దగ్గరకు వెళ్ళినప్పుడు ఎప్పుడైనా ఏ ప్రయోగ మెట్లు వచ్చిందో వివరించజూచేవారు. అయితే నాకు దానిని అర్థం చేసుకోగలిగినంత పాండిత్యం లేకపోయింది.

ఆయన శిష్యులు కొందరు ఆయనను గురించి, ఆయన ఒక రచనలోని భాషను గురించి తెలుసుకోగలరు గాని కళను గ్రహించలేరు అన్నారు. ఆ మాట ఎంతవరకు నిజం? ఆయన ప్రత్యేకంగా కృషి చేసినది భాషా విషయకమే, కాబట్టి కళ మెచ్చుకోలు కింది స్థానంలోకి దిగిపోయింది. నేను రోజా అను పేరున రాసిన కథ ప్రతిభ పత్రికలో అచ్చయింది. అటుతర్వాత నేను వారి దర్శనానికి వెళ్ళగా "నీ కథను నేను చదవడం మొదలు పెట్టేను. పూర్తిచేసేను. పెన్సిలుతో గీట్లుపెట్టడం మాటే మరచిపోయేను! నేను భాషలో ఇంత కృషిచేసేను. ఎందుకు? ఇటువంటి కథ ఒకటి రాసి ఉంటే ఎంత బాగుండును!" అన్నారు. నా కథ వారి మన్ననకు పాత్రమయినందుకునమస్కరించేను.

అంతకుముందు నేను ప్రచురించిన ఒక నాటకం పేరు కోపదారి మొగుడు. ఆయన కోపదారి అను మాటను విమర్శించి, "మాయదారి లాగుంది కాబట్టి సరిపెట్టు కోవచ్చు. కాని మొగుడు అన్న మాటేమిటి? ఆ రూపం ఎందుకు" అన్నారు. అదే పుస్తకంలో 'అప్పిడే పుచ్చుగుంటాను, తీసుగుంటాను' మొదలైన మాండలికాలను విమర్శించేరు. అది నాటకం కాబట్టి ఆ మాటలు పాత్రోచితాలు అన్న విషయం అలా గుంచండి. ఆయన మనస్సులో ఒక ప్రమాణమనేది ఉంది అని చెప్పేటందుకు ఇట్టి విమర్శేనిదర్శనం. అయితే వాదనకు వచ్చేటప్పటికి మాత్రం ప్రమాణం అనేది లేదం

టారు. ఈ విషయం వారి ఈకింది అభిప్రాయం వల్ల పూర్తిగా రుజువవుతుంది. "మనం మాటలలో కొత్తరూపాలను ప్రోత్సహించకూడదు, సులువుగా అంగీకరించకూడదు. అంతగా తప్పనిసరి అయితేనే ఒప్పుకోవాలి. లేకుంటే వెనుకటి గ్రంథాలకు మనకు సంబంధం బొత్తుగా తెగిపోతుంది" అన్నారు ఒకమారు నాతో. కాబట్టి ఆయన వట్టి తిరుగుబాటు దారుడేకాని మరేమీకాదని చెప్పడానికిలేదు. అయితే ఆయన చేసినపనిమాత్రం విధ్వంసం వరకే అనుకోండి. కాని ఆయన మనస్సులో భాషకి కొంత స్థిరరూపముండాలి అనే ఉద్దేశం. అయితే మనం పది శతాబ్దాల కిందటి భాషను గాక ఈనాటి భాషలో రచించమంటారు. ఆయన ఇట్లు వ్యావహారిక భాషకి పునరుద్ధారకుడు.

"తెలుగులో వాడుకభాషలో రాసేటప్పుడు ఆయా ప్రాంతాలవారు తమ మాండలిక భాషలలో రాయాలిగాని ఇతర ప్రాంతాల మాటలతో గూడిన కలగలుపు భాషలో రాయకూడదు" అని నేను వాదించగా, ఆయన "ఇతర ప్రాంతాలలోని రూపాలతో గూడిన మిశ్ర రచన శ్రేష్ఠం. ఇట్లు వ్రాస్తేనే కొంత కాలానికి ఎల్లెడల సమాన భాష అవుతుంది" అన్నారు. వారు చెప్పిన మాటే నిజమని నాకు నా దేశాటనానుభవం మీద రుజువయింది.

ఏ నవీన వాఙ్మయంలోనైనా యథార్థత (రియాలిజమ్) వైపే రచయితల రచనా విధానం ప్రవహిస్తుంది. అట్లే వ్రాసే భాషకూడ మాట్లాడేభాష వైపే మొగ్గుతుంది.ఇట్లు వ్రాసేభాష, మాట్లాడేభాష కూడ ఒక దానిమీద ఒకటి ప్రభావం కనబరుచుకొంటాయి.

చిలుకూరి నారాయణరావు ఎమ్ ఏ.ఎల్ టి. గారు ఆంధ్ర భాషా చరిత్రము అను పేరున రెండు పెద్ద సంపుటాలను ప్రచురించేరు. "నా దగ్గరున్న పదార్థాన్నే తీసుకొని వెళ్ళి అతను పుస్తకంగా అచ్చు వేసుకొన్నాడు" అన్నారు గిడుగువారు. ఆయన ఔదార్యం హద్దులేనిది. "నన్నయ భట్టు వ్రాసిన భారతభాగం మూలమును పరిశోధించి తయారుచేయడానికి ఎందరో పండితుల సహాయముంటే కాని సాధ్యంకాదు" అన్నారు.

గిడుగువారు శబ్దరత్నాకరంలో లేని ప్రయోగాల నెన్నిటినో సేకరించేరు. దానిని గురించి చిలుకూరివారు 1-7-1948 నాడు ఏమన్నారంటే - "గిడుగు రామమూర్తి పంతులు గారికి భాషా ప్రయోగాలను అందజేసినవాడు అరసవిల్లి గ్రామంలోని గోదా నరసయ్య గారు అను గొప్ప పండితుడు. ఆయనకు లెక్కలేనన్ని కావ్యాలు కంఠస్థం. ఒకేరకమైన వర్ణనలను వివిధ గ్రంథాలలోంచి నిలుచ్చున్న పాటున అప్పజెప్పేవాడు. బండ్లకొద్దీ భాషాప్రయోగాలున్న కాగితాలను పంపగా గిడుగువారు వాటిని ఉపయోగించేరు" అన్నారు. ఈ నూతన ప్రయోగాలున్న శబ్దరత్నాకరాన్ని గ్రహించడానికి నారాయణరావుగారు పాటు పడ్డారు. కాని ఆయనకు దక్కలేదు.

గిడుగువారు తమకు తెలిసిన వాటిని గురించే కాని అన్నిటిని గురించి అభిప్రాయాన్ని ఇచ్చేవారుకాదు. "దేవుణ్ణి గురించి మీ అభిప్రాయమేమిటి" అని అడిగితే 'ఏమో' అని మాత్రమే సమాధానం.

ఆయన ఆరోగ్యం పైకి కనబడినంత దృఢంగాలేదు. ఏదో కాలక్షేపం చేసేవారు.

మూత్రకోశం తాలూకు బాధ ఏదో ఉన్నట్లు తెలిపేవారు. మొత్తం మీద దీర్ఘకాలం జీవించి 22-1-1940 నాడు అస్తమించేరు.

ఎడబాటుకి విచారిస్తూ అనేక మంది వ్యాసాలు రాసేరు. నేను కూడ రాస్తాననుకొన్నారు. కాని నాది మూగబాధ అయిపోయింది.

ఒక ఉద్యమాన్ని లేవతీయడం కష్టం. అది ఏ కొందరి సొమ్మో! గిడుగువారు దానిని సాధించేరు. వారితెలివి, పట్టుదల, ఓర్పు, నేర్పు, ఔదార్యం, పాండిత్యం, సమయస్ఫూర్తి ఇత్యాదులు అద్భుతం. వాటిని మించినది నిష్కల్మషమైన హృదయం.

రామమూర్తి గారి కార్యదీక్ష అచంచలమైనది. జంకడ మంటూ ఎప్పుడూలేదు. సవరభాష కోసం మన్నెపుటడవులలో తిరిగి క్వినైన్‌ను ఎక్కువగా వాడి పాపం చెముడును కొని తెచ్చుకొన్నారు.! పర్లాకిమిడిని ఆంధ్ర రాష్ట్రంలో చేర్చే ప్రయత్నంలో తమ ఆస్తిపాస్తులను ధారవోసుకొన్నారు అట్టి త్యాగధనుడు! ఆయనది గొప్ప స్వభావం. అనవసరమైన ప్రాక్ నిర్ణయాలు (ప్రిజుడిసెస్) లేవు. అందరూ సమానమే కాని భాషా విషయం పట్ల అట్టి సమ దృష్టిలేదు. వాడుకభాష ఒక్కటే! ఏకమేవా ఒద్వితీయమ్!

నిత్యజీవిత వ్యవహారాలలో కూడ ఆయనకు పట్టుదల జాస్తి వారి పుత్రులలో ఒకాయన తాము తలుచు కొన్నట్లుగా పరీక్షలో గొప్పగా పాసు కాలేదని ఆయనతో ఒక సంవత్సరం మాట్లాడడం మానివేసేరట!

వ్యావహారిక భాషోద్యమం ప్రజలకెంతో ప్రయోజనం. ఇదివరకు భాషను పండితులు పెట్టెలలో బంధించేసేరు. దానికిప్పుడు సంకెళ్ళు వదిలేయి. పాశ్చాత్య వాఙ్మయంలో విక్టర్ హోగో, డ్యూమా, బాల్జాక్, గస్టేవ్ ఫ్లాబర్ట్, ఎమిలి జోలా, మాపసా, టాల్‌స్టాయి మొదలైన గొప్ప వచన కళాకారుల వంటి వారు మన భాషలో కూడ బయలు దేరవచ్చు. రెండక్షరాలు వచ్చిన ఎవరైనా సరే, పిల్లల దగ్గరనుంచి పెద్దలదాకా ఏ పత్రికనో, కొత్త పుస్తకాన్నో తీసుకొని చదవవచ్చు. ప్రజావిద్యకి రామమూర్తి గారి ఉద్యమం పునాదిరాయి. మన రాజకీయ నాయకులు శ్రమపడి మనదేశానికి స్వాతంత్ర్యం తెచ్చినట్లే, రామమూర్తిగారు శ్రమపడి మనభాషకి పండితుల చేతులలోంచిస్వాతంత్ర్యాన్ని తెచ్చి పెట్టేరు. మనదేశ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొన్నట్లే, భాషా స్వాతంత్ర్యాన్ని కూడ శాశ్వతంగా కాపాడుకోవాలి.

తెలుగుజాతి ఘనత రాజకీయాలలో మునిగి పోయింది. అక్కడ మనవారి హనుమంతుడి చేష్టలే గాని, వేరే నాయకత్వం లేదు. కాని సంఘసంస్కరణలో కాని, భాషా సంస్కరణలో కాని అట్లుకాదు, మహానాయకులను సృష్టించు కొన్నాము. రాజకీయాలకు అదెప్పుడో! ముందెప్పుడో!

[బేకు మళ్ల కామేశ్వరరావు గారి నా వాఙ్మయ మిత్రులు 1966 అనే గ్రంథం నుంచి]

# గిడుగు రామమూర్తి పంతులుగారు
# నా అనుభవాలు

## శ్రీనివాస శిరోమణి

ఎపుడో బాగా జ్ఞాపకము చాలదు. ఆల్ ఇండియారేడియో వారు మద్రాసు శాఖ కొద్ది రోజులలో పెడతారు అనగా-నేను రాజమహేంద్రవరము ఏదో స్వంత పని మీద వెళ్ళాను. శ్రీ రామమూర్తి పంతులుగారి దర్శనము చేయకుండా ఆ వూరి నుంచి బయలుదేరడమెట్లాగని పంతులుగారి దర్శనము చేయడానికి వెళ్ళినాను. మధ్యాహ్నము మూడు- మూడున్నర గంటలు అవుతుంది.

పంతులుగారు ఏదో ఇంగ్లీషు అక్షరాలలో ఉన్న పుస్తకము అతి తీవ్రముగా చదువుతున్నారు. ప్రక్కను నేను నిలుచున్నాను. వారిని కదలించడానికి యిష్టము లేక పోయింది. అరగంటసేపయింది. ఎందుకో ప్రక్కకు చూచినారు. నేను కనిపించినాను. ఒక్కనవ్వు నవ్వినారు. "మీరు సమయానికే వచ్చినారు .. . .. ...నేను పాళీ భాషలో మహా వంశము చదువుతున్నాను. సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఫలానా శబ్దానికి" ...అంటూ మొదలు పెట్టి "మీరున్నూ పాళీభాష చదివినారు కాదూ?" అని నన్ను ప్రశ్నించబోయినారు "పాళీ భాష ఎపుడో చదివినాను. కాని నాకేమిన్నీరాదు" అని వెంటనే పలకమీద వ్రాసి చూపించినాను. పంతులుగారు నవ్వి "తప్పించుకోడానికి అల్లా అంటున్నారు పోనీలెండి. ఆ బాధ నేను పడతాను" అంటూ కుశల ప్రశ్నలు వేసినారు. ఏవేవో కబుర్లు చెప్పినారు. వచన రచనలో నాకు వస్తూవున్న సందేహాలను వెల్లడించినాను. వారు నా సందేహాలను తీర్చినారు.

ఆల్ ఇండియా రేడియో ప్రసంగాల విషయమై ప్రస్తావన వచ్చింది. పంతులు గారు బ్రహ్మానంద పడిపోయినారు. రేడియోవారు ప్రసంగాలను సాధ్యమయినంతవఱకూ వ్యావహారికాంధ్రములోనే వుంచుతారని తెలిసిపట్టరాని సంతోషం వేసింది పంతులుగారికి.

ఒక్క పెద్దనిట్టూర్పు విడిచినారు. పాముబుసకొట్టినంత చప్పుడయినది-మళ్ళీ మాట్లాడటం ఆరంభించినారు.

"నావాదాన్ని రచయితలందరూ అంగీకరించినారు. పత్రికలన్నీ 1,2 తప్ప అన్నీ వ్యావహారిక భాషలో వస్తున్నాయి. టాకీలో కూడా వ్యావహారిక భాష

వస్తూవున్నదని నీవు చెబుతున్నావు. ఇహ రేడియో వారు వ్యావహారిక భాషకు ఎక్కువ ప్రాముఖ్యము ఇవ్వవలెనని అనుకుంటున్నారు. కాని నాకు ఇంకా తృప్తిలేదు. అయితే యూనివర్సిటీ వారు మన వ్యావహారిక భాషను అంగీకరించ లేదు. అంతవఱకూ కృత కృత్యుణ్ణి అయినానని అనుకోను" అన్నారు.

నేను విసుగుతో "కొన్నాళ్ళకు గ్రాంధి కాంధ్రములో పుస్తకాలే రావు. అపుడు యూనివర్సిటీ వారు వ్యావహారికాంధ్రాన్ని అంగీకరిస్తారు తప్పదు" అన్నాను.

"ఎంత కాలము పడుతుందో" అని అన్నారు పంతులుగారు.

* * *

రామమూర్తి పంతులుగారు ఒక భాషావిషయములోనే కాదు అనేక విషయాలలో అనుపమాన పండితులు.

ఒకపుడు ఆయనతో శ్రీ శివ శంకరశాస్త్రులుగారూ, నేనూ ఇంకా కొంతమంది మిత్రులును కలిసి ప్రయాణము చేయటము సంభవించింది.

పంతులుగారు ఎంత సేపూ తెలుగు వ్యాకరణాన్ని గూర్చి ప్రసంగించటము, మధ్య మధ్య తెలుగు వ్యాకరణములో ఆయా సూత్రాలను గురించి మమ్మలను ప్రశ్నించడం సాగించినారు.

మేమంతా ఎన్నడో ఆయన వాదాన్ని గుర్తించి ఆచరణలో పెట్టిన వాండ్లము. వ్యావహారిక భాషలో తప్ప గ్రాంధికాంధ్రమనే కృతక భాషలో వ్రాయకూడదూ అని మతముగా పెట్టుకొన్న వాండ్లము ఈ దిక్కుమాలిన బాల వ్యాకరణముతో ఎందుకీయన మనలను బాధించడము అని విసుగెత్తి పోయినాను. మా అందరిలోనూ ఎక్కువ విసుగు చెందినది శ్రీ శివశంకర శాస్త్రులువారు.

శాస్త్రులు వారు లౌక్యులు. మెల్లిగా భాషావిషయములోనుంచి ఆయనను తప్పించ దలచినారు. ఎంతవాడయినా సరే కామినీ ప్రశంసలోకి తీసుకొని వస్తే సర్వమూ మరచి పోక తప్పదు అని మెల్లిగా ఉపాయముగా తెలుగు ప్రబంధకారులు వ్రాసిన శృంగార పద్యాలు, ఆ శృంగార పద్యాలలో నుంచీ ప్రబంధకారులు చేసిన సంభోగ వర్ణనలు, ఆ వర్ణించిన మైధున వైపరీత్యాలు శాస్త్రిగారు చూచాయగా అందించినారు.

అంతే; రామమూర్తి పంతులుగారు చప్పున అందుకొన్నారు. "నేను ఇంగ్లీషులో సెక్సు మీద పుస్తకాలు చదివినాను. హెవలిక హెల్లిస్ వ్రాసిన పుస్తకాలన్నీ చదివినాను. అంతటితో పూరుకోలేదు, అయివాక్ బ్లాక్ పుస్తకాలు చదివాను. ఇంకా క్రాఫ్టి ఎవిలింగ్ వ్రాసిన సైకోపాతియా సెక్స్యుయాలిస్ చదివాను. వాళ్ళు చెప్పేవిషయాలు ఎంతవఱకూ వాస్తవములో అని మనుష్యులను పరిశీలిస్తూ వచ్చాను. వాళ్ళు చెప్పిన విషయాలు చాలా వరకు అనుభవములోనికి వచ్చినవి" అంటూ ఇక మాకు సెక్సు సైన్సు మీద పాఠములు చెప్పడము ఆరంభించినారు.

* * *

ఏదో సెక్సు పుస్తకాలు అస్మదాదులము చదివినాము. కాని ఆయన చెప్పి నన్ని విషయాలు మేము గ్రహించలేదు. ఆ సెక్సులోంచి ఇక జారత్వము మీద పంతులు వారు మాట్లాడడము మొదలు పెట్టినారు. అంతటితో మాకు మళ్ళి ఆ విషయము మీద కుతూహలము పోయింది.

మాలో చిత్రకారుడొకాయన ఉన్నాడు. అతడు మళ్ళీ ఆ ప్రసంగాన్ని మార్చ వలెనని, జారత్వము, అది యే దేశంలో పుట్టిందో ఆయా విషయాలను గురించి ఉపన్యసిస్తున్న పంతులుగారితో చిత్రరచనలో దిగంబరత్వము మొదలయిన వాటిని గురించి ప్రసంగించినాడు. ఇక పంతులువారు చిత్రరచన మీదనూ హిందూ దేశములో విగ్రహాలు చేయడములో దిగంబరత్వము ఎందుకు అవలంబించింది మొదలు పెట్టి నారు. ఏవో హవల్ వ్రాసిన పుస్తకాలు మాలో కొంత మంది చదివిన వారున్నారు. ఆయన చెప్పిన విషయాలు కొన్ని చాలా ఆశ్చర్యము గలుగజేసినవి. వెంటనే ఆ విషయాలు యేయే గ్రంథాలను ఆధారము చేసికొని చెపుతున్నారని నేను ప్రశ్నించినాను.

"నేను మూల గ్రంథాలు చదువ లేదు. చదవడానికి అవకాశము లేకపోయినది. అయితే గోపీనాధ్ రావు వ్రాసిన "ఇకనాగ్రఫి" పుస్తకాలన్నీ చదివినాను. విగ్రహాల విషయములో గోపీనాధరావు కన్నా యెక్కువ పరిశ్రమ చేసి వ్రాసిన గ్రంథాలు నాకంట బడలేదు" అని పంతులు వారు అన్నారు. అంత వరకున్నూ తక్కినవారి సంగతి ఏమో కాని నేను మాత్రము గోపీనాధరావు అనే వాడు అంత గ్రంథము చేసినట్టు ఎరుగను.

అయితే మాకందరికీ చాలా ఆశ్చర్యము వేసింది. ఈ పంతులవారు చదవని విషయమూ తెలుసుకోని విషయమూ ఏదయినా ఉందా అనిపించింది.

* * *

నన్ను ఎపుడూ తెలుగులో హిందూదేశచరిత్ర వ్రాయమని పంతులవారు ప్రోత్సాహపరుస్తూ వచ్చినారు. వ్రాస్తానంటూ వచ్చే వాణ్ణి. కాని ఆ పని ఇంతవఱకూ చేయలేదు. ఆ రోజులలో మేజరు B D. బసు అనే ఆయన క్రైస్తవ సామ్రాజ్యము అనే పుస్తకము మొదటి కూర్పు చిన్న చిన్న సంపుటాలుగా వచ్చింది. గుంటూరులో మొట్ట మొదట ఆ పుస్తకాలు చదివిన వాణ్ణి నేనే. పంతులవారు కనిపించగానే ఆ పుస్తకాలను గురించి మాట్లాడ బోయినాను. అప్పటికి కొన్ని సంపుటములే నేను చదివినాను. పంతులువారు యావత్తు గ్రంథమూ చదివినారు. బసు వ్రాసిన పద్ధతిని గురించి నాకు చాలా సేపు చెప్పినారు. కొన్ని కొన్ని చోట్ల బసు చేసిన విపరీత వాదాన్ని గురించి యెంతో యుక్తి యుక్తముగా చెప్పినారు వెల్లస్లీ ప్రభువు విషయంలో "బసు హిందూ దేశ చరిత్ర వ్రాయడము మానివేసి వెల్లస్లీ స్వంతవ్యవహారాలు పట్టుకొని వచ్చి రాజకీయాలకు ముడి వేయడము చరిత్ర కారుడు చేయవలసినపని కాదు" అని ఖండితముగా చెప్పినారు.

* * *

"బసు సిపాయి యుద్ధాన్ని గురించి వ్రాయలేదు. సవార్కారు వ్రాసిన పుస్తకము దొంగ తనముగా చదివినాను. అదినాకు సంతృప్తిగా లేదు" అన్నాను.

"అవును బసు సిపాయి యుద్ధమును గురించి వ్రాయలేదు. కాని జాన్ విలియం కేయే అనే ఆయన మూడు సంపుటములు పెద్ద పెద్దవి వ్రాసినాడు. కేయే అభిప్రాయాలు తప్పులు అంటూ మాలిసన్ ఒక రెండు సంపుటాలు వ్రాసినాడు. ఈ ఉభయపుస్తకాలూ మన దేశములో ప్రతివారూ చదువవలెను" అన్నారు.

చరిత్ర విషయంలో అందులో హిందూ దేశచరిత్ర విషయములో వారిజ్ఞానము అపారము. ఆ విషయములో వారి పాండిత్యాన్ని గురించి చెప్పడము సూర్యుణ్ణి కాగడాతో చూపించినట్లే.

* * *

పంతులువారు నడుస్తున్నా కూర్చున్నా ఏపని చేస్తున్నా తెలుగుభాషను గురించి యోజిస్తూనే ఉండేవారు.

బెజవాడలో గవర్నరుపేటలో చెట్లరోడ్డున మేము ఉభయులమూ నడిచివెళ్తున్నాము. హఠాత్తుగా పంతులుగారు ఆగిపోయి "చూడు చూడు - ఆ బోర్డు చూడు ఆ బోర్డు మీద ఎలా వ్రాసిఉందో చూడు" అన్నారు. చూచినాను. ఆబల్లమీద "ఇక్కడ ఫోటో గ్రావులు చక్కగా తీస్తారు" అని పెద్ద అక్షరాలతో వ్రాసి వుంది. పంతులుగారు బ్రహ్మానందపడిపోయి "ఈ ఫోటోగ్రాఫర్ ఎవరో మనవాడయ్యా-మామూలు పద్ధతిలో అయితే ఇచ్చట ఫోటోగ్రావులు చక్కగా తీయబడును అని వ్రాసిఉండేవాడు. ఇచ్చట అనేది కృతక శబ్దము. తీయబడును అనే కర్మణిప్రయోగము మన తెలుగులో లేదు" అన్నారు పంతులుగారు.

ఆయన అంతటితో వూరుకుంటారా? ఆ ఫోటో గ్రావుల దుకాణములోనికి పోయి అట్లా అతడు ఎందుకు వ్రాసినాడో విచారించే వరకూ పంతులుగారు ఊరుకోరు. లోపలికి వెళ్ళినాము. ఆ దుకాణదారు మేము ఎరిగిన్న బుద్ధిమంతుడే అయినాడు.

ఆ రోజునే బెజవాడ ఊళ్ళోకి పోయినాము.

అక్కడ ఇంతకన్నా చిత్రమయిన బోర్డు చూచినాము. ఆ బోర్డుమీద "ఇక్కడ పచారీ దినుసులు అమ్మబడవును" అని వుంది. ఆ బోర్డునూ పంతులువారే చూచి నాకు చూపించినారు. "చూచినావా ఇతడు సాంప్రదాయముగా వస్తూవున్న తెలుగు వాక్యము వ్రాసినాడు" అన్నారు.

ఆ కొట్టుదగ్గఱకు పోయినాము. ఆ కొట్టువాణ్ణి విచారించినాము.

అట్లా ఎందుకు వ్రాసిందీ తనకు తెలియదనీ ఆ కొట్టు ఆరంభించి అప్పటికి అరవై సంవత్సరాలయిందనీ అరవై సంవత్సరాలనాడు వాండ్ల పెద్దవాండ్లెవరో ఆ బోర్డు మీద ఆ వాక్యము అట్లా వ్రాయించినట్లూ, ఆ బోర్డు అచ్చివచ్చినందువల్ల ఆ బోర్డుమీదనే అక్షరాలు చెరిగిపోయినప్పుడల్లా ఆ అక్షరాలమీదనే కొత్తరంగు పూయిస్తున్నట్లు ఆ

దుకాణపు యజమాని చెప్పినాడు.

పంతులుగారు ఆ సమాధానానికి సంతృప్తి చెందినారు. "తెలుగు భాషలో కర్మణి ప్రయోగము లేదు. చేయబడును, తీయబడును ప్రయోగాలు సంస్కృతములోనుంచిన్నీ ఇపుడిప్పుడు ఇంగ్లీషు భాషలో నుంచిన్నీ మన తెలుగు భాషలోనికి వచ్చినవి. చేయడమవును, తీయడమవును అనేవి పరంపరలో వస్తూవున్న ప్రయోగాలు" అన్నారు

"అయితే తీస్తారు అన్నప్పుడు సంప్రదాయక ప్రయోగము చెడిపోయిందని మీ అభిప్రాయమా" అని నేను ప్రశ్నించినాను.

"కాదు కాదు" అంటూ తీస్తారు అన్నప్పుడు స్ఫురించే అర్థముకున్నూ, తీయడమవునూ అన్నప్పుడు స్ఫురించే అర్థముకున్నూ ఉన్న వ్యత్యాసాన్ని బోధపరిచినారు.

* * *

ఆనాడు వారు తెలుగులో కర్మణి ప్రయోగములేదు అని చెప్పినారు. ఈ కర్మణి ప్రయోగాలు ఆధునికులు చేస్తూవచ్చినారు. ప్రాచీనులు చేయలేదు అని పంతులుగారు చెప్పినారు. కొంత కాలము గతించింది. పోతరాజుగారి భాగవతములో మూడుచోట్ల పడు ధాతువును కర్మణిలో ఉపయోగించినట్లున్నూ, పాల్కురికి సోమన్న బసవపురాణంలో రెండు చోట్ల పడుధాతువును కర్మణిలో ఉపయోగించినట్లున్నూ నాకు తోచింది. పంతులు గారికి ఈ విషయము విన్నవించినాను.

వారు నవ్వినారు "ఈ ప్రయోగాలు నా కంటబడినవి. యోజించినాను. భాగవతములో రెండుచోట్ల పడు అనే ధాతువును విభక్తి ప్రత్యయముగా వాడినాడు. ఛందస్సు కోసము సంస్కృతములోనుంచి ఈ కర్మణి ప్రయోగము తెలుగువారు ఎరువుతెచ్చుకొన్నారు. అది ఎరువుసొమ్ముగానే కనబడుతూవుంటుంది. అయితే ప్రాచీన కవులు సకృతుగానే వాడినారు. నిత్యవ్యవహారములో పడు ధాతువు కర్మణిలో ఉపయోగించినట్టు ఊహించడానికి యెంతమాత్రమున్నూ అవకాశము లేదు.

"తోకత్రొక్కినత్రాచు అనేది లోకోక్తి. ఇది కర్మణి ప్రయోగము అయితే తోకత్రొక్క బడిన త్రాచు అనవలసి వుంటుంది. అట్లా యెప్పుడూ ఎవరూ అనరు. అంటే నవ్వుతాము. అట్లా అనరు అని ఖండితముగా చెపుతాము. తిన్న అన్నము, కట్టినగుడ్డ అన్నపుడు నా చేత తినబడిన అన్నము, నాచేత కట్టబడిన గుడ్డ అని ఎవరయినా అంటారా?" అని ప్రశ్నించినారు.

వెంటనే నేను "పీత ప్రతిబద్ధవత్సాం" అనే దాన్ని తెలుగులో ఎట్లాచెప్పవలెనో చెప్పండి అన్నాను. నవ్వుతూ తవుళ్ళాడుకోకుండా "పాలుకుడిచిననూ దూడ కట్టివేసి" అని అన్నారు.

ఏమి చెప్పవలెనో తెలియలేదు.

"పడు ధాతువు కర్మణిలో వాడడము లేదని అంటున్నారే? అయితే మీరెందుకు కర్మణిలో వాడినారు" అని ప్రశ్నించినాను.

"నేను వాడినానా? నేనువాడినాతప్పే నేనే వాడినట్లయితే ఇంగ్లీషులో ఆ వాక్యము ఆలోచించి తెలుగులో వ్రాసి వుండవలెను. అయినా ఎక్కడ వాడినానో చూపించు" అన్నారు.

"గృహలక్ష్మికంఠాభరణము" అనే పుస్తకమునకు తాము పీఠిక వ్రాసినారు. ఆ పీఠికలో మొదటి వాక్యములోనే పడుధాతువును కర్మణిలో వాడినారు" అన్నాను.

వెంటనే ఆ పుస్తకము తీసి చూచినారు. నేను చెప్పినట్లేవుంది. చాలా కించపడి పోయినారు. వెంటనే గుర్తుపెట్టుకొన్నారు. "ప్రమాదమే జరిగింది" అన్నారు.

పంతులుగారు ఆ గ్రంథము మీద తమ అభిప్రాయము చెపితే మరొకరు ఆ పీఠికలో పడుధాతువును కర్మణిలో ఉపయోగించి వాక్యము వ్రాసినట్లు తరువాత కొంత కాలానికి నాకు తెలిసింది.

* * *

పంతులుగారి ధారణశక్తి అద్వితీయము. అంత ధారణాశక్తి కలవారిని నేనింత వరకూ చూడలేదు.

గాంధీమహాత్ముడి ధారణాశక్తి అద్వితీయమని ఆయనను బాగా ఎరిగినవారు చెపుతూ వుంటారు. నాకయితే స్వయముగా మహాత్ముడి ధారణశక్తిని గురించి తెలియదు. ఇతరులు చెప్పిన దాన్నిబట్టి చూస్తే మహాత్ముని శక్తికన్నా పంతులవారి ధారణశక్తి గొప్పదనిపిస్తుంది.

పంతులుగారు ఆ సాయంత్రము ఉపన్యసిస్తారు ఉపన్యాసానికి బయలుదేరడానికి ముందుగానే వారు ఒక కాయితము మీద చెప్పదలచుకొన్న విషయాల సూచికను వ్రాసుకొంటారు. ఆ ఉపన్యాసములో ఏఘట్టములో ఏ యే గ్రంథాలనుంచీ ఏ యే భాగాలు ఆ రోజున ఉదహరించే దిన్నీ ముందుగానే నిర్ణయించుకొని ఆయా పుస్తకాలన్నీ సమకూర్చు కొంటారు. చప్పున ఆ పుస్తకాల పుటలు తీయడానికి గుర్తులు పెట్టుకొని మరీ బయలుదేరుతారు.

యథా ప్రకారముగా ఈ పనినంతా వారు ప్రారంభించినారు. ఆయా పుస్తకాల్లో వారు చెప్పిన పుటలలో గుర్తులు పెట్టినాను. ఆయన ఆ రోజున ఉదహరించ దలచిన పుస్తకాలన్నీ ఒక గాడిద బరువు అయింది. అంత బరువూ నేను మోసుకొని పోవడానికి బద్ధకము వేశింది. సాయంత్రము వారు బయలు దేరుతుండగా వారి దగ్గరకు వెళ్ళి "ఇన్ని పుస్తకాలూ మనము ఇక్కడినుంచీ పట్టుకొని పోవనక్కరలేదు. ఉపన్యాసము చేసేశాలలో వున్నవని" చెప్పినాను. ఆయన సరేనన్నారు.

పంతులవారు ఉపన్యాసము ప్రారంభించినారు. ఆయనకు అవసరము వచ్చినపుడు పుస్తకములలో పుటలు తెరిచి ఇవ్వడానికి అక్కడ కూర్చొని గుర్తులు పెడుతూ వున్నాను. వారు వ్రాసుకున్న సూచీ పత్రము నాదగ్గరే వుంది. కాబట్టి ఏపుస్తకముతో ఏపుడు వారికి అవసరము వస్తుందో నాకు తెలుసును.

ఇక క్షణలేశములో వావిలికొలను సుబ్బారావుగారి రామాయణములోనుంచి వారు ఉదహరిస్తారు. ఆ రామాయణంలో వారు ఉదహరించ దలుచుకొన్న పద్యముకోసం వెతుకుతున్నాను. ఇంతలో "ఏదీ ఆ రామాయణములో పద్యము. ఇంకాతీయలేదూ" అంటూ నన్ను ప్రశ్నించినారు. నేను గాభరాపడిపోయి దబదబా ఆ పుటలలో ఆ పద్యము కోసము వెతుకుతున్నాను. క్షణలేశము అయివుంటుంది. "ఇంకా కనిపించ లేదు" అని గద్దించినారు. నేను నిర్విణ్ణుణ్ణి అయినాను.

ఆలస్యమయినందుకు పంతులవారు ఒక్క నిట్టూర్పు విడిచినారు. నన్ను చూస్తూ "ఆ రామాయణము ఎన్నో కూర్పో చూడండి" అన్నారు

"రెండో కూర్పు" అని సంజ్ఞ చేసినాను.

"ఆ అదే అందు వల్లనే ఆలస్యమయింది. మనం ఇంటిదగ్గఱ మొదటి కూర్పు చూచినాము. రెండో కూర్పు అయితే ఆ పేజి త్రిప్పి క్రిందినుంచి పైకిమూడు పంక్తులు చూడండి. మనకు కావలసిన పద్యము అక్కడ దొరకుతుంది" అని అన్నారు.

అంతే ఆ ప్రక్కపేజీ త్రిప్పి క్రిందినుంచీ మూడు పంక్తులూ పైకి చూచినాను వారికి కావలసిన పద్యము అక్కడ ఉండనేవుంది. ఆ జ్ఞాపకశక్తికి నా గుండె బ్రద్దలయింది.

ఏ తాటాకు పుస్తకములో ఎన్నో ఆకులో ఎన్నో బంతిలో ఏ శబ్దము ఉందో ఇట్టేచెప్పి వేశేవారు. అంతేకాదు. పదిసంవత్సరముల నాడు వారిపేర కార్డు వ్రాస్తే వారి దర్శనము చేయగానే ఫలాన తారీఖున మీరు వ్రాసిన కార్డులో ఇల్లా అన్నారే అంటూ మొదలు పెట్టేవారు.

* * *

మేమిద్దఱమూ ప్రయాణముచేస్తూవున్నాము. పంతులవారు యథాప్రకారము ఏదో ప్రబంధము తీసుకొని పచ్చ పెన్సిలుతో గుర్తులు పెడుతున్నారు. నేను ఆ రైలు పెట్టిలో ఒక మూల కూర్చొని ఆయనకు కనబడకుండా సిగరెట్టు కాల్చుకుంటున్నాను. ఇంతలో నన్ను పిల్చినారు. ఏమిరా భగవంతుడా ఏదో వ్యాకరణ సూత్రముతోనో ఏదో శబ్దము ఏదో మారిపోయింది అనో చెప్పి విసిగిస్తారు కాబోలు ననుకుంటూ సిగరెట్టు పారవేసి ఆయన దగ్గఱకు పోవలెననుకున్నాను. నన్ను చూచి నవ్వుతో "ఎబ్బె సిగరెట్టుమాత్రము పారవేయకండి, ఒక్క శబ్ద రూపము మాత్రమే ఎలా మారిందో చెపుతాను" అన్నారు.

నేనయితే సిగరెట్టు పారవేసినాను. పంతులుగారు మందహాసము చేస్తూ "పాపం దురభ్యాసము అయింది. ఏమి చేయడము. నాకూ చుట్టతాగే అభ్యాసమువుంది. టాల్‌స్టాయ్ అరవై ఏండ్లు దాటిన తరువాత చుట్ట త్రాగడము మానివేసినాడట. ఆ మానివేసిన తరువాత వారము రోజులు యమయాతన పడ్డాడట. ఆ విషయము మామూలుగా పుస్తకము చదివితేవారికేం తెలుస్తుంది" అన్నారు.

పంతులుగారు తెలుగు వ్యాకరణాలన్నీ చదివిన తరువాత అవన్నీ ఆసక్తుగ్ర

ముగా ఉన్నవనీ, సమగ్రమయిన వ్యాకరణము తయారుచేయవలెననీ పూనుకొన్నారు. అహోరాత్రములూ అందుకు అవసరమయిన పరికరాలన్నీ కూర్చడము మొదలు పెట్టినారు. ఇంట్లో కుమాళ్ళనందరినీ అందులో పెద్ద కుమారుణ్ణి నిద్ర అయినా పోనీయకుండా ఆ వ్యాకరణోదహరణల కోసము బాధ పెట్టినారు. పదిహేను సం॥లు కష్టపడి పని చేసినారు. ఏ వూరుపోతే ఆ వూళ్ళో మిత్రులను శత్రులనూ (శత్రువులంటే పండితులన్న మాట) ఆ ఉదాహరణల గురించీ, వారు పరిశోధించిన విషయాలను గురించీ ప్రశ్నించేవారు. ఏదయినా అంతవఱకూ వారు ఊహించని విషయము తెలుసుకుంటే తమ చిఠాలో వ్రాసుకొనేవారు. అప్పటికప్పుడే ఆ విషయము యోజించమని పెద్ద కుమారుడికి తాఖీదు పంపించేవారు.

అట్లా 15 సం॥లు కష్టపడి తయారుచేసుకొన్న గ్రంథము— ఆ గ్రంథము పుచ్చుకొని 5 సం॥లు దేశమంతటా తిరిగినారు. తాము తెలుసుకొన్న దానికంటే మరొకరికి ఏమీ తెలియదు అని తేలిపోయింది.

ఆ గ్రంథాన్ని అచ్చువేయించమని మేమంతా వేధించినాము.

ఇంతలో ఒకానొక శాస్త్రిలుగారు పంతులుగారి దగ్గఱకు వచ్చి సమగ్రమయిన వ్యాకరణము తెలుగులో వ్రాయవలెనని అనుకుంటున్నాను మీ గ్రంథము అంతా నాకు ఇప్పించండి. నా పుస్తకానికి ఉపయోగించుకొంటాను అన్నారు అంతే అడిగిందే ఆత్రముగా పంతులుగారు తమ గ్రంథాన్ని ఆ శాస్త్రిలు గారి చేతికి ఇచ్చినారు

ఆ శాస్త్రిలుగారు పంతులుగారు వ్రాసుకున్న ఉదాహరణలన్నిటికీ సూత్రాలు గ్రాంథికములో తయారు చేయించి అచ్చు వేయించినారు ఆ పుస్తకములో పంతులవారి పేరయినా ఆ బ్రాహ్మణుడు చెప్పలేదు.

* * *

రాజమహేంద్రవరము పంతులవారితో నేను వెళ్ళినాను. అక్కడ భావరాజు వెంకట కృష్ణరావుగారు పంతులుగారి దగ్గఱికి వచ్చి ఆ వ్యాకరణములో పంతులువారి పేరయినా ఆ శాస్త్రిలువారు వేయలేదని భగ్గున మండిపడి పోయినాడు.

పంతులుగారు పకపక నవ్వినారు. కృష్ణారావుగారి వీపుతట్టి "నా పేరెందుకు? నాకు పేరు అక్కర లేదు. నా వాదాన్ని ఆ శాస్త్రిలవారు లోకములో పారవేసినారు. నా కదే తృప్తి" అన్నారు.

అంతటితో కృష్ణారావుగారు ఊరుకోలేదు. ఏదేదో మాట్లాడినారు. పంతులుగారు గంభీరముగా "అక్షరాలు కనిపెట్టినవాడి పేరెవరికైనా తెలుసునా? అట్లాగే నా పేరు లోకానికి తెలిస్తే ఏం తెలియకపోతే ఏం" అని మందలించినారు.

* * *

పంతులుగారి పేరు అయినా ఉదహరించలేదంటే నాకూ చాలా కష్టము వేసింది. ఆ పుస్తకము పీఠిక ఛాయాపుని తీసినాను.

ఆ పుస్తకానికి ఒక వీర గ్రాంధికుడు - చిత్తూరు జిల్లా ఆయన - ఉపోద్ఘాతము వ్రాసినాడు. వీర గ్రాంధికుడనడములో నా అభిప్రాయము వీరశైవులు వీరవైష్ణవులు అన్నట్టు. ...... .. ........

ఆ వీర గ్రాంధికుడు పుస్తకము వ్రాసినానని ప్రకటించుకొన్న శాస్త్రిలవారిని గురించి వ్రాస్తూ "అనవ్య సామాన్య పండితుడు" అని కితాబు ఇచ్చినాడు. అది చూచి నేను నవ్వుకొని పంతులుగారికి చూపించినాను.

పంతులుగారు "అనన్యా! రాని భాషలో వ్రాస్తే వచ్చే అనర్థకము ఇదే సుమా," అని వెంటనే పుస్తకము వ్రాసిన శాస్త్రిలవారిని పిలిపించి "అనన్య సామాన్య పండితుడు" అనే శబ్దము చూపించినారు. పంతులుగారు అంతటితో ఊరుకోలేదు. ఆ కితాబు శాస్త్రిలుగారికిచ్చిన వీర గ్రాంధికుడికి కూడా చెప్పినారు.

కానీ ప్రయోజనం ... ఇప్పటికీ ఆ తప్పు అలాగే ఉపోద్ఘాతములో వుంది.

* * *

బెజవాడ స్టేషనులో నేనూ పంతులు గారూ రైలు ఎక్కపోతున్నాము.

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు కనిపించినారు. అంతే; రామమూర్తి పంతులుగారు ఎకా ఎకీ పోయి వారిని కలుసుకొన్నారు. వారు మా అదృష్టవశాత్తూ తెనాలి వెళ్తున్నారు. మేమున్నూ తెనాలే బయలుదేరి వెళుతున్నాము. రైలు ఎక్కినాము. కూర్చున్నాము. ఇక పంతులుగారు "మాలపల్లి"లో గుంటూరు జిల్లా మెట్ట తాలూకాల ప్రయోగాలను గురించి చర్చించినారు.

"మీ మాలపల్లి రెండో పేజీలో తుమ్మపికెలు ఎక్కువస్తున్నవి అనే ప్రయోగము ఒకటి వుంది. ఎక్కిరావడము అనేది పెరుగుతున్నవి అనే అర్థములో వ్రాసినారు. ఈ ప్రయోగము వ్యవహారములో మాత్రమే వుందా లేక ఏదయినా గ్రంథములో చూచినారా" అని ప్రశ్నించినారు. లక్ష్మీనారాయణ గారు తమకావిషయము తెలియదనీ తమ ప్రాంతాలలో ఆ వాడుక ప్రతి రైతున్నూ చేస్తాడన్నీన్నీ చెప్పినారు.

పంతులు గారు కొంతసేపు ఆయావిషయాలను గురించి మాట్లాడి "కాంగ్రెసు వారు నా మతాన్ని అంగీకరించవలెను నా మతాన్ని అంగీకరించి నట్లయితే అచిరకాలములో కాంగ్రెసు జయిస్తుంది" అన్నారు.

లక్ష్మీనారాయణ గారు ఎందువల్ల - ఏలాగు? అని ప్రశ్నించినారు.

"అయితే వినండి. మీ స్వరాజ్య ఉద్యమములోకి ప్రజలందరూ రావలెననేటట్లయితే ప్రజలందఱూ మీ ఉద్యమాన్ని ముందుగా అర్థం చేసుకోవలెను. మీరు ప్రతి గ్రామమూ పోయి ప్రచారము చేయలేరు. అంతేకాదు అట్లా చేయటానికి అంతరాయాలు కూడా వస్తవి. మీ ఉద్యమ మంతా వ్రాతతోనూ కరపత్రాలు ప్రకటించడముతోనూ సాగవలెను. మీరిప్పుడు రెండు కోట్ల డెబ్బైలక్షల మంది ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నా మతము అంగీకరించేటట్లయితే ఒక మాసము రోజులలో సాధ్యమవుతుంది.

ముందుగా వ్యావహారిక భాషలో మీ కరపత్రాలనన్నిటినీ వ్రాసి అచ్చొత్తించండి. ఆ తరువాత తెలుగు అక్షరాలు గుణింతమూ ప్రతివారికీ నేర్పడానికి గ్రామానికొక ప్రచార కుట్టీ ఏర్పాటు చేయండి. అక్షరాలూ, గుణింతమూ మామూలు తెలివి తేటలు గలవాడు నేర్చుకోడానికి వారము పది రోజుల కన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడయితే అక్షరాలు గుణింతమూ వచ్చిందో ఆ క్షణము నుంచీ మీ కరపత్రాలు మొదలయినవి చదువు కోగలుగుతాడు. ఇంతకన్నా దేశములో విద్య వ్యాపింపజేయుటానికి సులభ మార్గము లేదు. మీరీపనికి పూనుకోవలెను. ఈ విధముగా బాల్కాను రాష్ట్రాలలో యుద్ధము అయి పోయిన తరువాత చేసినారు. నేను ఆ విషయమంతా చదివినాను. బాల్కాను రాష్ట్రాలలో ఆరు మాసాలులో విద్యాశూన్యత అంతా తొలిగిపోయింది.

పాపము పంతులుగారు అనేక మందిని అనేక పనులకు ప్రోత్సహించినారు. కానీ ఆయా పనులు చేసినవారు అరుదు.

[భారతి. 1940 మార్చి]

# మిత్ర ప్రశంస

## మల్లాది సూర్యనారాయణశాస్త్రి

కీర్తిశేషులగు రావుసాహెబు కళాప్రపూర్ణ గిడుగు వెంకట రామమూర్తి పంతులు గ్రామ్యగ్రాంథిక వాదము తలయెత్తిన నాటినుండి అనగా రమారమి ముప్పై సంవత్సరములనుండి నాకు పరిచితులు. 1914—15 నడుమ నేను ఆంధ్ర సాహిత్యపరిషత్తులో పూర్వ గ్రంథ ప్రకాశకుడనై సాహిత్య పరిషత్పత్రిక నడపిన సమయములో వారికిని నాకును పరిచయమెక్కువైనది. నేను గ్రాంథికవాదిగా నున్నను నాతో కొన్ని సందర్భములలో భాషా విషయములు ప్రసంగించుచు నాయెడ ఆదరము చూపుచుండెడు వారు. అది మా మత భేదమును పాటింపక మంచి మైత్రికి మూలమైనది.

రామమూర్తి పంతులుగారన్నను వ్యావహారిక భాషా వాదమన్నను భేదములేదు. ఆరెండును పర్యాయపదములైనవి. వారి వాదము 1910 మొదలు కొన్ని సంవత్సరములు దేశములో భాష వాడుకలోనున్నట్లే వ్రాయవలెనన్నంత తీవ్రముగా నడచినది. తరువాత భాషాతత్త్వ సంప్రదాయ విమర్శన లగ్నమై ప్రాచీనార్వాచీన కవి ప్రయోగములకు సరివచ్చు శిష్ట వ్యవహారములోని శబ్దములు రచనయందు గ్రాహ్యములనుచు ప్రమాణప్రదర్శన పూర్వకముగా విజృంభించినది. పిదప భాషా సంస్కారము భాషా సంప్రదాయము అను రెంటిని సహేతుకముగా సోదాహరణముగా విశదీకరించుచు శిష్టుల వాడుకలోని భాష కెప్పటికప్పుడు ఆనాటి గ్రంథములలోని భాష దగ్గరగా నుండవలెనన్న మతమును స్థాపింపబూనినది. "పాతపడ్డ మాటలు రచనకర్హములుకావు. వాటి సంప్రదాయము నేటివారికి తెలియదు. ప్రాచీన కవి ప్రయోగము లెన్నో పూర్వ వ్యాకరణములను విరుద్ధములుగా ఉన్నవి దేశ్య శబ్దజాలము మారునట్లే దేశ భాషా వ్యాకరణములును మారుచుండవలెను "తదనుగుణమైన రచన పండిత పామర రంజకము" అనుచు సయుక్తికముగా గ్రాంథిక వ్యావహారికభాషలకు సామరస్యము కలిగింప నుద్యమించినది. ఇది వారి వాదములోని సారాంశము.

ఆధునికులు పెక్కండ్రు వ్రాసిన చిన్నచిన్న గ్రంథములు చదివిన పంతులు వారు ఒకటి రెండు సందర్భములలో ఇంత తెగబడి వ్రాయవలెనని నా ఉద్దేశము కాదు. అయితే ఇపు డెవరిని నిర్బంధించగలము. ఇది సంధి కాలము. క్రొత్త యేటి నీరు కలకగా

నుండును. శరత్కాలము రాగానే తేటపడును. అట్లే ఇదిన్ని కొంత కాలమునకు చక్కబడును" అని నాతోననియున్నారు. దీనిని బట్టి పంతులుగారి ముఖ్యాభిప్రాయము స్పష్టమగును. పంతులుగారు పెక్కు సభలలో నుపన్యసించు సమయములందు గూడా గ్రాంథిక వ్యావహారిక భాషల సంబంధము మిక్కిలి సన్నిహితముగా నుండుట దేశభాషా సంప్రదాయమనుచు చెప్పెడివారు. గాని నోటికివచ్చినట్లు చేతికి వచ్చినట్లు వ్రాయ వచ్చునని చెప్పియుండలేదు. అది అందరికిని తెలిసియున్నదే కావున దానినిగూర్చి పెంచి వ్రాయుట యావశ్యకముకాదు. కాని వారినిగూర్చి యిపుడు పత్రికలలో వ్రాయు చున్నవారిలో నొకరిద్దరు సత్యము తెలియక వ్రాయుచున్నారని మాత్రము విచారించ వలసి వచ్చినది.

ఒకరు పంతులుగారికి పండితులు శత్రువులని వ్రాసియున్నారు. అది పొరపాటు. భాషా విషయమున మతభేద మున్నంతమాత్రమున వారు వీరి శత్రువులని భావింపరాదు. అదిగాక దేశములోని సుప్రసిద్ధ పండితులు పంతులుగారిని, పంతులుగారాపండితులను ప్రశంసించుచుండుటయు విదితము. అందుకెన్నో నిదర్శనములుకలవు. నేను 'ప్రయోగ శరణం వ్యాకరణం' అను నియమము ననుసరించి 1923 మొదలుగా మూడు సంవత్సరములు దీక్షవహించి ఆంధ్రభాషాను శాసనము రచియించిన సమయమున నా యొద్ద నున్న ప్రయోగములకు తోడుగా మరికొన్ని ప్రయోగములుకూడ లభించిన మేలని తలచి శ్రీ పంతులుగారి కొక జాబు వ్రాసితిని. దానికి బదులు వ్రాయుచు అట్టి ప్రయోగముల తోడి యొక వ్రాత పుస్తకమును నా కందజేసిరి. నా యభిప్రాయమున కనుగుణము లైన యందలి ప్రయోగములు నేను గ్రహించితిని. ఆ విషయము నా యనుశాసనము విజ్ఞప్తిలో (1926) కృతజ్ఞతా పూర్వకముగా దెలిపితిని.

నా గ్రంథ మచ్చుపడుటకు సిద్ధముగానున్న సమయమున శ్రీ పంతులుగారు 1926 మొదటి నెలలో రాజమహేంద్రవరము దయచేసి నా యందలి యాదరమున మా యింటికి నన్ను చూడవచ్చిరి. నా వ్యాకరణము వ్రాతపతి రెండు రోజులు చాలా వరకు చదివి "మీరు వ్రాసినది నావాదము నూటికరవై పాళ్ళు అంగీకరించినట్లున్నది. ఆ శేష మంగీకరించుట మీ కింకా ఇష్టముకాలేదు కాబోలు. అయితే నేమి ? మీ రింతవర కంగీకరించ డమే నాకు సంతోషము" అనుచు ప్రసంగించి నా విజ్ఞప్తి చదివి ఆ యా గ్రామములలో జరిగిన సభలలోని కొన్ని విషయములు నాకు చెప్పిరి. ఈ సత్య విషయమిసుమంత యైన తెలియని వారొకరు సర్వము తెలిసినట్లుగా నేను కృతజ్ఞత చూపనట్లుగా ఈ నడుమ భారతిలో వ్రాసిన దెంతయు విచారకరమైనది. పంతులుగారిని భూషించుటకు నిష్కారణముగా నితరులను దూషించుటకూడా అవశ్యకమా ? పోనిండు దానికేమి ?— దీనిని బట్టి పంతులుగారి వాదము స్వమత మందలి గుణమును భాషాభిమానుల కెరుక పరచుటకేకాని పండితులను నిందించుటకును ద్వేషించుటకును కాదనుట నేనును నావంటి వారనేకులును చిరకాలమునుండి యెరుగుదుము.

శ్రీ పంతులుగారు సంప్రదాయసిద్ధమైన శబ్ద స్వరూప మిట్టిదని నిర్ణయించుట కెక్కువగా పాటుపడినవారు. ఒకమారు నేను పర్లాకిమిడి వెళ్ళుట తటస్థించినపుడు వారు చదివి గీతలు పెట్టిన పుస్తకములు సుమారు రెండు వందలు చూచియున్నాను. అందలి విషయములెన్నో టిప్పణములుగా వ్రాసియుంచిరి. అవియు గొన్నిటిని చూచి ఉన్నాను. వారు సంగ్రహించిన వానిలో బాల కవి శరణ్యమున ప్రయోగములు మాత్రమే ముద్రితములైనవి. వారి రచనలన్నియు, ప్రత్యక్షరము శ్రీ సీతాపతి పంతులుగారెరుగుదురు. అవి అన్నియు నేకముఖముచేసి పరిశీలించిన యెడల వాని నుండి "ఆంధ్ర భాషా చరిత్రము" సంప్రదాయసిద్ధమైనది తయారుకాగలదు. ఆ పని సీతాపతిగారే నిర్వహింపవలసియున్నది. దాని నుద్ధరించుటకు నవ్య సాహిత్య పరిషత్తువారు పూనుకొందురుగాక! పంతులుగారి యశస్సు దేశమున చిరస్థాయియగుటకు వారి పరిశోధనలతోడి భాషాచరిత్ర ప్రధాన మగును.

శ్రీ పంతులుగారి ఆంధ్ర భాషా పాండిత్య మంతియు స్వతంత్రము. వారి విమర్శన పద్ధతులు శాస్త్ర సమ్మతములు. వ్యాకరణము భాషలోనే యిమిడి యున్నది. దానినే వేరుగా కావలసిన యెడల ఒక గ్రంథముగా సమకూర్చుకొనవచ్చును. అంతేగాని యెపుడో పుట్టిన వ్యాకరణమునుబట్టి మహానదివలె ప్రవహించుచున్న దేశభాషలోని శబ్దములను నిర్బంధించుట శక్యముకాదు. వాడుకలో మారుచున్న శబ్దములను కవి శిష్ట సమ్మతములైన వానిని రచనలో గ్రహింపకపోవుట సంప్రదాయ విరుద్ధమని వారి నిశ్చితాభిప్రాయము. అందుకై వారు సుమారు ముప్పది సంవత్సరములు మహా దీక్షతో భాషాసేవచేసి వ్యావహారిక భాషావాది పక్ష మొకటి నెలకొల్పి దాని జీవనము కల్పింప తమ జీవితమును ధారపోసి కృతకృత్యులైరి. ఆరంభించిన పని తుదముట్ట నొక్కరీతిని దీక్ష వహించు ధైర్యశాలులలో శ్రీ పంతులుగారగ్రగణ్యులై ఆంధ్రులకు మార్గదర్శకులైరి. శ్రీ పంతులుగారు దేహము విడిచినను భాషను విడువక దేశములో జీవించి యున్నారనుట నిజము. లోకమున కుపకరించు నేపని పూనినవారికైనను వారి నిశ్చల దీక్ష యనుకరణీయమగును. శ్రీ పంతులుగారి జీవాత్మ స్వస్వరూపాను సంధానమున పరమానందము నొందుగాక!.

[ప్రతిభ, సంపుటి : 4, 1940]

# రామమూర్తిపంతులు

## నోరి నరసింహశాస్త్రి

అనాదిగా ఋషులకు జన్మభూమి ఐన ఈ భారత క్షేత్రములో ఇప్పటికీ ఋషులు అవతరిస్తూనే ఉన్నారు. ఋషికల్పులైన అటువంటి మహానుభావులలో ఒకరు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు.

తెలుగు భాషలో విశేష పాండిత్యముగల మహాపండితులున్న కాలములో వారు వ్యావహారిక భాషా ప్రచారము సాగించినారు. సామాన్య పండితలోకమంతా వారిని ప్రతిఘటించి నిలిచినది. దిగ్దంతులవంటి పండితులతో వారు అసహాయముగా వాదించ వలసివచ్చినది. ఆ వాదములలో వారికి అండగా నిలిచినది, వారి అపారమైన భాషా జ్ఞానమూ, వారికి సత్యమందున్న విశ్వాసమూ మాత్రమే. వారిజీవితము చాలాభాగము ఈ వాదనలతోనే గడిచిపోయినది. వారు వాదించినన్ని పర్యాయములుగాని, అన్ని ప్రదేశములందుగాని, అంత మందితోగాని వాదించవలసిన అవసరము ఇతరులకు సామాన్యముగా కలిగి ఉండదు. కాని మన దౌర్భాగ్యమువల్ల విశేష భాషాభిమానముగల విద్వాంసులే రామమూర్తిని వాదపీఠము లెక్కించినారు. ఎన్ని వాద పీఠము లెక్కినా, వారు తమ సిద్ధాంతము లోకము అంగీకరించేట్లు చేయవలెనని వాదించినారే కాని తమ కీర్తి కోసముగాని, వివాదము కొరకుగాని ఆ పని చేయలేదు. ఆత్మజయము కోసము చేసే దుర్వాద పద్ధతి వా రెప్పుడూ అనుసరించలేదు. వారిని బాగా ఎరిగిన వారికి తెలుగు భాషకు సంబంధించి నంతవరకు వారు సర్వజ్ఞులే అనిపిస్తుంది. కాని తాను అల్పజ్ఞుడననే చెప్పుకునేవారు. అట్లా వారు చెప్పుకునేది వినయమువల్లనేకాదు. నిజముగా తాము అల్పజ్ఞులై నట్లే భావించేవారు. సముద్రము లోతుగాని ఆకాశము ఔన్నత్యముగాని నేల మీద నడిచే సామాన్యులకు ఏమి తెలుస్తుంది !

తెలుగు వాఙ్మయము చదివిన పండితులు చాలా మంది ఉన్నారు. అయితే మహాభారతాది ఉద్గ్రంథాలేకాక అచ్చుకూడా పడని గ్రంథములెన్నో శ్రీ గిడుగువారు చదివి ధారణలో ఉంచుకున్నారు. అట్లావారు ధరించినది పద్యకావ్యాలూ వచన కావ్యాలూ మాత్రమేకాదు. అవి చదివినంత క్షుణ్ణముగానూ దేశ చరిత్రలు, వార్తా పత్రికలు, టీకలు, లక్షణ గ్రంథాలు, బడి పుస్తకాలు, జాబులు, శాస్త్ర గ్రంథాలు, నిఘంటువులు,

కోశాలు, దిన చర్యలు, శాసనములు - ఇంకా ఎన్నో మన ఊహకందనివి భాషకోసము వారు పరించినారు. ఆంధ్ర మహాభారతాది ప్రసిద్ధ గ్రంథాలు శ్రద్ధగా చదివినవారు చాలామంది ఉండవచ్చును. కాని ఆ గ్రంథాలు ఎన్ని పర్యాయములు ప్రచురణ లయినందువల్ల ఎన్ని పరిణామములు పొందినవో, ఎన్ని వ్రాతప్రతులలో ఎన్ని రూపాలతో ఉన్నవో, ఎరిగినవారు వారే కాని ఇతరులు లేరని నా విశ్వాసము. ఈ విధముగా ప్రసిద్ధ గ్రంథాలేకాక చివరకు టెక్స్టుబుక్కులుకూడా చిన్నయసూరి ప్రచారములోకి వచ్చిన తర్వాత ఏ విధముగా 'గ్రాంధికీకరణము' పొందినదీ వారు పరిశీలించి ప్రచురిస్తూ వచ్చినారు. వారి పాండిత్యము అపారమైనందున పాండిత్య ప్రకర్ష చేసుకునేవారు కారు. విద్వత్తువారికి నైజము.

వారు పరమశాంతులే కాని మధ్యమధ్య పట్టరాని రోషావేశముతో వారి శరీరము ఆపాదమస్తకము కంపించేది అయితే ఆ రోషమంతా వితండవాదులైన 'పండిత భిషక్కుల భాషాభేషజము' మీదనే కాని ఆ పండితులమీద కూడా కాదు. కాకపోతే ఒకప్పుడు ఆత్మలాభపరాయణుల స్వార్థ పరతమీద కూడా అది ప్రసరించేది కాని ఆ స్వార్థపరులమీదకూడా కాదు. అందువల్ల భారత యుద్ధమువంటి భాషా యుద్ధము చేసినా వారు అజాత శత్రువులే.

వారికి భాషా శాస్త్రము అభిమాన విద్య అందులో తెలుగుభాషలో వారి విద్వత్తు అపారము ఐనా వారికి శుద్ధశాబ్దికునికువలె రసగ్రహణశక్తి ఏ మాత్రమూ లోపించలేదు. అంతేకాక వారి కాశక్తి అతి సూక్ష్మముగానూ బహు విశాలముగానూ ఉండేది. అదికాక వారికి అనేక శాస్త్రములలో ఎక్కువ పరిచితి ఉండేది. బోధన విద్యలో వారు నిధివంటి వారు. మానసికశాస్త్రము చక్కగా పరించినారు. బెజవాడ నుంచి గుంటూరు వరకూ ఒక పర్యాయమువారితో కలసి రైలు ప్రయాణము చేయడము నాకు తటస్థించినది. అది ౧౯౨౬ లో అప్పుడు మనదేశములో సంతాన నిరోధము ప్రచారములోకి వస్తున్నది. ఆ ప్రయాణములో సంతాన నిరోధమునుగూర్చి, అందుమీద సామాన్యముగా పాశ్చాత్యపండితుల కామశాస్త్రాభిప్రాయములనుగూర్చి సంభాషణవచ్చింది. ఆ విషయాలలో వారికి జోక్యముండదనుకున్నాను. కాని నేను పొరబడ్డాను. వారి ప్రసంగ మునుబట్టి ఆ విషయాలకు సంబంధించిన పుస్తకాలెన్నో వారు శ్రద్ధగా చదివి ఆలోచించినవారని నాకు స్పష్టమయినది. ఈ విధముగా ఇంకా ఎన్ని విషయాలలో వారికి గాఢప్రవేశమున్నదో మనము ఊహించలేము. దేహానికి వృద్ధాప్యము వస్తున్నా వారి ఊహ నిత్యయౌవనముతో తాండవముచేసేది. వారు సవర భాషకు చేసిన మహో పకారము లోకవిదితము ముందు సవర భాషలో వ్రాసే మహాకవులు వారిని వాగను శాసను లంటారో, అపరపాణిని లంటారో, మరేమంటారో! ఎంత చిన్నవాళ్ళనూ ఎంత చదువుకోని వాళ్ళనూ కూడా వారు పెద్దలనూ విద్వాంసులనూ సంబోధించినట్లే సంబో ధించేవారు. ఒకసారి పరిచయమైన మనిషిని మళ్ళీ సామాన్యముగా మరచిపోయేవారు

కారు. ఒకవేళ మరచిపోతే జ్ఞాపకమున్నట్లు నటించేవారూకారు. వారిని ప్రథమ పర్యాయము నేను దర్శించినది ౧౯౧౯ సం॥ జూలై మాసంలో ౨౬వ తేదీన, చెన్న పట్టణంలో 'థీస్టిక్ ఎండెవరు సొసైటీ' ఉండే ఇంట్లో. అప్పుడు బి. ఎ సీనియరు విద్యార్థిని. ఆగస్టు ఒకటో తారీకున వారు ఆంధ్రపత్రిక ఆఫీసులో చేసిన ఉపన్యాసము విన్నాను. తర్వాత మళ్ళీ ౧౯ ౨౩లో చెన్నపట్టణములోనే దర్శించినాను. విక్టోరియా హాస్టలులో ఉపన్యాస మధ్యములో తగరపు పనిచేసేవాని కుమారుడు ఇంగ్లీషులో గొప్ప గ్రంథకర్త అయినాడని చెప్తూ పేరుకోసము వారు తవుడుకుంటూ ఉంటే, నేను 'బనియను' అని అందించినాను. వారు అందుకుని ఆ వాక్యము పూర్తిచేసి కాస్త ఆగి నా వైపు తిరిగి 'లోగడ మిమ్మల్ని చూచినాను' అని కొద్ది ప్రయత్నం చేసి, ౧౯౧౯లో నేను వారిని కలుసుకున్నది వారు జ్ఞాపకము చేసుకొన్నారు. ప్రసిద్ధులైన వారి దర్శనము చేసినది నాకు జ్ఞాపక ముండకపోతే నా లోపము కాని, అనామకుణ్ణీ చిన్నవాణ్ణీ ఐన నన్ను అప్పటికి నాలుగు సంవత్సరాల క్రిందట రెండుమూడుసార్లు మరొకరితో కలిసి చూసినది వారికి జ్ఞాపక ముండడము నాకు ఆశ్చర్యము వేసినది. ఒక విధముగా వారికి చిన్నవాళ్ళమీదనే అంతస్సులో ఆదరాభిమానాలు ఎక్కువ ఉండే వనడము అతిశయోక్తికాదు.

ఆ తర్వాత ౧౯౨౬ దాకా నాకు వారి దర్శనము తరుచుగనే ప్రాప్తమయింది. అయితే ౧౯౨౬ తర్వాత ౧౯౩౬ వరకూ వారిని కలుసుకోవడము తటస్థపడలేదు. పర్లాకిమిడి ఓఢ్ర రాష్ట్రములో కలిపినందున వారి అసమ్మతి తెలుపడానికి, కష్టపడి అధిక ధనము వ్యయముచేసి కట్టుకొని చాలాకాలము నివసించిన స్వగృహములో నివాసము పరిత్యజించి రాజమహేంద్రవరము వచ్చిన రోజులవి! ఏప్రిలు మొదటి వారమనుకుంటాను. అది వారు రాజమహేంద్రవరము వచ్చిన మరునాడు సాయంత్రమే నని నా జ్ఞాపకము. నేను యాదృచ్ఛికముగా రాజమహేంద్రవరములో దిగి శ్రీ జనమంచి కామేశ్వరరావు ఇంట్లో ఉన్నాను. శ్రీ గిడుగువారు ఆ గ్రామము వచ్చినది తెలిసి వారి దర్శనార్థము వేళ్ళబోతున్నాను. ఇంతలో వారే జనమంచి వారింటికి వచ్చినారు. వారిని ఎదుర్కొడానికి రైలు స్టేషనుకు వెళ్ళిన మిత్రులను అందరినీ ఒకసారి మర్యాదకు చూచి రావడానికి బయలుదేరి, అట్టి వారిలో ఒకరైన శ్రీ కామేశ్వరరావునుకూడా చూడడానికి దయచేసినారు. ప్రతిస్వల్పవిషయములోనూ వారు చూపే మర్యాదకు నాకు ఆశ్చర్యము వేసింది. అప్పటికి నేను వారిని దర్శించి పది సంవత్సరాలయింది నన్ను జ్ఞప్తికి తెచ్చుకోడానికి వారికి ఒక్క నిమిషము మాత్రము పట్టినది. పిమ్మట అంతా జ్ఞప్తికి వచ్చినది. కాని మొత్తముమీద అప్పటికే వారి దేహము మిక్కిలి క్షీణ దశకు వచ్చినట్లు నాకు గోచరించినది. అమోఘమైన వారి జ్ఞాపకశక్తి చాలా తగ్గిపోయినది.

చివరసారి వారిని నేను దర్శించినది గుంటూరులో, నవసాహిత్య పరిషత్తు

వార్షిక సభా సందర్భంలో ౧౯౩౭లో, జనవరి మాసంలో. అప్పటికి వారి దేహపటుత్వము మరి కాస్త తగ్గిపోయినది కాని ఉత్సాహమేమీ తగ్గలేదు. దేశమంతా వ్యావహారిక భాషాప్రచారము చేస్తూ సంచరిద్దామని యువకులకు ఉత్సాహము కలిగించినారు. అంత విద్వాంసులైనా, అంత లోకానుభవము కల వారైనా, చివరవరకూ వారి మనస్సు పసిపిల్లల మనస్సువలె స్వచ్ఛమై నిష్కళంకముగా ఉండేది. ఒక సంగతి తలుచుకుంటే నాకెప్పుడూ పట్టరానినవ్వు వస్తూ ఉంటుంది. ఒకసారి చాలాకాలానికి వారు వారితో సమానవయస్కులైన ఒకానొక మిత్రుని కలుసుకోవడం తటస్థించినది. ఆ మిత్రుడు కథలు చాలా వ్రాసి ప్రచురించినారు. వారు లోగడ అభిప్రాయము కూడా వ్రాయమని కోరినారుట. వారు కనపడ్డ వెంటనే శ్రీ గిడుగువారు వారి చిత్రమైన కంఠస్వరముతో "మీ కథలు చదివినా నండీ—మనవాళ్ళంతా అవి చప్పగా ఉన్నవంటున్నారండీ—నాకూ అల్లాగే ఉన్నవండీ" అని ప్రసంగము ప్రారంభించినారు. ఈ సంగతి చదివేవారికి వారు మోటుగా ప్రవర్తించినారేమో అని భ్రమ కలుగవచ్చును గాని వారి నిర్మలమయిన ముఖము చూచినవారికి అట్లా అనిపించదు. నిష్కల్మషముగా మర్యాదగా వారి కథలమీద తనకున్న అభిప్రాయము మరుగుపరచకుండా తెలుపవలె ననే వారి ఉద్దేశము.

మహానుభావులైన వారిని నేను సందర్శించినాను. వారిదృష్టి నామీద పడ్డది. వారితో నేను మాట్లాడినాను. వారిని నేను స్పృశించినాను. వారిప్పించిన కాఫీ త్రాగినాను. వారిని నా అతిథిగా పూజించే భాగ్యము పొందినాను. వారికి నేను ఉత్తరాలు వ్రాసినాను. వారు ప్రత్యుత్తరాలిచ్చినారు. నేను వ్రాసినవి వారు చదివినారు. బాగున్నవంటూ వాటిలో భాషా ప్రమాదాలు ఎత్తిచూపి, అటువంటి ప్రయోగాలు పూర్వకవులవి చూపుతారా అని మర్యాదగా ప్రశ్నించినారు. నాయందుకూడా వారికి కొంత ఆదరముండేది. ఈ విధంగా నేను సగర్వముగా చెప్పుకుంటున్నాను. ఈ నా ఆత్మశ్లాఘాపరత్వమును లోకము దూషించక శ్లాఘించవలెనని నా మనవి. వారికి బిరుదమూ పదకమూ ఇచ్చి ఇండియా ప్రభుత్వము గౌరవార్హమయింది. వారిని చివరకైనా కళాప్రపూర్ణులనుజేసి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తన్ను తాను గౌరవించుకున్నది. నాకు వారి పరిచయ భాగ్యము కలిగినదని గర్వించడము తప్పా? శ్రీ గిడుగు రామమూర్తిని కూడ, ఎందరు మహానుభావులనో మింగినట్లుగానే కాలము మింగివేసినది. మన దేశములోని సామాన్యాయుర్దాయమును బట్టి కాక పోయినా, వారిది దీర్ఘాయుర్దాయమే! మన పామరత్వముచేత ఇంకా వారు చాలాకాలము జీవించి ఉండవలెనని మనము కోరుకోవడము సహజము. కాని దేహము నశించక తప్పదు.

గ్రంథాలలో వ్యావహారికాంధ్రము వాడవలెననే వాదానికి వారు తమ జీవితము అర్పించినారు. అది స్కూళ్ళలో పాఠ్యగ్రంథాలతో ప్రారంభించినా, కావ్యాలకూ పత్రికలకూ పాకింది. దైవఘటన చిత్రమేమోకాని, వారి వాదము ప్రారంభించిన

స్థానములో ఇప్పటికి బహిరంగముగా అంగీకృతముకాలేదు. అయితే రసవంతమైన గ్రంథరచన, పత్రికలు-ఇత్యాదులకు సంబంధించినంత వరకు వారి వాదము జయప్రదము కావడము వారు కన్నులార చూడగలిగినారు. విద్యాశాఖవారి చేత ఒప్పించినట్లు తెలుసుకునే సంపూర్ణానందము వారి భాగ్యములలో లేదు. వారు పత్రికా రచయితల కిచ్చిన చివరి సందేశములో కూడా అదే సెలవిచ్చినారు. అయితే వారి వాదము సర్వవిధములా జయోన్ముఖమైన స్థితిలోకి రావడము వారు చూచుకున్నారు. కనుక వారు నిశ్చింతగానే జీవము వదిలినారని మన మూహింపవలసి ఉన్నది. వారు వారి దీర్ఘ జీవితకాలములో చేసిన అనన్యసామాన్యమైన పరిశ్రమ సత్ఫలము నేడు మనము అనుభవిస్తున్నాము. రేపు మన పిల్లలు దీనికి రెండింతలు అనుభవిస్తారు. "గ్రాంథిక భాష పరిమిత ప్రయోజనము కలది. వ్యావహారికభాష అపరిమిత ప్రయోజనము కలది" అని వారు తరచుగా ఉద్ఘాటించేవారు. వారికిఅభిమానమైన వ్యావహారికాంధ్ర భాషవలెనే వారి జీవితముకూడా 'అపరిమిత ప్రయోజనము' కలదానినిగా చేసి వెలిగించుకున్నారు. వారి దీర్ఘ జీవితకాలములో భయమనేదిఎరుగరు. వారు జీవించిఉండగా ఉపన్యాస వేదికల మీద నితారుగా నిలుచుండేవారు. ఆవిధముగానే ఇప్పుడుకూడా వారు భగవంతుని ఎదుట నిలువబడి "నీవు నాకిచ్చిన దీర్ఘాయుర్దాయమును సద్వ్యయము చేసినాను" అని నిష్కంపముగా చెప్పగలరు. ఆ భాగ్యము లోకములో ఎందరికి?

ఇతర రాష్ట్రములవారుకానీ విదేశీయులుగాని 'మీ తెలుగుతల్లి కన్న గొప్ప సుపుత్రుని పేరు చెప్ప'మని అడుగుతే, మనము తడుముకోకుండా 'ఇడుగో, గిడుగు రామమూర్తి' అని చెప్పగలము. 'ఆయన ఎక్కడ ఉన్నా'డని అడిగితే మాత్రము, ఆకాశము వంక గంభీరముగా చూచి ఒక్క కన్నీటిచుక్క విడుద్దాము.

[ప్రతిభ, సంపుటి 4, 1940]

# నా గురువుగారు

చిలుకూరి నారాయణరావు

లోకానికి రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారీ లోకమును విడిచి పోయినారని తోచవచ్చు. కాని నా కట్లు కనబడడములేదు. వారు నాయెదుట నిలబడి ఎప్పటికప్పు డిప్పుడున్ను ఉద్బోధిస్తూనే ఉన్నారు. వారి గంభీరమైన స్వరూపము నా హృదయములో నాటుకొని కన్నులలో ప్రతిఫలిస్తూ ఉండేవారు పరలోక ప్రాప్తి పొందినారని నే నెట్లనుకోగలను?

రామమూర్తి పంతులుగారు నా తండ్రిగారికి మిత్రులు. చిన్నప్పుడు మా నాన్న గారున్ను, వారున్ను ఆడుకొనేవారట. అది ఒక కారణమై ఉంటుంది పంతులుగారికి నా మీద వుండే అపరిమితమైన ప్రేమకు.

ముప్పైరెండేండ్లక్రిందటి మాట. నేను పర్లాకిమిడి కాలేజీలో ఎఫ్. ఏ. క్లాసులో ప్రవేశించాను. రామమూర్తిపంతులుగారు మాకు చారిత్రకోపాధ్యాయులయినా, శారీర శాస్త్రము, ఇంగ్లీషుకూడా బోధించేవారు వారు మొట్టమొదటి దినము మాకు తీసుకొన్న పాఠము ఇంగ్లీషు. మాధారణాశక్తిని పరీక్షించడాని కారంభించినారు. మిల్టనుకవి రచించిన '**Sonnet on my blindness**' అనే పద్యఖండికను ఒకసారి చదివి ఒక్కొక్కరిని ఒప్పజెప్పమన్నారు. అందరున్ను తప్పిపోయినారు. నేను ఒప్పజెప్పి నాను. దానితో నా మీద గురువుగారికి ఎక్కువ గురిపడినది.

పంతులుగారి దృష్టిలో ఒకసారి పడితే వారి అభిమానానికి అంత ముందేదికాదు. కాని నేను నా చిన్నతనము మూలాన వారి అభిమానానికి తగినశిష్యుడను కాజాలక పోయి నాను నాకు గర్వము హెచ్చయినది. పాఠాలు చదపడము మానివేసినాను క్లాసులో విన్నదానినిబట్టే పరీక్షలలో బాగా మార్కులు తెచ్చుకొనేవాడను.

నాకా కాలములో తెనుగు కవిత్వమంటే ప్రీతి యెక్కువగా ఉండేది. తిరుపతి వేంకట కవులు దిగ్విజయం చేస్తూఉండిన కాలమది. వారి మూలముగా తెనుగు కవిత్వా నికి సంకెళ్ళు విడినవి. వారి పుస్తకాల నెట్లాగో సంపాదించి సాయంత్రం ఏడుగంట లకు భోజనము చేయగానే గదికి తలుపులు బిగించి గ్రంథము చదవడము పూర్తి అయిన తరువాత నిద్రపోయేవాడను.

ఈ కావ్యపఠనపు పిచ్చిలోపడి రామమూర్తి పంతులుగారి గ్రీకు, రోమను చరిత్రలను చదవడము బొత్తిగా మానివేసినాను. సెలెక్షను పరీక్షలు వచ్చినవి. రోమను చరిత్రములో ఒక ప్రశ్న యిస్తే ప్రపంచ చరిత్రలోని వ్యక్తుల పేళ్ళను, విషయములను తేదీలను అన్నింటినీ గుదిగ్రుచ్చి ఒకపెద్ద గ్రంథం తయారుచేసి వ్రాసి కాగితాలు మడచి ఇచ్చినాను. రామమూర్తి పంతులుగారు, 'నా ప్రియ శిష్యుడెట్లా వ్రాసినాడో చూదా'మని నా కాగితాలు తీసినారు. నేను చేసినది చిన్నతనపు చేష్ట. పరీక్షకు కూరొ్చ నకపోయినా బాగుండేది కాని 'పరీక్ష పేపర్లు దిద్దరు, ఎన్ని ఎక్కువ కాగితాలు వ్రాస్తే అంత ఎక్కువమార్కులిస్తారు. యూనివర్సిటీ పరీక్షలలో పరీక్షకు లవలంబించే పద్ధతి ఇది అని నామిత్రు లనుకొనడము విని నేనట్లా చేసి ఉంటాను. మోసము చేయవలెననే ఉద్దేశము మాత్రము నాకులేదు. అయితేనేమి? గురువుగారికి నా మీద అంతవరకున్న ఎంత ప్రేమ ఉండేదో ఇప్పుడంతటి ఆగ్రహము కలిగినది. వెంటనే ప్రిన్సిపాలుగారి యింటికి పరుగెత్తి, "ఒరే శ్రీనివాసరావూ, నువ్వెవరినైనా పరీక్షకు కట్టించినాసరే, నారాయణరావును మాత్రము కట్టిస్తే నా ఉద్యోగానికి రిజైను పెట్టేస్తాను" అన్నారు. ప్రిన్సిపాలు మంగు శ్రీనివాసరావుగారికి నా మీద అమితమైన దయ హిస్టరీలో తప్ప తక్కిన అన్ని 'సబ్జక్టు్స' లోను నాకు మొదటిమార్కు వచ్చింది. రామమూర్తి పంతులు గారికి నా మార్కులు చూపినాను. 'ససేమిరా' పంతులుగారొప్పుకోలేదు. ఈ సంగతి హాస్టలులో గుబ్బుమన్నది. నా మిత్రు లందరున్ను పంతులుగారి కాళ్ళ మీద పడ మన్నారు. ఉదయమయింది. పంతులుగారి భార్య నన్ను కన్న కొడుకువలె చూచేది. ఆమెతో చెప్పుకొన్నాను. భోజనము దగ్గర నవ్వుతాల మాటలలో పెట్టి, పెరుగూ అన్నమూ తింటూ ఉన్న సమయములో 'మన నారాయణరావూ!' అని చెవిలో గట్టిగా చెప్పింది. నా మాట చెవిని బడగానే గురువుగారి సంతోషమంతా పోయి ఒక్క క్షణములో మండుతూవున్న కోపముగా మారిపోయింది. ఆ యెంగిలి చేతితోనే ప్రిన్సిపాలుగారి యింటికివెళ్ళి "నా భార్యకూడా నారాయణరావును గురించి సిఫార్సు చేస్తూ ఉంది. నువ్వుమాత్రము వాడిని పరీక్షకు కట్టించినావంటే నీ కాలేజీకి నాకూ సరి" అన్నారు. పాప మా ప్రిన్సిపాలుగారేమి చేస్తారు.

కాలేజీలో ఇంగ్లీషునాటకం వెయ్యాలి. దానిలో నాదొక ముఖ్యపాత్రము. దానిని వల్లవేసేవారెవరున్ను లేరు. నాకది అనర్గళముగా వచ్చును. ఆర్గిలుదొర మాకింగ్లీషు చెప్పడానికి క్రొత్తగా ఇంగ్లాండునుంచి వచ్చినాడు. ఆయనకు నా మీద ఎంతో ప్రేమ. నన్ను పరీక్షకు కట్టించకపోతే నాటకములో వేషము వెయ్యను. ఆయన ప్రయత్న మంతా భగ్నమవుతుంది. అందుచేత నా విషయములో ఆయనకూడ కలుగజేసు కొన్నారు. ఉఁహూఁ! రామమూర్తి పంతులుగారు ఒక్క పిసరైన లొంగలేదు. మీ నాటకం గంగలో కలుపుకోండన్నారు.

ఏమీ కార్యము లేకపోయింది. నాదగ్గర పాతిక రూపాయిలుండేవి. హాస్టలులో

నావంటి అభాగ్యుడే మొసలికంటి రామారావును మెట్రిక్యులేషను పరీక్షకు కట్టించరని తెలిసింది. ఇద్దరమున్నూ కూడబలుకుకొన్నాము. చీకటితోనే లేచి రైలెక్కినాము. కాశీలో తేలినాము. అక్కడ పది దినములుండేసరికి దగ్గరవున్న సొమ్మయిపోయింది. ఉద్యోగం సంపాదింతామని తల ఒకదారి పట్టినాము. ఆ తరువాత మేమిద్దరమున్నూ కలుసుకోలేదు. ఇప్పుడు రామారావెక్కడో పోలీసు ఉద్యోగిగా ఉన్నాడని వింటున్నాను.

సొమ్మయిపోగానే కాశీలో ఒక ఫర్ములో ప్రవేశించి కొన్నాళ్ళుండి రైలుఖర్చులకు సంపాదించుకొని తిరిగీ పర్లాకిమిడిలో దిగినాను. నన్ను గురించి తెలియక శ్రీకాకుళములో మావాళ్ళు ఆందోళనపడి నిరాశ చేసుకొన్నారు రామమూర్తి పంతులు హితము వల్ల నారాయణరావు ఎక్కడో నుయ్యో, గొయ్యో చూచుకున్నాడు అని ఒక వాదు బయలుదేరి గురువుగారి చెవిలోపడినది. ఆయన పశ్చాత్తాపానికి మితిలేకపోయినది. తిండికికూడా సరిగా లేచేవారు కారట. నేను స్టేషను నుంచి భుజము మీద ట్రంకుపెట్టె పెట్టుకొని హాస్టలుకు నడుస్తూ ఉండడము ఆర్గిలు దొర చూచినాడు. పరుగు పరుగునవచ్చి 'నువ్వు నారాయణరావువేనా?' అని అడిగినాడు. నేను నారాయణరావునే అని నిశ్చయము చేసుకొని కాలేజీకి పోతున్నవారు తిన్నగా రామమూర్తి పంతులుగారి యింటికి పోయి నేను తిరిగి వచ్చిన సంగతి తెలియజేసినారు. ఓహో! ఎంతసంతోషం! పట్టరాని సంతోషం కలిగింది మా గురువుగారికి. భోజనము చేసుకొని పంతులుగారి దర్శనానికి పోయినాను. చిన్న గావంచా కట్టుకొని కూర్చున్నారు. దించిన తల యెత్తడములేదు. ఒక గంటకాల మట్లే నిలబడ్డాను. అప్పటికేదో జ్ఞాపకము వచ్చి తల యెత్తినారు. 'ఆఁ! వచ్చావూ! నాయనా! చదువు ఊరకే వస్తుందటోయ్? చూచావూ! పన్నెండేళ్ళయింది ఈ పని చేస్తున్నాను. ఇప్పటికింకా ముగియలేదు. కష్టపడితేగాని కార్యము లేదోయ్! పో! కష్టపడిచదువు! పరీక్షకు కట్టుకో!'" అన్నారు. భుజముమీద చేయివేసి తట్టి ఒక కన్నీటిబొట్టును జార్చినారు. ఆ అశ్రుకణము నా హృదయాంతరాళములో నేటికిన్ని మహాసముద్ర రూపము పొంది కలవర పెట్టేస్తూ ఉంది. అది నా జీవితానికొక లక్ష్యము కుదిర్చింది.

అప్పుడు గురువుగారు వ్రాస్తూఉన్నది సవరభాషానిఘంటువు. గురువుగారికీ పిచ్చి యెందుకు? హాయిగా జీతమురాళ్ళు తెచ్చుకొని సుఖంగా కాళ్ళుచాచుకొని కూర్చోకుండా ఎందుకీ వృథాయాసము? సవరవాళ్ళంటే చాలా మందికి తెలియదు. వాళ్ళు అడవులలోను, కొండలలోను వన్యమృగాలతో కలిసి జీవించే జనులు. వాళ్ళను నాగరలోకములోనికి తేవలెనని, గురువుగారి ప్రయత్నము. దానికి విద్యయే సాధనమని వారి నిశ్చితాభిప్రాయము. వారి భాషలోనే వారికి విద్యను నేర్పవలెనని గురువుగారి పట్టుదల. అందుకోసము మన్యపు జ్వరముచేత బాధపడినా సరే, క్వినీను ప్రయోగముచేత బ్రహ్మచెవుడు వచ్చినా సరే, ఉద్దిష్టకార్యము నెరవేరి తీరవలెను. పంతులుగారు తమ జీవితకాలములో పట్టుదలను సాధించినారు. ఒక అనాగరికజాతిని మానవ ప్రపంచములో చేర్చినారు. ప్రపంచ చరిత్రలో నిష్కల్మషముగా ఫలాపేక్షారహితముగా ఇట్టి కార్యమును తలపెట్టి

సాధించిన మరొక పురుషుడేడీ?

గురువుగారి పాండిత్యమును గురించి ఉగ్గడించడానికి నే నసమర్థుడను. వారిదగ్గర చేరిన వారికందరికిన్ని అది బోధపడుతూ ఉండేది. ప్రాచీప్రతీచీ విజ్ఞానాలలోని సారము నంతటిని ఆయన అవగాహన చేసుకొని 'తనది' అనిపించుకొన్నారు.

కాని చాలామంది రామమూర్తి పంతులుగారి పేరు వచ్చినప్పుడు వ్యావహారిక భాషా ప్రవర్తకునిగా మాత్ర మాయనను స్మరిస్తారు. వ్యావహారికభాషకు గ్రామ్యమని పేరు పెట్టి ఆయన జీవితకాలములో ఆయన లక్ష్యమునకు పండితమ్మన్యులయిన అవివేకులు, స్వార్థపరులు, ఆత్మవంచకులు, దేశద్రోహులు, అనేకములైన ఆటంకములు కల్గించినారు.

ప్రభుత్వ విద్యాశాఖలలోను, యూనివర్సిటీలలోను ఆయన ఉద్దేశము సరిగా కొనసాగడానికి ఆయన జీవితకాలములో అవకాశము చిక్కలేదు అయినా, ఆయన విజయమునే పొందినారు. ఆయన యెదుట నిలిచినప్పుడు పిల్లికూనలవలె మూలలకు నక్కి, ఆయన పరోక్షములో పందికొక్కు చేష్టలు చేసేవారివల్ల వారి ఉద్దేశమునకు కొంత ప్రతిబంధకము కలిగినా, దేశమంతా, ప్రజలందరూ ఆయన సదుద్దేశమును గ్రహించి ఆయన ఉద్యమముమూలముగానే జ్ఞానప్రసాదము కలుగుతుందని గ్రహించి ఆ మార్గములో వేలకొలదిగా పనిచేస్తున్నారు. మా గురువుగారు ధన్యులు. వారి తుది దినము వరకున్ను తమ ఉద్యమము మూలముగా దేశహితమును చేకూర్చవలెననే చింత తప్ప వారికి మరొక తలపులేదు.

మా గురువుగారి మనస్సు నిష్కల్మషమైనది. అందుచేతనే ప్రక్కదారులను త్రొక్కి తమ ఉద్యమ విజయానికి పూనుకోలేదు. వారికి రాజాదరములేదు. ధన బలము లేదు. ఒక్క చేతిమీదుగా ఈ మహోద్యమము నడిపించిన ధీరుడాయన. అట్టిపట్టుదల, పాండిత్యము, ఉత్సాహము, ధైర్యము సాహసముగల వాడిక ఎవరు పుట్టుతారు?

గురువుగారి కభిమానముకాని విజ్ఞానశాఖలేదు. కాని, భాషాశాస్త్రము శాసన పరిశోధనములలో వారి దందెవేసిన చేయి. వారు బహుభాషాకోవిదులు, బహుభాషా తత్త్వవేత్తలు. వారి పాండిత్య గౌరవము దేశదేశాలు ప్రాకినది. ఆ విజ్ఞాన భాస్కరతేజస్సును చూపడానికి నా కాగడాను వెలిగించి చూపడమవివేకము.

గురువుగారి తుది సందేశము ఆంధ్రదేశము వినింది. విన్నందుకు ఏమిపని ఎట్లు చేస్తుందో చూడవలెను. ఆంధ్రులాత్మగౌరవమే కలవారయితే, ఆంధ్రులలో చైతన్యమే మిగిలి ఉంటే ఆయన ఉద్దేశనిర్వహణానికి పూనుకొంటారు. దీక్షవహించి పనిచేస్తారు.

[ప్రతిభ, సంపుటి 4, 1940]

# కర్మ వీరుడు

## చింతా దీక్షితులు

భాషా సంప్రదాయాన్ని పోగొట్టుకొని తప్పుడు దారుల్లో సంచరించే తెనుగువారికి నిజమైన సంప్రదాయాన్ని చూపించి వారిని సరియైన దారిలో పెట్టిన విద్వాంసులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు. సంప్రదాయాన్ని నిలబెట్టడానికి ఎంతటి కష్టములనైనా వారు లెక్కచేయలేదు. "ఆంధ్రగద్య చింతామణి" వారి కృషికొక నిదర్శనము.

* * *

తాము భ్రమపడి ఇతరులను భ్రమపెట్టిన పండితుల పాండిత్యమెట్టిదో రామమూర్తి పంతులుగారు బాలకవి శరణ్యములోనూ భాషాభేషజములోనూ వెల్లడించారు. వారందుకై చేసిన అపార కృషి కా గ్రంథమొక నిదర్శనము.

* * *

వారు శబ్ద రత్నాకరాన్ని శోధించిన విధము లోకానికింకా వెల్లడికాలేదు. అక్షరమక్షరమూ పట్టిచూచి అందలి గుణదోషాలను తెలిసికొన్నారు. చిలుకూరి నారాయణరావు గారి సంపాదకత్వమున అది ప్రకటింపబడునని విన్నాను. అప్పుడు వారి కృషి కొంత తెలుగువారికి తెలియగలదు.

* * *

కవిత్రయమువారి మహాభారతము వారి అభిమాన గ్రంథము. సవిమర్శకముగా దానిని ముప్పై మారులు వారు చదివినట్లు చెప్పారు— ఒక మారు సందర్భవశాన్ని, తెలుగు సంప్రదాయాన్ని తెలుసుకోడానికి వారు చేసిన కృషి కిదియొక నిదర్శనము.

* * *

ఆంధ్ర నిఘంటు నిర్మాణము విషయమున రామయ్యగారికీ రామమూర్తిగారికీ అభిప్రాయభేదం వచ్చిందట. తాము చెప్పినట్లు చేస్తే తక్కువ ఖర్చుతో ఎక్కువ పని చేయించవచ్చునని రామమూర్తిగారన్నారట. రామయ్యగారికి నచ్చలేదు. పదముల కర్థములు వ్యవహార భాషలో ఉండవలెననీ వాడుకపదములన్నీ నిఘంటువులో ఉండవలెననీ, ప్రాచీన గ్రంథముల శుద్ధ ప్రతులు తయారుచేసిన పిమ్మటనే అందలి పదములు గ్రహించవలసి ఉంటుందనీ రామమూర్తిగారు. ఇవేవి రామయ్యగారికి కిట్టలేదు. అప్పుడు

చేశారు రామమూర్తిగారు ప్రతిజ్ఞ—మీ నిఘంటువులో నేను తప్పులు చూపుతాను. మీరు వప్పుకొన్న తప్పులకు తప్పు వక్కంటికి ఒక రూపాయి నాకు యివ్వించగలరా అని. రామయ్యగారు ఈ షరతు వప్పుకొంటే ఎన్నివేలు, లేక, లక్షలు ఖర్చుచెయ్యవలసి ఉండేదో

* * *

రామమూర్తిగారి మనుమడు పసివాడుగా ఉన్నప్పుడు ఆయన ఫ్రెంచి నిఘంటువునిండా పెన్సలుతో గీట్లు గీశాడు. రామమూర్తిగారు కోపధారి. మనమణ్ణి పిలిపించారు.

"నీవు పెద్దవాడవైన తరువాత యీ పుస్తకం చదువుతానని మాటయిస్తే నిన్నేమీ అనను. లేదా........"

పిల్లవాడు చదువుతానని వప్పుకొన్నాడు. రామమూర్తిగారు అపరిమితానందం చెందారు. మిత్రులకు ఆ మనుమణ్ణి పుస్తకాన్నీ చూపుతూ యీ కథ చెప్పేవారు. నవనీత సమానమైన వారి మనస్సు చిన్న పిల్లలను ప్రేమించకుండా ఎట్లా ఉండగలదు ?

* * *

పసివాళ్ళు చదువుకోడానికి తెలుగులో గ్రంథాలు లేవని వారెంతగా పరితపించారు! నామీద దయకొద్దీ నన్నెంతగా అట్టి పుస్తకాలు వ్రాయమని పురిగొల్పేరని! వారే గ్రంథమాలకు "బాలానందం" అనే నామకరణం చేసి వ్రాసే బరువు నాపై త్రోశారు. పిల్లలంటే అంత వెర్రి ప్రేమ ఆ మహామహుడికి.

* * *

తెలుగు దేశంలో అవతరించి తెలుగు భాషను ఉద్ధరించిన పుంభావసరస్వతి అస్తమించాడు వారి కొరకై అశ్రుతర్పణాదుల విడువవలసిన అవసరం ఉన్నదా ? నిష్కామ కర్మ ఆమరణమూ చేసిన యీ కర్మవీరుడు శ్రీకృష్ణ పరమాత్మను హృదయంలో నిక్షిప్తము చేసికొని గీతావాక్యములు నాలుకపై తాండవ మాడుతుండగా దేహాన్ని చాలించాడు. ఇట్టి వారికి మోక్షము ఇస్తానని శ్రీకృష్ణుడు వప్పుకొన్నదే.

[ప్రతిభ, సంపుటి : 4, 1940]

# ధన్య జీవి

## తెలికిచర్ల వెంకటరత్నం

రామమూర్తిపంతులుగారు ధన్యజీవులు. తలపెట్టిన ప్రతికార్యమూ కొనసాగించుకొని, మనోరథ సాఫల్యము పరిపూర్ణముగా పొంది, పత్రికాధిపతుల పరిషత్తులో భరత వాక్యము పలికి ప్రశాంత చిత్తముతో అవతారము చాలించిన కారణజన్ములు.

వారు నెరవేర్చిన కార్యకలాపము అమేయము. వారి పరిశ్రమ బహుముఖము. పురాతత్త్వ పరిశోధనములోనూ చారిత్రక పరిశోధనములోనూ వారికి అపరిమితమయిన ఆసక్తి చివరవరకూ ఉండేది. రాజమహేంద్రవరములో ఆంధ్రేతిహాస పరిశోధక మండలి కార్యములలో ఎంతో శ్రద్ధ వహించేవారు. శాసన పరిశోధనము మొదట చారిత్రక దృష్టితో చేసేవారు. తరవాత భాషాతత్త్వ జిజ్ఞాసతో. శిక్షాశాస్త్రములో వారిని మించిన వారీ దేశములో ఎవరు? విద్యాబోధనము వారి అభిమాన విద్య. చివరరోజు వరకూ మనుమడికి సంస్కృతాంధ్రాంగ్లములు బోధిస్తూనే ఉన్నారు. భాషాపరిశోధనము గాలి పీల్చుటవలెనే వారి విషయములో **Involuntary**గా జరిగిపోయే పనిగా పరిణమించినది. ముద్రితాముద్రిత గ్రంథాలే కాదు. పత్రికలే కాదు. కరపత్రములేకాదు. ఏ రూపముగా భాష ఎక్కడ కనబడ్డా అది వారి పరిశోధనకు పాత్రమయేది. తెలుగు కంటె సవరభాషే ముందుగా ఎత్తుకొనడమువల్ల దానిని గురించి వారు ఎక్కువ అభిమానముతో పరిశ్రమచేసి అది మాతృభాషగా కల సవరల కంటె కూడా చక్కగా అలవర్చుకొన్నారు. ఆ భాష ఉద్ధరించి మృగప్రాయులుగా ఉండే సవరజాతిని ఉద్ధరించారు. పర్లాకిమిడిలో—ఆ మారుమూల మన్యప్రదేశములో ఉండి, సహాయ సంపత్తి లేశమయినా లేకపోయినా ఒక్కరూ ఈ మహా కార్యములన్నీ ఎలాగ సాధించినారా అనే విషయము ఆశ్చర్యము కలిగిస్తుంది.

వారిది పరిశుద్ధాంతఃకరణము. తమది సత్సంకల్పమనీ, తామవలంబించినది ఋజుమార్గమనీ వారికి దృఢవిశ్వాస మున్నది. అపరిమితమయిన సాహసమున్నది. అందుకు తగిన ఉత్సాహశక్తి ఉన్నది. అన్నిటినీ మించినది వారి పట్టుదల. ఇక కార్య సాధనానికి ఏమి కొరత? తనపక్షము తానొక్కరే అయినా వెనుకంజవేయడము ఏమిటో ఎరగక ప్రతిపక్షులు కూడా సెబా సనే లాగున ప్రవర్తించి సిద్ధసంకల్పు

లయినారు.

వారిది ఉదారహృదయము. ప్రజాసేవ, లోక కల్యాణము వారి ఆశయములు. వారు పూనుకొన్న కార్యాలకన్నిటికీ ఇదే మూల సూత్రము సవరల నుద్ధరించడానికి అదే పురికొల్పినది. ఏభై సంవత్సరాల కిందట అంటరాని తనము నిర్మూలించడ మనేది ఒక సమస్యగా ఎవరూ గుర్తించక పూర్వమే వారు పంచముల కోసము ఒక బడి పెట్టినారు. ఇతర దేశాలవలె మన దేశమున్ను నాగరకము కావలెననీ, ప్రజలలో ఉన్న మూఢ విశ్వాసములూ అజ్ఞానమూ తొలగిపోవలెననీ భావించి, గాలి వెలుతురులు ఎలాగ ఎట్టి తారతమ్య పరీక్షా లేక అన్ని తావులలోనూ ప్రసరిస్తవో అదే విధముగా సమస్త ప్రజకూ విజ్ఞానముకూడా సంక్రమించవలెననీ, ఆ కార్యానికి అన్ని విధములా అనుకూలపడేదిగా మన దేశములో మన తెలుగుభాష ఉండవలెననీ కోరినారు. ఈ గాఢవాంఛ వల్లనే వారు భాషా యుద్ధానికి దిగినారు. వారి భగీరథ ప్రయత్నము సఫలమయినది. అపమార్గములో పడి కృతక కూలముల నడుమ ఇరుకుకొని, ఎదుగు బొదుగులు ఎరగక, నానాటికీ కృశిస్తూ అత్యల్ప ప్రయోజన కారిగా అయిపోయిన భాషా స్రవంతిని సరిఅయిన మార్గము లోనికి ప్రవేశపెట్టి, అది స్వేచ్ఛగా సజీవముగా సోల్లాసముగా ప్రవహిస్తూ అపరిమిత ప్రయోజనకారిగా పరిణమించేటట్లు చేసిన అసాధారణ ప్రతిభాశాలి శ్రీ పంతులుగారు. వారి ఉద్యమ ఫలితముగా కవులకు గొంతుచెర వీడినది. రచయితల చేతుల సంకెలలు ఊడి పోయినవి.

పంతులుగారి వ్యావహారిక భాషావాదము దేశోపకారక మని ఎరిగి కొందరూ, అది సత్సంప్రదాయ సిద్ధమని తెలుసుకొని కొందరూ, అంగీకరించినారు. పంతులుగారితో వాదించి అందు పరాజయము పొందీ, తమ వాదానికి అనుగుణముగా నిర్దుష్టమయిన గ్రాంథి కాంధ్రములో వ్రాయడము తమకే అసాధ్యమని గుర్తించీ కొందరు పండితులు పంతులుగారి పక్షములో చేరినారు. ఒక్కొక్కరిని తమ మతానికి త్రిప్పడానికి పంతులు గారు ఎంతకాలము, ఎంత ఓపికతో పాటుపడవలసి వచ్చినదో చెప్పవలెనంటే ఒక్కొక్కరి విషయము ఒక్కొక్క విచిత్రగాథగా ఉంటుంది.

తణుకులో, 1924 వ సంవత్సరములో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్త్రియోదశ వార్షిక సభలో పంతులుగారు ఐదు గంటలసేపు గంభీరోపన్యాసముచేసి పరిషత్తు వారు తమ వాదము అంగీకరించేలాగున చేసినారు. ఆనాటి రాత్రి పడవలో ప్రయాణముచేస్తూ ప్రసంగించినప్పుడు వారి అనిర్వచనీయానందము వ్యక్తమైనది. రాజమహేంద్రవరములో 1933లో వారి డెబ్బదవ జన్మదినోత్సవము జరిపినప్పుడు వారికి కలిగిన సంతోషము అపారము. ఏ రాజమహేంద్రవరములో పదిహేను సంవత్సరాలకుపూర్వము తమ వాదమును గురించి ఉపన్యసించడానికయినా తావు దొరికినదికాదో ఆ నగరము లోనే తమకు సన్మానము జరగడమూ, వెనుక విపక్షులుగా ఉన్న మహామహులంతా తన యెడల ఆదరాభిమానములు ప్రకటిస్తూ అక్కడ సమావిష్టులు కావడమూ తమకు ఎంతో

ముదావహమని పంతులుగారు సెలవిచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు-తమకు 'కళాప్రపూర్ణ' బిరుదు ఇవ్వడమువల్ల తమ వాదము విశ్వకళా పరిషత్తు అంగీకరించి నట్లు భావించి సంతోషించారు. మొన్న జనవరి 1ళవ తేదీని పత్రికాధిపతులు సమావేశ మయి పంతులుగారి వాదము తామంతా ఆమోదించి వ్యావహారిక భాషలోనే పత్రికలన్నీ నడుపుతున్నామని చెప్పినప్పుడు మిగతా కార్యము వారికే ఒప్పగిస్తున్నానని సెల విచ్చినారు. పత్రికలే విశ్వకళాపరిషత్తు అనీ, పత్రికలవల్లనే దేశములో విజ్ఞానము విరి విగా వ్యాపించగలదనీ ఈ పరిషత్తు తమ ఉద్యమము కొనసాగిస్తూ ఉన్నందువల్ల తాము కృతకృత్యుల మైతిమనీ తుది మాటగా చెప్పినారు.

పంతులుగారు ఆనాడు పలికిన భరత వాక్యములో తమ తుదివాంఛ తెలియచేశారు; ప్రభుత్వమువారూ, విద్యాశాఖవారూ, విశ్వవిద్యాలయాధికారులూ వ్యావహారిక భాషమీద అన్యాయముగా వేసిన వెలి తొలగించేలాగున చేయవలసినదని. ఆ కోరికనెరవేరేటట్టు చేసే బాధ్యత ప్రతి ఆంధ్రుని మీదా ఉన్నది. మనము ఆ పనికి పూనుకొందుముగాక.

[ప్రతిభ, సంపుటి 4, 1940]

# వ్యావహారిక భాషోద్యమ నేపథ్యం గిడుగువారి సారథ్యం

తూమాటి దొణప్ప

"ఏరోయ్! బరంపురం వాసనగాని తగిలిందా? అప్రాచ్యుడా! భాషను తగలేస్తున్నావ్! బెంచీమీద నుంచో" "ఓహో! పర్లాకిమిడి గాలి విసిరింది కాబోలు! అందుకా ఈ తప్పుల తడకలు! వందసార్లు ఇంపోజిషన్ రాయి"— ఈ వెక్కిరింతలూ, ఈ వెటకారాలూ ఈనాటివి కావు. నాలుగైదు పుష్కరాల క్రితం నాటి ముచ్చట్లు, తెలుగునాటి ఇసుకోలు బళ్ళల్లోనూ, కళాశాల తరగతుల్లోనూ తరుచుగా వినిపిస్తూ వచ్చిన అవహేళన మిళాయించిన గద్దింపు సుద్దులివి. విద్యార్థుల వ్యాస రచనలో గాని పరీక్షల జవాబు పత్రాలలోకాని వాడుకభాష ప్రయోగాలు తెలిసో, తెలికో దొర్లితే ఇలా ఊరబ్బులు నారబ్బులుగా పెడబొబ్బలు పెట్టేవారు, వీరగ్రాంథిక భాషాభిమానులైన తెలుగు పంతుళ్ళు. వాడుకభాషకూ, వ్యావహారికం, శిష్ట వ్యావహారికం అన్న పరిభాషకూ అర్థచ్ఛాయలో సూక్ష్మభేదాలు ఉన్నప్పటికీ ఈ ప్రసంగంలో ఇవి మూడూ ఇంచుమించు సమానార్థకాలుగా స్థూలదృష్టితో స్వీకరించడం జరిగింది. గ్రాంథికవాదులు దీనినే "గ్రామ్య"మని పేర్కొనేవారు.

ఆధునిక విద్యారంగంలోనూ, సాహితీ వ్యాసంగంలోనూ మాధ్యమంగా పాతగిల్లిన కావ్యభాషను కాక సజీవమైన వాడుకభాషను ఉపయోగించాలన్న ఉద్యమానికి తమ జీవితాన్ని అంకితం చేసిన మహాభాగులు గిడుగు వెంకట రామమూర్తి పంతులు గారు. ఆయన ఆనాటి గంజాం జిల్లా బరంపురం వైపునగల పర్లాకిమిడి పట్టణంలోని రాజావారి కళాశాలలో ఉపన్యాసకులుగా బహుకాలం పనిచేస్తూ ఆ సీమ తమ కార్యక్షేత్రంగా వాడుకభాషా ఉద్యమానికి సారథ్యం వహించారు. ఆయన తలపెట్టిన ఈ ఉద్యమంపై తొలినాళ్ళలో తెలుగునాట కొన్ని వర్గాలలో గల చిన్నచూపువల్ల పంతులు గారి నివాసప్రాంతాలను ఉద్దేశించి ఈసడింపుతో ఇలా యద్దేవ చేసేవారు సంకుచిత బుద్ధులైన కొందరు ప్రబుద్ధులు.

రమారమి క్రీస్తు మొదటి శతాబ్దులనాటికే తెలుగుభాష వ్యాప్తిలో ఉన్నట్లు చరిత్రకారుల అంచనా. ఆరో శతాబ్ది నుంచీ రాజాజ్ఞప్తి రూపాలుగానో, ప్రభువుల

విజయాంకాలుగానో, ధర్మపరుల దానప్రకటన లేఖనాలుగానో తెలుగునాట నెలకొన్న నూరారు తెలుగు శాసనాలలో పద్య రూపంగానో, గద్యరూపంగానో అచ్చమైన తెలుగు భాష కన్పిస్తుంది. దీని స్వరూప స్వభావాలను విశ్లేషించి చూస్తే పద్యరూపంలోని భాషా శైలికి అనంతర యుగాలులోని కావ్యభాషా శైలి వరవడిగా నిలిచిందనీ, వచనరూపంలోని భాష సమకాలిక సామాన్య జనుల వాడుక భాషకు చాలా సమీపంగా ఉండేదనీ ధ్రువపడుతుంది. తెలుగునకు ప్రామాణిక సాహిత్య స్థాయి అబ్బిననాటికి కూడ ఇదే ద్వంద్వరూప వ్యవస్థ స్థిరపడి ఉన్నట్లు రూపించవచ్చు. అటుపిమ్మట కూడ తెలుగుభాషా ప్రవాహంలో ఒక పాయగా కావ్యభాష. మరొక పాయగా వాడుకభాష ఒకదాని సరసన ఒకటి ప్రవహిల్లుతూ పరస్పర ప్రభావితాలుగా ప్రవర్తిల్లుతూ వచ్చినట్లు నిర్ధారించవచ్చు. వాడుకభాష సర్వకాల సర్వావస్థలలో అశేష జనుల భావవాహకం కాగా, కావ్యభాష అల్పసంఖ్యాకులైన జనుల పరిమిత ప్రయోజనం కోసం ఉద్దిష్టమైన లిఖితరూప వ్యవహారం.

కావ్యప్రబంధాలకూ, శాస్త్రగ్రంథాలకూ ఆయా కాలాలలో వ్యాఖ్యాకారులు కూర్చిన వ్యాఖ్యానాలలోనూ, తీర్చిన టీకా తాత్పర్యాలలోనూ చాలామట్టుకు వ్యావహారిక భాషయే ఉపయోగించినట్టు ప్రత్యక్ష సాక్ష్యం కావలసినంత ఉంది. పదహారో శతాబ్దం నుంచి రూపొందిన వచన రచనలలో సైతం ఆనాటి వాడుకభాష ప్రయుక్తమయింది. కవనార్థం వాడినపుడు ప్రాయికంగా ప్రాచీన లక్షణ బద్ధమైన శైలినీ, శాస్త్రార్థాలు చేసినపుడు వ్యావహారిక శైలిని ఉపయోగించినట్లు నిష్కర్షించవచ్చు. మరి జానపదమాధ్యమాలైన పురాణప్రవచన హరికథా కాలక్షేపాదులు సాగినపుడు జానపదుల అంతస్తుకు దగ్గర దగ్గరగా ఉన్న స్థానిక శైలిని వాడక తప్పదు గదా! ఒగ్గుకథ, దాసరికం (దశావతారాలు) పగటి వేషాలు, బయలాట, బుర్రకథ మొదలైన జానపద కళారూపాల ప్రయోగంలో జానపదుల జానుభాషయే ఉపయుక్తమవడం జగమెరిగిన సత్యం. ఎటొచ్చీ ప్రభుపోషణమూ, పరిషదవలంబనమూ పొందిన కావ్యభాషకు తప్ప ఇతర మౌఖిక రూపాలకు అక్షరరూపం రావడానికి అవకాశాలు లేనందున అవి పరంపరీణంగా జానపద కళాకారుల నోటివాడుకకే పరిమితం కావలసి వచ్చింది.

జనరంజనం కోసమో, ఝటితిస్ఫూర్తి కోసమో ప్రయుక్తమైన మహాకవుల లక్షణ విరుద్ధ ప్రయోగాలు లాక్షణికులకు తరచుగా కొరకరాని కొయ్యలుగా తయారు కాగా కవులు నిరంకుశులన్న సాకుచూపి ఈ ప్రయోగాలకు వారి ఔద్ధత్యం కారణమని సర్దిచెపుతూ వాటికి అనింద్యగ్రామ్యాలని పేరు పెట్టి సరిపెట్టుకుంటూ వచ్చారు లాక్షణికులు. లక్షణ విరుద్ధమైన భాష గ్రామ్యమనీ తాము విధించిన నియమ నిబంధనలకు లొంగని ప్రయోగరీతి అగ్రాహ్యమనీ వీరు ఎప్పటికప్పుడు హెచ్చరికలుచేస్తూ, వాడుక భాషాప్రయోగాలను నిషేధిస్తూ, జనప్రియ ధోరణిని నిరోధిస్తూ, కట్టుదిట్టంగా బోలెడు గ్రంథం నడిపించారు.

ఇలాగా తరతరాలుగా లాక్షణికులు నిరాకరించినా, సంప్రదాయవాదులు నిరాదరించినా అనునిత్యం జనుల నాల్కలపై చిందులు వేస్తూ తీయదనాలు చిలికే పలుకుబళ్ళనూ, సుతారపు నుడికారపు సొంపులనూ చూచి చూచి కాదనడానికి మనసొప్పక స్వస్థాన వేష భాషా ప్రియులైన మన కవులు కొందరు వాటిని రతనాలు మాదిరిగా ఏరి చికిలివేసి, చిత్రిక పట్టి రచనలలో జవకట్టి తమ ప్రయోగపద్ధతికి పద్ధతిగా జిలుగు నగిషీలు చెక్కారు. తిక్కన, సోమన, శ్రీనాథ, పెద్దనాది మహాకవులు ఈ ప్రలోభానికీ, ఈ ప్రలాభానికీ లోనైన మాననీయులే. "అప్పాచెల్లెండ్రు", "ఇరువై యెన్మిది మూళ్ళమేర", "నమ్మి నమ్మక", "నుయిదాటే వానికిన్", "నూటిరువై యెన్మిది భేదముల్", "నెల రెణ్ణాళ్లకు", "మూన్నాళ్లు", "చేసిందేమిటి", "రోసిందేమిటి", "వస్తూచూస్తిమి"- వంటి వ్యావహారిక ప్రయోగాలను కోకొల్లలుగా కొసరి కొసరి ధృతిమంతులూ, శ్రుత వంతులూ ఐన ప్రామాణిక కవులు తమ చతురవచో విలాసంలో పదింబడిగా ప్రయోగించారు.

రాయల యుగానికి సమకాలికమైన రాయవాచకాదుల శైలినీ, ఆనాటి తెలుగు శాసనాల బాస తీరుతెన్నులను పరిశీలిస్తే ఆ బాణీ ఆ నాటి వ్యావహారిక భాషాస్వరూపానికి ఎంత సమీపంగా నిలుస్తున్నదో తెలుస్తుంది. మధుర - తంజావూరు సీమలను పాలించిన తెలుగు నాయకరాజుల కాలంలో యక్షగానాది జనప్రియ రూపక రచనాప్రయోగాలలో జనానికి చేరువైన వాడుక భాషకు మరింత విశిష్ట స్థానం లభించింది. ఇంగ్లీషు ఈస్టిండియా కుంఫిణీ సర్కారు హయాంలోనూ, ఆ దరిమిలా రాణీ పరిపాలనా కాలం నుంచీ వాడుక భాషకు మహాదశ పట్టింది. ఆర్థిక రాజకీయ రంగాలలో గొప్ప పరిణామం వచ్చింది. పరిపాలనా వ్యవస్థలోనూ, న్యాయ స్థానాలలోనూ సామాన్యుల వాడుక భాషను చాలమట్టుకు వాడక తప్పలేదు. పుస్తకాల భాషతోకాక జనుల వాడుకభాషతో కుంఫిణీ సర్కారు వారికి సరాసరి సంబంధాలు ఏర్పరచుకోవలసిన అవసరం తప్పనిసరి అయింది. కుంఫిణీ ఉద్యోగులూ, క్రైస్తవ మత ప్రచారకులూ, జ్ఞాన పిపాసువులైన ఇతర పాశ్చాత్య పరిశోధక పండితులూ తెలుగునాటి వాడుక భాషను నేర్చుకుని తమ తమ కార్యకలాపాలు నిర్వహించవలసివచ్చింది.

అది వలస విధానమేకావచ్చు గాని ఆంగ్ల విద్యా పద్ధతిలో అనేక విద్యాసంస్థలు స్థాపించడం మూలంగా ఆంగ్ల భాషా సాహిత్యాలతో ఆలోచనా సంయోజనంతో సంక్రమించిన పరిచయాన్ని పురస్కరించుకొని దేశీయులైన విద్యాధికుల దృక్పథంలో సామాజిక సాంస్కృతిక రంగాలపరంగా - ఎన్నెన్నో కీలకమైన మార్పులు పొడసూపాయి. తాటాకు పుస్తకాలతో కడిదం కవిలె కట్టలతో కుస్తీపట్టే కాలానికి స్వస్తిచెప్పి, కాగితం విరివిగా వాడుకలోనికివచ్చి అచ్చుకూటాలు తెలుగునేల నాలుగు చెరగులా నెలకొనడంతో వాడుక భాషా విషయంగా బ్రహ్మాండమైన పరిణామం ప్రవర్తిల్లింది. సామాన్యులకు కూడా ఆధునిక విద్యా సౌకర్యాలు కొంతవరకు అందుబాటులోనికి వచ్చాయి. రావిపాటి

గురుమూర్తి శాస్త్రి, ఏనుగుల వీరాస్వామయ్య మొదలైనవారు ఆనాటి వాడుక భాషకు దగ్గరి శైలిలో రచించిన పుస్తకాలు వివిధ విద్యా సంస్థలలో పాఠ్య గ్రంథాలుగా నిర్ణీత మయ్యాయి. లోక వృత్తాంత దర్శకాలుగా, ధీరవిచారుల ఆలోచనా ధారకు భాష్యాలుగా, రాజకీయ సామాజిక విషయ చర్చావేదికలుగా అనేక వార్తా పత్రికలు అవతరించాయి. ఇలాగా పరిపాలనాపరమైన అవసరాలూ, ఆధునిక పద్ధతులలో విద్యాసంస్థల అవతరణమూ, ముద్రణా సౌకర్యాలూ ఒక మోస్తరు వాడుక భాషలో దేశభాషా పత్రికల ప్రచురణమూ, విద్యాధికుల సంఘ సంస్కరణాభిలాషా ఒకదాని కొకటి తోడుకాగా వాడుకభాష అధికారకంగా రంగప్రవేశం చేయడానికి అనువైన నేపథ్యం సిద్ధమవుతూ వచ్చింది. గత శతాబ్దం మధ్యలో వెలుగులోకి వచ్చిన సామినేని ముద్దు నరసింహ నాయని "హిత సూచని" అన్న వ్యాస సంకలనం దీని కొక మచ్చుతునక. బంగాళా రాష్ట్రంలో ప్రచలితమైన "చలిత్" భాషోద్యమ ప్రతిస్పందన సైతం ఇందులో ఉందని చెప్పవచ్చు. ప్రజల భాషపట్లను, దాని ప్రయోజనంపట్లను శాస్త్రీయమైన అవగాహనా అజేయమైన వాదనా పటిమా కల గిడుగువారి సూత్రధారిత్వంతో దానికి మాంచి ఊపు వచ్చి నిర్దిష్టమైన రూపకల్పన పరికల్పిత మయింది. అంతేకాని, ఇదేదో ఉన్నట్టుండి ఒకానొక శుభోదయాన ఆకాశం నుంచి ఊడిపడ్డ ఉద్యమం మాత్రం కాదు. అనాదిగా అనుస్యూతంగా అధిక సంఖ్యాకుల నిత్యవ్యవహారంలో ఉండికూడ రాజ్యాంగంలోనూ, విద్యా సాంస్కృతికాది రంగాలలోనూ గుర్తింపునకు నోచుకోక వాడుక భాష అచ్చంగా ప్రవాస జీవితం గడపింది.

ఈ శతాబ్దపు తొలి దశకంలో కళింగాంధ్రంలోని ఇసుకోలు బళ్ళ ఇన్స్పెక్టర్ యేట్స్ దొరగారి ప్రేరణతో, గురజాడ అప్పారావు, బుర్రా శేషగిరిరావు, పి.టి. శ్రీనివాసఅయ్యంగారు మున్నగు వ్యావహారిక భాషా ప్రియుల ప్రోత్సాహంతో గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషోద్యమానికి సారథ్యం వహించారు. "గిడుగు గ్రాంథిక వాదం పాలిటి పిడుగు" అని వారి ఇష్టులు కొందరు కీర్తించినా, గిడుగు వారికి గ్రాంథిక భాషపై ద్వేషంగానీ, చిన్న చూపుగానీ ఎంత మాత్రమూ లేవు. ఐతే దాని పరిమితులూ, ప్రయోజనాలూ వేరని ఆయన మతం. చదువు సంధ్యలూ, తక్కిన రాతకోతలూ వాడుక భాషా ముఖంగా సాగాలన్నది ఆయన వాదం. నన్నయగారినుంచీ చిన్నయసూరిదాకా వెలసిన కవి పండితులు, గ్రాంథికభాషలో నిర్మించిన తెలుగువాఙ్మయం నుంచి తప్పులను తవ్వి కుప్పలు కుప్పలుగా పోశారాయన. సమకాలికులైన విద్వత్కవుల రచనల నుంచి తప్పుల తిప్పలను బండ్లకెత్తి తూర్పారబట్టారు. కొమ్ములు తిరిగిన ఉద్దండ పండితులే నిరుపంగా రాయలేని గ్రాంథిక భాషా శైలిలో బడి పిల్లలూ, సామాన్యులూ రాయాలని ఉద్దేశించడం అశాస్త్రీయమనీ, ఆదేశించడం అన్యాయమనీ అది ఏటి కెదురీత వంటిదనీ గిడుగువారు పత్రికా ముఖంగా ప్రబోధం కావించారు. తెలుగు మాగాణమంతా తిరిగి సభాముఖంగానూ, విజ్ఞప్తుల పరంగానూ ప్రచారం చేశారు.

'ఆచార్యాద్విదితావిద్యా' అంటారు ! నూటికో కోటికోతప్ప ఆ ఆచార్యుల బోధనా శైలి సైతం వ్యావహారికమే కదా ! ఇంటా బయటా నూటికి తొంబై తొమ్మిది పనుల కోసం వాడే మధురమైన నిసర్గశైలిని విస్మరించి కేవలం పాతబడ్డ పాఠ్య గ్రంథాల బాణీని బట్టీపట్టి ఒంటబట్టని కృతకమైన శైలిలో జవాబులు రాయాలని పిల్లలను నిర్బంధించి వేధించడం అందని పొందని ధోరణికాదా" అని ఎవరికైనా అనిపిస్తుంది. మద్రాసు రాష్ట్ర విద్యాశాఖవారు నియమించిన తెలుగు కాంపోజిషన్ కమిటీ గిడుగువారి వాదంలోని ఔచిత్యాన్నీ, అవసరాన్నీ గుర్తించి వాడుక భాషను సిఫార్సు చేసింది, దానిని ప్రభుత్వం అమలు పరచింది.

ఈ వాడుక భాషా ఉద్యమానికి ప్రతిస్పర్ధిగా గ్రాంథిక భాషావాదులైన హేమాహేమీలు - జయంతి రామయ్య పంతులు, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు, వేదం వెంకటరాయశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వావిలికొలను సుబ్బారావు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి ప్రభృతులైన గురువృద్ధులు ఎందరెందరో గిడుగువర్గాన్ని ప్రతిభటించి గిడుగు వాదాన్ని ప్రతిఘటించి సకలయుక్తులనూ, సర్వశక్తులను మోహరించి, ఓహరి సాహరిగా పోరాడారు. ప్రాచీనవాదుల బలగంతో కాంపోజిషన్ కమిటీ నిర్ణయాలను తిరగదోడడంతో "సరళ గ్రాంథికం" పేర గ్రాంథికవాదానిది పైచేయి అయింది. ఆదశలో "గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె ఒగి జయంతి రామయోక్తి గెలిచె" అని వద్దాది సుబ్బారాయకవి వంటివారు ఒడ్డారించినా కడకు గిడుగువారి నుడుగే గెలిచింది; తెలుగుల వాడుక భాషకు అది గొడుగుగా నిలిచింది. మంచి మార్పులకోసం ఉద్దేశించిన ఉద్యమాలకు మారొడ్డి నిలవడమూ, క్రమంగా వాటిధాటికి తట్టుకోలేక అంతరించడమూ కొన్ని తిరోగమన శక్తుల సహజ లక్షణం. ఇది సృష్ట్యాదిగా సామాజిక వ్యవస్థలో సాగుతూ వస్తున్న సమర ప్రక్రియ.

రాష్ట్ర ప్రభుత్వమూ, రాష్ట్రంలోని విశ్వ విద్యాలయాలూ అవలంబించిన వ్యావహారిక భాషా ప్రయోగాలనుకూల వైఖరి ఫలితంగా సుమారు అయిదారు పుష్కరాలుగా కొనసాగిన గ్రాంథిక వ్యావహారిక భాషావివాదానికి తెరపడింది. ఆంధ్రప్రదేశ ప్రభుత్వం నియమించిన లక్ష్మీకాంతం కమిటీ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నియమించిన అప్పారావు కమిటీ, వెంకటేశ్వర విశ్వవిద్యాలయంవారి విద్యా విషయిక మండలీ, ఉస్మానియా విశ్వ విద్యాలయంవారి ప్రాచ్య భాషా పండిత పరిషత్తూ చూపిన చొరవా, చేసిన సిఫార్సులూ వ్యావహారిక భాషోద్యమానికి అధికారికమైన అదనపు బలాన్ని సమకూర్చాయి. మాండలిక స్పర్శకు అతీతమైన నేటి ఆధునిక ప్రామాణిక భాషావతరణకు నాటి వ్యావహారిక భాషోద్యమం ప్రధాన భూమికగా ప్రవర్తిల్లింది. ఇందులో ప్రముఖ రచయితలు, ప్రసిద్ధ ప్రచురణ సంస్థలు నవ్యసాహితీ సంస్థ, అభ్యుదయ రచయితల సంఘం, ఆకాశవాణి, తెలుగు పత్రికలు చేసిన విశిష్ట కృషి విస్మరించరానిది. ప్రస్తుతం అన్ని విశ్వ విద్యాలయాలలోనూ, అన్ని స్థాయీభేదాలలోనూ చివరకు బడిపిల్లల వాచకాల రచన

లోనూ వ్యావహారిక భాషకు అధికారికమైనస్థానం లభించింది.తెలుగు నేర్చుకోదలచిన-వయోజనుల, ప్రవాసాంధ్రుల, ఆంధ్రేతరుల, ఉద్యోగుల, ఇతర జిజ్ఞాసువుల- అవసరాల దృష్టిలోకూడా ఈ మార్పు ఎంతో సముచితమని స్పష్టంగా రుజువయింది

గ్రాంథిక వాదులు ఏ కొందరో తప్ప నేడు చాలమంది రచయితలు వ్యావహారిక భాషా శైలిలో సృజనాత్మక, విమర్శనాత్మక రచనలు చేస్తున్నారు. ఛందః ప్రాభవం సన్నగిల్లింది, పద్య రచనాశక్తి పాతబడింది. "ఛందో బందోబస్తుల" బాదరబందే లేనందున కేవలం ప్రతిభావంతులేకాదు, శబ్ద ప్రభుతా, శాస్త్ర ప్రతిష్ఠా గల ప్రతిపత్తిమంతులు సైతం గేయభణితిలో చిట్టచివరకు జానపదుల బాణీలో విశిష్ట కావ్య సృష్టి కావిస్తున్నారు. ఆకాశవాణి, వార్తా పత్రికలు, చలన చిత్రసీమ, రూపక ప్రయోగరంగం, వివిధ గోష్ఠీ చర్చా సభావేదికలు, బోధనామాధ్యమం, శాస్త్ర సాహిత్య విద్యావ్యాసంగం, అక్షరాస్యతా ప్రసార విభాగం, విశ్వజనీన విద్యావ్యాప్తి, ప్రభుత్వ యంత్రాంగం మున్నగు ఆధునిక ప్రచార సాధనాలన్నింటిలోనూ, భాషా వ్యాపక విధానాలన్నింటిలోనూ వ్యావహారిక భాషే ముఖ్యాలుం ముప్పీసంపాలు ఏకైక భావవాహకంగా చలామణీ అవుతూ మౌలికమైన భాషా ప్రయోజనాలకు సార్థకతను చేకూరుస్తున్నది.

[తెలుగు విద్యార్థి, 1986 అక్టోబరు]

# బంగోరె లేఖ

బంగోరె
**Room No. 1, Faculty Club Upstairs**
**Andhra University**
**Visakhapatnam**
7-10-81, రాత్రి 10.40
(తెల్లవారితే విజయదశమి)

చే రా. గారికి,

మహాశయా-బంగోరె యిక్కడ యిక్కడొచ్చి పడ్డాడు. సి. ఆర్. రెడ్డి ప్రవాహంలో పడి కొట్టుమిట్టాడుతున్నాడు. నెలా నెల పదిరోజులుగా దేశాటనం చేసి బెంగుళూరు—మద్రాసు వగైరా చోట్లు తిరిగి-సి. ఆర్ రెడ్డి—మూడురోజులక్రితం యీ గూడు చేరుకున్నాను. నెల్లూరునుంచి వస్తూ—గిడుగు **material** పట్టుకొచ్చాను ... . . లేకుంటే నీ అడ్రసుకు **Reg post parcel** పంపుదామనుకొంటూ వున్నాను.

నావద్దవున్న గిడుగు **material** వివరం యిది.

1. **An a/c of the antiquities of Mukhalingam and its neighbourhood 1894 Xerox copy.**
2. చిన్న ఇంగ్లీషు వ్యాకరణము (**Danish** లోటటో ఎస్పర్సన్‌గారు రచించినది) గిడుగు తెలుగులో వ్రాసినది (1918) **Xerox copy.**
3. **Madras Telugu Composition Committee report** మొత్తం (1914) యిది చాలా అపురూపమైంది **Xerox copy.**
4. సవర రీడర్స్ తాలూకు **title pages etc.** సవర సాంగ్స్, స్టోరీస్, ఫోక్‌లోర్, యీసఫ్ కథల సవర తర్జుమా **etc.**
   అసమగ్రమైనా అపురూపమే మహా శిథిలావస్థలో వున్న **pages** షుమారు **300 pages.**
5. గిడుగు సి. ఆర్. రెడ్డికి రాసిన లేఖ.
   ప్రస్తుతానికి యివి మిత్రమా నావద్దవున్న **material** గిడుగుకు సంబంధించి

వొకేవొక షరతు-Xerox ఖర్చులు మీరు చెల్లించాల్సి వుంటుంది-నేను తీయించిన వాటికి తీయించబోయేవాటికి. సరేనా?

యెప్పుడొస్తున్నారో రాయాల్సింది.

వందనాలతో
భవదీయ
బంగోరె

[బంగోరె పేరుతో ప్రసిద్ధుడైన బండి గోపాలరెడ్డి అపురూపమైన గ్రంథాలు సాధించటంలో దిట్ట. ఆయనకు తవ్వకప్పనిమంతుడు అనే పేరు ప్రచారంలో ఉండేది. ఆయన తిరుపతిలో బ్రౌన్ ప్రాజెక్టులో పనిచేసి బ్రౌను రచనలను తవ్వితీసి ప్రచురించాడు. అట్లాగే ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో పనిచేసి కట్టమంచి రామలింగారెడ్డిగారి రచనలను వెలికితీశాడు. ఆ ప్రాజెక్టులో పనిచేస్తూనే అర్థాంతరంగా ఆత్మహత్య చేసుకున్నాడు.

బంగోరె దగ్గర మెటీరియల్ సంపాయించలేకపోయాను. ఏర్పాట్లు చేసుకుంటుండగానే అతను శాశ్వతంగా వెళ్లిపోయాడు. కనీసం కాయితాల, పుస్తకాల వివరాలు తెలుస్తాయని ఈ ఉత్తరం ప్రచురిస్తున్నాం—సం.]

# A Letter From Professor David Stampe

Central Institute of Indian Languages
Manasagangotri, Mysore-570 006.
4 August 1981

Dear Prof. Ramarao ·

I would be pleased to contribute an article on Ramamurti's works on Sora-the *Manual* (1931) as well as the *English-Sora Dict* (1933) and the *Sora-English Dict.* (*1938*)-for the projected commemorative Volume. You did not mention in your letter the suggested length of the article, or whether the phonetic symbols used in the Sora works could be available in the publication. The special symbols Ramamurti used (in addition to ordinary Roman letters) were

ʃ ŋ ɟ ʔ ɪ ʋ

the diacritics

ˈ accent

̣ retroflex

̥ Voiceless

ˑ half length

: length

¨ umlaut

in addition for comparing other works on Sora the symbols

ɛ J ɨ ʉ

and the diacritics — and ′ would be useful. (of course, substitutions could be made, but it would be shame to lose too much of the flavour of the Origininal alphabet Ramamurti used, since it may well have been the *first description* of any language done entirely in the

alphabet of the *IPA*. You should not infer from my interest in reproducing Ramamurti's alphabet as exactly as possible that my article would not be directed to a general audience-it would be But it has to be recalled that Ramamurti's works were also directed chiefly to a genral audience, and yet they are rather demanding because the language itself is demanding Part of Ramamurti's excellence was in not oversimplifying the facts Could you let me know about length and symbols available as soon as possible ?

If you expect to have other contributions on Ramamurti's works on Sora, could you tell me about these ? it could help me in deciding what to leave out!

I would probably discuss somewhat also an anonymous work in my possession on Sora, the *Tea District Labour Association Language Handbook Sovara* (Calcutta, 1927), which in certain respects anticipates Ramamurti's *Manual* Ramamurti makes no mention of it, though he does quote the *TDLA/H Mundari* once, but certain parts of the two works are laid out in precisely parallel ways. It is conceivable that Ramamurti had some part in the writing of the *TDLA* handbook Do you know of anyone who might know anything about this ?

I have virtually no knowledge of Ramamurti himself other than the little one can gather from the Sora works, not even his education languages spoken, or dates, or place of birth. If you have any material already on hand on the man, I would be grateful for any information you could supply me. Information on Sitapati would also be helpful

In the Sora country it is recalled that Ramamurti was quite old when he was completing his works, and rather deaf, and that it was necessary to shout in order for him to hear. I have no idea whether this story is true But I do know that despite his intention of describing only the language of the hill Soras, many of his texts are in the now extinct dialect of such plains villages as Tekkali, A P. It must have been necessary for him to travel by palanquin into the hills, an arduous journey even today, since unless one traveled on horseback, like his missionary friend Anne Munro, the way would have been nearly impossible for an elderly man.

Certain of Ramamurti's and Sitapati's works on Sora and also on Parengi I have searched for many years without success. It would be wonderful if as a result of your efforts in his memory some compies were discovered I list here the works of which I have heard :

1. G.V. Ramamurti, Savara reader (Madras, 1911?)
2. ____________, *Telugu translation of Savara reader* (Madras 1912-13)

3. ___________ *Savara Songs* (Madras 1913)

4. G. V. Sitapati, "Paren", in *A miscellany of papers presented to Rao Saheb Mahopadhyaya Gidugu Venkata Ramamurti Pantulu Garu on his 70th Birthday* (Madras 1933), pp. 145-165. (Other works on Sora, e.g by Miss Munro, might be expected to have been included in this volume)

Perhaps through your contributors and the Librarians at various libraries in Andhra Madras and Orissa some of these could be located. For sometime the Sora Manual has been out of print, and I know only of two extant copies, my own, and a copy in the Library of the India Office, London. During the sixties copies of the dictionaries were still available from the government of Orissa publishing office, but I do not know the address or whether the supply (badly worm-eaten) is exhausted.

I have discussed with certain publishers, e.g. Munshiram Manoharlal, the poseibility of reprinting the Manual and the two dictionaries, because I do not think they will be superseded by the grammar and dictionaries which my wife and I are editing from our own and others' materials. Have you heard of any interest on these lines?

There were, according to Ramamurti, a lot of example sentences collected for the dictionaries. Few of them were published, and the question arises whatever became of Ramamurti's notes? Are you in contact with his heirs, and have you inquired what may still exist? His materials would not be possible to duplicate nowadays because of the complete assimilation of the more southerly Soras to the Telugu language, and the loss of most of the Sora-ized Telugu forms found in the speech of even the southerly hill areas (e.g. Gumma, Serango) where Sora etill survives.

The same could be said, *mutatis mutandis*, of Sitapati's materials on Parengi, etc. I see there are other paper by him I Forgot to list;

5. G.V. Sitapati, "The Soras and their Country," *Journal of the Andhra Historical Research Society*, Vols. XII-XIV (1938-43).
6. __________"Sora Songs and Poetry', (no further information on where published or when)
7. __________"Sora Musical Instrument'', Bulletin du Music & Ethnographie du Trocadero (Paris' 1933), No. 5

Best regards from patricia (whom incidentally I may ask to collabarate in the article if she has time) and myself.

Yours sincerely,
David Stampe

[The editor regrets his failure to obtain frofessor stampe's article which would have been, undoubtedly, a valuable contribution to this volume. This letter itself, is quite informative for the interested scholars in the field. Hence, its publication.

Professor David stampe, besides working on Sora Language, has developed, along with his wife patricia Donnegan, a fresh approach called Natural Phonology, toward a better understanding of the sound systems of languages This approach has been considered to be a big leap forward in the field of Phonology after the theory of Generative Phonology proposed by Noam chomsky and Morris Halle in their Sound Patterns of English (1968). Ed.]

# Ramamurti : A Munda Linguist's appreciation

Stanley Starosta

I fist encountered the work of Rao Sahib G.V. Ramamurti pantulu gave in 1962, when I was a graduate student of the University of Wisconsin. I had joined the University of Chicago's Munda Languages Project, and had been given a copy of Ramamurti's 'Manual of the Sora language' to help me to prepare for my fieldwork on Sora during the summer of 1963. During that summer, and during my subsequent work on Sora in Orissa in 1965-66, I made extensive use of Ramamurthi's 'Manual', and was repeatedly impressed by its accuracy and thoroughness of coverage. I also came to know more about the Rao Sahib himself through the extensive notes in his manual, and through conversations with people in Ganjam District who had know him or know of him. As a result my respect and admiration for him increased, and when submitted my doctorol dissetation to the University of Wisconsin in 1967, I dedicated it with the following inscription:

To the memory of
Rao Sahib G. V. Ramamurti
Teacher, humanitarian, and
pioneer in Munda Linguistics, this
work is respectfully dedicated

In my later work on Sroa, I have had repeated recourse to Ramamurti's lingustic work, and as a result of a recent stay at Osmania University in Hyderabad (1981) I have also learned much more about other facets of his long and distinguished career, and about the respect and admiration in which he is help by Telugu vernaculer writers and linguists in Andhra. Thus when my old friend, Dr. C. Ramarao, asked me to make a contribution to this commemorative volume, I was more than happy to do so.

I am familar with Ramamurti's work chiefly through his research on the Sora language, and so I think it is appropriate for me to focus

